


శ్రీ కవితా పబ్లికేషన్స్

ఏలూరురోడ్ · విజయవాడ-2



# EE DESAMLO 'O' ADADI

(Serialised in Andhra Bhoomi Weekly)

By

KAKANI KAMALA

*First Edition :*
AUGUST 1985

*Publishers* :
SRI KAVITA PUBLICATIONS
Vijayawada - 520 002

*Cover Design :*
'B A L I'

*Price* :
**Rs. 25-00**

*Printers* :
NAGARJUNA PRINTERS
Vijayawada - 2

## "ఈ దేశంలో ఓ ఆడది" [నవల]

ఈ దేశంలో ఓ ఆడది....

హత్యలు చేస్తూంది

దొంగతనం చేస్తూంది

వ్యభిచారం చేస్తూంది

ఎన్నో వేషాలు వేస్తూంది

మోసాలు చేస్తూంది

ఇదంతా చూసి-

"అయ్యో! ఆడది చెడిపోయింది"

అంటుంది లోకం—

కాని

చెడిపోయింది ఆడదా ?

# ఈ దేశంలో ఓ ఆడది

సాయం సమయం ...

దీపాలు వెలిగించే వేళ...,

సినిమా పాట సన్నగా "హమ్మింగ్" చేస్తూ సావిత్రి వంట గదిలో కూర్చుని కూర తరుగుతోంది.

అంతలో వీధి గేటు "కిర్ర్..." మని చప్పుడయ్యింది. సావిత్రి పాట ఆపి గుమ్మంలోంచి తల బయటికి పెట్టి తొంగి చూసింది.

"సావిత్రీ! అమ్మాయి సావిత్రీ...." అంటూ చలపతి హడావుడిగా లోపలికి వచ్చాడు.

తండ్రితో పాటు వెనకాల ఎవరో పెద్ద మనుషులు రావటం చూసి సావిత్రి గభాల్న చేతిలో పని ఒదిలి గడపదాటి ఇవతలకి వచ్చింది.

బయట వీధి వసారాలో ఎవరెవరివో సందడిగా మాటలు, కుర్చీలు బల్లలు జరిపిన శబ్దాలు వినిపిస్తున్నాయి.

"అమ్మాయ్ సావిత్రీ?"

"ఏంటి నాన్నా!"

చలపతి లిప్తసేపు రెప్ప వెయ్యకుండా పరామర్శగా కూతురి మొఖంలోకి చూసి కళ్ళు మూసుకుని అలసటగా, పై కండువాతో మొఖం తుడుచుకున్నాడు.

"ఇంకా స్నానం చెయ్యలేదా తల్లి!"

"పని తెమలలేదు నాన్నా. ఇదిగో వంట పూర్తి చేసి తరుగుదామను కుంటున్నాను. కూర తరుగుతున్నాను కదా!"

"ఊ.... ఆ కూర పని పక్కకి పెట్టి ముందు తొందరగా స్నానం చేసి ముస్తాబవు తల్లీ, అవతల వాళ్లు వచ్చి కూర్చున్నారు" చలపతి తొందర చేశాడు.

సావిత్రి నొసలు చిట్లించింది.

"వా....ళ్లు? అంటే ఎవరు! పెళ్ళి చూపులా!".

ఇంతలో ప్రక్కింటి శారదమ్మ నవ్వు మొఖంతో లోపలికి వచ్చింది.

"పెళ్ళి చూపులు కాదే పిల్లా. ఏకంగా పెళ్ళి. మీ నాన్న లెల్లారి లేచి నక్కని తొక్కాడు. నయా పైసా కట్నం లేకుండా బంగారం లాంటి అల్లుడ్ని సంపాయించాడు" అంటూ మురిపెంగా సావిత్రి బుగ్గ గిల్లింది.

సావిత్రి చిలిపిగా నవ్వింది.

"అలాగా! అయితే వేరే ముస్తాబు ఎందుకూ? ఇలాగే వాళ్ళ ఎదురుగా కూర్చుంటాను."

చోద్యంగా బుగ్గలు నొక్కుకుంది శారదమ్మ.

"ఏమిటి! ఇలాగే....ఈ చింపిరి జుత్తుతోనే!"

పెంకెగా తల ఎగరేసింది సావిత్రి.

"ఆ.... ఇలాగే.... ఈ చింపిరి జుత్తుతోనే.... అట్టే మాట్లాడితే మెల్లి కన్ను కూడా పెడతాను. మెడ ఒంకర పెడతాను.... తొంటి చెయ్యి పెడతాను...."

గలగలా నవ్వింది శారదమ్మ.

"ఏం లాభం లేదు. నువ్వు ఏ కళ్ళు పెట్టినా ఏ ముఖం పెట్టినా ఈ పెళ్ళి ఖాయం."

"....?!" బిత్తరపోయింది సావిత్రి.

"పిన్నీ! ఏంటి నువ్వు చెప్పేది?"

చలపతి ముసిముసిగా నవ్వాడు.

"అవునమ్మా సావిత్రి! మొన్న మనం విజయవాడ అరుణ పెళ్ళికి వెళ్ళాం కదా! ఆ పెళ్ళికి కృష్ణకుమార్ అని ఒక అబ్బాయి వచ్చాడు కదా! గుర్తుందా! పెళ్ళిలో నిన్ను బాగా ఆటలు పట్టించాడు....అతను నిన్ను చాలా ఇష్టపడుతున్నాడుట. పెళ్ళి చేసుకొంటానని స్వయంగా అడగడానికి వచ్చాడు. ఇందాక రఘునాధరావుగారు రమ్మని కబురు పెడితే వెళ్ళాను. కృష్ణకుమార్‌కి వాళ్ళు కొంచెం తెలుసట. అందుకని అక్కడికి వచ్చాడు. అంతా కల్సి మనింటికి వచ్చారు"

"........"

చలపతి రెండు అడుగులు వేసి కూతురు దగ్గరగా వచ్చి తల మీద చెయ్యివేసి నిమురుతూ చెప్పాడు.

"నువ్వు చాలా అదృష్టవంతురాలివి తల్లీ! నా దగ్గర చేసినట్లు ఇంకా అల్లరి చేస్తే కుదర్దు. చప్పున స్నానం చేసి ముస్తాబవు .."

హృదయం ఆర్ద్రం అవుతుంటే హడావుడిగా బయటికి వెళ్ళిపోయాడు.

తండ్రి ఉత్తరీయంలో కళ్లు తుడుచుకోవటం చూసి సావిత్రి నిర్ఘాంతపోయింది.

శారదమ్మ సావిత్రిని ఆపేక్షగా దగ్గరకు తీసుకుని ప్రేమగా బుగ్గలు పుణికింది. మంద్రస్వరంతో అంది.

"సావిత్రీ! తల్లి లేని పిల్లయినందుకు ఆ దేముడు నిన్ను చల్లగా చూశాడు. అన్ని విధాలా మంచి భర్త దొరికాడు. మా అబ్బాయి బజారుకి వెళ్ళాడు స్వీట్సు తేవటానికి. వాళ్ళ కాఫీ ఫలహారాల సంగతి నేను చూసుకుంటాను గాని .... నువ్వెళ్ళి తొందరగా స్నానం చేసి మంచి బట్టలు కట్టుకుని ముస్తాబవు" అంటూ వంటగదిలోకి నడిచింది.

సావిత్రి తువ్వాలు అందుకుని స్నానాల గదిలోకి వెళ్ళింది.

మనసు మనసులో లేదు.

ఒక విధమైన తన్మయత్వం శరీరం అణువణువునా నిండి నాట్యం చేస్తూంది.

చిరు నవ్వులు చిందిస్తూ కృష్ణకుమార్ రూపం సమ్మోహనంగా కళ్ళ ముందు మెదిలింది.

"ఏమిటి! ఆ రోజు. పెళ్ళిలో తనని నిమిష నిమిషానికి కవ్వించి ఆటలు పట్టించిన కృష్ణకుమార్....యంగ్ చాప్....కొంటె....తనని వెతుక్కుంటూ వచ్చాడా! వాటెవండర్. నేను అంతగా అతనికి నచ్చానా! ఓహో....లవ్.

ఎట్ ఫస్టు సైట్ కాబోలు. అందుకేనా ఆరోజు తను ఎక్కడికి వెడితే అక్కడికి ఆఖరికి వంటగది....గాడిపొయ్యి..."

సావిత్రి పెదాల మీద సన్నటి చిరునవ్వు తొణికింది.

మనసు తియ్యగా మూలిగింది.

ఆలోచన్ల మధ్యే స్నానం ముగించి గదిలోకి వచ్చింది.

ఆ రోజు శుక్రవారం కావటంతో ఉదయం తలంటి పోసుకుంది.

జుట్టు బ్రష్‌తో చిక్కులు తీసుకుని లూజుగా జడ అల్లుకుంది.

చిన్న పూలు ప్రింటు వున్న ఎర్రటి షిఫాన్ చీర ఎర్రటి జాకెట్టు వేసుకుంది.

ముత్యాల నగల సెట్ తీసి అలంకరించుకుంది.

కనురెప్పలికి కాటుక రాసి నుదుట ఎర్రగా బొట్టుదిద్దుకుంది.

సావిత్రి పచ్చగా కాస్త బొద్దుగా వుంటుంది. కోలగా వుండే పెద్ద కళ్ళు ఒత్తుగా వున్న వుంగరాల జుత్తు ఆ అమ్మాయికి పెట్టని ఆభరణాలు.

వుంటున్నది కాస్త పల్లెటూరు కావటంతో అట్టే చదువుకోలేదు.

కాని ఫాషన్లలో మాత్రం ఇప్పటి కాలం వాళ్ళకి ఎందులోనూ తీసిపోదు.

కాలేజీల్లో చదువుకున్న వాళ్ళూ, ఉద్యోగాలు చేసే వాళ్ళే సినిమాల్లో చూపించినట్లు ప్రేమించి పెళ్ళి చేసుకుంటారు అనుకుంది ఇన్నాళ్ళూ. కాని....

"సావిత్రీ...." చేతిలో పూలదండతో లోపలికి వచ్చింది శారదమ్మ.

చప్పున సావిత్రి అద్దం ముందునుంచి లేచింది.

శారదమ్మ సావిత్రి జడలో జాజిపూలదండ పెట్టి ఆప్యాయంగా బుగ్గలు పుణికింది.

"ఇంత అందంగా వున్నావు గనకనే ఆ అబ్బాయి చూడగానే వరించాడు. పద....మీ నాన్న నిన్ను తీసుకురమ్మంటున్నాడు" అంటూ చెయ్యి పట్టుకుంది.

సావిత్రి గుండె ఝల్లుమంది.

చెక్కిళ్ళు ఎర్రగా కందాయి.

"ఇప్పుడు తను కృష్ణకి ఎదురుగా వెళ్ళబోతోంది కదా!" అనుకుంటే కళ్లు సిగ్గు బరువుతో వాలిపోయ్యాయి.

"ఓ యబ్బో! ఇప్పుడే ఇంత సిగ్గు పడిపోతున్నావ్! పెళ్ళిలో నువ్వూ అతన్ని ఆటలు పట్టించావటగా! అదిగో హాల్లో అందరికీ హరికథల్లా చెప్తున్నాడు. వినిపించడంలేదూ!"

శారదమ్మ వెక్కిరించింది.

"ఫో....పిచ్చి...." గారంగా కసురుకుంది సావిత్రి. పెళ్ళిచూపులు కేవలం లాంఛనంగా జరిగాయి. అంతే.

కట్న కానుకల ప్రసక్తి లేకుండా కృష్ణకుమార్ సావిత్రిని ఇష్టపడ టంతో ఆ రోజే పెద్దల సమక్షంలో లగ్నపత్రిక వేయింపాడు చలపతి.

వివాహాలు "దైవనిర్ణయాలు" అంటారు పెద్దలు. అక్షరాలా ఆ విధంగానే దైవఘటనగా ఆ తతంగం అంతా జరిగిపోయింది.

o o o

ఆ రాత్రి పడుకుంటే సావిత్రికి నిద్రపట్టలేదు.

కన్నుమూసినా తెరిచినా కృష్ణకుమార్ రూపమే కళ్ళముందు కదల సాగింది.

తండ్రి తన పెళ్ళి ప్రయత్నం చేస్తున్న సంగతి సావిత్రికి తెలియంది కాదు.

కాని ఇంత తొందరగా తన వివాహం నిశ్చయం అవుతుందను కోలేదు....

అదీ తనని ప్రేమించి మనసుకు దగ్గరగా వచ్చిన మనిషితో....

తలుచుకొంటేనే ఎంతో ఆనందంగా వుంది సావిత్రికి.

మరెంతో ఆశ్చర్యకరంగా కూడా వుంది.

వివాహాలు దైవ నిర్ణయాలు అంటారు.

ఇందుకేనేమో అనిపిస్తోంది.

క్రిందటి నెల విజయవాడ దూరపు బంధువులు ఇంటికి పెళ్ళికి వెళ్ళారు.

పెళ్ళికూతురు అరుణ సావిత్రికి "కజిన్" అవుతుంది.

అరుణ తల్లి కామాక్షమ్మ ఏవో సంబంధాలు వున్నాయని వ్రాయ టంతో చలపతి సావిత్రిని కూడా తీసుకుని పెళ్ళికి వెళ్ళాడు.

కృష్ణకుమార్ కూడా పెళ్ళికొడుకు తరఫున ఆ పెళ్ళికి వచ్చాడు.

"ఏ అమ్మాయి నచ్చటం లేదు అంటున్నావు గదరా! నా పెళ్ళికి రా....లక్కీగా నీకు భార్య దొరుకుతుందేమో...." అన్నాడు జోక్‌గా పెళ్ళి కొడుకు ప్రకాష్ కృష్ణకుమార్‌తో.

అక్షరాల అలాగే జరిగింది.

పద్దెనిమిదేళ్ళ వసంత శోభతో పచ్చగా విరిసిన ముద్దబంతిలా చలాకీగా పెళ్ళి ఇంట్లో సందడిగా తిరుగుతున్నా కన్నెలేడి సావిత్రి అతడి దృష్టిని ఆకర్షించింది.

కృష్ణకుమార్‌కి వూహ తెలిసే నాటికే తండ్రి లేడు.

తల్లే వున్న కొద్దిపాటి పొలం చూసుకుంటూ జాగ్రత్తగా పొదుపు చేసి కొడుకుని పెంచి పెద్ద చేసింది.

ఈ మధ్యనే ఆవిడ కూడా అనారోగ్యంతో కన్నుమూసింది.

కృష్ణకి అక్క — బావ వున్నారు.

ప్రస్తుతం వాళ్ళే అతని ఆలనా పాలనా అంతా చూస్తున్నారు.

కృష్ణ అక్క వసుంధరకి ముగ్గురు పిల్లలు.

బావ మధుసూధన్ నేవీలో పని చేస్తాడు.

ప్రస్తుతం వాళ్ళంతా ఢిల్లీలో వుంటారు.

కృష్ణ ఉద్యోగంలో స్థిరపడి ఏడాది దాటుతోంది.

అక్క అజమాయిషీలో అతని పెళ్లి ప్రయత్నాలు జరుగుతూనే వున్నాయి.

కృష్ణ కొంతమంది అమ్మాయిల్ని చూడటం నచ్చలేదని చెప్పటం కూడా జరిగింది.

కృష్ణ జీవితంలో చిన్నతనంలోనే కొంత విషాదం చోటు చేసుకుంది.

అతన్ని ఎంతగానో ముద్దుచేసే తండ్రి ఆక్సిడెంట్‌లో మరణించటం, తల్లి దిగులుతో మంచం పట్టటం, తనతో కలిసి మెలసి తిరిగే అక్క అత్తవారింటికి వెళ్ళడం, ఆర్థిక ఇబ్బందులు... ఇవన్నీ అతనిపై ప్రభావం చూపించాయి.

శారదమ్మ సావిత్రిని ఆపేక్షగా దగ్గరకు తీసుకుని ప్రేమగా బుగ్గలు పుణికింది. మంద్రస్వరంతో అంది.

"సావిత్రీ! తల్లి లేని పిల్లయినందుకు ఆ దేముడు నిన్ను చల్లగా చూశాడు. అన్ని విధాలా మంచి భర్త దొరికాడు. మా అబ్బాయి బజారుకి వెళ్ళాడు స్వీట్సు తేవటానికి. వాళ్ళ కాఫీ ఫలహారాల సంగతి నేను చూసుకుంటాను గాని .... నువ్వెళ్ళి తొందరగా స్నానం చేసి మంచి బట్టలు కట్టుకుని ముస్తాబవ్వు" అంటూ వంటగదిలోకి నడిచింది.

సావిత్రి తువ్వాలు అందుకుని స్నానాల గదిలోకి వెళ్ళింది.

మనసు మనసులో లేదు.

ఒక విధమైన తన్మయత్వం శరీరం అణువణువునా నిండి నాట్యం చేస్తూంది.

చిరు నవ్వులు చిందిస్తూ కృష్ణకుమార్ రూపం సమ్మోహనంగా కళ్ళ ముందు మెదిలింది.

"ఏమిటి! ఆ రోజు. పెళ్ళిలో తనని నిమిష నిమిషానికి కవ్వించి ఆటలు పట్టించిన కృష్ణకుమార్....యంగ్ చాప్....కొంటె....తనని వెతుక్కుంటూ వచ్చాడా! వాటెవండర్. నేను అంతగా అతనికి నచ్చానా! ఓహో....లవ్.

ఎట్ ఫస్టు సైట్ కాబోలు. అందుకేనా ఆరోజు తను ఎక్కడికి వెడితే అక్కడికి ఆఖరికి వంటగది....గాడిపొయ్యి..."

సావిత్రి పెదాల మీద సన్నటి చిరునవ్వు తొణికింది.

మనసు తియ్యగా మూలిగింది.

ఆలోచన్ల మధ్యే స్నానం ముగించి గదిలోకి వచ్చింది.

ఆ రోజు శుక్రవారం కావటంతో ఉదయం తలంటి పోసుకుంది.

జుట్టు బ్రష్‌తో చిక్కులు తీసుకుని లూజుగా జడ అల్లుకుంది.

చిన్న పూలు ప్రింటు వున్న ఎర్రటి షిఫాన్ చీర ఎర్రటి జాకెట్టు వేసుకుంది.

ముత్యాల నగల సెట్ తీసి అలంకరించుకుంది.

కనురెప్పలికి కాటుక రాసి నుదుట ఎర్రగా బొట్టుదిద్దుకుంది.

సావిత్రి పచ్చగా కాస్త బొద్దుగా వుంటుంది. కోలగా వుండే పెద్ద కళ్ళు ఒత్తుగా వున్న వుంగరాల జుత్తు ఆ అమ్మాయికి పెట్టని ఆభరణాలు.

వుంటున్నది కాస్త పల్లెటూరు కావటంతో అట్టే చదువుకోలేదు.

కాని ఫాషన్లలో మాత్రం ఇప్పటి కాలం వాళ్ళకి ఎందులోనూ తీసిపోదు.

కాలేజీల్లో చదువుకున్న వాళ్ళూ, ఉద్యోగాలు చేసే వాళ్ళే సినిమాల్లో చూపించినట్లు ప్రేమించి పెళ్ళి చేసుకుంటారు అనుకుంది ఇన్నాళ్ళూ. కాని....

"సావిత్రీ...." చేతిలో పూలదండతో లోపలికి వచ్చింది శారదమ్మ.

చప్పున సావిత్రి అద్దం ముందునుంచి లేచింది.

శారదమ్మ సావిత్రి జడలో జాజిపూలదండ పెట్టి అప్యాయంగా బుగ్గలు పుణికింది.

"ఇంత అందంగా వున్నావు గనకనే ఆ అబ్బాయి చూడగానే వరించాడు. పద....మీ నాన్న నిన్ను తీసుకురమ్మంటున్నాడు" అంటూ చెయ్యి పట్టుకుంది.

సావిత్రి గుండె ఝల్లుమంది.

చెక్కిళ్ళు ఎర్రగా కందాయి.

"ఇప్పుడు తను కృష్ణకి ఎదురుగా వెళ్ళబోతోంది కదా!" అనుకుంటే కళ్లు సిగ్గు బరువుతో వాలిపొయ్యాయి.

"ఓ యబ్బో! ఇప్పుడే ఇంత సిగ్గు పడిపోతున్నావ్ ! పెళ్ళిలో నువ్వూ అతన్ని ఆటలు పట్టించావటగా ! అదిగో హాల్లో అందరికీ హరికథల్లా చెప్తున్నాడు. వినిపించడంలేదూ!"

శారదమ్మ వెక్కిరించింది.

"ఛో....పిచ్చి...." గారంగా కసురుకుంది సావిత్రి. పెళ్ళిచూపులు కేవలం లాంఛనంగా జరిగాయి. అంతే.

కట్నం కానుకల ప్రసక్తి లేకుండా కృష్ణకుమార్ సావిత్రిని ఇష్టపడ టంతో ఆ రోజే పెద్దల సమక్షంలో లగ్నపత్రిక వ్రాయించాడు చలపతి.

వివాహాలు "దైవనిర్ణయాలు" అంటారు పెద్దలు. అక్షరాలా ఆ విధంగానే దైవఘటనగా ఆ తతంగం అంతా జరిగిపోయింది.

o o o

ఆ రాత్రి పడుకుంటే సావిత్రికి నిద్రపట్టలేదు.

కన్నుమూసినా తెరిచినా కృష్ణకుమార్ రూపమే కళ్ళముందు కదల సాగింది.

తండ్రి తన పెళ్ళి ప్రయత్నం చేస్తున్న సంగతి సావిత్రికి తెలియంది కాదు.

కాని ఇంత తొందరగా తన వివాహం నిశ్చయం అవుతుందను కోలేదు....

అదీ తనని ప్రేమించి మనసుకు దగ్గరగా వచ్చిన మనిషితో....

తలుచుకొంటేనే ఎంతో ఆనందంగా వుంది సావిత్రికి.

మరెంతో ఆశ్చర్యకరంగా కూడా వుంది.

వివాహాలు దైవ నిర్ణయాలు అంటారు.

ఇందుకేనేమో అనిపిస్తోంది.

క్రిందటి నెల విజయవాడ దూరపు బంధువులు ఇంటికి పెళ్ళికి వెళ్ళారు.

పెళ్ళికూతురు అరుణ సావిత్రికి "కజిన్" అవుతుంది.

అరుణ తల్లి కామాక్షమ్మ ఏవో సంబంధాలు వున్నాయని వ్రాయ టంతో చలపతి సావిత్రిని కూడా తీసుకుని పెళ్ళికి వెళ్ళాడు.

కృష్ణకుమార్ కూడా పెళ్ళికొడుకు తరఫున ఆ పెళ్ళికి వచ్చాడు.

"ఏ అమ్మాయి నచ్చటం లేదు అంటున్నావు గదరా! నా పెళ్ళికి రా....లక్కీగా నీకు భార్య దొరుకుతుందేమో...." అన్నాడు జోక్‌గా పెళ్ళి కొడుకు ప్రకాష్ కృష్ణకుమార్‌తో.

అక్షరాల అలాగే జరిగింది.

పద్దెనిమిదేళ్ళ వసంత శోభతో పచ్చగా విరిసిన ముద్దబంతిలా చలాకీగా పెళ్ళి ఇంట్లో సందడిగా తిరుగుతున్న కన్నెలేడి సావిత్రి అతడి దృష్టిని ఆకర్షించింది.

కృష్ణకుమార్‌కి వూహ తెలిసే నాటికే తండ్రి లేడు.

తల్లే వున్న కొద్దిపాటి పొలం చూసుకుంటూ జాగ్రత్తగా పొదుపు చేసి కొడుకుని పెంచి పెద్ద చేసింది.

ఈ మధ్యనే ఆవిడ కూడా అనారోగ్యంతో కన్నుమూసింది.

కృష్ణకి అక్క — బావ వున్నారు.

ప్రస్తుతం వాళ్ళే అతని ఆలనా పాలనా అంతా చూస్తున్నారు.

కృష్ణ అక్క వసుంధరకి ముగ్గురు పిల్లలు.

బావ మధుసూధన్ నేవీలో పని చేస్తాడు.

ప్రస్తుతం వాళ్ళంతా ఢిల్లీలో వుంటారు.

కృష్ణ ఉద్యోగంలో స్థిరపడి ఏడాది దాటుతోంది.

అక్క అజమాయిషీలో అతని పెళ్ళి ప్రయత్నాలు జరుగుతూనే వున్నాయి.

కృష్ణ కొంతమంది అమ్మాయిల్ని చూడటం నచ్చలేదని చెప్పటం కూడా జరిగింది.

కృష్ణ జీవితంలో చిన్నతనంలోనే కొంత విషాదం చోటు చేసుకుంది.

అతన్ని ఎంతగానో ముద్దుచేసే తండ్రి ఆక్సిడెంట్‌లో మరణించటం, తల్లి దిగులుతో మంచం పట్టటం, తనతో కలిసి మెలసి తిరిగే అక్క అత్తవారింటికి వెళ్ళడం, ఆర్థిక ఇబ్బందులు... ఇవన్నీ అతనిపై ప్రభావం చూపించాయి.

దాంతో జీవితం గురించి ఒక నిర్దిష్టమైన పథకం అభిప్రాయం ఏర్పడింది.

ముఖ్యంగా వ్యూహ తెల్సిన దగ్గర్నుంచి పెళ్లి గురించి ఒక ఆశయం వుంది.

తన కాబోయే భార్య గురించి కొన్ని అభిరుచులు వున్నాయి.

సావిత్రిని చూడగానే అతని గుండెలో కోయిల కూసింది.

మనస్సు తియ్యగా మూలిగింది.

భార్య గురించి తనలో రూపు దిద్దుకుంటున్న వ్యూహాసుందరికి సావిత్రి ప్రతిరూపం అనిపించింది.

ఆ అమ్మాయికి పెళ్ళి కాలేదని తెల్సి అతని ఆనందానికి అంబర మైంది.

ఆమెని పరిచయం చేసుకొని ఓ ఆట పట్టించాలి అనుకున్నాడు. కృష్ణ సరసుడు.

అసలు ఆ సరసత్వం అతని పేరులోనే వుంది. చిన్నప్పుడు కూడా బాగా అల్లరి చేసి తల్లి చేత తన్నులు తినేవాడు.

కాలేజీ రోజుల్లో కూడా ఆడపిల్లల్ని బాగానే ఏడిపించేవాడు.

సావిత్రిని చూడగానే తిరిగి ఆ కొంటె తనం అతనిలో విజృంభించింది.

సావిత్రి పెళ్ళి కూతురు తరఫున వచ్చింది.

కృష్ణ పెళ్ళి కొడుకు వైపు నుంచి వచ్చాడు.

దాంతో బాగా ధైర్యం వచ్చింది.

మిత్రబృందంతో కల్సి అల్లరి మొదలు పెట్టాడు.

పెళ్ళిలో అరుణ తల్లి కామాక్షమ్మ మాటి మాటికి "సావిత్రీ" అంటూ పిలుస్తూ చిన్న చిన్న పనులు పురమాయించసాగింది.

ఆడవాళ్ళకి బొట్లు పెట్టటం, పూలు పళ్ళు ఇవ్వడం వగైరా...

కృష్ణకుమార్ నీడలా ఆ అమ్మాయిని వెంటాడి తన వాడి చూపుల్తో వేధించసాగాడు.

చేతిలో వున్న అక్షతలు నవదంపతులపై చల్లకుండా కావాలని సావిత్రి దగ్గరగా వెళ్ళి ఆమె తలపై పడేలా జల్లాడు.

"ఏయ్...!" అన్నట్లు సావిత్రి కళ్ళెర్ర చేస్తే —

"ఏమిటి...!" అన్నట్లు అమాయకంగా చూశాడు.

ఆమె ఏ పని చేస్తే ఆ పనికి అడ్డం రాసాగాడు.

సావిత్రి "టీ" కప్పులున్న ట్రే పట్టుకొస్తుంటే మధ్యలో తనే అందుకుని అందరికీ పంచాడు.

ఆ సందట్లో తన వేళ్ల ఆమె చేతులకి తగిలేలా చేసి ఆమెని బెదరగొట్టాడు కూడా.

ఇలా ఒకటి కాదు....

చాలా రకాలుగా ఆమెని ఏడిపించాడు.

పెళ్ళి ఉదయం తొమ్మిది గంటలకి జరిగింది.

ఆ రాత్రి 'మేజువాణి' ఏర్పాటయ్యింది.

ఇరుపక్షాల పెళ్లివారూ ఆడా మగా పిల్లా పాపా అంతా పందిట్లో చేరారు.

సావిత్రి తలనిండా పూలు పెట్టుకుని వంగపండు రంగు పట్టుచీరలో అందంగా ముస్తాబయ్యింది.

ఆమె చెవులకి పెట్టుకొన్న జూకాలు జిగ్‌జిగ్‌మని మెరుస్తున్నాయ్.

పందిట్లోకి వచ్చి స్నేహితురాళ్ళ మధ్యలో కూర్చుంది.

ఆ అలంకరణలో...ఆ లైట్ల వెలుగులో ఆమె ముగ్ధలావణ్యంతో మెరిసి పోసాగింది.

దూరంగా మగవాళ్ళ మధ్య కుర్చీలో కూర్చున్న కృష్ణ దృష్టి అంతా సావిత్రి మీదే!

సభ్యత మర్చిపోయి నేరుగా ఆమెనే చూస్తూ కూర్చున్నాడు.

ఎంత ఒదిగి నిల్చున్నా సావిత్రి అతని దృష్టినుంచి తప్పించుకోలేక పోతోంది.

పందిట్లో మేజువాణి హుషారుగా సాగుతోంది.

అంతా ఆసక్తిగా చూస్తున్నారు.

"పెళ్ళికూతురు అరుణ" పక్కన కూర్చున్న కామాక్షమ్మ సావిత్రిని చేత్తి సైగతో పిలిచి—

"ఇదిగో సావిత్రీ! ఒకసారి వంట గదిలోకివెళ్ళి ఆ వంటాయనకి ఇంకో నాలుగు కుంచాల బియ్యం ఎక్కువ పొయ్యమన్నానని చెప్పిరా తల్లీ, ఎందుకైనా మంచిది" అంటూ పని పురమాయించింది.

సావిత్రి లేచి పందిరి పక్కగా వున్న సందులోంచి ఇంటి వెనకాలకి వెళ్ళింది.

ఆ సందు బాగా పొడవుగా కాస్త చీకటిగా వుంది.

సావిత్రి గాడిపొయ్యి ముందు కూర్చున్న వంటాయనకు ఆ మాట చెప్పి వెనక్కి తిరిగి సందులోకి వచ్చింది.

అంతే...!

రెండు బలమైన చేతులు ఆమెని గట్టిగా పొదివి పట్టుకున్నాయి.

సావిత్రి కెవ్వున కేక పెట్టింది.

కానీ భయంతో ఆ కేక గొంతులోనే నుడి తిరిగి ఆగిపోయింది.

మసక వెలుగులో దగ్గరగా కృష్ణకుమార్‌ని చూసి స్థంభీభూతురాలు అయ్యింది.

అతని కళ్ళు కొంటెగా నవ్వుతున్నాయ్.

సావిత్రి చప్పున విదిలించుకొని పోబోయింది.

కానీ కృష్ణ బలంగా ఆమెను బంధించి మెరుపులా ఒంగి ఆమె పెదాలమీద 'ముద్దు' పెట్టుకున్నాడు.

చిన్న గొంతుకతో ఆమె చెవి దగ్గర గుసగుసగా చెప్పాడు.

"సావిత్రీ! ఐ లవ్ యు...!"

సావిత్రి ఒళ్లు ఝల్లుమంది.

గుండె ఒక్క క్షణం ఆగి రెట్టింపు వేగంతో కొట్టుకోసాగింది.

జరుగుతున్నది ఏమిటో తెల్సేసరికి నుదురుపై సన్నగా చెమట పట్టింది.

తుఫానులో నావలా ఒణికిపోసాగింది.

కృష్ణకుమార్ ఆవేశంగా తిరిగి ఆమెమీదికి ఒంగబోతుంటే సావిత్రికి చప్పున స్పృహ వచ్చినట్లు అయ్యింది.

శక్తినంతా కూడ తీసుకుని అతడ్ని విదుల్చుకుని ఒక్క గెంతున పందిట్లోకి వచ్చిపడింది.

ప్రమాదవశాన కాలు జారి అగాధంలో పడబోయి చప్పున నిల దొక్కుకున్నట్లు....ఒక్క క్షణం ఉక్కిరి బిక్కిరి అయ్యింది ఆమె ప్రాణం.

ఇంతవరకూ సావిత్రికి అలాంటి 'అనుభవం' లేదు.

చల్లని తండ్రి స్పర్శ తప్పించి వేరే పురుష స్పర్శ ఎరగదు. ఆలాంటిది....!

"బాప్‌రే....!"

సావిత్రి గుండె దడ ఎక్కువయింది.

మాటిమాటికి ఒళ్ళంతా చెమట పోస్తోంది.

అరచేతులు చల్లగా అవుతున్నాయ్.

బెదిరిన లేడిలా తిరిగి పందిట్లోకి వచ్చి స్నేహితురాళ్ళ మధ్య సర్దుకుని కూర్చుంది.

మనసంతా అలజడి....

వేదికపై మేజువాణి రంజుగా సాగుతోంది.

పందిట్లో అంతా ఎందుకో చాలా ఆనందంగా నవ్వుతున్నారు.

కాని సావిత్రికి నవ్వు రావడంలేదు.

మనసంతా ఎలాగో అయిపోయింది.

క్షణం క్రితం జరిగినది తల్చుకుంటే భయంతో శరీరం బిగుసు కుంటోంది.

సావిత్రి చెయ్యి అప్రయత్నంగా గుండెల మీదికి వెళ్ళింది.

నెమ్మదిగా తల ఎత్తింది....

ఎదురుగా కృష్ణకుమార్?

పందిరి గుంజకు ఆనుకుని బుద్ధిగా రెండు చేతులూ కట్టుకుని నిల్చుని వున్నాడు.

అతడు ఇందాకట్నుంచీ సావిత్రినే గమనిస్తున్నాడు.

ఆమె తల ఎత్తగానే ఇద్దరి చూపులూ చిక్కుపడ్డాయి.

సన్నగా సమ్మోహనంగా నవ్వాడు కృష్ణ.

తల దించేసుకుంది. ఆ తరువాత....

"ఠంగ్....ఠంగ్....ఠంగ్...."

సావిత్రి వులిక్కిపడింది.

నిద్రరాని కళ్ళతో మంచంలో అసహనంగా కదిలింది.

ఇప్పుడు అదంతా తల్చుకుంటే చాలా థ్రిల్లింగ్‌గా వుంది.

కృష్ణకుమార్....

ఆ రోజు తనని ఎంత అల్లరి చేశాడు!

ఎంత చక్కగా నవ్వుతాడు!

కోటి అవ్యక్తానురాగాలు....

శతకోటి నాదాలు....

ఎంత అందమైన నవ్వు!

"....ఊహు....

నవ్వులా అవి కావు

నవ పారిజాతాలు
రవ్వంత సడిలేని
రస రమ్య గీతాలు....
ఆ రాజు ఈ రోజు అరుదెంచెనా....
అపరంజి కలలన్నీ ఫలియించెనా...."
అన్నంత మధురమైన ఈ అనుభవం...
నిజమే.
పిన్ని చెప్పినట్లు తన పూజ ఫలించింది.
అందుకే తనని ప్రేమించి ఆదరించే భర్త దొరికాడు!
ఏ స్త్రీ కయినా అంతకంటే వేరే ఏం కావాలి!
"ఠంగ్—ఠంగ్—ఠంగ్—"
గడియారం పన్నెండు గంటలు కొడుతూ వుంటే...
తియ్యని వూహల మధ్య మగతలోకి జారింది సావిత్రి.

వీణ తీగలన్నీ ఒక్కసారి లాగి ఒదిలినట్లు ఆమె హృదయంలో 'ఝుమ్మ—' అన్న గానం...

o o o

ఉన్నంతలో ఘనంగా కృష్ణకుమార్ — సావిత్రిల వివాహం అతి నిర్విఘ్నంగా జరిగిపోయింది.

గుండెలమీంచి కొండంత బరువు దిగిపోయినట్టు తేలిగ్గా వూపిరి తీసుకున్నాడు చలపతి.

భార్య పోయిన తరువాత మళ్ళీ పెళ్ళి చేసుకోలేదు.

ఒక్కగా నొక్క కూతురు కదా అని సావిత్రిని కంటికి రెప్పలా పెంచుతూ వచ్చాడు.

చలపతి కలలు, ఆశలూ, ఆశయాలూ .... అన్నీ కూతురు కోసమే !

భార్య పోయాక ఒక విధంగా సావిత్రి కోసమే బ్రతికాడు. అను క్షణం ఆ అమ్మాయి కోసమే శ్రమించాడు. కూతురి కోసమే జీవించాడు.

అల్లుడ్ని చూసుకున్నాక తన ఇన్నేళ్ళ జీవితాశయం ఫలించిందని తృప్తి పడ్డాడు.

సావిత్రికి పెద్దగా చదువు అంటలేదు.

చిన్నతనంలోనే తల్లి పోవటం, తోబుట్టిన వాళ్ళు లేకపోవటం, తండ్రి గారాబం—ఆ అమ్మాయిని కాస్త అపురూపంగా తయారు చేసాయి.

దాంతో మెట్రిక్యులేషన్ పూర్తి కాగానే ఇంటి పట్టునే వుండి పోయింది.

ఉండేది పెద్ద పట్నవాసం కాకపోవటంతో,

ఆడపిల్లలకి ప్రత్యేకం కాలేజి లేదు.

కూతుర్ని కో-ఎడ్యుకేషన్ కాలేజికి పంపటం ఇష్టంలేక చలపతి సావిత్రి చదువు విషయంలో తటస్థంగా వుండి పోయ్యాడు.

సావిత్రి ముగ్ధలా సంసార పక్షంగా వుంటుంది.

ఇంటిపని వంట పని అయ్యాక 'హాబీ'గా కుట్లు అల్లికలు నేర్చేది.

ఎంబ్రాయిడరీ వర్క్ అంటే ఆ అమ్మాయికి చాలా ఇష్టం. డిప్లొమా పాసయింది.

సెంటర్‌కి వెళ్ళి టైలరింగ్ కూడా నేర్చుకుంది.

కూతురి పెళ్ళి గురించి చలపతి బెంగపడితే ఇరుగు పొరుగు అభి మానంగా మందలించే వారు.

"సావిత్రికేం! బంగారంలాంటి పిల్ల. ఏ ఇంట కాలుపెట్టినా శోభిస్తుంది. ఆ పిల్ల పెళ్ళి గురించి ఎందుకు దిగులు...!" అంటూ మంద లించేవారు.

వాళ్ళు దీవించినట్లుగానే సావిత్రికి బృహస్పతి లాంటి భర్త లభించాడు.

కృష్ణ కూడా కష్టం సుఖం తెల్సిన మనిషి.

అతి సామాన్యమైన కుటుంబంలోంచి వచ్చాడు.

తల్లి పెంపకంలో జీవితం అంటే ఏమిటో తెల్సుకున్నాడు.

బాగా కష్టపడి పైకి వచ్చాడు.

కృష్ణకి భవిష్యత్తు గురించి ఎన్నో ఆశలు వున్నాయి. కలలు వున్నాయి. వాటికి తగిన పట్టుదల వుంది. ఉద్యోగంలో బాగా పై అంతస్థుకి రావాలని, చిన్న ఇల్లు, అందమైన అనుకూలవతి అయిన భార్య సుఖవంతమైన సంసారం కావాలని కోరుకున్నాడు.

అతని ఆశయాలకి తగినట్టే సావిత్రి భార్యగా లభించింది.

వసుంధర దగ్గరుండి తమ్ముడికి మరదలికి పట్నంలో కొత్త కాపురం పెట్టింది.

సావిత్రి చెయ్యి పట్టుకుని చెప్పింది.

"సావిత్రీ! చిన్నప్పట్నుంచి తమ్ముడి ఆలనా పాలనా చూశాను. మా అమ్మపోయాక ఆ బాధ్యత నాకు మరింత పెరిగింది. కాని ఈ రోజు నుంచీ మా కృష్ణకి అమ్మ, అక్క, భార్య....అన్నీ నువ్వే...." అంది ఆదరంగా.

సావిత్రి మనసంతా చల్లగా అయ్యింది. ఒదినగారి అభిమానానికి గుండె ఆర్ద్రం అయ్యింది.

చిలకా గోరింకల్లా వున్న కూతుర్ని అల్లుణ్ని చూసి చలపతికి చాలా ఆనందం అనిపించింది.

మొదట్లో ఆ సంబంధానికి ఆయన కొస్త సందేహించాడు.

కారణం కృష్ణకి తల్లి తండ్రి లేకపోవటం చలపతికి చాలా అసంతృప్తి కలిగించింది.

సావిత్రి ఒంటరిగా పెరిగింది. పుట్టింటి వైపు నుంచి "నా" అనుకున్న బంధుత్వం గొప్పగా లేదు.

కనీసం అత్తింట్లో నయినా పదిమంది మధ్య మెలగాలి అను కున్నాడు.

పెద్ద బలగం కల కుటుంబంలోకి తన కూతుర్ని ఇవ్వాలని ఆశించాడు.

కాని కృష్ణకుమార్ మంచితనం, అతని ఉద్యోగం బాదరబందీ లేని జీవితం చూస్తుంటే కూతురు చక్కగా సుఖపడగలదన్న నమ్మకం కుదిరింది.

అయినా మనసు ఆపుకోలేక పెద్దతనపు చాదస్తంతో ఆ మాట కాస్తా పైకి అనేశాడు.

కృష్ణకుమార్ నవ్వాడు.

"మామగారూ! మీరు అలాంటి దిగుళ్ళేం పెట్టుకోకండి. నేనూ సావిత్రి అంతే ఒంటరి వాళ్ళం. కాని రేపు మాకు పదిమంది పిల్లలు పుడితే, వాళ్ళకి పెళ్ళిళ్ళు చేస్తే ఇరవై మందిమి కామా! ఆ పిల్లలకి మళ్ళీ పిల్లలు... మళ్ళీ ఆ పిల్లలకి పిల్లలు...." అంటూ దండకం చదివాడు.

బంధువులంతా గొల్లుమని నవ్వారు. కొత్త పెళ్ళికూతురు సావిత్రి అందంగా సిగ్గుపడింది.

"నీకేం లోటు చలపతీ ? మీ అల్లుడే పది మంది పెట్టు" అన్నా రంతా.

చలపతి పొంగి పొయ్యాడు.

పెళ్ళయిన మూడునెల్లకే భర్త వెంట పట్నం కాపురానికి వచ్చేసింది సావిత్రి.

కృష్ణతో గడిపిన ప్రతిరోజూ ఆమెకి ఒక రసరమ్య కావ్యం.

అతని ప్రతిమాట ఆమెకి ఒక అందమైన అనుభూతి....

తలపు మాత్రానికే సావిత్రి శరీరం పులకరిస్తుంది.

o o o

అవి కొత్తగా కాపురం పెట్టిన రోజులు....

కృష్ణకుమార్ ఒకరోజు ఆఫీసు నుంచి వస్తూ సావిత్రికి రెండు చక్కటి ప్రింట్సు వున్న ఖటావ్ వాయిల్ చీరలు, సెంట్సు హెయిరాయిల్, ఎగ్ షాంపూ, ప్యారిస్ బాడీస్ప్రే, మైలేడి బ్రాలు, పూలు....ఇవన్నీ కొని ఆ ప్యాకెట్లు రెండు చేతులనిండా పట్టుకుని ఈల పాటపాడుతూ హుషారుగా ఇంట్లోకి వచ్చాడు.

పగలంతా సావిత్రి ఒంటరిగా వుంటుంది.

సాయంత్రం కాగానే చక్కగా ముస్తాబయి భర్తకోసం ఎదురుచూస్తూ వుంటుంది.

కృష్ణ ఇంటికి రాగానే ఫ్రెష్ అవుతాడు.

కాఫీ టిఫెన్ పూర్తి అయ్యాక ఇద్దరూ అలా స్కూటరుమీద సినిమాకో షికారుకో వెళ్ళటం రివాజు....

ఆరోజు కూడా అలాగే ఎదురు చూస్తున్న సావిత్రికి భర్త చేతుల్నిండా ప్యాకట్లతో రావటం ఎంతో ఆనందాన్ని కించిత్ ఆశ్చర్యాన్ని కలిగించింది.

కృష్ణ ఇంట్లోకి వస్తూనే ప్యాకెట్లన్ని సావిత్రి చేతిలోపెట్టి ఆమె బుగ్గ మీద చిన్న చిటికె వేశాడు.

ప్యాకెట్లన్ని వూడదీసిన సావిత్రి తలపట్టుకుంది. "ఇవన్ని ఎందుకండి! దండగ ఖర్చు. అసలే మన్ది కొత్త సంసారం కదా! ఇంట్లో ఒకటి వుంటే ఒకటిలేదు. మిమ్మల్ని కొంచెం కొంచెం డబ్బు అడిగి ఎన్నో కొనాలని నేను తాపత్రయ పడుతున్నాను" అంటూ చిరాగ్గా విసుక్కుంది.

నిన్నగాక మొన్న కాపురానికి వచ్చి అప్పుడే పక్కా గృహిణిలా మాట్లాడుతున్న భార్యని చూసి కృష్ణ నవ్వాడు.

"ఎన్నాళ్ళనుంచో ఇవన్ని కొనాలని నేనూ తాపత్రయ పడుతున్నాను" అన్నాడు కవ్వింపుగా.

"ఇవన్నీ దండగ. ఇంట్లో వుండే దాన్ని కదా నాకెందుకు ఇంత ఖరీదయిన కాస్మొటిక్సు."

కృష్ణ కోపంగా చూశాడు.

"ఆ మాట అన్నావ్! అమ్మమ్మా....ఇదిగో చెప్తున్నా. జాగ్రత్తగా విను. ఇలా ముసలమ్మలా మాట్లాడే ఆడవాళ్ళంటే నాకు ఒళ్ళుమంట....

ఇప్పుడే కాదు....ఇకనుంచి ప్రతినెలా మిగతా అన్ని ఖర్చులతోపాటు నీకు నిత్యం వాడకానికి ఇలాంటివన్ని రకరకాలు తెస్తాను.

రోజూ సాయంత్రం నేను ఆఫీసునుంచి వచ్చేసరికి అప్పలమ్మలా కాక...ఇవన్ని అలంకరించుకుని నా కంటికి అందంగా అప్టుడేట్‌గా కనిపించాలి తెల్సిందా" భార్య జడపట్టి గుంజుతూ.

ఆ సాయంత్రం అతని కోర్కె ప్రకారం షాంపూతో తలరుద్దుకుంది సావిత్రి.

భర్త ప్రేమగా తెచ్చిన తెల్లటి ఖటావ్ వాయిల్ చీర కట్టుకుంది.

మైలేడి ధరించి తెల్లటి జాకట్టు వేసుకుంది.

చీరకి స్టైప్సు పెట్టుకుని "పిన్" చేస్తుంటే దగ్గరుండి సహాయం చేశాడు కృష్ణ.

ఆమె ఒంటి నిండా కొత్త చీర నింపా బాడీ స్ప్రే జల్లాడు.

సావిత్రి జుత్తు చిక్కులు తీసుకుని కొంచెం లూజుగా జడ అల్లుకుంది.

సంపెంగలు జాజులు కలిపిన చండని జడలో క్లిప్ చేసుకుంది.

బ్యూటీ క్రీం రాసుకుని ఎర్రగా సింగార్ తిలకం దిద్దుకుంది.

అందంగా అలంకరించుకుని అద్దంలో చూసుకుంటుంటే కృష్ణ వెనకాల్నుంచి వచ్చి రెండు చేతులా ఆమెని బంధించి సున్నితంగా ఆమె చెక్కిళ్ళపై తన మీసాలు "బ్రెష్" చేశాడు.

"ఏయ్ సావిత్రి! మన ఫస్ట్‌నైట్ ఎలా వున్నావో ఇప్పుడు అచ్చం అలా వున్నావ్" అన్నాడు.

సావిత్రి అందంగా సిగ్గు పడింది.

ఆమెకి "ఆ రాత్రి" తిరిగి జ్ఞాపకం వచ్చింది.

o o o

ఆరోజు రాత్రి....

తెల్లటి పట్టుచీరలో తలనిండా పూలతో భర్త కౌగిలిలో ఒదిగి అడిగింది సావిత్రి.

"ఏమండి!"

"ఊఁ...."

"అరుణ పెళ్ళిలో....ఆ సందులో నన్ను అంత చొరవగా ముద్దు పెట్టుకున్నారు కదా....పెళ్ళికాక ముందే ఇంకా అలా ఎంత మంది అమ్మాయిల్ని అలా చేశారు?"

కృష్ణ తియ్యగా నవ్వాడు.

"సావిత్రీ...."

"ఊఁ...."

"నువ్వు మన పెళ్ళి కాక ముందు అలా ఎంతమందికి ఎన్నిసార్లు ము...."

తలమీద పిడుగు పడినట్లు సావిత్రి అదిరి పోయింది.

"ఛీ....ఛీ...." అంటూ గభాల్న మంచంలో లేచి కూర్చుంది.

"అయినా మీ అంత రౌడి ఎవరూ వుండరు అసలు...." అంది కోపంగా.

"ఛీ....నీ అంత బెదురు గొడ్డు కూడా ఎవరూ వుండరసలు...." అన్నాడు అంతే కోపంతో కృష్ణ.

ఆ రాత్రి ఇద్దరూ చాలసేపు నవ్వుకున్నారు.

మళ్ళీ అవన్నీ జ్ఞాపకం వచ్చాయి సావిత్రికి.

తలవంచుకుని సిగ్గులు పడుతున్న సావిత్రి బుగ్గమీద చిన్నగా కొట్టాడు కృష్ణ.

"స్వీట్ నథింగ్స్ తరువాత. షికారుపోదాం పద....అన్నాడు.

ఇద్దరూ మోటారు బైక్‌మీద షికారు బయలుదేరారు.

తరువాత హోటల్‌కి వెళ్ళి భోజనం చేశారు.

సావిత్రి కోసం రెండు స్వీట్సు ఐస్‌క్రీం తెప్పించాడు కృష్ణ.

"ఎందుకండి ఇలా జల్సాలకి వూరికే డబ్బు దండగ చేస్తారు" అంది సావిత్రి విసుగ్గా.

"రేపు మనకి అబ్బాయో అమ్మాయో పుడితే ఇంత జాలీగా తిరగ్గలమా! అప్పుడు నువ్వు ఇలా ఖర్చు పెట్టమన్నా పెట్టను....సరేనా!" అన్నాడు నవ్వుతూ.

ఆ రాత్రి ఇంటికి వచ్చేసరికి పదయ్యింది. కృష్ణ మంచంమీద పరుపు చుట్టి డాబామీద పక్క పరిచాడు.

అవి శారద రాత్రులు....

పిండి జల్లెడ పట్టినట్లు వెన్నెల కురుస్తోంది.

ఇంటిచుట్టు వున్న నైట్ క్వీన్ కమ్మని పరిమళంతో కల్సి చల్లగాలి తెరలు తెరలుగ వీస్తోంది.

ఆగి ఆగి చలిగాలులు వీస్తున్నాయ్.

సావిత్రి భర్తకేసి ఇబ్బందిగా చూసింది.

"ఆరు బయట పడుకుంటే నాకు చలేస్తుందండీ!"

"నీమొగ మేస్తుందండీ!" మొద్దు....వెచ్చగా పక్కన నేనుండగా చలేంటే!" బలంగా చెయ్యిపెట్టి గుంజాడు.

ధబ్బున తూలి అతని ఒళ్ళో పడింది.

"ఇదుగో సావీ? నువ్వు మరీ ఇంత మట్టి ముద్దవేంటి!"

సావిత్రి బిత్తరపోయింది.

"ఇప్పుడు ఏవయ్యిందండి!"

"ఏమయ్యిందా! నీకసలు రొమాన్సు తెలుసా.... సరదాగా నన్ను కౌగలించుకోవడం....ము....! అలా దూరంగా మడి కట్టుకుని కూర్చుంటా

వెందుకూ! పరాయి ఆడదాన్ని గనక బలిమి చేసినట్లు తేపా చెయ్యి పట్టి గుంజి ఫైట్ చెయ్యాలా! ఊ...!"

తియ్యగా నవ్వింది సావిత్రి.

"ఐ.సీ. అదా మీ బాధ!"

"కాక! మరింకేమిటనుకున్నావ్!"

సావిత్రి గోముగా భర్తకేసి చూసింది.

"ఏమండి, మీ కంత సర్దాగా వుంటే మనం చక్కగా ఏ ఊటీకైనా ఎక్కడికైనా హనీమూన్ పోవచ్చుకదా? నాకు వూళ్ళు చూడడం అంటే భలే సర్దా అండి!"

"చంద్ర మండలం పోదామా!"

మొఖం తిప్పుకుంది సావిత్రి.

"అంతదూరం ఎందుకులేండి. చక్కగా ఎటైనా తిరిగొద్దామండి! పెళ్ళయిన కొత్తలో అంతా హనీమూన్ వెళతారు కదా!"

నవ్వాడు కృష్ణకుమార్.

"మైస్వీట్ లేడీ? సరదాగా సెంటు సీసా తెల్లచీర తెస్తేనే గొడవ చేశావ్ కదా! మరి అంతదూరం వెడితే ఎంత ఖర్చు అవుతుందో తెలుసా? అసలు మీ ఆడవాళ్ళ సైకాలజీ ఏమిటో నాకు బుర్ర బద్దలు కొట్టుకున్నా అర్థం కాదే!

గయ్యిమంది సావిత్రి.

"దానికి దీనికి తేడా లేదూ!"

భార్య బుగ్గమీద చిటికె వేశాడు కృష్ణ. "ఎందుకు లేదూ! కావల్సి నంత వుంది, బట్. ఐ హావ్ ఎ లిటిల్ మనీ మైడియర్ స్వీట్ హార్ట్... నువ్వు మరీ మరీ కోరితే కాదన్ను. అలాగే హనీమూన్ ట్రిప్ వేసుకుందాం ....అయినా నాకు తెలియక అడుగుతాను మనకి అసలు హనీమూన్ ఎందుకు చెప్పు!"

"అదేం ప్రశ్న!"

బిత్తర పోయింది సావిత్రి.

చెలినగుమోమో చంద్రబింబమై
పగలే వెన్నెల కాయగా
సఖినెరి చూపులె చల్లదనముతో
జగమునె వూటి చేయగా.." అని పాడి

"ఈ పాట ఎప్పుడైనా విన్నావా." అన్నాడు.

"ఓ?.. చాలా సార్లు విన్నాను కదా."

"వూరికే వినటం కాదే పిచ్చి మెద్దు. దాని అర్ధం ఏమిటో తెలుసా అని."

ప్రేమ యాత్రలకి ఊటీ కాశ్మీరే వెళ్ళక్కర్లేదూ... అందమైన మన సంటే.. ఈ వెన్నెల్లో.. ఈ డాబమీద.. ఈ పూల పరిమళాల మధ్య ఇప్పుడే... ఇక్కడే.."

మెరుపులా ఆమెను బంధించాడు.

సావిత్రి విసుక్కుంది.

"అబ్బ ఏంటండి.. ఈ మోటు సరసం. నాకు చలిగా వుంది. నిద్ర వస్తోంది. కిందకు వెళ్ళిపోతాను."

"ఓ.కె.. ఓ.కె. అద్సరే గాని సావీ నే తెచ్చిన సెంటు సీసా ఎలా వుంది"

చప్పున ముక్కు మూసుకుంది సావిత్రి.

"అది సెంటా. మురికి వాసన కొడుతూంది."

"పోనీ.. తెల్ల చీర."

"ఇది తెల్లచీర. ఎవరికైనా చూపిస్తే నవ్వి పోతారు కదా."

"పోనీ.. ఈ సంపెంగలూ జాజులూ..."

"వీటి కంటె భోగం విల్లా నయం...."

"ఐ. సీ... కృష్ణ ముని వ్రేళ్ళతో మీసం దువ్వుకున్నాడు.

"పోనీ... ఈ కృష్ణగాడైనా నచ్చాడా లేక పక్కింటి....

పెదవులనిండా నవ్వు తొణికిస పడుతుంటే చప్పున భర్తని చుట్టు కొంది సావిత్రి.

సముద్రంలో కలిసే నదిలా ఆమె గుండె నిండా ఆనందపు ఒరవడి.

కృష్ణకుమార్ గాఢంగా భార్యని కౌగలించుకుని గుసగుసగా చెప్పాడు.

"సావిత్రి! ఐ లవ్ యు..."

"ఐ టూ...."

మరు నిమిషం ఆ తెల్లని పక్కపై సంపెగలూ సన్నజాజులూ నలిగి రేకులు రాలాయి.

జాబిల్లి మబ్బు చాటుకి తప్పుకున్నాడు.

చుక్కలు కలకల్లాడాయి.

o o o

"కృష్ణకుమార్" అంటే గలగలా దుమికే జలపాతం. ఎప్పుడు సరదాగా హుషారుగా వుంటాడు. బాగా అల్లరి చెయ్యటం, రొమాంటిక్‌గా మాట్లాడడం అతని నేచర్.

కొత్తకుండలో నీరులా తియ్యగా సాగిపోతోంది సావిత్రికి జీవితం.

సావిత్రి కూడా సర్దాగా హుషారుగా వుండాలని అతని కోరిక.

చలాకీ అమ్మాయిలంటే అతనికి ఇష్టం.

సావిత్రి ఎక్కువగా చదువుకోలేదు.

అల్ట్రా మాడరన్ కాదు.

కొంచెం పూర్వకాలపు పద్ధతుల్లో ఉండేది.

ఆడవాళ్ళంతా ఇలాగే వున్నారా! సెక్సీగా అలంకరించుకుని ఎలాగ వెర్రెక్కిస్తారూ!....

....కాలేజి అమ్మాయిలైతే మరీ నాటీగరల్స్....

సినిమా యాక్టర్లు మాత్రం!

అన్నట్లు సావిత్రీ! ఎప్పుడైనా క్యాబరా డాన్స్ చూశావా !

నేనయితే చాలాసార్లు చూశాను.

ఆ డాన్సు అంటే నాకెంత ఇష్టమో...."

సావిత్రిని ఏదో ఒక రకంగా వుడికించి కవ్వించడం కృష్ణకుమార్ హాబీ.

రకరకాల తమాషాలు చేసేవాడు.

సావిత్రి పల్లెటూరి పిల్లని తరచూ ఆటలు పట్టించేవాడు కృష్ణ....

ఒకసారి—

కృష్ణ భార్య ఒళ్ళో తలపెట్టుకుని పడుకున్నాడు.

"ఏయ్ సావిత్రీ! నువ్వు ఎప్పుడైనా....నీకుగా నువ్వు నా దగ్గరగా వచ్చి... నా గుండెల మీద అరచేత్తో రాస్తూ....నా కళ్ళలోకి గోముగా చూస్తూ....

"ఏమండి? ఊఁయ్....! అన్నావే!" అడిగాడు.

సావిత్రి విసురుగా తలతిప్పుకుంది. "అబ్బ! ఆ సినిమా డైలాగులూ... ఆ యాక్షనూ నాకు చేతకాదు బాబూ... "

భార్య తల మీద చిన్నగా కొట్టాడు కృష్ణ.

"కంట్రీబ్రూట్ ....

"...."

"అసలు నీకు బొత్తిగా లోకజ్ఞానం లేదే. అవన్నీ కేవలం సినిమా డైలాగులు కాదు సరసులైన దంపతులు పడకటింటి రహస్యాలు...

సినిమాల్లో పబ్లిక్కుగా చూపిస్తున్నారు అంతే.

అంత మాత్రం చేత నీలాంటి వాళ్ళు యిడుసుకోనక్కర్లేదు....

"ఏమో బాబూ! నాకు సిగ్గు" సావిత్రి గోళ్ళు కొరుకుతూ తల దించుకుంది.

"పల్లెటూరి గబ్బిలమా! సిగ్గట సిగ్గు?"

జడపట్టి గుంజాడు.

పూలచెండులా చప్పున త్రుళ్ళి అతని ఒళ్ళో పడింది సావిత్రి.

o o o

ఆ రోజు

ఆదివారం.

పెళ్ళయిన కొత్త రోజులు

సెలవు రోజు వస్తే సరదాగా గడిపేవారు.

ఆదివారం కావటంతో సావిత్రి చాలా హడావుడిగా వుంది.

భర్త ఇంట్లో వున్నాడు కదా అని మధ్యాహ్నం 'టీ' టైమ్‌కి స్వీట్ చేస్తుంది.

మాలతీ చందూర్ వంటల పుస్తకం తెరిచింది.

కృష్ణ మంచంలో విశ్రాంతిగా పడుకుని పేపరు చదువుతున్నాడు.

అతను స్వీటుగా వుంటాడు.

అతనికి స్వీట్సు అంటే ఇష్టం. అందుకే సెలవురోజుల్లో ఒక కొత్త రకం తీపి వంటకం చేస్తూ వుంటుంది సావిత్రి.

పావుగంటలో ఘుమఘుమ లాడుతూ నెయ్యి, జీడిపప్పువేసి 'కేసరి' చేసి భర్తకి పెట్టింది. కారంగా కొంచెం వుల్లిపాయ పకోడి చేసింది.

మంచి కాఫీ ఇచ్చింది.

"స్వీట్ చాలా బాగుందోయ్...." అంటూ కాస్త మోతాదు మించి హెవీగానే తిన్నాడు కృష్ణకుమార్.

కాఫీ తాగి గూట్లో తమలపాకులు కనిపిస్తే మేకలా అరడజను దాకా నమిలాడు.

దాంతో వొంటికి మత్తు ఆవరించింది. చేతితో పేపరు పక్కన వేసి తిరిగి బద్ధకంగా మంచంలో వాలాడు.

ఆరోజు సావిత్రి తలంటుకుంది.

చిన్న చిన్న చుక్కలున్న నల్లచీర జాకెట్టు వేసుకుంది.

తెల్లగా కాస్త బొద్దుగా వుండే ఆమె ఒంటికి ఆ చీర అందంగా అమిరింది.

పనిలో సతమతమవుతూ కాస్త అస్తవ్యస్తమైన డ్రెస్‌తో హడా వుడిగా అటు ఇటు తిరుగుతున్న ఆమెని చూస్తూంటే కృష్ణకి కాస్త మత్తెక్కి నట్టు అయ్యింది.

"ఏయ్ సావిత్రి! ఇటురా...." పిలిచాడు.

భర్త మూడ్ కనిపెట్టింది సావిత్రి.

"ఎందుకో చెప్పండి" అంది.

"మాటా...."

"మాటా లేదూ పాటా లేదు. పనిమనిషి రెండు రోజుల్నుంచి రావటంలేదు కదా? ఇంతెడు పని అలాగే వుంది...."

"అందుకే కాస్సేపు ఇటొచ్చి రెస్టు తీసుకో .... సాయంత్రం ఏం సినిమా కెళదామో చెప్తా."

"అక్కడ్నుంచి చెప్పండి వినిపిస్తుంది."

"పోనీ- రావద్దులే గాని...ఓసారి వెనక్కి తిరిగి చూడు.'

సావిత్రి చేతిలో పని ఆపి వెనక్కి తిరిగింది.

కృష్ణ ఒక కన్నుమూసి రెండో కన్ను రెపరెప లాడించాడు.

సన్నగా నవ్వింది సావిత్రి.

నిర్వికారంగా తల తిప్పుకుని పనిలో పడింది.

తలపట్టుకున్నాడు కృష్ణకుమార్.

"ఖర్మరా బాబూ! ఐ, సేమ్. .సావిత్రీ! నువ్వు మరీ ఇంత ట్యూబు లైట్ ఏంటే!"

సావిత్రి భర్త మొఖంలోకి చూసి మళ్ళీ నవ్వింది.

"భార్యని చూసి కన్నుకొట్టే మగాడ్ని మిమ్మల్నే చూశాను."

"హత్తోస్మి..."

"...."

"పోనీ మన పక్కింటావిడ్ని —అదే ఆ శాంతిని చూసి — కన్ను కొట్టమంటావా!"

కళ్ళు తిప్పింది.

"కొట్టండి. నాకేం అభ్యంతరంలేదు."

అరచేత్తో గెడ్డం రాసుకున్నాడు. తాపీగా అన్నాడు.

"నాకూ లేదు గానీ...మళ్ళీ ఆయన కూడా నిన్ను చూసి..."

గయ్యిమంది సావిత్రి.

"ఛ....వూరుకోండి. చెత్తవాగుడూ మీరూ...".

"నాకేంటో తిక్కగా వుందే."

"ఊ... అయితే గెంతు లెయ్యండి."

చప్పున మంచం దిగి మెరుపులా ఆమెని చుట్టేశాడు.

సావిత్రి కెవ్వుమన బోయి ఆగిపోయింది.

సరిగ్గా అదే సమయంలో "ఢన్....ఢన్...." మంటూ వీధి తలుపు శబ్దం అయ్యింది.

ఆ శబ్దంతో పాటే కృష్ణా....ఒరేయ్ కృష్ణా అన్న పిలుపు తార స్థాయిలో వినిపించింది.

"చచ్చాంరా దేముడా!"

కృష్ణ సావిత్రిని ఒదిలిపెట్టాడు.

"బాగా అయ్యిందా! కొత్త బిచ్చగాడు పొద్దు ఎరగట్ట. ఎంత భార్య అయితే మాత్రం మరీ ఇంత అన్యాయమా!" వెక్కిరించింది సావిత్రి.

o o o

ఏడాది గిర్రుమని తిరిగింది.

ఈ ఏడాదిలో సావిత్రి—కృష్ణల దాంపత్య జీవితంలో తల్చుకోవాలంటే ఎన్నో మధుర స్మృతులు....

అనుబంధానికి అందమైన నిర్వచనం ఆ జంట....

తియ్యని సంగీతంలా....అరివిరిసిన పూల పరిమళంలా ఇద్దరి మధ్య ఆనంద వాహిని....

ఏడాది గిర్రున తిరిగింది.

సావిత్రికి ఆడపిల్ల పుట్టింది.

పిల్లలు పుట్టిన తరువాత సరదాలు తగ్గుతాయి అంటారు.

కాని కృష్ణ పిల్లల మధ్య పిల్ల....

పెద్దల మధ్య పెద్ద!

భార్యమీద అపురూపం తగ్గలేదు.

సరికదా పాప పుట్టాక సావిత్రిపై అపురూపం ఎక్కువైంది.

ఇదివరకు మంచినీళ్ళు కూడా తాగేవాడు కాదు.

సావిత్రి అందించాల్సిందే.

కాని ఇప్పుడు తనపన్లు తను చేసుకోవటమే కాక ఇంట్లో చిన్న చిన్న పన్లుకూడా చెయ్యటం మొదలుపెట్టాడు.

కూతురుకి సుజాత అని పేరు పెట్టారు.

కూతుర్ని చూసుకుని ఇంటికి లక్ష్మి అని సంబరపడింది.

సావిత్రికి తల్లిలేని లోటు కనిపించకుండా చలపతి అన్నీ యధావిధిగా జరిపించాడు.

ఎర్రగా మందార మొగ్గలా వున్న మనవరాల్ని చూసుకొని మురిసి పోయ్యాడు.

"అమ్మాయ్ సావిత్రీ! నేను రిటైర్ అవ్వగానే మీదగ్గరకే వచ్చేస్తానమ్మ! సుజాత బాధ్యతంతా నాదే! దాన్ని బాగా చదివించి డాక్టర్ని చేస్తాను." అన్నాడు.

కాని ఆయన కోరిక తీరలేదు.

సుజాత పుట్టిన ఎనిమిదేళ్ళకి చలపతి హఠాత్తుగా పెద్ద జబ్బుచేసి కన్ను మూశాడు.

సావిత్రికి పుట్టింటి తరుపున వున్న ఒకేఒక్క ఆత్మీయుడు, బంధువు తండ్రి!

పచ్చని చెట్టుకి గొడ్డలి దెబ్బ తగిలినట్లు తండ్రి మరణం సావిత్రిని కృంగదీసింది.

విషబాణం దెబ్బతిన్న పిట్టలా ఆమె ప్రాణం గిజగిజలాడిపోయింది.

కాని భర్త ఆదరణ గాయపడిన ఆమె గుండెని చల్లని గంధపు పూతలా సేద దీర్చాయి.

ఆ తరువాత ఏడాదికి అజయ్ పుట్టాడు. ఆడపిల్ల పుట్టినా సరే 'బర్త్ కంట్రోల్' చేద్దామనుకున్నారు.

అలాంటిది బాబు పుట్టేసరికి సావిత్రి ఆనందం వర్ణనాతీతం.

బాబు పెరుగుతున్నకొద్దీ సావిత్రి కోరికలు కూడా పెరగసాగాయ్.

బాబుని పబ్లిక్‌స్కూల్లో చేర్పించాలని, విదేశాలకి పంపి వున్నత విద్యావంతుడ్ని చెయ్యాలని కలలు కనసాగింది.

సావిత్రి చెప్పిన ప్రతిదానికి "ఊ" కొట్టటమే కృష్ణపని.

ఈ మధ్య అతను ఉద్యోగంలో పై మెట్టు ఎక్కాడు.

ఉన్నంతలో ఏ వడిదుడుకులూ లేకుండా జీవితం నల్లేరుమీద బండి నడకలా సాగిపోతూంది.

చలపతి మరణించి ఏడాది దాటింది.

సావిత్రి గుండెలో విషాదం క్రమంగా దూరం అయ్యింది.

తండ్రి జ్ఞాపకాలు మరుపు తెరల్లోకి వెళ్ళాయి.

ఇప్పుడు ఇంకా ఇల్లు....సంసారం....పిల్లలు .... వీటిమధ్య రోజు గడిచిపోతోంది.

ఆమెకి ఎంతో ప్రియమైన కుట్లు అల్లికలు చెయ్యటానికి కూడా అట్టే సమయం చిక్కడంలేదు. అయినా ఆ మాట ఎప్పుడూ అనుకోలేదు సావిత్రి. ఇల్లే స్వర్గం.

o o o

సాయంత్రం నాలుగు గంటలు కావస్తోంది.

సావిత్రి సుగంధి షాంపుతో తలారా స్నానం చేసింది.

జుట్టు ఆరబెట్టుకుని చిక్కులు తీసి కొంచెం లూజుగా జడ అల్లుకుంది.

తీరిగ్గా అద్దం ముందు కూర్చుని ముస్తాబు మొదలు పెట్టింది.

అప్పటికే అజయ్‌బాబుకి నీళ్ళుపోసి కడుపునిండా పాలు పట్టి ఉయ్యాల్లో వేసి నిద్రపుచ్చింది.

ఆ రోజు ఉదయం కృష్ణ ఆఫీసుకి వెళ్ళేముందు కూతురు సుజాతని స్నేహితుడింట్లో అప్పగించాడు.

కారణం -

ఆ రోజు రాత్రి యాదగిరి గుట్టమీద ఒక ఫంక్షన్ వుంది.

తప్పనిసరిగా ఆ ఫంక్షన్‌కి హాజరవ్వాలట.

కృష్ణ ఆత్మీయ స్నేహితుడు మారేజి ఫంక్షన్ అది.

ముహూర్తం ఎనిమిది గంటలకి.

సావిత్రి, కృష్ణకుమార్ బాబుని తీసుకుని సరిగ్గా ముహూర్తం సమయానికి పెళ్ళికి వెళ్ళి వెంటనే తిరిగి వచ్చెయ్యాలని నిర్ణయించుకున్నారు.

ఎందుకంటే అక్కడ నైట్‌హాల్టు చెయ్యడానికి వీలుపడని పరిస్థితి.

కృష్ణకుమార్‌కి గత రెండు రోజులుగా ఆఫీసులో ఇనస్పెక్షన్ జరుగుతోంది.

అతను సీనియర్ ఆఫీసర్ కావటంతో సెక్షన్ బాధ్యత అంతా అతని పైనే వుంది.

సెలవు పెట్టటం అన్నమాట అప్రస్తుతం.

పోనీ అలాగని పెళ్ళికి వెళ్ళటం మానుకుందామన్నా పెళ్ళికొడుకు రఘునాధ్ కృష్ణకి చిన్ననాటి మిత్రుడు. ఆత్మీయుడు.

హైద్రాబాద్‌లో వుంటూ యాదగిరిగుట్ట పెళ్ళికి రాలేక పొయ్యానని చెప్పటం హాస్యాస్పదంగా వుంటుంది కదా!

అందుకే సావిత్రిని, బాబుని తీసుకుని మోటార్ బైక్‌మీద పెళ్ళికి వెళ్ళి, తిరిగి అదే రాత్రి ఇంటికి వచ్చెయ్యాలని నిర్ణయించుకున్నాడు.

సుజాతని ఆ ఒక్కరోజుకి స్నేహితుడింట్లో ఒదిలిపెట్టాడు.

సావిత్రి నాలుగయ్యేసరికి పన్లు అన్నీ ముగించుకుని అద్దం ముందు కూర్చుని అలంకరణ మొదలు పెట్టింది.

ఆ రోజు ఉదయం ఆఫీసుకి వెడుతూ కృష్ణ చెప్పాడు.

"సాయంత్రం నేను వచ్చేసరికి రెడీగా వుండాలి అని."

సన్నటి జరీ చెక్స్ వున్న నల్లటి పట్టుచీర అలాంటిదే జాకెట్టు వేసుకుంది.

ఈమధ్య సావిత్రి బాగా రంగుతేలి కొంచెం ఒళ్ళు చేసిందేమో.... ఆమె శరీరానికి ఆ చీర బాగా అమిరింది.

నల్లగా తుమ్మెద రెక్కల్లా వున్న జుత్తు లూజుగా అల్లుకొని జడలో కనకాంబరం పూలచెండు "క్లిప్" చేసింది.

ముత్యాల నగల సెట్ అలంకరించుకుంది.

ఇంతలో ఇంటిముందు మోటార్ సైకిల్ ఆగిన శబ్దం అయ్యింది.

చిరునవ్వుతో గుమ్మం దగ్గర ఎదురు వచ్చిన భార్యని చూస్తూనే కృష్ణ పెదాలు చిరునవ్వుతో విరిశాయి.

"మంచి మేకప్ అయ్యావే!" చప్పున భార్యని దగ్గరకి తీసుకున్నాడు.

"ఊ....అద్సరే. నాల్గింటికే వస్తానన్నారు కదా!"

"ఏం చెయ్యను చెప్పు! ఈ ఆఫీసు చెకింగ్ కాదుగాని నా తల తిరిగిపోతోంది." అంటూ అసహనంగా కుర్చీలో వాలాడు.

కాఫీ టిఫిన్ పూర్తిచేసి స్నానంచేసి "ఫ్రెష్" అయ్యాడు.

ఆరుగంటల ప్రాంతంలో మోటార్ బైక్‌మీద బయలుదేరారు.

సాయం సమయం కావటంతో నీరెండలు దిగి చల్లగాలి సాగింది.

వాళ్ళు వెళ్ళేసరికి యాదగిరిగుట్ట పెళ్ళి సందడిలో కళకళ లాడుతోంది.

పెద్ద షామియానావేసి రంగురంగుల దీపాలు అందంగా అలంకరించారు.

"స్వాగతం" అన్న అక్షరాలు ఎరుపు ఆకుపచ్చ రంగు బల్బులతో గప్పున వెలిగి ఆరుతున్నాయి.

ఎర్రటి యూనిఫారంలో వున్న బ్యాండ్ గ్రూప్ షామియానాముందు ఆటు ఇటు బారులు తీర్చి నిల్చుని....

"....నువ్వు నా పక్కనుంటే హాయి.

నువ్వు లేకుంటే చీకటి రేయి...."

అంటూ హృద్యంగా షెహనాయిమీద సినిమా పాట వాయిస్తున్నాడు.

పూల మాలలతో పెద్ద ఎత్తున వేదికపై కల్యాణమండపం కట్టారు.

రఘునాధ్ కృష్ణని చూస్తూనే ఎదురొచ్చి లోనికి తీసుకు వెళ్ళాడు.

పెళ్ళికూతురు "ఉష" తెల్లగా నాజూగ్గా వుంది.

తొమ్మిది గంటల ముహూర్తానికి పెళ్ళి ఆడంబరంగా జరిగింది.

స్నేహితుడికి రెండు వందల ఖరీదుచేసే వెండి ప్లేటు కానుకగా చదివించాడు కృష్ణకుమార్.

డిన్నర్ ముగించి పదకొండు గంటల ప్రాంతంలో తిరుగు ప్రయాణం అయ్యారు.

రఘునాధ్ కృష్ణని తీవ్రంగా అభ్యంతరం పరిచాడు.

పెళ్ళివారంతా కూడా ఆ రాత్రికి వుండి పొమ్మని, అంత అర్ధరాత్రి ఆడవాళ్ళతో ప్రయాణం అంత మంచిది కాదని మర్నాడు ఉదయమే వెళ్ళమని సలహా ఇచ్చారు.

"అమ్మాయ్ సావిత్రీ! చంటిపిల్లాడితో రాత్రిపూట చల్లగాలిలో ఏం వెడతావ్. నా మాట విని ఈ రాత్రికి ఇక్కడ వుండిపో" అని సలహా ఇచ్చింది ఓ బామ్మగారు. కాని—

ఇంటిపరిస్థితులు సరిగాలేక తప్పనిసరిగా భర్త వెంట తిరుగు ప్రయాణం అయ్యింది సావిత్రి.

పైగా సుజాతకి కొంచెం ఒంట్లో బాగుండలేదు.

బాగా జలుబుచేసి ఒళ్ళు వెచ్చబడింది.

తప్పనిసరిగా ఒదిలి పెట్టారు.

పైగా కృష్ణకి ఆఫీసుపని ఒత్తిడి.

అందుకే పెళ్ళికి బయలుదేరే ముందే కృష్ణకుమార్ అన్నాడు:

"ఏయ్ సావిత్రీ! మీ ఆడవాళ్ళకి పెళ్ళి, పేరంటాలంటే మోజు.... ఆ సందడంతా చూసి అక్కడే వుండిపోతానన్నావ్! పదింటికల్లా భోజనం అదీ ముగించి గుట్టనుంచి రిటన్ అవుదామోయ్....వెన్నెల రాత్రులుకదా.... సరదాగా చల్లగాలికి షికారుగా వచ్చేద్దాం...."

సరసంగా భార్య బుగ్గమీద చిటికె వేశాడు.

"ఇద్దరు పిల్లలు పుట్టినా సరదాలకేం తక్కువలేదు."

సావిత్రి నవ్వింది.

అసలు పనిపిల్ల వుంది గనక బాబుని కూడా వుంచెయ్యమన్నాడు కృష్ణ.

కాని సావిత్రి ఒప్పుకోలేదు.

సుజాత పుట్టిన తరువాత ఒక అమ్మాయి పుట్టి నెలలోపుగానే చచ్చిపోయింది.

ఆ తరువాత ఆరేళ్ళకి అపురూపంగా పుట్టాడు బాబు.

అందుకే సావిత్రికి అజయ్ అంటే ఎనలేని మమకారం.

వాడ్ని విడిచి ఒక్క గంట కూడా వుండలేదు.

అజయ్ ఎప్పుడైనా కాస్త ఎక్కువ నిద్రపోతే వాడ్ని ఏదో ఒంకన లేపేసేది.

తండ్రి చనిపోయి అజయ్ రూపంలో తన కడుపున పుట్టాడని ఆమె నమ్మకం.

అదీ కాక అజయ్‌కి పోతపాలు అలవాటు లేదు.

అందుకే కొడుకుని ఒదిలి పెట్టటానికి ఇష్టపడలేదు సావిత్రి.

స్నేహితులతో కలిసి చక్కగా పెళ్ళి సందడి ఎంజాయ్ చేసి డిన్నర్

ముగించుకుని పదకొండు గంటల ప్రాంతంలో తిరుగు ప్రయాణం అయ్యారు.

సావిత్రి అజయ్‌కి స్వెట్టర్ తొడిగి పూల టోపీ పెట్టింది. ఫ్లానల్ టవల్ కప్పి భర్త వెనకాల మోటార్ బైక్‌పై కూర్చుంది.

రాత్రి....

దాదాపు అర్ధరాత్రి సమయం....

ఊరు చివర ప్రదేశం కావటంతో రోడ్డంతా నిర్మానుష్యంగా వుంది.

మత్తయిన అడవి సంపెంగలు, పున్నాగచెట్లు పూల పరిమళంతో కల్సి చల్లటి గాలి....మందంగా తెరలు తెరలుగా వీస్తోంది.

పౌర్ణమి రోజులు కావటంతో పిండి జల్లెడ పడుతున్నట్లు వెన్నెల నింగి నుంచి ధారలుగా కురుస్తోంది.

నున్నటి తారురోడ్డు మీద మోటార్ బైక్ మెత్తగా జారిపోతోంది.

సావిత్రి ఒక చేత్తో బాబుని ఒడిలో పడుకోబెట్టుకుని మరొక చేతిని భర్త నడుం చుట్టుతిప్పి అలవోకగా ఆతడి భుజంమీద తల వాల్చింది.

రమణీయమైన ప్రకృతి అందాలతో ఆ ప్రయాణం సావిత్రి కృష్ణలకి తీరని అనుభూతుల్ని చవి చూపుతోంది.

ఇద్దరూ సరదాగా కబుర్లు చెప్పుకొంటున్నారు.

ఆనందంగా నవ్వు కుంటున్నారు.

కృష్ణకుమార్ స్వతహాగా రాష్ డ్రైవింగ్ చేస్తాడు.

అదొక థ్రిల్ అతనికి.

కాని ఈ రోజు సావిత్రి ఒడిలో బాబు వున్నాడు. కాస్త జాగ్రత్తగా నడుపుతున్నాడు.

వుండి వుండి లారీలూ, డిస్ట్రిక్ట్ బస్సులు మోటార్ బైక్‌ని ఓవర్ టేక్ చేస్తూ శరవేగంతో దూసుకుని పోతున్నాయి.

ఒడుపుగా వాటిని తప్పిస్తున్నాడు కృష్ణకుమార్.

మధ్య మధ్య "జాగ్రత్తండి!" అంటోంది సావిత్రి.

"ఏం ఫరవాలేదులేవోయ్...." అంటున్నాడు కృష్ణకుమార్.

కనుచూపు మేరలో నగర శివార్లు కనిపిస్తున్నాయి.

సన్నటి తారురోడ్డు మీద మెత్తగా జారిపోతోంది మోటార్‌బైక్.

కాని డ్రైనేజ్‌పై కట్టిన చిన్న వంతెన దగ్గరకి వచ్చేసరికి "కీసు" మని శబ్దం చేస్తూ షడన్ బ్రేక్ తో అప్రయత్నంగానే ఆగిపోయింది బైక్.

"జర్క్" యిచ్చినట్లయి షడన్ బ్రేక్ పడటంతో సావిత్రి త్రుళ్ళి నట్లు అయ్యి తమాయించుకుంది.

దారికి అడ్డంగా పెద్ద రాళ్ళు పడివున్నాయ్.

కృష్ణమోటార్ బైక్ దిగాడు,

భర్తతో పాటు సావిత్రి. కూడా దిగింది.

కృష్ణ స్టాండ్ వేసి రాళ్ళు తొలగించే ప్రయత్నంతో ముందుకు ఒక అడుగు వేశాడు.

అంతే! కళ్ళు మిరమిట్లు గొలుపుతూ

"ఛమక్...." మంటూ ఓక వింత కాంతి వాళ్ళపై పడి మాయం అయ్యింది.

ఆ కాంతితో పాటే చేతుల్తో పెద్ద పెద్ద ఆయుధాలతో యమకింకరు ల్లాంటి కొందరు దుండగులు ఛెంగున దూకినట్లు హఠాత్తుగా చెట్లమధ్యనుంచి బాట పైకి వచ్చి కృష్ణ మోటార్ బైక్‌పై 'మెరుపుదాడి' చేశారు.

దాదాపు పదిమంది దాకా వున్నారు.

చెయ్యెత్తు నిలువుతో భారీ శరీరాలతో నల్లగా పోతపోసిన కంచు విగ్రహాల్లా అతి భయంకరంగా వున్నారు.

చిన్న కట్ డ్రాయర్సు తప్ప శరీరాలపై ఏ ఆచ్ఛాదనా లేదు.

అందరి చేతుల్లోనూ మెరిసే కత్తుల్లాంటి ఆయుధాలువున్నాయి.

ఆ పదిమంది ఒక్కసారి మూకమ్మడిగా సావిత్రి కృష్ణలను చుట్టు ముట్టారు.

ఆ మెరుపు దాడికి అప్రతిభుడయి పోయ్యాడు.

కృష్ణకుమార్ కొద్ది క్షణాలు కొయ్యలా బిగుసుకుని పొయ్యాడు.

సావిత్రి గుండె ఒక్క క్షణం ఆగి తిరిగి రెట్టింపు వేగంలో కొట్టుకో సాగింది.

అనూహ్యమైన ఆ దుర్ఘటనని భయంతో ఆమె నోటిమాట పడి పోయింది. ఎటూ తోచడంలేదు.

అందులో ఒక్కడు మోటార్ బైక్‌ని కాలుతో తన్ని పక్కనే పెద్ద గొయ్యిలా వున్న అగాధంలోకి పడదోశాడు.

మరొకడు రోడ్డుమీద అడ్డంగా పెట్టిన బండల్ని చకచకా తొలగించాడు.

మిగతా ఎనిమిదిమంది కృష్ణని సావిత్రిని అరచేతుల్తో నోళ్ళు నొక్కి బటన్ చాకు గెడ్డం కింద అదిమి రోడ్డు కిందికి ఈడుస్తూ దాదాపు ఒక పది గజాలకి పైగా దూరం లాక్కుపోయారు.

అక్కడ ఇద్దర్నీ దాదాపు అష్టదిగ్బంధన చేసి కృష్ణని కత్తితో బెదిరించి అతని పర్సు వుంగరం చేతి వాచీ గుంజుకున్నారు.

సావిత్రి ఒంటిపై వున్న ఖరీదయిన ముత్యాల నగలు, కాలి మట్టెలు, మువ్వల పట్టీలు ఆఖరికి మంగళసూత్రాలతో సహా వల్చుకున్నారు.

ఆమె వడిలోని బాబుని గుంజినట్లు ఒంటి రెక్కతో లాగి, బాబు మెళ్ళోంచి పులిగోరు గొలుసు, మొలగజ్జెలు, వుంగరం సమస్తం హస్తగతం చేసుకున్నారు ఆ బందిపోటులు.

"భమ్మకొ...." మని మెరుపు మెరిసి మాయం అయినట్లు రెప్పపాటులో అంత నిలువుదోపిడి అతి చాకచక్యంగా జరిగిపోయింది.

గజదొంగతనాలు అతి సమర్ధవంతంగా కళ్ళల్లో కారం జల్లినట్లు చెయ్యగల రాబర్సు గ్యాంగు అది!

ఈ చిన్న దారిదోపిడి వాళ్ళకి లెక్కకాదు.

మంచినీళ్ళు తాగినంత సునాయాసంగా కొట్టిన పిండి అయినా అంతా ప్లానుగా పకడ్బందీగా నిర్వహించారు. పైగా కృష్ణకుమార్ ఒక్కడూ వాళ్ళు పదిమంది!

కింగ్ కాంగ్‌ని తలపింపచేస్తూ ఎత్తుగా పోతపోసిన ఉక్కువిగ్రహాల్లా బలిష్టంగా వున్నారు.

వాడు ఒక్క చేత్తో కృష్ణని పట్టి గుంజితే, రెండు చేతులతో, రెండు కాళ్ళతో అణుమాత్రం విదిల్చుకోలేక పొయ్యాడు కృష్ణ ఆ పట్టునుంచి. వాళ్ళని చూడగానే సావిత్రికి కళ్ళు తేలి పై ప్రాణాలు పైనే పొయ్యాయి.

తుఫానులో జాజి తీగ అల్లాడినట్లు ఆ పాదమస్తకం ఒణికిపోతోంది.

భయంతో గుండె ఆగిపోతోంది.

జరుగుతున్నది కలో నిజమో తెలియక స్థంభీభూతురాలు అయి పోతోంది.

ఆ దుండగులు దాడి అక్కడితో ఆగినా బాగుండేది.

కాని—

వెన్నెల వెలుగులో తెల్లగా దంతపు బొమ్మలా మెరుస్తున్న సావిత్రి "అందం" పై పడింది ఆఖరికి వాళ్ళదృష్టి

అంతే!

అంతా కూడబలుక్కున్నట్లు సావిత్రిని రెక్కలు పట్టి గుంజుతూ మరింత దిగువకి లోయలో వున్న ప్రాంతానికి ఈడ్చుకుపోసాగారు.

అసలే గజగజా వణికిపోతున్న సావిత్రి ఆ అకృత్యానికి భయంతో కొయ్యలా బిగుసుకుని పోయింది.

ఆ ఖంగారులో పొత్తిళ్ళలోని పసిబిడ్డ కాస్తా జారిపొయ్యాడు.

కఠిన నేలపై పడటంతో కెవ్వుకెవ్వున ఏడవ సాగాడు బాబు.

కాని వాళ్ళు అదేమీ పట్టించుకోలేదు.

సావిత్రిని ఈడ్చుకుపోవటమే ధ్యేయంగా — చచ్చిన కుక్కని ఈడ్చినట్లు —. ఆమె రెక్క పట్టి బలంగా చెట్ల చాటుకి లాక్కొని పోసాగారు.

సావిత్రి కాళ్ళకి బరువయిన కంజీవరం పట్టుచీర బంధాలు పడుతూంది.

ఎగుళ్ళు దిగుళ్ళుగా వున్న అడ్డదారి కావటంతో రాళ్ళు రప్పలు కాళ్ళకి కొట్టుకుని మెత్తని పాదాలకి ఎదురు దెబ్బలు తగులుతున్నాయ్.

గాయాలు భగభగా మండుతూ వెచ్చగా జివ్వున చిమ్ముతున్న రక్తపు స్పర్శ తెలుస్తోంది.

చెప్పులు కూడా ఎక్కడో జారిపొయ్యాయి.

అంతా అయోమయం....

కన్ను తెరిచినా గాఢాంధకారమే కనిపిస్తుంది సావిత్రికి. గెద్ద నోటికి చిక్కిన కోడిపిల్లలా ఆమె ప్రాణం గిజగిజ మంటూంది.

వాళ్ళ చేతుల్నుంచి తప్పించుకోవాలని విశ్వ ప్రయత్నం చేస్తుంది. బుడితిలో పడ్డ ఎలకలా అల్లాడిపోతోంది.

అయినా కరుడు గట్టిన కసాయి తనంతో — చచ్చిన కుక్కని తోక పట్టి ఈడ్చినట్లు—వాళ్ళు సావిత్రిని పొదల మాటుకి ఈడుస్తూనే ఉన్నారు.

కొద్ది అడుగుల దూరంలో ఆమెకి వెనకాలే ఈడ్చుకుని రాబడుతున్న కృష్ణకుమార్ కూడా దాదాపు అంతే దుస్థితిలో వున్నాడు.

వాళ్ళ గొంతులోంచి శబ్దాలు రాకుండా ఇద్దరి నోళ్ళల్లోనూ రుమాళ్ళు కుక్కి చేతులు పెడసిరిచి పట్టుకున్నారు.

సావిత్రి పొత్తిళ్ళ నుంచి జారిన అజయ్‌ని ఆ గ్యాంగ్‌లో ఒకడు ఒంటి రెక్కన ఎత్తి భుజాన వేసుకున్నాడు.

దాంతో బాబు గొంతు తెగుతున్న కోడి పిల్లలా కక్కడిల్లి కెవ్వు కెవ్వున ఏడ్వసాగాడు.

అయినా వాళ్ళకదేమీ పట్టటం లేదు.

పచ్చి నెత్తురు తాగె కరుడు కట్టిన కసాయి తనంలో జాలికి. ప్రేమాను రాగాలకి. మమతాను బంధాలకి చోటులేదు.

వాళ్ళ ధ్యేయం ఒక్కటే.

గొడ్డలి....గునపం....

తీవ్ర వాదత్వం....

సమాజంపై తిరుగుబాటు....

వేటగాడికి నెమలి మాంసం రుచే తెలుసు, దాని కంటి నీరు తెలియదు.

మేకపిల్ల జాలి అరుపు కసాయి కత్తిని కదిలించదు. దానిని "బలి" ఇయ్యటమే తెల్సు.

పది నెల్లు నిండిన బాబు "అమ్మా...." అన్న హృదయ విదారకమైన రోదన వాళ్ళ చెవిని కూడా సోకటంలేదు.

గాలి రొదలాగే బాబు ఆక్రందన వాళ్ళు పట్టించుకోవటం లేదు.

కాని—

తన చిన్నారి కొడుకు ఆక్రందన సావిత్రి గుండెని నిశా కత్తుల్లా చీలుస్తోంది.

అయినా కనీసం కొడుకని "బాబూ...." అని నోరారా పిలుచుకోలేని నిస్సహాయతతో మూగ వేదనతో అల్లాడి పోతూంది సావిత్రి.

దాదాపు పది నిమిషాలసేపు రోడ్డుకి ప్రక్క చాలా దిగువగా లోయలా వున్న మరు భూమికి లాక్కుని వచ్చారు.

అక్కడ ప్రదేశం మైదానంలా విశాలంగా వుంది.

అక్కడక్కడ తెల్లగా చిన్న చిన్న గోరీలు, ఎముకల కుప్పలు, శిధిల సమాధులు వెన్నెల్లో మరింత తెల్లగా మెరుస్తున్నాయి.

కొండరాళ్ళు గుట్టలు గుట్టలుగా పడి వున్నాయ్.

ఆ మైదాన ప్రదేశం చుట్టూతా నిలువెత్తున పెద్దపెద్ద చెట్లు పెరిగి గాలి మరింత వుధృతంగా వీస్తోంది.

గాలి చేసే వికృత శబ్దాలు మసీదులో వింతగా ప్రతి ధ్వనిస్తున్నాయి.

అక్కడికి వచ్చాక ఆగారు ఆ దొంగలముఠా.

ఒక రకంగా అది వాళ్ళ సంకేత స్థలం. విడిదింటి గృహం.

అక్కడ ఒక వారగా చెట్ల చాటున ఐదు మోటారు సైకిళ్ళు వరుసగా నిలిపి వున్నాయ్.

రోడ్డుకి దాదాపు ఇరవై గజాల దూరం....

అర్ధరాత్రి ...

నిర్మానుష్యమైన అరణ్య ప్రాంతం....

ఎందుకో ఏడ్చి ఏడ్చి గొంతు కీచుబడి....బాబు ఏడుపు కూడా ఆగి పోయింది.

ఆ మరుభూమిలో...

ఆ నిర్జన ప్రదేశంలో....

అప్పుడు....

అక్కడ....

సావిత్రి మీద అత్యాచారం జరిగింది.

కృష్ణకుమార్ నోటిలో రుమాళ్ళు కుక్కి నల్గురు అతడ్ని పెడ రెక్కలు విరిచి దాదాపు అష్ట దిగ్బంధనం చేశారు.

అతడి కళ్ళముందే సావిత్రిని ఘోరంగా చెరచారు.

గోమాత కళ్ళ ముందే దానికి పుట్టిన లేగ దూడని వధిస్తుంటే గోవు ఆక్రంధనంతో "అంబా...." అని హృదయ విదారకంగా ఆర్తనాదం చేస్తుందో—

కృష్ణ మనసు గూడా మూగగా అలాగే రోదించింది.

కాని—

ప్రాణం వుండి లేని వాడిలా....

కళ్ళుండి గుడ్డి వాడిలా....

మనసుండి రాతి శిల్పంలా నిస్సహాయంగా అలా చూస్తూ వుండి పోవటం మినహా ఏమీ చెయ్యలేని అశక్తుడయ్యాడు కృష్ణ.

గొంతు పెగలదు.

నోటి నిండా గుడ్డలు....

గుండెల్లో లేచిన కేక గొంతులోనే సుడి తిరిగి ఆగిపోతోంది.

"సావిత్రి....సావిత్రి..." అతని హృదయం మూగగా ఏడ్చింది.

చేతుల కదుల్చుదామంటే ఇనుప రెక్కలు బలంగా ఒడిసి పట్టాయ్.

గడ్డిపరకని ఏనుగు పాదం తొక్కిపట్టినట్లు—

కృష్ణ పాదాలపై ఆ కిరాతకులు తమ బలమైన కరుకు....కంకాళ పాదాలు తొక్కి పట్టారు.

అందులో ఒకడి భుజంమీద తోటకూర కాడలా వ్రేలాడుతున్నాడు బాబు.

కొడుకుని ఆ దుస్థితిలో చూస్తుంటే కృష్ణ ప్రాణం గుప్పెట్లోకి వస్తోంది.

"ఒరేయ్....చూడరా....నీ భార్య" అంటూ ఒకడు మోచేత్తో కృష్ణ కడుపులో పొడిచాడు.

ఆ స్ట్రోక్కి....కృష్ణకి ప్రాణం కడగట్టినట్లయింది.

'కెవ్వు' మంటూ అతని గుండెలో ఒక చిన్న కేక....

ఆ పరిస్థితిలో కళ్ళు తెరిచేసరికి....

ఎదురుగా అతని కళ్ళముందే....అతనికెంతో ప్రియమైన సావిత్రిపై అత్యాచారం జరిగిపోయింది.

కృష్ణ మెదడు స్థంబించి పోయింది.

అతని శరీరంలోని రక్త ప్రసారం కొద్ది క్షణాలు ఆగిపోయింది.

బ్రతికుండగానే కళ్ళకి 'నరకకూపం' కనిపించింది. నల్గురు చేరి సావిత్రిని వివస్త్రను చేస్తుంటే సహించలేని కృష్ణకుమార్ బోనులో పెట్టిన సింహంలా గాండ్రించాడు.

ఒంట్లోని యావత్ శక్తిని కూడ గట్టుకుని గట్టిగా విదిల్చుకున్నాడు.

తీవ్రంగా ఎదురు తిరిగాడు.

వాళ్ళు కూడా అదే బలంతో ముగ్గురు మూకుమ్మడిగా కల్సి కృష్ణని ఒక్క తోపు తోశారు.

ఆ తోపుకి కృష్ణ తన్నిన బంతిలా త్రుళ్ళి నాల్గు గజాల దూరం వెళ్ళి వెల్లకిలా పడ్డాడు. ఆ కుమ్ములాటలోనే బాబుని కూడ అందుకో బోయాడు కృష్ణ.

కాని ప్రమాద వశాన చెయ్యి జారింది.

దాంతో ఆ విసురుకి బాబు—పెనంమీద పేలపు గింజలా-త్రుళ్ళి గాల్లో పదడుగుల ఎత్తున ఎగిరాడు.

అంతే!

మరుక్షణం....

ఆ నిర్జన మరుభూమిలో....

అరణ్యం లాంటి ఆ తాటి తోపుల మధ్య....

ఆ పది నెల్ల పసివాడు .... 'అమ్మా....' అంటూ కెవ్వున పెట్టిన చావు కేక దిక్కుల్ని చీలుస్తూ రింగు....మని దిగంతాలలో మారు మ్రోగింది.

గాల్లో ఎగిరిన బాబు దేహం పెద్ద బండరాతికి తగులుకొని మరు నిమషం మెత్తగా చితికి రక్తపు ముద్దగా మారిపోయింది.

చిన్నారి బాబు శరీరం మొత్తం చితికి ఆ ముద్దలో ఇమిడిపోయింది.

ఆ ముక్కు పచ్చలారని పసికూన గొంతులోంచి వచ్చిన "అమ్....మ్మా" అన్న ఆ చిన్న కేక గింగిరాలు తిరుగుతూ గాల్లో కల్సి పోయి దిగంతాలలో మారు మ్రోగింది.

అయినా ఆ రాక్షసులకి అదేమీ పట్టలేదు.

మారణ హోమం వాళ్ళ నిత్యకృత్యం. పచ్చి రక్తం తాగనిదే వాళ్ళకి దాహం తీరదు.

కాని....

తన్నిన బంతిలా అంతదూరం ఎగిరి పడ్డ కృష్ణకి మాత్రం విచ్చు కత్తితో గుండెని చీల్చినట్లు కొడుకు ఆర్తనాదం వినిపించింది.

కాని సరిగ్గా అదే క్షణంలో వాళ్ళు తోసిన తోపుకి ఎగిరి పడటంతో తలకి పెద్ద బండరాయి తగిలింది.

నుదురు చిట్లి రక్తం చివ్వున చిమ్ముతూ వెచ్చగా దారకట్టింది.

తలకి తగిలిన ఆ బలమైన దెబ్బకి కృష్ణకి మరుక్షణంలో మెదడు స్వాదీనం తప్పింది.

"అమ్....మ్మా...." అన్న కొడుకు చావుకేక చెవులకి సోకు తున్న— కళ్ళముందు నల్లటి చీకటి తెరలు దిగి మైకం కమ్ముతుంటే లీలగా....ఎ లోకాల్లో నుంచో....వింటున్నట్లు అతడి చెవులకి....చిన్నారి కొడుకు పెట్టిన కేక గుండెల్ని బ్రద్దలు చేస్తూ దిక్కులు పిక్కటిల్లేలా విని పించింది.

ఆయినా....నిర్వీర్యుడయి పొయ్యాడు.

నిస్సహాయంగా రెక్కలు తెగిన పక్షిలా వున్నచోటే ధబ్బున కూలబడి పొయ్యాడు.

అప్పటికే సావిత్రి బ్రతుకు "బలి" అయ్యింది.

వీటన్నింటికీ అతీతంగా ఇహపరాలతో పనిలేకుండా పూర్తిగా స్పృహ కోల్పోయింది.

చిరుతపులి వాత పడ్డ లేడికూనలా మట్టిలో చైతన్య రహితంగా దాదాపు శవ స్త్రిగా పడి వుంది.

ఆమెలో ప్రాణం ఉండి లేనట్లు కొట్టుక లాడుతోంది.

సరిగ్గా అదే క్షణంలో....

చెట్లచాటుగా నిలిపిన ఐదు మోటారు వాహనాలు స్టార్టయ్యాయి.

"జర్ర్ర్...." అన్న మోటారు శబ్దం క్రమంగా వేగం పెరిగి దూరం అయ్యింది.

పది నిమిషాలపాటు ఆ శబ్దం అలా....అలా....గాల్లో కల్సి అంతం అయ్యింది.

అంతే?

ఆ తరువాత....ఆ ప్రాంతం అంతా నిశ్శబ్దం· శవం కాలిన తరువాత శ్మశానంలో ఏర్పడే భయంకర నిశ్శబ్దం....అలుముకుంది.

మృత్యుదేవత విషాద నృత్యం!

విధి వికృత వికటాట్టహాసం....!

ఇంత జరిగినా—

నింగిలో పున్నమి చంద్రుడు పదహారు కళలలో వెలిగి పోతున్నాడు.

చుక్కలు సరాగం ఆడుతున్నాయ్.

అడివిపూల పరిమళంతో కల్సిన చల్లని గాలి హాయిగా మత్తుగా వీస్తోంది.

"ఇటువంటి అకృత్యాలతో మాకేమిటి పని!" అన్నట్లు పకృతి మాత నిశ్చలంగా చూస్తోంది.

కాని....

ప్రక్కనే ఒక మ్రోడైన చెట్టు తొర్రలోంచి చూస్తున్న ఒక చిన్న పిట్టకి మాత్రం గుండె పగిలినట్లయింది.

రివ్వున తొర్రలోంచి బయటికి ఎగిరింది.

"తీతూ...." అని వికృతంగా అరుస్తూ ఆ విశాలమైన మైదాన ప్రాంతంలో ఆ వెన్నెల్లో....అక్కడి కక్కడే గుండ్రంగా గిరికీలు కొట్ట సాగింది.

"తీతూ...." అని గొంతు చిరిగేలా ఆ పిట్ట అరుస్తుంటే దాని నోటి నుంచి రాలిన రక్తపు చుక్కలు గాలి విసురుకి తుంపర్లుగా చెదిరి కృష్ణ కుమార్ దేహంమీద పడ్డాయి.

మళ్ళీ మళ్ళీ అదే పనిగా అతని మీద గుండ్రంగా గిరికీలు తిరుగుతూ ఆర్తనాదం చేసినట్లు మళ్ళీ మళ్ళీ విసుగు విరామం లేకుండా అరుస్తూనే వుంది తీతూ పిట్ట!

చెవి దగ్గర క్షుద్ర పక్షి అరుపు వినిపిస్తుంటే దాదాపు అరగంట తరువాత—బలహీనంగా కళ్ళు తెరిచాడు కృష్ణ.

తల పగిలి రక్తం ధారగా స్రవించటంతో మెదడంతా మైకం కమ్మి నట్లు అయ్యింది.

ఎంత శక్తి కూడ దీసుకుంటున్నా నీరసంతో కనురెప్పలు బరువుగా వాలిపోతున్నాయ్.

చూపు ఆనటం లేదు.

ఎంత కళ్ళు విప్పార్చినా నల్లగా నీలి తెరలు....కళ్ళముందు వల యాలుగా కనిపిస్తున్నాయ్.

పెదవులు చలిస్తున్నాయి తప్ప శబ్దం బయటికి రావటం లేదు.

మాటలు గరగర లాడుతూ కంఠంలోనే సుడి తిరిగి ఆగి పోతున్నాయి.

నోటికి వుప్పగా రక్తం రుచి తెలుస్తూంది.

ఆ పరిస్థితిలో....

ఎవరో భుజం తట్టి పిలుస్తున్నట్లు—

తన మీదుగా ఎగురుతున్న పిట్ట "తీతూ...." అన్న అరుపుకి కొద్దిగా మత్తువిడి స్పృహలోకి వచ్చినట్లు కనురెప్పలు ఎత్తాడు.

కొద్దిక్షణాలు అలాగే చూసి శక్తి అంత కూడ గట్టుకుని నెమ్మదిగా మోచేతులమీద లేచి కూర్చున్నాడు.

అలికిడికి బెదిరి పిట్ట కృష్ణమీంచి కొద్దిగా గాల్లో పైకి ఎగిరి రివ్వున చెట్టు కొమ్మమీద వాలింది.

ఒక్కసారి టపటపా రెక్కలు విరిచి కొట్టుకుంది.

విశాలమైన బంగరు బయలులాంటి ఆ అడవినిండా వెన్నెల పచ్చ పువ్వులా విరగ కాస్తోంది.

కృష్ణకుమార్ కొద్దిగా పేదదీరి నెమ్మదిగా స్పృహలోకి వచ్చాడు.

కళ్ళముందు పేరుకున్న నల్లటి చీకటి తెరలు కరిగి క్రమంగా అంది నంత మేర దృష్టి అనుతోంది.

సరిగ్గా గంట క్రితం జరిగిన దారుణ మారణకాండ అంతా కృష్ణ కుమార్ కళ్ళముందు సినిమా రీలులా అద్దం కట్టినట్లు కదలసాగింది.

కురవని మేఘంలా మనసు బరువెక్కింది.

నెమ్మదిగా తల తిప్పి చుట్టూ పరికించాడు.

అతి చేరువుగా—విషబాణం దెబ్బతిన్న పావురంలా రెక్కలు విరిగి పడివున్న— భార్య కనిపించింది.

ఆమెకి ఇంకొంచెం దూరంలో పెద్ద కొండరాతికి పక్కగా....తెల్లని వెన్నెల్లో ఎర్రగా మెరుస్తూ రక్తం ఓడుతున్న చిన్న మాంసపు ముద్ద కూడా కనిపించింది.

మనస్సు కలుక్కుమంది.

చిల్లి పడ్డ కుండ నుంచి నీరు కారినట్లు కళ్ళనుంచి అవిరామంగా కన్నీరు జారిపోతుంటే నెమ్మదిగా లేచి నిల్చోబొయ్యాడు.

అంతే.

నడుం కలుక్కుమంది.

"అబ్బా...."

బాధగా మూలుగుతూ దబ్బున కూలబడిపొయ్యాడు.

ఎత్తుగా పేర్చినట్లున్న గాళ్ళ గుట్టమీద వెళ్ళకిలా పడటంతో వెన్నుపూస నరాలు దెబ్బతిన్నాయ్.

నడుం పట్టుజారింది.

కృష్ణ హృదయంలో దుఃఖం కెరటంలా అంతెత్తున అలలా లేచి విరిగి పడింది.

నేలపై నెమ్మదిగా దేక్కుంటూ కొండ రాతి దగ్గరకి వచ్చాడు. అలా దేకుతుంటే శరీరంలోంచి ప్రాణం వెళ్ళిపోతున్నంత బాధగా వుంది.

అయినా బాధని ఓర్చుకుని కొడుకు పడివున్న చోటుకి వచ్చాడు.

కన్ను, ముక్కు, చెవి....చేతులు....ఏ ఆకారాలు లేకుండా అన్ని చితికి రక్తపు ముద్దగా మారిపోయిన కొడుకు చిన్నారి మృతదేహాన్ని రెండు చేతుల్లోకి తీసుకుని గట్టిగా హృదయానికి హత్తుకున్నాడు.

అతని కళ్ళనిండా కన్నీటికి బదులు ఎర్రగా రక్తం చిమ్మింది.

ఒంగి ఆర్తితో అలాగే ముద్దుపెట్టుకున్నాడు.

పెదవులకి కొడుకు లేత రక్తం ఎర్రగా ఉప్పగా తగిలింది.

అతనికి తెలియకుండానే దుఃఖపు తెర పొంగింది. హృదయంలో "ఏక్....ఏక్...." మని వికృతంగా ధ్వనించింది.

కృష్ణ దేహం నిస్సత్తువతో తూలిపోతోంది.

శరీరంలో పీసం ఎత్తు ఓపిక కూడా లేదు.

అణువు అణువూ రక్తానికి బదులు నీరు నిండిపోయినట్లు మాటి మాటికి తూలి పడుతున్నాడు.

తలకి బాగా పెద్ద దెబ్బ తగిలిందేమో....

కళ్ళముందు చీకటి ఇనుప తెరలా కమ్ముతోంది. విపరీతమైన దాహంతో గొంతుక ఎండిపోయి లుంగలు చుట్టుకుపోతోంది.

లాలాజలానికి బదులు దంతాలు కదిలి....గాలి పీల్చిన గొంతుకలోకి రక్తమే తగులుతోంది.

అయినా సరే....

కృష్ణ తన ప్రయత్నం మానలేదు.

అక్కడే అలాగే పడివుంటే బ్రతికుండగానే ఏ నక్కలో రాబందులో పీక్కుని తినటం ఖాయం.

అందుకే శక్తినంతటిని కూడగట్టుకున్నాడు.

రక్తపు ముద్దగా మారిన కొడుకు దేహాన్ని రెండు చేతులా గట్టిగా పట్టుకుని మట్టిలో నేలమీద....ఆ రాళ్ళగుల్ల మధ్య....ముళ్ళకంపల మధ్య దేకుతూ....అతికష్టంతో ఎలాగో....రోడ్డుమీదికి రాగలిగాడు.

అక్కడితో అతనిలోని యావత్‌శక్తి నశించింది. శరీరం పూర్తిగా స్వాధీనం తప్పింది.

అంతే!

రోడ్డు వారగా పడిపోయ్యాడు.

ఆ తరువాత అతని కేమి తెలియదు.

o o o

ఆ మర్నాడు....

ఉదయం పదిగంటల ప్రాంతంలో—నెమ్మదిగా కళ్ళు తెరిచాడు కృష్ణ కుమార్.

అంతవరకూ—

తెల్లటి హాస్పిటల్ బెడ్‌మీద రెక్కలు విరిగిన పక్షిలా నిస్త్రాణంగా పడివున్నాడు.

తలకి నగానికి పెద్ద బాండేజి.

ఒంటినిండా ఫ్రాక్చర్స్.

చిన్న నీడిల్‌తో చేతికి సెలైన్ బాటిల్—

రోడ్డుపక్క పడివున్న కృష్ణని లారీలవాళ్ళు చూసి హాస్పిటల్‌కి చేర్చినట్లు తెలిసింది.

కృష్ణ రోడ్డుమీదికి దేకుతూ వచ్చిన ఉద్దేశ్యం కూడా అదే.

ఆ మధ్యాహ్నం రెండు గంటల ప్రాంతంలో సావిత్రికి తెలివి వచ్చింది.

ఆమె దేహం చితికిపోయింది.

శరీరం నిండా తీవ్రమైన గాయాలతో శత్రుబారినుంచి తప్పించుకుని రణరంగం నుంచి బయటపడ్డ మనిషిలా దీనాతి దీనంగా వుంది సావిత్రి.

చిరుతపులి పంజా నుంచి తప్పించుకున్న లేడి కూనలా జాలిగా వుంది.

పాము నోట్లో చిక్కిన కప్పలా బలహీనంగా వుంది ఆమె స్వరం.

అజయ్‌బాబు తల రాతికి కొట్టుకుని "కెవ్వు"మన్న క్షణంలోనే వాడి చిన్నారి దేహంలోంచి "హంస" రెక్కలు విదుల్చుకుని అనంతాంబరపు నీలి నీడల్లోకి ఎగిరిపోయింది.

కృష్ణ-సావిత్రి "చావు తప్పి...." అన్నట్లు ఎలాగో అతి కష్టంతో బతికి బయటపడ్డారు.

కాని—

ఇప్పుడు వాళ్ళు బ్రతికున్న శవాలు....

తెల్లారేసరికి ఆ వార్త క్షణాల్లో వూరంతా పాకిపోయింది.

ఫోటోలతో సహా నిమిషాల మీద-పేపర్లకి ఎక్కింది.

ఫ్రంటు పేజీలో పెద్ద పెద్ద హెడ్డింగ్స్‌తో ప్రచురించారు.

"రాముడేలిన రాజ్యంలో....

సీత పుట్టిన దేశంలో....

సత్యవంతుడి కథ నేటికి హరికథల్లా విని తరిస్తున్న పవిత్ర భారత దేశంలో....

ఒక ఆధునిక సావిత్రి ఎంత ఘోరంగా "బలి" అయి పోయిందో....

ప్రత్యక్ష సాక్ష్యాధారాలతో కళ్ళకి కట్టినట్లు ఫోటోలతో సహా చూపించారు.

రక్తపు ముద్దగా మారిన అజయ్ బాబు ఫోటో కూడా ప్రచురించారు కలర్‌లో....

ఈ వార్త ప్రచురించి పేపర్లో డబ్బు చేసుకోవటంతో పాటు....

కొంత రాజకీయ పార్టీల పొలిటికల్ స్టంట్ కూడా జరిగింది. ప్రతి పక్షాలు చెలరేగి తీవ్రంగా ఆక్షేపించాయి.

స్త్రీకి రక్షణ లేని రాజ్యమని—

రామరాజ్యంలో రక్తపాతం" అని

దొంగలది దోపిడిదారులదే ప్రభుత్వమని—

రక్షణశాఖ నిద్రపోతోందా! అన్న స్లోగన్సుతో కొన్ని "పాంప్లెట్సు" కూడా వీధులనిండా విరజిమ్మబడ్డాయి....

దాంతో గుట్టుగా వున్న సావిత్రి కృష్ణల సంసారం బట్టబయలు అయ్యింది.

తెల్సినవాళ్ళూ తెలియనివాళ్ళూ అందరూ తిరుణాలకి వచ్చినట్లు పరామర్శకి వచ్చారు.

ఆ పరామర్శలూ, సానుభూతి వచనాలు ఆ దంపతులని స్వాంతన పరచలేదు సరికదా పుండుమీద కారం అద్దినట్లు మరింత గాయపరిచాయి.

మూడు రోజుల తరువాత హాస్పిటల్ నుంచి డిస్‌చార్జి అయి ఇంటికి వచ్చారు.

ఆ మూడు రోజులు మూడు యుగాల్లా గడిచాయి.

చేదు అనుభవంతో మనసంతా విషపూరితం అయిపోయింది.

తెల్లని పాలకుండ లాంటి స్వచ్ఛమైన జీవితాల్లో మాయని మచ్చ పడిపోయింది.

భార్య భర్తలిద్దరూ ఒకరి మొఖం ఒకరు చూసుకోలేనట్లు ఎంత దౌర్భాగ్యం!

ఆఫీసు స్టాఫ్ అంతా వచ్చారు.

స్నేహితులూ, బంధువులూ, పరిచయస్థులూ....అందరూ పరామర్శకి వచ్చారు.

చాలా ఘోరం జరిగిపోయిందని వాపోయ్యారు. కడివెడు సానుభూతి చూపించారు.

"అర్ధరాత్రి....అట్లా ఆడవాళ్ళతో మోటార్ బైక్‌మీద ప్రయాణం చెయ్యటం చాలా పొరబాటు. లోకం ఎలా వుంది! తెల్లారి లేచి ఎన్ని వినటం లేదు. మన జాగ్రత్తలో మనం వుండాలి...." అని కృష్ణని మందలించారు.

కాని—

కృష్ణకుమార్ పెళ్ళయిన కొత్తలో భార్యతో అట్లాంటి ప్రయాణాలు ఎన్నో జాలీగా చేశాడు. ఎంతో రిస్క్ తీసుకున్న సందర్భాలు కూడా వున్నాయ్. అసలు అలాంటి అడ్వంచర్స్ అంటే కృష్ణకి ఇష్టం. కాని.... ఎన్నడూ ఏ చిన్న ఆపదా సంభవించలేదు.

కాని ఇప్పుడు ఇట్లా జరిగింది.

ఏదిమంది పది రకాలుగా వ్యాఖ్యానిస్తున్న మాటలన్ని కృష్ణ మౌనంగా.... 'యోగి'లా విని నిశ్శబ్దంగా వుండిపోయాడు.

అదృష్టవంతుడు "సింహం" నోట్లోంచి తప్పించుకుంటాడు. దుర దృష్టవంతుడ్ని పూల దండే పామై కాటు వేస్తుంది.

"శివుడి ఆజ్ఞ లేనిదే చీమైన కుట్టదు" అని కదా పెద్దల వాక్కు.

దైవం అనుకూలించని నాడు అంతే జరుగుతుంది. ఏ చిన్న పని చేసినా గ్రహపాటె అవుతుంది. విధి విన్యాసాలని ఎవరడ్డ గలరు!

తల రాతని ఎవరు తుడపగలరు ?

ఎవరు ఎన్నివిధాల తర్కించినా, ఎంత ఓదార్చిన జరగకూడనిది జరిగిపోయింది. ఎంత వగచినా గతం తిరిగిరాదు. చిన్న కర్రపుల్ల అడ్డం వచ్చి ఓడ తల్లకిందులై సముద్రగర్భంలో మునిగిపోయింది.

జీవితం క్షణ భంగురం కదా ?

"లైఫ్ అండ్ డెత్ ఆర్ లైక్ ద టు సైడ్స్ ఆఫ్ ఎ కాయిన్" అంటారు "గాంధీజీ".

రెప్పపాటులో సావిత్రి పచ్చటి నూరేళ్ళ జీవితం బుగ్గిపాలు అయ్యింది.

భార్య భర్తలు ప్రాణాలతో బతికి బయటపడ్డారు.

కాని—

తిరిగి ఎలా తల ఎత్తుకోవటం ?

ఈ సభ్య సమాజంలో ఎలా జీవించటం ?

రేకులు తునిగి నేలపై ధూళిలో కలిసి పాదాలకింద నలిగినపువ్వు.... పూజకి పనికి వస్తుందా ?

కుక్క తిన్న అన్నం కుండని తిరిగి ఇంట్లో పెట్టుకుంటారా ఎవరైనా ?

కక్కిన కూటికోసం ఆశపడటం ఎంత హేయం !

చీడపట్టిన చెట్టుకి కుక్కమూతి పిందెలు కాస్తాయి కాని మంచిఫలాలు కాస్తాయా ?

సావిత్రి వంటింటి గడపలో మోకాళ్ళ మధ్య తలదించుకుని కూర్చుంది.

అక్కడ్నుంచి అంగుళం కూడా జరగలేదు. వంచిన తల ఎత్తలేదు.

వర్షాకాలంలో బాగా తడిచి నానివున్న చూరునుంచి వర్షపు నీరు చుక్కలు చుక్కలుగా జారుతున్నట్లు.

ఈ నాల్గు రోజుల్నుంచి ఆమె కళ్ళనుంచి అశ్రువాహిని అలా రాలుతూనే వుంది.

ఆమె మాట్లాడటం మర్చిపోయింది.

కాని అర్థం తెలిస్తే ఆమె కన్నీటిని చూసి కావ్యాలు వ్రాయవచ్చు.

మసిగుడ్డని కట్టిన మాణిక్యంలా రక్షణలేని ఆమె అందం....

విషాదగీతంలా.... నిశ్శబ్దంగా.... ఆమె కన్నీరు....

బాధని వేదాంత పరి భాషలో చెప్పినట్లు... ఆమె మౌనం?

ఇరుగు పొరుగు అమ్మలక్కలందరూ పరామర్శకి వచ్చి సావిత్రిని- ఓ వింత జంతువుని చూసినట్లు- చూసి వెడుతున్నారు.

నిన్నటివరకూ సావిత్రి అదృష్టానికి అసూయపడిన తల్లులందరూ ఈరోజు కడివెడు సానుభూతి కురిపిస్తున్నారు.

కాని—

నోటితో మాట్లాడుతూ నొసలుతో వెక్కిరిస్తున్నారని తెల్సు సావిత్రికి.

అయినా ఏం చేస్తుంది ?

అల్లాంటి దుస్థితి ఆమె కోరుకోలేదు.

ఇంటి దగ్గర ఆడపిల్లని అందునా జ్వరంలోవున్న పిల్లని పరాయి

పంచన ఒదిలిపెట్టి వచ్చింది. భర్త ఆఫీసులో అధికారుల ఒత్తిడితో పనిలో తల మునకలుగా వున్నాడు.

అందుకని తప్పనిసరిగా వెళ్ళాలి కదా అని ప్రయాణం అయ్యింది.

ఇల్లాలుగా అది ఆమె బాధ్యత!

కాని....

ఇలా జరుగుతుందని ఆమె కోరుకుందా?

అంతటి దురదృష్టం తన నొసట వ్రాసివుందని తెలిస్తే ఏ ఆడపిల్ల మాత్రం గడప దాటుతుంది?

స్త్రీ తన మనోరధుడి వాలుచూపులు కొంటె మన్మధ బాణం హృదయానికి గుచ్చుకోవాలని కోరుకుంటుంది. కాని....కిరాతకుడి సూది విషబాణం దెబ్బ గుండెని వాడిగా తూట్లు పొడవాలని కోరుకోదుకదా?

"స్త్రీ!"

ఎంత అందమైన పేరు.

ఆ చిన్న అక్షరంలోనే ఎన్ని ఒంపుల సొంపులు? సుకుమారానికి, లాలిత్యానికి, ప్రేమకి, మాతృత్వానికి మారురూపం....

భగవంతుడు తనకి మారుగ స్త్రీని సృష్టించి ప్రతి ఇంట శాంతి సౌఖ్యాలని నెలకొల్పమని ఆశీర్వదించి స్త్రీని భూలోకానికి పంపించాడట.

అందుకే స్త్రీకి ప్రేమ, త్యాగమే తెలుసు.

ద్వేషం తెలియదు.

అలాంటి స్త్రీకి ఎంత దుస్థితి!

అయితే ఈ లోకంలో పరహస్తగతం అయిన స్త్రీకి....

బురదపాలు అయిన పువ్వుకి విలువలేదు.

తన భార్య పథాజిత అవుతుందని తెలిస్తే ఏ భర్తా అజాగ్రత్తగా వుండడు.

కాని "విధి లిఖితం" అని ఒకటుంది.

దాన్ని ఎవరూ తప్పించలేరు కదా?

అనూహ్యమైనది జరగటమే దైవఘటన.

"బుద్ధిః కర్మానుసారి" అన్నది 'వేదవాక్కు'.

దైవం అనుకూలించనప్పుడు "కాలసర్పం" పగబట్టినట్లు కాటు వేస్తుంది.

ఆ విషపు కోరలకి ఎంతటివారైనా గురికాక తప్పదుకదా?

o o o

మూడురోజులు.

అదృష్టవంతులకి మూడు రోజులు అంటే మూడు ఘడియలు.

దురదృష్టవంతులకి మూడు రోజులు అంటే మూడు యుగాలు....

దురదృష్టవంతురాలు సావిత్రి....మూడు రోజుల్నుంచి "శవం"లా వంట గదిలో కటిక నేలమీద పడివుంది.

కృష్ణ డ్రాయింగ్ రూమ్‌దాటి బయటకి రాలేదు.

ఇరుగు....పొరుగు....ఎవరో ఏదో పెడితే సుజాత తింది.

సావిత్రికి కన్నీరే ఆహారం.

కృష్ణకుమార్‌కి సిగిరెట్ అనుపానం.

అతని తలకి బాండేజ్ ఇంకా అలాగే వుంది. తెల్లటి ఆ గుడ్డల నిండా ఎర్రటి నెత్తుటి మరకలు.

అతని ఆప్తులు పరిచయస్తులు ఎవరెవరో....వచ్చి వెళుతూనే వున్నారు.

ఏ ఆఫీసు ఇనస్పెక్షన్ కోసం అతడు ఖంగారుపడి రాత్రికి రాత్రి బయలుదేరాడో తిరిగి ఆ ఆఫీసు గుమ్మం కూడా ఎక్కలేదు.

ఆ పై అధికారులే స్వయంగా జీపులో అతని ఇంటికి వచ్చి అతని కుటుంబానికి జరిగిన అన్యాయానికి సానుభూతి పలికి, పరామర్శించి వెళ్ళారు.

అతని అక్క వసుంధర కూడా పేపర్లనిండా వార్తలు చూసి వెంటనే అతనికి ట్రంక్ కాల్ మాట్లాడింది.

భర్త హైపాడ్ పడ్డాడనీ, అతనికి కొంత నెమ్మదించిన పత్యం పెట్టిన వెంటనే తాను బయలుదేరి వస్తానని దాని సారాంశం.

ధైర్యంగా వుండమని మనసు పాడు చేసుకోవద్దని తమ్ముడ్ని తల్లిలా అనునయించింది.

పలువురి ఆ సానుభూతి వాక్యాలు ఆ పరామర్శలూ వింటూ వుంటే కృష్ణని మొండి రంపంతో ఎవరో తన హృదయాన్ని కోస్తున్నట్లు వేదన కలిగింది.

విచ్చు కత్తితో గుండెని కెలుకుతున్నట్లు వేదన కలిగింది.

ఈ రోజున....

కృష్ణకుమార్ అంటే సమాజంలో మంచి పరువు ప్రతిష్ట కల వ్యక్తి.

ప్రభుత జమానాలో వున్నతాధికారి.

మధ్య తరగతి జీవనంతో పరువు ప్రతిష్ట ఆస్తిగా పెట్టుకుని బ్రతుకుతున్న అభిమానధనుడు.

అటువంటి మనిషి తన కళ్ళముందే భార్య పరాజిత అవుతుంటే కళ్ళుండి గుడ్డివాడిలా చేతులూ కాళ్ళు లేని మొండి వాడిలా....మనసుండి రాయిలా···నిస్సహాయంగా నిర్వీర్యంగా....

ఇంత దురదృష్టం తనని వెక్కిరిస్తుందని అతనికి మాత్రం ఏం తెల్సు ?

జరిగిన దుర్ఘటన ఆ దంపతుల గుండెల్ని అనుక్షణం సూదిలా పొడుస్తూంది.

దానికి తోడు పుండుని పుల్లతో కదిపినట్లు ఈ చెత్త సానుభూతి ఏమిటి ?

ఈ పనికిరాని పరామర్శలు ఏమిటి ?

పత్రికల వారి ఇంటర్వ్యూలు ఏమిటి ?

ఈ డెత్ స్టేట్ మెంట్స్ ఏమిటి?

ఎందుకూ కొరగాని ఇందరి ఔదార్యం ఏమిటి?

నోట్లో చక్కెర కడుపులో కత్తెర అన్నట్లు అంతా కపట సానుభూతి.

ఈ అనునయం వల్ల తిరిగి తన జీవితంలో మునుపటి స్వేచ్ఛత నెల కొంటుందా?

మచ్చ తుడిచి పెట్టుకుని పోతుందా ?

సభ్య సమాజం మరి....

మూడు రోజులు ....

ఊహూ....

మూడు యుగాలు....

కృష్ణకుమార్ గడపదాటి వీధి ముఖం చూడలేదు.

భార్యతో పెదవి కదిపి ఒక చిన్న మాట కూడా మాట్లాడలేదు.

ఇద్దరి హృదయాల్లోనూ చిత్రమైన స్తబ్ధత శ్మశాన వైరాగ్యం.

శవాన్ని తీసిన తరువాత ఏర్పడే అఘోరకమైన నిశ్శబ్దం....

దాదాపు నాల్గురోజులు అలాగే గడిచిపొయ్యాయి.

ఆ తరువాత నెమ్మదిగా ఆ స్తబ్ధత చెదరసాగింది.

విషాదం కొద్దిగా తేలికపడింది.

సమాజంలో ఆడదాని విలువ పడిపోయింది.

కేవలం స్త్రీని సుఖాలు అందించే ఆటబొమ్మగానే చూసే దురదృష్ట కరమైన రోజు దాపురించింది.

కాని పట్టించుకొనే నాథుడు ఎవరు?

కడుపు చించుకుంటే కాళ్ళమీద పడుతుంది.

"....ఏటి కేత మేసినా ఏరు ఎండదు పొగిలి పొగిలి ఏడ్చినా పొంత నిండదు...."

అన్నట్లు ఎంత ఏడిస్తే ఆ దుఃఖం తీరేను?

సావిత్రి నెమ్మదిగా లేచి స్నానం చేసింది.

కొద్దిగా కాఫీ డికాషన్ వేసింది.

పాలు పెట్టి స్టౌ ఎర్రగా మండుతుంటే ఆ మంటలోకి చూస్తూ కూర్చుంది.

సావిత్రి ఈ మూడు రోజుల్నుంచి వంటిల్లు దాటలేదు.

భర్త మొగం చూడలేదు.

నిన్నటి దాకా ఎంతో సన్నిహితంగా మనసుకి దగ్గరగా అనిపించిన భర్త ఈ రోజు ప్రక్కగదిలోనే వున్నా హృదయానికి కొన్ని వందల మైళ్ళ దూరంగా అనిపిస్తున్నాడు.

ఎవరితోనూ అతను మాట్లాడటం లేదు.

కాని నిన్న సుజాత 'టీ' తీసుకు వెళ్ళి బల్లమీద పెట్టి "నాన్నా...." అని పిలిస్తే—

మునివేళ్ళతో కణతలు రుద్దుకొంటున్న కృష్ణ కళ్ళు తెరవకుండానే "ఊ...." అని మాత్రం పలికాడు.

తండ్రి పన్లు అన్నీ సుజాత చేస్తోంది.

సావిత్రికి అతని ఎదుట పడాలంటే భయంతో మనసు వెనక్కి లాగుతోంది.

కాని ఇలా ఎన్నాళ్ళు?

భార్యాభర్త అయివుండి ఒకే ఇంట్లో అపరిచితుల్లా ఎన్నాళ్ళు బ్రతగ్గలరు ?

నిప్పు కాలిన వెంటనే చెయ్యి బొబ్బ లెక్కుతుంది.

కాని క్రమంగా మంట తగ్గి మచ్చ మాత్రమే మిగులుతుంది.

రోజులు గడిచిన కొద్దీ ఆ మచ్చకూడా మరుగున పడిపోతోంది.

"కాలం" మనసు గాయాలని మాన్పే గొప్ప మందు, ఇవాళ కాకపోతే రేపయినా తమ ఇద్దరి మధ్య సఖ్యత కుదరకపోతుందా ?

తన భవిష్యత్తు గురించి సావిత్రిలో ఆదే ఆశ ....

సావిత్రి నెమ్మదిగా కాఫీ కప్పు ట్రేలో పెట్టుకుని భర్త దగ్గరికి వచ్చింది.

కృష్ణ రైటింగ్ టేబిలు ముందు మోచేతుల మధ్య తలదించుకుని నిశ్శబ్దంగా నైరాశ్యంగా కూర్చున్నాడు.

సావిత్రి కాలి గజ్జెల చప్పుడుగాని గాజుల చిరునవ్వడిగాని అతడి స్తబ్దతిని కదిలించలేక పొయ్యాయి.

అతడు మానసికంగా అక్కడలేడు.

సావిత్రి చేతిలో కాఫీ కప్పు పట్టుకుని అలాగే బొమ్మలా గడపలో నిల్చుండి పోయింది.

బల్లమీద చేతుల మధ్య తలదించుకుని కూర్చున్న ఆ మనిషిని ఇంతకుముందు ఎన్నడూ చూడనట్లు ఆరోజే మొదటిసారి కొత్తగా.... చూస్తున్నట్లు సావిత్రిలో ఒక విచిత్రమైన అనుభూతి.

"తనకి దూరం అయిపోతున్నాడనుకుంటున్న ఈ కృష్ణ ఒకప్పుడు తనకి ఎంతో దగ్గర మనిషి కదా?" అనుకుంటే సావిత్రి మనసులో మెత్తని కదలిక.

ఇదివరకు ఇలా ఇంట్లో వున్న కాస్సేపు ఎంత అల్లరిగా వుండే వాడు ?

తన వెనకాలే నీడలా తన కొంగు పట్టుకు తిరిగేవాడు కదా ?

"కాని ఇప్పుడు ?"

సావిత్రి నెమ్మదిగా భర్త దగ్గరికి వచ్చి చేతిలో కాఫీ కప్పు టేబిల్ మీద పెట్టింది.

పెరిగిన గెడ్డంతో మాసిన దుస్తులతో పిచ్చివాడిలా అలా బల్లమీద తల వాల్చుకు పడుకున్న భర్తను చూస్తుంటే సావిత్రి మనసు ఎంతో ఆర్ద్రం అవుతూంది నెమ్మదిగా అతని భుజంమీద చెయ్యి వేసింది.

అంతే!

ఆ స్పర్శకి షాక్ తిన్నట్లు చివ్వున తలఎత్తాడు కృష్ణ.

ఎదురుగా....భార్యని చూస్తూనే విషసర్పాన్ని చూసినట్లు బెదిరి గభాల్న కుర్చీలోంచి లేవబొయ్యాడు.

బల్లమీద పొగలు కక్కుతూ కాఫీ కప్పు కనిపించింది.

మనసు భగ్గున మండినట్లు అయ్యింది.

కడుపులోని అక్కసు అసహనం అంతా ఆ కప్పుమీద చూపిస్తూ విసురుగా ఒక్క తోపు తోశాడు.

మరుక్షణంలో కాఫీకప్పు గాల్లో అంతెత్తున ఎగిరి గోడకి గుద్దుకుని "ధన్న్...."మంటూ గచ్చుమీదపడి భళ్ళున బ్రద్దలయ్యింది.

చిక్కటి కాఫీ నేల పాలు అయింది.

సావిత్రి మొఖం చూడటం కూడా అసహ్యం అన్నట్లు చివ్వున తల తిప్పుకుని తామసంగా పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ గదిలోంచి బయటికి వెళ్ళిపొయ్యాడు.

సావిత్రి హతాశురాలు అయ్యింది.

రెండు నిమిషాలసేపు నోటమాట పడిపోయినట్లు .... శిలా ప్రతిమ అయిపోయింది.

చెప్పుతీసి కొట్టినట్లున్న అతని ప్రవర్తన ఆమె మనసుకి ఛెళ్ళున తగిలింది.

ప్రాణం చచ్చినట్లు అయ్యింది.

కళ్ళలో గిర్రున నీళ్ళు తిరుగుతుంటే గభాల్న వెనుతిరిగి వంట గది లోకి వచ్చేసింది.

గుండెల్లో గునపం గుచ్చుకున్నట్లు మనసు విలవిల్లాడిపోతోంది.

ఎంత హేయమైన ప్రవర్తన?

"పనికిరాని వస్తువుకేసి ఎలా చూస్తారూ?"

అచ్చం అలా చూశాడు.

ఎంత నిర్లక్ష్యపు చూపు....?

"నవ్వు అంటే ఏమిటో అసలు తెలియనట్లు అతని పెదవులు బిగుసు కుని పొయ్యాయి.

ఇంతకు ముందు అతడు కురిపించిన అనురాగం....ప్రేమ....ఆప్యాయత అన్నీ ఏమయిపోయ్యాయి?

అంత నటనేనా?

కాలక్షేపం కబుర్లేనా?

అసలయిన ప్రేమ ఏమిటో తెలిసేది కష్టకాలంలోనే కదా ?

కాని....అతడు?

సావిత్రి మనసంతా విషం తిన్నట్లుగా వుంది.

"చచ్చిపోకుండా ఇంకా బ్రతికున్నావా ?" అన్నట్లు భర్త చూపిన ఆ చూపు....సావిత్రి గుండెల్ని వాడి బాకులా చీలుస్తోంది.

"ఎందుకు ?"

ఎందుకు తనకింత దౌర్భాగ్యం?

చావలేక బ్రతకటం అంటారే....అలా ....

అసలు....ఆరోజు ఆ కిరాతకుల చేతుల్లోనే తన ప్రాణం పోయి వుంటే ఎంత బాగుండేది ?

అయ్యో భగవంతుడా ?

ఈ సావిత్రి మొఖాన ఏమి రాత రాసావయ్యా ?

ఆ పసివాడితోనే నన్ను కూడా తీసుకుపోలే దెందుకు?

సావిత్రి మనసంతా వైరాగ్యంతో నిండిపోయింది.

ఈ మూడు రోజుల చేదు అనుభవంతోటి భర్త చూసిన ఆ చిన్న ఏహ్యపు చూపుతోటి సావిత్రికి జీవితం అంటే విరక్తి ఏర్పడింది,

భర్త చూసిన ఆ చిన్న చూపులో జీవిత సత్యం ఏదో ఆవిష్కరణ అయినట్లు తోచింది.

సావిత్రి రెండు చేతుల్లోనూ మొఖం పెట్టుకుంది.

కన్నీటి ముత్యాలు జలజలా రాలి ఆమె దోసిలి నిండాయి.

o o o

ఆ రోజు ఉదయం తొమ్మిది గంటలు కావస్తోంది.

సావిత్రి చీకటితోనే లేచి నిశ్శబ్దంగా తన పన్లు అన్నీ ముగించుకుని నెమ్మదిగా వంట ప్రయత్నం మొదలుపెట్టింది.

సుజాత బయట వరండాలో కూర్చొని చదువుకుంటోంది.

సుజాతని స్కూలుకు పంపడం లేదు సావిత్రి.

ఆ దుర్ఘటన జరిగి సరిగ్గా పదిరోజులు అయింది.

ఆ సంగతులు గురించి ఇంకా లోకం వింతగా చెప్పుకుంటూనే వుంది.

పదిరోజులుగా సావిత్రి, కృష్ణ వీధి మొగం చూడటంలేదు.

ఆఖరికి సుజాత గుమ్మంలో నిల్చున్నా ఇరుగు పొరుగు ఎగాదిగా చూస్తున్నారు.

నిన్న సాయంత్రం సుజాత బాల్యచాపల్యంతో ప్రక్కింటి ముందు ఆడుకుంటున్న పిల్లల దగ్గరికి వెళ్ళింది.

వాళ్ళంతా సుజాతకి స్నేహితురాళ్ళే.

కాని నిన్న సుజాత ఆటకి వెళ్ళగానే వింత జంతువుని చూసినట్టు సుజాతని చూసి ఆట ఆపివేశారు.

ఆ అమ్మాయిలంతా ఒకరి మొఖాలొకరు చూసుకుని కాస్సేపు సుజాతని ఎగాదిగా చూసి నిశ్శబ్దంగా సైగలు చేసుకుని ఇళ్ళల్లోకి వెళ్ళి పోయ్యారు.

నిన్నటిదాకా ఇంటికి వచ్చి చెయ్యి పట్టుకుని ఆటకి పిల్చుకుపొయ్యే స్నేహితురాళ్ళు ఈ రోజు చిన్న పల్కరింపు లేకుండా ఆట మానేయ్యటంతో బిత్తరపోయింది సుజాత.

ఏడుపు మొగం పెట్టుకుని లోపలికి వచ్చేసింది.

ఇదంతా కిటికీ వారగా నుంచుని ఓ కంట గమనిస్తూనే వుంది సావిత్రి.

కూతురు చిన్నపోయి రావటం చూస్తే ఆమె మనసంతా తెడ్డు వేసి కెలికినట్లయ్యింది.

ఆ పరిస్థితిలో సుజాతని స్కూలుకి పంపితే ఆ లేత మనసు ఎంత గాయపడుతుందో ఆ చిన్న సంఘటనతో అర్థం అయ్యింది సావిత్రికి.

సమాజంలో తన స్థానం ఎందుకింతగా దిగజారిపోయింది?

ఏం పాపం నిశ్శబ్దంగా మోగాళ్ళ మధ్య తలపెట్టుకుంది.

కన్నీరు చెక్కిళ్ళమీద జారిపోతుంటే అలా ఎంతోసేపు స్తబ్దగా కూర్చుండిపోయింది.

దాదాపు అర్ధగంట తరువాత "అమ్మా...." అంటూ సుజాత భుజం కుదుపుతుంటే గభాల్న తల ఎత్తింది.

"అమ్మా .... నాన్న ఎందుకో ఇందాకట్నుంచి మూలుగుతున్నాడే...."

"...." సావిత్రి నొసలు ముడిపడింది.

అయోమయంగా కూతురు మొఖంలోకి చూసింది.

"అవునమ్మా! ఇందాకట్నుంచి నాన్న పాపం ఎందుకో మూలుగుతున్నాడమ్మా. నే వెళ్ళి ఎంత పిలిచినా పలకటంలేదు." సుజాత గొంతులో ఆందోళన ధ్వనిస్తోంది.

ఆ అమాయకమైన కళ్ళల్లో తండ్రిపట్ల అనురాగం ఆప్యాయత తొణికి పడుతూంది.

సావిత్రి గభాల్న లేచి కృష్ణ పడుకున్న గదిలోకి వచ్చింది.

సుజాత చెప్పింది నిజమే.

కృష్ణ నిండా రజాయి కప్పుకున్నాడు.

అగి అగి "ఊయ్....ఊయ్... " అని మూల్గుతున్నాడు.

సావిత్రి గుండె ఝల్లుమంది.

మనసు ఎందుకో....కీడు శంకించింది.

మొన్నటి భర్త ప్రవర్తన నిరసన అంత మర్చిపోయింది. అతనిపై మునుపటి ఆపేక్ష గుండెలో కెరటంలా విరుచుకు పడింది.

అంతే !

చప్పున భర్త దగ్గరగావెళ్ళి మంచంలో కూర్చొని అతని ఒంటిమీద చెయ్యి వేసింది.

పొయ్యిమీద పెనంలా సలసలా కాగిపోతోంది ఒళ్ళు.

ఒంటిమీద స్పృహలేని స్థితిలో అతనికి తెలియకుండానే ఆగి ఆగి మూల్గుతున్నాడు.

జ్వర తీవ్రతకి అతని తెల్లని శరీరం ఎర్రగా మాడినట్లు అయి పోయింది.

కళ్ళు వుబ్బి ఎర్రగా చారకత్తులా మెరుస్తున్నాయి. అతను దేహ మాత్రంగానే అక్కడ వున్నాడు.

కాని—

అతని ప్రాణం ఏలోకాల్లోనో కొట్టుకొంటుంది. మాసిన గెడ్డంతో.... తిండిలేక సుష్కించి పోయిన దేహంతో చెంపలు పీక్కునిపోయి దీనాతి దీనంగా వుంది అతని రూపం.

భర్తని ఆ స్థితిలో చూస్తుంటే సావిత్రికి కడుపులోంచి దుఃఖం తన్నుకుని వచ్చింది.

ధర్మామీటర్ తెచ్చి టెంపరేచర్ చూసింది.

నూట నాలుగు డిగ్రీలు చూపుతోంది.

సావిత్రికి గుండె గుభేల్లు మంది.

ఒక్క క్షణం ఏం చెయ్యాలో అర్థంకాలేదు.

అతనికి ఎదురు పడితే ఏం మండి పడతారో అని కడుపులో భయం.

కాని ఆలా అని అంత జ్వరం మనిషిని ఎలా నిర్లక్ష్యం చేస్తుంది.

అదే ఇదివరకయితే....?

సావిత్రికి కళ్ళల్లో గిర్రున నీళ్ళు తిరిగాయి. అతి ప్రయత్నంలో భర్తని భుజం తట్టి పిలిచింది.

రెండు మార్లు కదిపాక బరువుగా కనురెప్పలు ఎత్తి చూశాడు కృష్ణ

కాని ఆ చూపులో 'జీవం' లేదు.

వీలోకాల్లోనో చిక్కు పడింది. అపస్మారకంగా వున్నాడు.

కళ్ళు తెరిచి చూసినా సావిత్రిని గుర్తించలేదు. సావిత్రి చేతిలోవి "మెటాసిన్" టాబిలెట్ ఇచ్చి గోరు వెచ్చని నీళ్ళగ్లాసు అందించింది.

కృష్ణ యాంత్రికంగా మాత్ర వేసుకుని తిరిగి కళ్ళు మూసుకుని మగతలోకి జారిపొయ్యాడు.

జ్వర మైకంతో అతడు భార్యని గుర్తించలేదు.

లేకపోతే మాత్ర విసిరికొట్టే వాడేమో బహుశా....

సావిత్రి తడిగుడ్డ పిండి అతటి నుదుటిమీద అరగా అరగా వేస్తూ కృష్ణ తల దగ్గరే స్టూలు వేసుకుని కూర్చుండిపోయింది.

అన్నిరోజుల తరువాత భర్తని అంత సన్నిహితంగా చూస్తుంటే దుఃఖమో అనందమో తెలియని ఒక ఉద్వేగం అలలా ఆమె గుండెలో పొంగులెత్తింది.

మధ్యాహ్నం కాస్త హార్లిక్సు కలిపి తాగించింది.

భర్తకి అలా వుండటంతో సావిత్రికి కూడా తిండి సయించలేదు.

క్షణాల్లో తన జీవితం ఎంత దుర్భరంగా మారిపోయింది. తమ ఇద్దరి మధ్య ఎన్ని అడ్డు గోడలు మొలిచాయో తల్చుకుంటే ఆమెకి ఏడుపు వస్తుంది.

అతికష్టంతో దుఃఖాన్ని గుండెల్లోనే అణచుకుంది.

సావిత్రి భర్తని అంటి పెట్టుకుని సేవలు చేసింది.

తనకి చేతనయినంత వరకు వైద్యం చేసింది.

ఆ రెండు రోజులు తాను పూర్తిగా అపస్మారకంగానే వున్నాడు.

హార్లిక్సు తప్పించి వేరే ఆహారంలేదు.

ఆ రాత్రి పన్నెండు గంటల ప్రాంతంలో కృష్ణకి టెంపరేచర్ దిగింది.

ఒళ్ళంత చెమటలు పట్టాయి. మొఖం తేటపడింది.

సావిత్రికి ఎంతో ఆనందం అనిపించింది.

తన భర్తని చల్లగా చూడమని వేయి దేముళ్ళకి మొక్కుకుంది.

ఆ మర్నాడు ఉదయం పది గంటలకల్లా పొట్లకాయకూర చారు చేసి పథ్యం భోజనం తయారు చేసింది.

వేడిగా ప్లేటులో వడ్డించి అతని గదిలోకి తీసుకెళ్ళింది.

కృష్ణగోడవైపుకి తల పెట్టుకుని కళ్ళు మూసుకుని పడుకున్నాడు. సావిత్రి భోజనం పళ్ళెం స్టూలుమీద పెట్టి ఆప్యాయంగా భుజంమీద చెయ్యి వేసింది.

అంతే!

"పాము" మీదపడితే త్రుళ్ళి పడినట్లు చివాలున మంచంలోంచి లేచి కూర్చున్నాడు.

కోపంతో అతని సోగ కళ్ళు ఎర్రగ రక్తం కక్కుతున్నాయి.

"...." సావిత్రి ఏదో చెప్పబోయింది.

కాని భర్త వుగ్రరూపం చూస్తూనే కంఠంలోనే ఆ మాటలు సుడి తిరిగి ఆగిపొయ్యాయి.

కృష్ణ ఎదురుగా నిల్చున్న భార్యని. ఆమె బల్లమీద పెట్టిన అన్నం పళ్ళాన్ని ఒక్కక్షణం సేపు మార్చి మార్చి చూసి తన మనసులో భార్యపై వున్న ద్వేషం అంతా వెల్లడి చేస్తూ చేత్తో విసురుగా అన్నం పళ్ళాన్ని బలంగా ఒక్క తోపు తోశాడు.

గాల్లో అన్నం పళ్ళెం అంతెత్తున ఎగిరి "ఠంగ్...." మంటూ నేల మీద పడింది.

భార్య మొఖం కామకదా కనీసం గాలికూడా సోకటం ఇష్టం లేనట్లు చివాలున మంచంలోంచి లేచి తామసంగా అడుగులు వేస్తూ పక్క గదిలోకి వెళ్ళిపొయ్యాడు.

సావిత్రి హతాశురాలు అయ్యింది.

అనూహ్యమైన భర్త ప్రవర్తనకి ఆమె మెదడు స్థంభించి పోయింది.

రక్తనాళాలన్నీ చిట్లుతున్నట్లు సన్నని వేదన....

రెండు రోజులు మూసిన కన్ను తెరువకుండా పడివుంటే పగలు రాత్రి సేవలు చేసిందే....ఆ సేవలకి ఇదేనా ఫలితం?

ఎంత ఆప్యాయతతో అతనికోసం భోజనం వండి పట్టు కొచ్చింది? కాని అతడు ఎంత కఠినంగా ప్రవర్తిస్తున్నాడు?

ఎందుకు?

ఇందులో తను చేసిన తప్పేముంది?

విధిచేసిన వికృతానికి తను 'బలి' అయ్యింది అంతే కదా? అది తన దోషమా? అది తన నేరమా?

సావిత్రికి కళ్ళనిండా నీళ్ళు నిండాయి.

నేలపాలయిన అన్నంలో నేలపాలయిన తన ఆప్యాయితే కని పిస్తోంది.

జ్వరం పడ్డ మనిషి ఆకలితో వున్నాడు కదా అని ఎంతో ఆత్రపడి నందుకు ఫలితం అది.

తరతరాల పురుషుడి దురహంకారానికి స్త్రీ బానిసత్వానికి నిదర్శనం అది....

మగవాడి కసాయితనం....

ఆడదాని బేలత్వం....

ఎప్పటికి మారేను ?

కళ్ళనుంచి చుక్కలు చుక్కలుగా కన్నీరు రాలుతుంటే చీపురుతో నేల శుభ్రం చెయ్యటం మొదలు పెట్టింది.

o o o

ఆకాశం నల్లగా కారుమబ్బులు పట్టింది.

ఉరుములు తోటి మెరుపులతోటి ప్రకృతి క్షణక్షణానికి భీభత్సంగా మారిపోతోంది.

చల్లని వడగాలులు వీస్తున్నాయ్.

ఆ రోజు ఉదయం నుంచి వాతావరణం ఆలాగే భయంకరంగా వుంది.

ఇప్పుడో ఇంకో ఘడియకో పెద్ద వానకురవచ్చు.

వుండి వుండి ధన్ ధన్‌మని వురుములు....

తళతళా మెరుపులు....

కరెంటు పోయింది.

సావిత్రి మనసే కాదు.

ఇల్లంతా కూడా చీకటిగానే వుంది.

సావిత్రి లేచి లాంతర్లు తుడిచి నూనె పోసింది.

అసలు తన జీవితానికే కారు మబ్బులు పట్టినట్లు ఆ వురుములు పిడుగులు తన బ్రతుకు మీదే పడుతున్నట్లు భ్రాంతి కలిగింది సావిత్రికి.

ఆ దుర్ఘటన జరిగి దాదాపు ఇరవై రోజులు దాటుతోంది.

ఈ మూడు వారాలుగా భార్యాభర్త లిద్దరూ వీధి మొగం చూడలేదు.

సయించిన్నాడు తింటున్నారు.

లేనినాడు లేదు.

సావిత్రి ఏడ్చి ఏడ్చి అలసిపోయింది.

మనసు నిబ్బరించుకుని ఎప్పటిలాగే రోజూ ఇంటిపన్లు నిర్వహించు కుంటోంది.

కాని కృష్ణ మాత్రం గది దాటి బయటికి రావటంలేదు.

తన గదిలోనే ఒంటరిగా నిశ్శబ్దంగా వుండిపోతున్నాడు.

ఈ మూడు వారాలుగా భార్యాభర్తలిద్దరి మధ్య మాటల్లేవు.

ఇన్ని రోజుల్నుంచి అనుక్షణం సావిత్రి భర్త తనని పల్కరిస్తాడని, తనకి జరిగిన అన్యాయానికి జాలిపడి తన కన్నీరు తుడిచి ఓదారుస్తాడని ఎంతగానో ఎదురు చూసింది.

పోనీ తనుగా తను అతడ్ని పలకరించి మునుపటిలా సంసారంలో శాంతి నెలకొల్పుదామని ప్రయత్నించింది.

కాని కృష్ణ పడనివ్వలేదు సరికదా....తనని బద్ధశత్రువుని చూసినట్లు ప్రవర్తిస్తుంటే ఆమె దుఃఖం ఆవేశం రెట్టింపు అవుతున్నాయి.

ఇన్నాళ్ళుగా సావిత్రికి భర్తపై ఒక గొప్ప నమ్మకం... తిరిగి అతడు తనని ఆదరిస్తాడని ఒక చిన్న ఆశ.

"ఆ రోజుని" మర్చిపోయి తిరిగి కొత్త జీవితాన్ని ప్రారంభించాలని తపనపడింది.

కాని—

రోజులు గడుస్తున్న కొద్ది సావిత్రిలోని ఆశలన్ని అడియాస లయ్యాయి.

భర్త తనని క్షమిస్తాడనీ. అనురాగంతో అక్కున చేర్చుకుంటాడని ఊహించుకున్న ఆమె నమ్మకాలన్నీ వమ్ము అయ్యాయి.

రోజు రోజుకి సావిత్రి జీవితం దుర్భరం అయిపోతోంది.

తను ఎదురు పడితే గర్భ శత్రువుని చూసినట్లున్న భర్త ప్రవర్తనకి సావిత్రి మెదడు స్థభించిపోతోంది.

అసలు అతడు ఎందుకింత కఠినంగా మారిపోవాలి?

జరిగినదాంట్లో అతని బాధ్యత ఎంతో అతనికి తెలియంది కాదుకదా?

అది ఒక పీడకల అనుకుని కాస్త విశాల హృదయంతో ఆలోచిస్తే తమ దాంపత్యం తిరిగి చక్కపడుతుంది కదా?

కాల క్రమేణా అన్నీ మరిచిపోవచ్చును కదా? ఆ రోజు.... తను ఎంత నిస్సహాయురాలో అతను ఎరగంది కాదు.

కావాలని తను బురదపాలు అవలేదు. తెల్సితెల్సి ఏ తప్పు చెయ్య లేదు.

విధి వికృతాలకి తను బలి అయ్యింది. అంతే. అయినా అతని దృష్టిలో తను ఎంత హీనం అయిపోయింది.

కాలు జారిపడితే తిరిగి లేస్తాము. కాని పడిన చోటే వుండం కదా? నేటి సమాజంలో స్త్రీకి ఆపాటి అవకాశం ఎందుకులేదు?

పొరపాటునో గ్రహపాటునో రొచ్చులు పడితే అందులోంచి బయట పడే అవకాశం ఎందుకివ్వరు?

ఆ రొచ్చులో మ్రగ్గిపోవాల్సిందేనా!

తెలిసి చేసినా తెలియక చేసినా తప్పు తప్పే. 'శిక్ష' అనుభవించా ల్సిందేనా?

తిరిగి ఆ తప్పు దిద్దుకుని నీతిగా బ్రతికే అవకాశం స్త్రీకి ఎందుకివ్వదు ఈ సమాజం?

శిశిరంలో ఎండిన మోడు కూడా వసంతంవస్తే తిరిగి చిగురిస్తుందే.... కాని....స్త్రీ....

సావిత్రి మనసు పాముల బుట్టలా వుంది.

భర్త నిరసన....పనికిరాని చెత్తని చూసినట్లు అతని చూపు తల్చు కుంటే సావిత్రి మనసు భగ్గున మండుతోంది. రక్తం కుతకుత వుడుకుతోంది. వరదలా ఆవేశం పొంగులెత్తుతూంది.

తనకి జరిగిన అన్యాయం జ్ఞాపకం వస్తే కడుపంతా నిప్పు రాజుతోంది.

ఎవరిమీదో.... ఒక విధమయిన 'కసి' చెలరేగుతుంది. ఇంట చూసినా బయట చూసినా ఈ రోజు మగవాడి ప్రతాపం ఎక్కడయ్యా అంటే ఆడవాని మీద.... నిస్సహాయురాలయిన అబలమీద! లేకపోతే.... అసలు ....

"అమ్మా ...."

సావిత్రి తుళ్ళిపడింది.

సుజాత భుజం పట్టి కుదుపుతుంటే ఆలోచన్ల నుంచి తేరుకుంది.

"అమ్మా! ఇల్లంతా చీకటిగా వుంది. దీపం వెలిగించమ్మా. కరెంటు లేదా."

సావిత్రికి అప్పటికి కనిపించింది చుట్టూ ఆవరించిన చీకటి. లేచి అగ్గిపెట్టెతీసి లాంతర్లు వెలిగించింది. బయట ప్రకృతి కూడా భయంకరంగానే వుంది.

ఇప్పట్లో కరెంటు వచ్చే జాడలేదు. చూస్తూ వుండగానే వురుములతో మెరుపులతో సన్నగా వర్షం మొదలయ్యింది.

సూది చినుకల్లా రాలుతున్న వర్షం క్షణాల్లో వుధృతమై ధారలు కట్టింది.

ఒక దీపం వంటింటి గడపలో పెట్టి ఇంకొక దీపం తీసుకుని భర్త గదివైపు అడుగులు వేసింది.

కృష్ణ కూర్చున్న గదంతా చీకటిగా వుంది. ఒంటరిగా ఆ చీకట్లోనే కూర్చుని సిగరెట్ తాగుతున్నాడు.

సావిత్రి లాంతరు దీపం పట్టుకుని గదిలోపలికి రాబోయింది.

కృష్ణ ఆమెని చూస్తూనే అసహనంగా తల విదిల్చుకున్నాడు.

వెలుతురు ఇష్టంలేనట్లు తీవ్ర అభ్యంతరం తెలుపుతూ గబాల్న కుర్చీలోంచి లేచి తలుపు దగ్గరికి వచ్చాడు. అప్పటికి సావిత్రి గడప అవతల వుంది.

కృష్ణ గడప లోపల వున్నాడు.

సావిత్రిని "లోపలికి రావద్దు" అన్నట్లు దూకుడుగా చెయ్యి అడ్డంపెట్టి ఆమె మొఖం కూడా చూడటం ఇష్టంలేనట్లు నిరసనగా తల తిప్పుకున్నాడు.

సావిత్రికి అహం దెబ్బతిన్నట్లయ్యింది.

రోషం కోడెత్రాచులా పడగ ఎత్తింది.

ఆవేశంగా ఏదో అనబోయింది. అంతే!

ఆమె నోట్లో మాట నోట్లోనే వుంది.

తలుపు "ధన్" మని మూశాడు కృష్ణ.

హతాశురాలు అయ్యింది సావిత్రి.

ఆ విసురుకి సావిత్రి చేతిలోని లాంతరు జారి గచ్చుమీదపడి బ్రద్ద లయ్యింది.

రెండుసార్లు గప్పుగప్పున మండి దీపం ఆరిపోయింది.

చెప్పుతీసి మొహంమీద కొట్టినట్లున్న భర్త మూర్ఖపు ప్రవర్తనకి సావిత్రి స్థంభీభూతురాలు అయ్యింది.

భర్తతో మనసు విప్పి మాట్లాడాలి అనుకుంది. ఏమేమో చెప్పాలి అనుకుంది. తనలో అశాంతి ఆవేదన అతనికి అర్థం అయ్యేలా నివేదించు కోవాలి అనుకుంది.

కాని కృష్ణ ఆ అవకాశం ఆమెకి ఇవ్వలేదు.

అసలు భార్య మొఖం చూడటం ఇష్టంలేనట్లు, ఆమెగాలి సోకితేనే అపవిత్రం అయిపోతానన్నట్లుగా వుంది అతని ప్రవర్తన.

సావిత్రి నిర్వీర్యురాలు అయిపోయింది.

ఒక్కసారి మనసంతా నిరాశా నిస్పృహా ఆవరించాయి.

శరీరంలో అణువు అణువునా రక్తానికి బదులు నీళ్ళు ప్రవహిస్తున్నట్లు నిస్సత్తువ ఆవరించింది. నిన్నటిదాకా ఒకే మంచంలో అతి సన్నిహితంగా గడిపిన మనిషి....

....ఈ రోజు ఎంత పరాయిగా....కొన్ని వందల మైళ్ళ దూరంగా అనిపిస్తున్నాడు.

ఎంత చిత్రంగా మారిపోయింది తన బ్రతుకు ?

అసలు ఎందుకు ఇలా జరిగింది?

తనవల్ల దోషం ఏమిటి?

తను చేసిన తప్పు ఏమిటి?

అతడు ఇంత తిరస్కారంగా ఇంత విరసనగా ప్రవర్తిస్తున్నప్పుడు.... ఇంకా తను పట్టుకు ప్రాకులాడటం ఎంత అవివేకం?

కుక్క బ్రతుకుతుంది?

పంది బ్రతుకుతుంది?

ఈ సావిత్రీ బ్రతుకుతుంది.

కాని ఏమిటి తేడా?

ఇలా జీవచ్ఛవంలా బ్రతకటం కంటే తను చచ్చిపోవటం నయం కదా? మనస్ఫూర్తిగా అనుకుంది ఆ మాట.

విష పురుగని చూసినట్లు భర్త చూసిన ఆ చిన్న చూపులోనే జీవిత సత్యం ఏదో ఆవిష్కరణ అయినట్లు తోచింది సావిత్రికి.

అసలు ఆ రోజు లేచింది మొదలు.... ఎందుకో....సావిత్రిలో చచ్చి పోవాలన్న కోర్కె బలీయం అయిపోయింది. ఇన్నాళ్ళ భర్త ప్రవర్తనతో ఆమె మనసు విరిగిపోయింది.

అయినా.... అంతరాంతరాలలో బ్రతుకుమీద ఏదో చిన్న ఆశ....

అందాకా ఆఖరి ప్రయత్నంగా భర్తతో మనసు విప్పి మాట్లాడదా మనుకుంది.

కాని ఆ ప్రయత్నం కూడా విఫలం అయ్యింది కదా?

ఇంకెందుకు బ్రతకటం ?

అవును.

తెల్లారేసరికి తను వుండకూడదు.

ఎలాగైన చచ్చిపోవాలి ....

ఇప్పటికే తను అలసిపోయింది. ఇంకా ఈ నిరాదరణ.... నిస్పృహ....నిరాశా....ఇంకొక్క క్షణం కూడా తను భరించలేదు.

ఎలాగైనా ఈ రాత్రికి తను వెళ్ళిపోవాలి.... అన్ని రోజుల చేదు అనుభవంతో సావిత్రిలో చివరికి ఆ ఆలోచన ఒక్కటే నిలిచింది.

సన్నని కాల్వలా కన్నీరు చెక్కిళ్ళమీద జారిపోతుంటే మోకాళ్ళ మధ్య తల పెట్టుకొని నిశ్శబ్దంగా వంటింటి గడపలో కూర్చుండి పోయింది.

ఆమె మనసులాగే చుట్టూ చీకటి....

ఆ చీకటిలో అలా....ఎంత సేపు....స్తబ్దుగా వుండిపోయింది.

పురుములతో ...మెరుపులతో బయట వర్షం జోరు హెచ్చింది.

చూస్తూ వుండగానే ధారలు కట్టి కురవసాగింది.

సుజాత అప్పటికే అన్నం తిని పడుకుంది.

సావిత్రికి కడుపులో సన్నగా ఆకలి మంట రగులుతోంది.

కాని తినాలని లేదు.

నెమ్మదిగా లేచి బెడ్‌రూమ్‌లోకి వెళ్ళి సుజాత పక్కన కళ్ళు మూసుకుని పడుకుంది.

రెప్ప మూత పడటంలేదు.

మనసంతా చేదు తిన్నట్లుగా వుంది.

రాత్రి తొమ్మిది గంటలు దాటుతూ వుంటే కృష్ణ గదిలో అలికిడి వినిపించింది.

లుంగి విప్పి పాంటు తొడుక్కున్నాడు.

రెయిన్ కోటు తీసి వేసుకున్నాడు.

గది తలుపులు తెరిచి హాల్లోకి వచ్చి అల్మారాలోంచి ఏమిటో తీసి జేబుల్లో పెట్టుకున్నాడు.

గదిలో పడుకున్న సావిత్రి చీకట్లోంచి నిశ్శబ్దంగా చూస్తూ అతన్ని గమనిస్తూనే వుంది.

అతను బయటికి వెళ్ళబోతున్నాడని అర్థం అయ్యింది సావిత్రికి.

బయట వర్షం ధారలు కట్టి కురుస్తోంది.

ఏదవుతే అవనీ అని సావిత్రి గభాల్న లేచి పడకగదిలోంచి ఇవతలికి వచ్చింది.

ఇంకో గంటలో తను శాశ్వతంగా ఆ యింట్లోంచి నిష్క్రమించబోతోంది .... అంటే చచ్చిపోతుంది ....' అనుకుంటే అంతవరకూ ఆమె గుండెలో రగులుతున్న కోపం, ద్వేషం, కసి....అన్ని అణగారిపోయ్యాయి.

భర్తని చూస్తుంటే మునపటి ప్రేమానురాగాలతో మనసు ఆర్ద్రం అయ్యింది.

హృదయం స్పందించింది.

"ఈ రోజు నేను చచ్చిపోతున్నాను. మీరు ఇంట్లోనే వుండండి...." అని చెప్పగలదా?

చెప్పలేదు. అందుకే—

"ఇంత వర్షంలో చలిలో బయటికి వెళ్ళద్దు" అందామని నోరు తెరిచింది.

కాని ఎందుకో ఆమె కంఠం పెగల్లేదు.

పెదవులు కదిలాయి.

కాని ఒక చిన్న శబ్దం కూడా బయటికి రాలేదు.

స్వరపేటిక మూసుకుపోయినట్లు.... అర్థంకాని మూగపిలుపు.

"ఏ...మం....డీ.... కృ....ష్ణా...." కేక పెట్టాను అనుకుంది.

కాని ఆ పిలుపు తన చెవులకే సోకలేదు.

కంఠంలోనే సుడి తిరిగి ఆగిపోయింది.

అప్పటికే కృష్ణ "ధన్" మంటూ వీధి తలుపులు తెరిచాడు.

బయటికి అడుగుపెట్టి తిరిగి అదే విసురుతో మూశాడు.

జోళ్ళ శబ్దం చేస్తూ వీధిలోకి వెళ్ళిపోయాడు.

వెళ్ళే ముందు ఆ మాట భార్యకి చెప్పలేదు. కనీసం వెనక్కి తిరిగి చూడలేదు.

కొత్తగా తవ్విన బావిలో జల వూరినట్లు సావిత్రి కళ్ళల్లో గిర్రున నీళ్ళు తిరిగాయి.

కృష్ణకి అప్పుడప్పుడు రాత్రిళ్ళు 'డ్రింకొ'చేసే అలవాటుంది.

"బహుశా అందుకే కావచ్చు. అతని మనసు కూడా బాగుండలేదు కదా" అనుకుంది విరక్తంగా.

ఎంతోసేపు కిటికిదగ్గరే నిల్చుని భర్త వెళ్ళినవైపే అలా గుబులుగా చూస్తూ వుండిపోయింది.

వర్షం ధారలుగా కురుస్తూనే వుంది.

సావిత్రి గుండెల్లో కన్నీరు కురుస్తూనే వుంది. ఆ కన్నీటి వానలోనే తడుస్తూ వెళ్ళిపొయ్యాడు కృష్ణ.

కడుపంతా పొయ్యి రాజినట్లువుతోంది సావిత్రికి.

భర్త అలా కాస్సేపు బయటికి వెళ్ళటంతో ఎంతో రిలీఫ్ అనిపించింది సావిత్రికి.

సామాన్లు పెట్టే గదిలోకి వెళ్ళి చిన్న బకెట్‌కి కట్టిన నులకచేంతాడు విప్పింది. తిరిగి తను పడుకున్న గదిలోకి వచ్చింది. నులక తాడు తీసి మంచం కింద దాచింది. డ్రాయింగ్ రూమ్‌లోకి వచ్చి టేబిల్ ముందు కూర్చుంది.

లెటర్‌పాడ్‌లోంచి కాయితం చింపి పెన్ అందుకుంది.

రెండు క్షణాలు కళ్ళు మూసుకుని, మునివ్రేళ్ళతో కణతలు రుద్దుకుని వ్రాయటం మొదలు పెట్టింది.

తను ఈ లోకంనుంచి నిష్క్రమిస్తున్నానని, రేపట్నుంచి సుజాతకి తల్లిదండ్రి సమస్తం అతనేనని గుర్తుచేస్తూ బాధ్యత అప్పగించింది.

"....డియర్ కృష్ణా ....

జరిగింది ఒక పీడకల అనుకుని మర్చిపోండి. నా మరణంతో కొంత వరకూ సమస్య తీరిపోతుందనే అనుకుంటున్నాను.

సుజాతని ఎప్పటిలా ప్రేమతో చూస్తారని, జాగ్రత్తగా పెంచుతారని ఆశిస్తున్నాను.

మీకు నచ్చిన రీతిలో మీ జీవితాన్ని సుఖప్రదం చేసుకోండి.

మీనుంచి ఈ రాత్రి శాశ్వతంగా శెలవు తీసుకుంటున్నాను.

కృష్ణా ....

ఆఖరిగా మిమ్మల్ని ఒక్కమాట అడగాలని వుంది. నా మొఖం చూడ టానికి మీకు అసహ్యంగా వుంది కదూ? నాగాలి సోకితే మీకు రోతగా వుంది కదూ?

కాని ఇందులో నా బాధ్యత ఎంత ?

ఒక్కసారైనా ఆలోచించారా ?

ఎవరో కిరాతకులు నన్ను అన్యాయం చేశారు అనుకొన్నాను. కాని నేను ఎంతగానో ప్రేమించిన మీరు కూడా నన్ను ఇంత అన్యాయంగా శిక్షి స్తున్నారు కదా అనుకుంటే నా మనసు చిత్రవధ అనుభవిస్తుంది.

మీ చల్లని ఒడిలో సేదదీరుదామని ఆశపడ్డాను. నా హృదయ భార మంతా తీర్చుకుందా మనుకున్నాను కాని ఆ ఆశ కూడా అడుగంటి పోయింది.

ఇన్నాళ్ళు మీరే నా ప్రపంచం అనుకున్నాను.

కాని

ఇంక ఆ ప్రపంచంలో నాకు చోటులేదని తెల్సింది. అందుకే వెళ్ళి పోతున్నాను.

— సావిత్రి...."

భర్తకి క్లుప్తంగా ఆఖరి ఉత్తరం వ్రాసింది.

వేరే కాయితం తీసుకుని, "తన మరణానికి తానే బాధ్యురాలు అని, వేరెవ్వరూ కాదని, జీవితంమీద విరక్తి పుట్టి ఆత్మహత్య చేసుకుంటున్నానని వ్రాసి సంతకం చేసింది.

ఆ రెండు ఉత్తరాలు ఒక కవరులో పెట్టి తన గదిలోకి వచ్చి పరుపు కింద పెట్టింది.

భర్త ఇంటికి వచ్చాకా ఎలాగూ అతని గదిలోచేరి తలుపులు బిగించు కుంటాడు. ఆ తరవాత అర్ధరాత్రి అదను చూసుకుని ఫ్యాన్ రాడ్‌కి తాడు బిగించి ఉరిపోసుకుందామని నిర్ణయించుకుంది.

పెరట్లో లోతయిన బావి వుంది.

అందులో దూకవచ్చు.

కాని ప్రస్తుతం దాంట్లో నీళ్ళు చాలా తక్కువ వున్నాయి.

అదీగాక ఆ శబ్దానికి ఇరుగు పొరుగు ఎవరైనా చూస్తే కష్టం. సరి కదా....ఆఖరికి తనచావు కూడా నల్గురిలో అపహాస్యం అవుతుంది. అందుకే నాల్గుగోడల మధ్య నిశ్శబ్దంగా "హేంగ్" కావటానికి నిశ్చయించు కుంది.

సావిత్రిలో బ్రతుకుపై ఆశ అణుమాత్రం లేదు.

జీవితేచ్ఛ పూర్తిగా నశించిపోయింది.

తనకి జరిగిన అన్యాయం, కడుపు శోకం భర్త నిరాదరణ .... ఈ మూడు శూలంలా గుండెని కుళ్ళ బొడుస్తున్నాయి.

అసలు బాబుతోపాటే తనుకూడా ఆరాత్రి చనిపోయి వుంటే ఇప్పుడు తనకి ఈ నరకం తప్పేది కదా?

అసలు తను ఈపాటికే చచ్చిపోయివుంటే కనీసం లోకాన్నుంచి సానుభూతి అయినా దక్కేది కదా? పోనీ — ప్రపంచం అంతా తనని విర సించినా భర్త ఆదరిస్తాడనుకుంది.

కాని ఇప్పుడు ఆ అదృష్టం కూడా లేదని రూఢిగా తెల్సిపోయింది.

ఇంకెందుకు బ్రతకటం? బ్రతికినా అదీ ఒక బ్రతుకేనా?

తను ఎలాగైనా చచ్చిపోవాలి.

ఈ రాత్రి వృధా చెయ్యకూడదు. ఇప్పుడు తను 'శవం'తో సమానం.

'శవం' ఇంట్లో వున్న కొద్దీ కుళ్ళు కంపు కొడుతుంది తప్ప వేరే ప్రయోజనంలేదు.

ఆ దుర్గంధాన్ని ఇంట్లో వాళ్ళేకాదు. ఇరుగు పొరుగు వాళ్ళు కూడా భరించలేరు.

సావిత్రి స్థిరంగా ఒక నిర్ణయానికి వచ్చింది.

మనసు రాయి చేసుకుంది. ఆదమరిచి నిద్రపోతున్న సుజాత దగ్గరకి

వెళ్ళి పక్కనే పడుకుని కూతుర్ని గట్టిగా కౌగలించుకుంది. లేత చెక్కిళ్ళు నిమిరి ముద్దుపెట్టుకుంది. నుదుటిపై జుత్తు సవరించి కొంచెం సేపు తనివితీరా లాలించింది.

భర్తకోసం ఎదురుచూస్తూ నిశ్శబ్దంగా మంచంలో వాలింది.

గదంతా చీకటిగా వుంది. ఆమె మనసులాగే....

జోరున బయట వర్షం ఆగకుండా కురుస్తూనే వుంది.

గడియారం టిక్ టిక్‌మన్న శబ్దం తప్ప ఇంట్లో ఇతరత్రా ఏ చిన్న అలికిడి లేదు.

సావిత్రికి ఎంత 'వద్దు' అనుకున్నా 'గతం' గుర్తుకువస్తోంది.

ఈ ఎనిమిది సంవత్సరాల వైవాహిక జీవితంలోనూ కృష్ణతోగడిపిన ప్రతీక్షణం అనుభూతి కావ్యమే. గలగలా దుమికే జలపాతంలా ఎప్పుడూ అల్లరిగా వుండేవాడు.

ప్రేమ, అనురాగం.... అలా ధారల్లా కురిపించేవాడు. అలాంటి మనిషి ఇప్పుడు ఇంతగా మారిపోయాడంటే చిత్రంగా వుంది సావిత్రికి.

అసలు రాత్రి అయినా పగలు అయినా ఇల్లు ఇంత స్తబ్దుగా ఎప్పుడూ లేదు.

అజయ్‌బాబు వుంటే అస్తమానం వాడి అల్లరితో, కేరింతలతో, ఏడుపుతో ఇల్లంతా సందడిగా వుండేది.

వాడిది కోడి కునుకు.

రాత్రిళ్ళు నిద్రలో అస్తమానం కదిలి ఏడుస్తూ వుండేవాడు.

ఉయ్యాల ఆగిపోతే చాలు.... వాడికి మెలుకువ వచ్చేసేది.

కృష్ణ విసుక్కునే వాడు.

ఇప్పుడు సావిత్రికి అవన్నీ తెరలు తెరలుగా జ్ఞాపకం వస్తున్నాయి.

ఆలోచనల మధ్య కొట్టుకుని పోతున్న సావిత్రి 'ధన్....'మన్న శబ్దానికి వులిక్కిపడింది.

దూరంగా ఎక్కడో పిడుగుపడింది.

కళ్ళని మిరిమిట్లు కొలుపుతూ 'ఛమక్'మని ఒక కాంతి ఆకాశంలో మెరిసి మాయం అయ్యింది. ఆ కాంతియొక్క వెలుగు కిటికీలోంచి పాకి గదంతా మిరుమిట్లుకొల్పింది. దాంతోపాటే చల్లగాలి విసిరి వర్షం జోరు హెచ్చింది.

సావిత్రి లేచి గడియారం వైపు చూసింది.

చిన్నముల్లు పన్నెండు వైపు పరుగులు పెడుతోంది.

జల్లు వాలుగా ఇంట్లోకి పడుతూంటే లేచి కిటికీ రెక్కలు మూసింది సావిత్రి.

వీధంతా చీకటిగా నిర్మానుష్యంగా వుంది. జోరునవాన... జోణీ పాతంగా కురుస్తోంది.

"అరె! అనవసరంగా ఈయన వానలో బయటికి వెళ్ళారే....వెచ్చగా ఆ 'బార్'లోనే వుండిపోయారేమో.... వర్షం బాగా కురుస్తోంది కదా?" అనుకుంది నిర్లిప్తంగా.

భర్త-రాకకోసం కళ్ళల్లో ఒత్తులు వేసుకుని ఎదురుచూస్తూ తిరిగి సుజాత పక్కకి వచ్చిపడుకుంది.

కృష్ణ బయటికి వెళ్ళి రెండుగంటలు పైగానే అయ్యింది.

క్షణ క్షణానికి వాన జోరు హెచ్చుతోంది గాని ఎక్కడా తగ్గే సూచనలు కనిపించటం లేదు.

మరణించబోతున్న సావిత్రిపై సానుభూతిగా ఆకాశం భోరున ఏడుస్తోందా అన్నట్లు ఆకాశం చిల్లుపడినట్లు వురుములు మెరుపులతో పెళ పెళార్భాటంగా జోరున.... కురుస్తోంది వాన....

"ఠంగ్.... ఠంగ్...." మని గడియార్ఠం పన్నెండు గంటలు కొట్టింది.

కృష్ణ ఇంటికి రాలేదు.

సావిత్రి క్షణాలు లెక్కపెడుతుంది.

"వాన తగ్గితే కదా ఈయన వచ్చేది. ఇంత వర్షంలో ఎలా వస్తారు? ఎక్కడో ఆగిపోయి వుంటారు...." అనుకుంది.

సావిత్రి చనిపోవటానికి ఎంత తొందర పడుతుందో అంత ఆలస్యం అవుతోంది.

క్షణం ఒక యుగంలాగా అనిపిస్తోంది.!

భర్త ఇంట్లో లేకుండా సుజాతని ఒంటరిగా వదిలి పోవటానికి ఆమె తల్లి మనసు అంగీకరించటంలేదు.

నిద్రలేవగానే ఎదురుగా వురిపోసుకున్న తనని చూస్తే సుజాత గుండె పగిలి పోతుంది.

తండ్రి దగ్గర వుంటే సుజాతకి ఆ దుస్థితి తప్పుతుందని సావిత్రి తాపత్రయం.

అదీకాక తన ప్రాణంపోయే సమయంలో అతను ఇంట్లో వుంటే మానసికంగా అదొక తృప్తి.

అతని చేతుల మీదుగానే తన అంతిమ యాత్ర ప్రయాణానికి సన్నాహాలు జరుగుతాయి కదా ?

లేకపోతే చచ్చిపోయే చివరి క్షణంలో కూడా నిశ్చింతవుండదు.

సావిత్రి నెమ్మదిగా లేచి కూర్చుంది. మంచంకింద నుంచి ఉరితాడు బయటికి తీసింది. మెడకి బలంగా ముడిపడి వుచ్చులా బిగుసుకుందంటే కుత్తుక తెగిపడాల్సిందే.

ఆలోచన్ల మధ్యే తాడు విసిరి సీలింగ్ ఫ్యాన్ రాడ్‌కి బిగించింది.

రెండవ కొన బాగా ఎత్తుకి జారుముడి వేసింది.

వంట గదిలోంచి చిన్న ముక్కాలిపీట తెచ్చి తలుపు వారగా పెట్టింది.

కృష్ణ రాగానే డ్రాయింగ్ రూమ్‌లోకి పోయి తలుపులు బిగించుకుంటాడు.

ఎదురుగానే వున్న భార్యవైపు కన్నెత్తి చూడడు.

పెదవి కదిపి మాట్లాడడు.

గత మూడు వారాలుగా అతను ప్రవర్తిస్తున్న తీరు అదే కదా ?

అంతే!!

అతను నిద్రపోయ్యాడని రూఢి అయ్యాక తన పని తాను చేసుకుని పోతుంది.

దాదాపు అర్ధగంట తరువాత తన గొంతు వురితాడుకి బిగుసుకుని తన ప్రాణం గాల్లో కల్సిపోతుంది.

తెల్లారేసరికి ఎవరి కెవరో?

సావిత్రి 'హేంగ్' కావటానికి అంతా సిద్ధం చేసుకుంది.

బయట వాన తగ్గలేదు.

హెచ్చింది.

"వాన తగ్గందే ఎలా వస్తాడు ?" అనుకుంటూ గదిలో లైటు ఆర్పి తిరిగి సుజాత పక్కన వచ్చి పడుకుంది.

ఎందుకో....ఎదురుగా ఆ చీకట్లో పైనుంచి వ్రేలాడుతున్న వురి తాడుని చూస్తుంటే కడుపంతా చెరువు అయ్యింది.

వరద పొంగినట్లు పెద్ద ఎత్తున ఏడుపు ముంచుకుని వచ్చింది.

తను చచ్చిపోతున్నందుకు కాదు ఆ బాధ.

అలా కుక్కలా అందరిచేత "ఛీ...." అనిపించుకుని చావ వలసి వచ్చినందుకు.

అసలు ఎందుకు?

ఎందుకు తనకీ దుస్థితి?

తను చేసిన పాపం ఏమిటి ?

తన బ్రతుకు ఎందుకు ఇలాగ అయ్యింది?

ఆ రాత్రి....

యాదగిరి నరసింహస్వామిని దర్శనం చేసుకుని మరీ తిరిగి ప్రయాణం అయ్యింది కదా?

అయినా ఆయన తన పట్ల కొంచెం కూడా కరుణ చూపించలేక పొయ్యాడు.

అసలు దేముడున్నాడా?

తన బ్రతుకుని అంతగా కాలరాచిన ఆ దుండగులు ఎవరు బందిపోట్లా ?

ఎవరు?

వాళ్లు ఈ పవిత్ర భారతదేశంలో పుట్టలేదా?

ధనం దోచుకుంటే దోచుకోనీ...

కాని....

అట్లా సంసార స్త్రీని చెరపడితే రేపు ఆమె జీవితం ఏమిటి ?

తిరిగి సమాజంలో ఆమె స్థానం ఏమిటి ?

భవిష్యత్తులో ఆమె బిడ్డల గతి ఏమిటి?

ఒక స్త్రీ నైతిక విలువల్ని దిగజార్చే ముందు ఇలాంటి కనీస ఆలోచన్లు వాళ్ళకి అసలు రావా ?

బహుశా రావేమో ....

లేకపోతే ఇలా ఎందుకు జరుగుతుంది?

సమాజంలో నానాటికి స్త్రీ స్థానం ఎందుకు దిగజారిపోతుంది ?

మొన్నటి దాకా కుష్టు, క్షయ, క్యాన్సర్ సమాజంలో అతి భయంకరమైన వ్యాధులు కాని —

ఈ రోజు అంతకంటే భయంకరమైన వ్యాధి....“సెక్స్ ఎక్స్ప్లాయిటేషన్.”

నానాటికీ దేశంలో అంటు వ్యాధిలా “వైరస్” కంటే భయంకరంగా విజృంభిస్తోంది.

ఎక్కడ విన్నా నేడు ఈ రోగం గురించిన వార్తలే.

మగవాడిలో విజృంభించిన ఈ రోగానికి స్త్రీ బలి అవుతూంది.

ఎంత చదివినా ఎంత ప్రగతి సాధించినా అసలు సమస్యకి వచ్చేసరికి స్త్రీ స్త్రీగానే మిగిలిపోతుంది.

మగవాడి దృష్టిలో విలాస వస్తువుగానే నిలిచి పోతుంది.

ధనిక పేద తారతమ్యం వుండచ్చు.
అనుభవాల్లో తేడాలు వుండవచ్చు.
కాని ప్రతీ ఆడదాని సమస్య ఒక్కటే!....
ప్రతి స్త్రీ ఆవేదనా ఒక్కటే....

బంగారం చిన్న ముక్కర రూపంలో వున్నా, కంఠాభరణంగా వున్నా, లేదూ....గాజులు, గొలుసులు, వుంగరాలు....ఏ రూపంలో వున్నా దాని అసలు స్వరూపం మాత్రం బంగారమే కదా?

ఆ బంగారానికి ఒక విలువ వుంది.

ఆకర్షణ వుంది.

అందంతోపాటు అవసరం తీర్చే గుణం వుంది.

అందుకే ప్రతి ఒక్కడు అవకాశం చిక్కితే తస్కరించాలని చూస్తాడు.

ఎందుకంటే—

అది బంగారం.

ఈ ప్రపంచంలో "స్త్రీ" బంగారం అయితే "పురుషుడు" దొంగ!

"ఛీ....ఇది పని మనిషి" అని ఒదిలి పెట్టడు.

"పట్ట మహిషే కావాలి" అని కాసుక్కూర్చోడు.

అవసరం....

అవకాశం....

బంగారంలాగే స్త్రీకి కూడా ఈ రెండు అవసరాలూ తీర్చే గుణం వుంది.

ఈ రెంటినీ అందినంత వరకూ వుపయోగించుకోవటం....మనిషికి... ముఖ్యంగా....మగవాడి నైజ గుణం.

ఎవడి సొత్తుని వాళ్ళు దొంగిలించుకోరు కదా?

ఎప్పుడూ పరాయి సొత్తుమీదే కన్ను

అందుకే—

మని షి మనిషి.

o o o

వేగు చుక్క పొడిచింది.

తూరుపు తెలవారుతోంది.

బ్రతుకు అర్థాన్ని వేదాంత పరిభాషలో వివరిస్తున్నట్లు గూళ్ళలో పక్షులు మూకుమ్మడిగా కలకలారావాలతో గానం చేస్తున్నాయి.

దూరంగా కోళ్ళు కూస్తున్నాయి.

సన్నని సూర్యకిరణం మెడ దగ్గర పొడుస్తుంటే గభాల్న మంచంలో లేచి కూర్చుంది సావిత్రి.

ఎదురుగా ఫ్యాన్ రాడ్‌కి తగిలించిన తాడు అలాగే వ్రేలాడుతోంది.

వీధి తలుపు వేసింది వేసినట్లే వుంది.

మంచంలో సుజాత దుప్పటి కప్పుకుని అదమరిచి నిద్రపోతూంది.

రాత్రి భర్త రాకకోసం ఎదురు చూస్తూ దుఃఖభారంతో అలసిపోయి వున్న సావిత్రి ఆలోచనల మధ్యే ఎప్పుడో నిద్రలోకి జారిపోయింది.

సగం రాత్రి దాటాక వాన కొద్దిగా వెలసింది.

ఆకాశం తెరిపిన పడింది.

కాని....

రాత్రి కృష్ణ మాత్రం ఇంటికి రాలేదు.

తెల్లగా తెల్లవారింది.

తూర్పున సూర్యోదయం అవుతుంటే సావిత్రికి మెలకువ వచ్చింది.

గభాల్న లేచి తలుపులు తెరచి పెరట్లోకి వచ్చింది. మబ్బులు విడిన ఆకాశం ప్రచ్ఛన్నంగా తెల్లగా కడిగినట్లు వుంది.

తూర్పున బాల భానుడు బంగారు కిరణాలలో పరుగు పరుగున వస్తున్నాడు.

భర్త రాత్రి ఇంటికి ఎందుకు రాలేదోనన్న సన్నని ఆందోళన సావిత్రి గుండెల్లో బయలుదేరింది.

తెల్లవారి లేచింది మొదలు ప్రతిక్షణం భర్త రాకకోసం నిరీక్షిస్తూనే వుంది సావిత్రి.

యాంత్రికంగా ఇంటి పన్లు చేసుకునిపోతూంది.

కాని ఆమె మనసు మనసులో లేదు.

"ఆతను ఎందుకు రాలేదు?" అన్న ప్రశ్న మాటి మాటికి తల ఎత్తుతూనే వుంది.

"రాత్రంతా వర్షం పడుతూనే వుంది కదా? రాలేకపొయ్యారేమో...." అని మరుక్షణం ధైర్యం తెచ్చుకుంటూంది.

దుఃఖం వస్తుంటే తనని తాను ఓదార్చుకుంటుంది.

అయినా గుండె గుండెలో లేదు.

మనసు కీడు శంకిస్తుంది.

సుజాత కోసం గుప్పెడు బియ్యం వుడకేసి వంటగది గడపలోనే కూర్చుండి పోయింది.

మనసంత అస్థిమితంగా వుంది.

హోరున.... అలజడి.

వీధి గుమ్మం దగ్గర తనకెంతో పరిచితమైన భర్త అడుగుల సవ్వడి కోసం నిరీక్షిస్తూ....

ఎంతో ఆశతో....గుండెలో గూడు కట్టిన వేదనతో....ఏదో తెలియని నమ్మకంతో....ప్రతిక్షణం మనసు చిక్క పట్టుకుని ఆలా ఎదురు చూస్తూనే వుంది.

తిండి నీళ్ళు మాని పడిగాపులు కాస్తూనే వుంది.

క్షణాలు గంటలుగా మారాయి.

మధ్యాహ్నం అయ్యింది.

ఎండ వాటారి ప్రొద్దు గ్రుంకింది.

సంధ్య అంతరించింది. చీకట్లు ముసురుకున్నాయి.

ఇళ్ళలో దీపాలు పెట్టారు.

కాని కృష్ణ ఇంటికి రాలేదు.

ఆ రాత్రంత సావిత్రికి కన్నీటి భోజనమే.

ఆమె గుండెలో ఆశాదీపం కొడి గట్టుకుని పోతూంది. వెలుగు అంతరించి పోతూంది.

రాత్రి గడిచి మళ్ళీ తెల్లవారింది.

సావిత్రి నిరీక్షణ మానలేదు.

క్షణక్షణం గడుస్తున్న కొద్దీ ఆశ నిరాశ అయ్యింది.

మిణుకు మిణుకు మనే చిన్నదీపం కొండెక్కి పోయింది.

సావిత్రి కళ్ళలో ఎదురు చూపులే మిగిలాయి. నాలుగు రోజులు అతి భారంగా అలాగే గడిచిపోయ్యాయి.

సావిత్రి నిరీక్షణ మానలేదు.

దాదాపు వారం రోజుల తరువాత కృష్ణకి బదులు పోస్టులో ఒక చిన్న వుత్తరం వచ్చింది సావిత్రి పేర్న. ఎంతో ఆత్రంగా ఉత్తరం చించింది సావిత్రి.

"....తను ఇల్లు విడిచి దూరంగా వెళ్ళిపోతున్నానని, తిరిగి ఎన్నడు రానని, ఇకపై సావిత్రితో తనకి ఎటువంటి సంబంధము వుండ బోదని, సుజాత బాధ్యత కూడా ఆమెదేనని" — ఆ లేఖ యొక్క సారాంశం !

సావిత్రిపై జరిగిన అత్యాచారాన్ని కళ్ళారా చూడటంచేత తన మనసు విరిగిపోయిందని అది ఇంక తిరిగి అతుక్కోవటం జరగదని స్పష్టంగా వ్రాశాడు కృష్ణ. చాలా క్లుప్తంగా వుంది లేఖ.

ఈ ఉత్తరం చదువుతుంటే సావిత్రి చేతులు సన్నగా ఒణికాయి.

మరో మారు కాయితం వంక చూసింది.

సందేహం లేదు.

తన పేర్నే పోస్టు చెయ్యబడింది.

స్వహస్తాలతో కృష్ణ వ్రాసిన ఉత్తరమే !

సావిత్రి స్థంభీభూతురాలు అయిపోయింది.

అది కేవలం చిన్న ఉత్తరమే కావచ్చు కాని ఒకానొక కుటుంబ వ్యవస్థను అనుకోకుండా త్రెంచి వెయ్యగల పత్రం!

విడాకుల పత్రం!

అంతకంతకూ సావిత్రి అంతరాంతరాలలో భర్త వస్తాడన్న ఆశాజ్యోతి—ఆ లేఖ చదువుకున్న తరువాత — గప్పున మండి ఆరిపోయింది.

ఆమె హృదయం చీకటి అయిపోయింది.

కన్నుమూసినా తెరిచినా ఎటు చూసినా చీకటే కనిపిస్తోంది.

కాలం గాయాలని మాన్పేమందు.

ఇవాళ కాకుంటే రేపయినా భర్త అన్నీ మరిచి తనని అక్కున చేర్చుకుంటాడని ఆశించింది.

కాని ఆమె ఆశ సమూలంగా కూకటివేళ్ళతో సహా పెకిలించబడి నేలమట్టం అయిపోయింది.

ఇంక వేరే ఉరితాడు అక్కర లేకుండా భర్త వలాయనమే ఆమెకి వుచ్చులా బిగుసుకుంది.

మగవాడు అయివుండి పరిస్థితులకి ఖిన్నుడయిపోయ్యాడు.

బాధ్యతలకి భయపడ్డాడు.

అలాంటిది స్త్రీ అయివుండి తను ఎలా నెగ్గుకు రాగల్దు అనుకున్నాడు!

అగ్నిసాక్షిగా పెళ్ళాడిన స్త్రీని, దాదాపు పది సంవత్సరాలు కల్సి బ్రతికిన భార్యని ఎంత తేలిగ్గా ఒదిలేశాడు.

"సావిత్రి నీ దారి నువ్వు చూసుకో...." అని వ్రాశాడు.

నేను ఎక్కువగా చదువుకోలేదని అతనికి తెల్సుకదా?

తనకి "నా" అనుకున్న వాళ్ళు లేరు కదా?

ఈ పరిస్థితిలో పిల్లతో ఎలా బ్రతుకుతాననుకున్నాడూ? హూం.... మగవాడు.

ఎంత నిర్దయ?

అసలు తనకి ఒక "దారి" అంటూ వుంటే కదా చూసుకోవటానికి ?

ఎటు చూసినా చీకటి కనిపిస్తోంది.

ఎటు చూసినా ముళ్ళ కంచలే....గాఢా

సావిత్రి కన్నీటితో తడిసి చేతిలో వుత్తరం నానిపోయింది.

ఆమె మనసు చీలికలు వాలికలై....గుండె బ్రద్దలయి రక్తంగా మారి....ఆ రక్తం ఆవిరియై మనసు లోతుల్లోంచి

తేలి....కళ్ళల్లో తుఫానుగా....వర్షంలా మారి....ధారాపాతంగా ఆమె అందమైన బంగారు చెక్కిళ్ళపై కురిసింది.

"సావిత్రి! నీ దారి నువ్వు చూసుకో....

నా మనసు విరిగిపోయింది.

దాన్ని తిరిగి అతకటం కష్టం."—

ఉత్తరంలోని భర్త మాటలే సావిత్రి గుండెలో పదే పదే మారు మ్రోగుతున్నాయి.

ముక్కుపచ్చలారని సుజాత మొఖం చూసి అయినా అతని మనసు మారకపోతుందా అని ఆశించింది.

హూం....

మనసు !

ఎంత చిత్రమైన పదం ?

వెన్నలా కరగటం....

రాయిలా గట్టి పడటం....

రెండూ దీనికి చాతనవును....

మనసు !
అతనికేనా వుంది ?
తనకి లేదూ
కాని....
అసలు ఆడదాని మనసు అర్థం చేసుకున్న దెవరు? దాని గోడు విన్న దెవరు ?
సావిత్రి మెదడంతా సన్నని హోరు....
గుండెని ఎవర్తో రంపంతో కోస్తున్నారు. ఎవరు?

o o o

"ఏం చెయ్యాలి?" నిమిష నిమిషానికి అదే ప్రశ్న రెండు రోజులు.... అతి నిర్లిప్తంగా మూగగా గడిచిపొయ్యాయి.
సావిత్రికి ఎటూ తోచటంలేదు.
నిన్నటిదాకా చచ్చిపోదామన్న ఆలోచన....కాని ఇప్పుడు ఆపాటి స్వేచ్ఛ కూడా లేదు. సుజాత కాళ్ళకి బంధంలా తగులుతోంది.
కాని బ్రతకటం ఎలా?
ఏ చిన్న ఉద్యోగం అయినా చూసుకుందామన్న తనకి తగిన చదువు లేదు కదా?
భర్త తనని ఆదరిస్తాడన్న ఆశ కూడా పూర్తిగా అణిగిపోయింది.
సమాజంలో నైతికంగా తన స్థానం పతనం అయిపోయింది.
తనని కష్ట కాలంలో ఆదుకోతగ్గ బంధువులైనా ఎవరున్నారని?
అసలు...."
సావిత్రి వులికి పడినట్లయ్యింది.
చప్పున ఆలోచన్ల నుంచి తేరుకుంది.
ఇంటి గుమ్మం ముందు ఆటో ఆగిన శబ్దం అయ్యింది.
వీధి తలుపులు తెరుచుకుని ఎవరో లోపలికి వస్తున్న అలికిడి వినిపించింది.
సావిత్రి గుండె "ఝల్లు" మంది.

భర్త మనసు మార్చుకుని ఇంటికి తిరిగి వచ్చాడేమోనన్న ఉద్వేగంతో గబాల్న లేచి వంటగదిలోంచి ఇవతలికి వచ్చింది.

చిన్న ఎయిర్ బ్యాగ్‌తో లోపలికి వస్తున్న వసుంధరని చూడగానే క్షణం సేపు నోటమాటరాక దిగ్భ్రాంతురాలు అయ్యింది.

"సావిత్రీ....!"

"ఒదినా... !"

దుఃఖం పెల్లుబుకుతుంటే ఉద్వేగంతో గబాల్న ఆవిడ్ని కౌగలించుకుంది.

సావిత్రి ఎంత ఆర్తితో ఆవిడ్ని అల్లుకుందో అంత వ్యతిరేక భావంతో సావిత్రిని చేత్తో దూరంగా నెట్టింది వసుంధర.

సావిత్రి విస్తుబోయింది.

దెబ్బ తిన్నట్టు వసుంధర మొహంలోకి చూసింది.

వసుంధర అసహనంగా కృష్ణ కోసం ఇల్లంతా చూపులతోనే కలయ వెదుకుతూ "మా తమ్ముడేడి?" అంది పెళుసుగా.

సావిత్రి గుండెల్లో రాయి పడింది.

చప్పున మొఖం తిప్పుకుంది.

"ముందు మీరు కూర్చోండి కాఫీ తెస్తాను" వంటగదిలోకి వెళ్ళబోయింది.

"కాఫీకేంలే....తర్వాత తాగచ్చు. ముందు కృష్ణ ఎక్కడికి వెళ్ళాడో చెప్పు?"

ఆవిడ గొంతుకలో స్పష్టంగా ధ్వనిస్తున్న విసుగుకి ఆశ్చర్యపోయింది సావిత్రి.

మొన్నటి దాకా "సావిత్రీ! ఓ మరదలు పిల్లా....నా కోడలేది?" అంటూ తమ్ముడి పేరు కంటే సావిత్రినే ఎక్కువగా స్మరించేది వసుంధర.

అలాంటిది ఈ రోజు అంటి ముట్టనట్లున్న వదినగారి ప్రవర్తనకి సావిత్రి మనసు చిన్నబోయింది.

స్వంత ఒదినగారు. సాటి స్త్రీ తనికి జరిగిన అన్యాయానికి సానుభూతి చూపిస్తుంది అనుకుంది.

తనకి కొండంత అండగా నిలుస్తుంది అని ఆశపడింది.

కాని జరుగుతున్నది వేరు "బాగున్నావా!" అంటూ రాగానే సావిత్రిని చిన్న పరామర్శ కూడా చెయ్యలేదు సరికదా వచ్చిన పది నిమిషాల్లోనే తమ్ముడి గురించి వందసార్లు అడిగింది.

సావిత్రికి మనసు మండినట్లు అయ్యింది.

కన్నీరు పొంగింది.

గభాల్న లేచి కృష్ణ రాసిన ఉత్తరం తెచ్చి ఆవిడ చేతుల్లో పెట్టింది.

ఆత్రంగా ఉత్తరం చదువుతున్న వసుంధర మొహంలో క్షణక్షణానికి నెత్తురు విరగటం సావిత్రి గమనిస్తూనే వుంది.

ఆ రాత్రి సావిత్రి కృష్ణలపై జరిగిన దుర్ఘటన గురించి పేపర్లు నిండా చూసింది వసుంధర.

కాని భర్త ఆ సమయంలో టైఫాయిడ్‌తో జబ్బుపడి మంచంలో వున్నాడు. అందుకే తమ్ముడికి వచ్చిన కష్టం ఎంతటిదో తెల్సినా వెంటనే బయలుదేరి రాలేకపోయింది.

భర్తకి కాస్త నెమ్మదించి పథ్యం తినిపించి ఆ మర్నాడే ప్రయాణం అయి వచ్చింది.

కాని అప్పటికే కృష్ణ ఇల్లు వదిలి బైరాగిలా దేశం మీదికి వెళ్ళి పోయ్యాడు.

తమ్ముడిని ఆఖరిసారి చూసే అదృష్టం కూడా లేకపోయింది కదా అన్న వేదన వసుంధర మొఖంలో స్పష్టంగా కదలసాగింది.

పేలటానికి సిద్దంగా వున్న అగ్నిపర్వతంలా ఎదురుగా వున్న ఒదిన గార్ని చూస్తుంటే సావిత్రికి గుండెలో సన్నగా వణుకు బయలు దేరింది.

"........"

"........"

ఇదరిమధ్యా కొద్దిక్షణాలు భయంకర నిశ్శబ్దం.

హఠాత్తుగా వసుంధర సంచీ అందుకొని వెళ్ళటానికి లేచింది.

సావిత్రి హతాశురాలు అయ్యింది.

ఒక్క చిన్నమాట అయినా లేకుండా ఆవిడ అలా వెళ్ళిపోతుంటే కత్తితో గుండెని గుచ్చినట్లు అనిపించింది సావిత్రికి.

గభాల్న ఒదినగారి చెయ్యి పట్టుకుని ఆవిడ దారికి అడ్డం తగిలింది.

దీనంగా కన్నీటితో తన దుస్థితి వివరించింది.

"ఒదినా! ప్రస్తుతం నాకు బ్రతకటానికి జీవనాధారం ఏదీ లేదు. మీ తమ్ముడు కాదు....ఆ భగవంతుడే నాకు తీరని అన్యాయం చేశాడు. ఏటూ తోచటంలేదు. కనీసం సుజాతనైనా మీతో తీసుకొని వెళ్ళండి. మీ తమ్ముడికి మీరంటే ప్రాణం. నాల్గురోజులు పొయ్యాక ఏదో ఒకనాడు తప్పకుండా ఆయన మీ దగ్గరికి వస్తారన్న నమ్మకం నాకుంది. అప్పుడు సుజాతని ఆయనకి అప్పగించండి" ప్రాధేయ పూర్వకంగా చేతులు పట్టుకుని దీనంగా అర్థించింది.

కాని వసుంధర ఒప్పుకోలేదు

సావిత్రి చేతుల్ని విడిలించేసుకుని దూరంగా జరిగింది. ఆమె మొహం కూడా చూడటం ఇష్టంలేనట్లు గోడవైపుకి చూస్తూ చెప్పింది.

"సావిత్రి! చిన్నప్పట్నుంచి మా కృష్ణని కంటికి రెప్పలాకాచి సొంత కొడుకులా పెంచుకొచ్చాను....

....వాడి చదువుకోసం వాడి వున్నతికోసం ఎంతో శ్రమపడ్డాను వాడి తరువాతే నా కొడుకుని ప్రేమించాను.

పెళ్ళితో వాడి నూరేళ్ళ జీవితం బంగారు పంట పండాలి అనుకున్నాను.

కాని నీది దుష్టజాతకం. నీ పాదం మారెమ్మ పాదం.

అందుకే వాడి బ్రతుకు బండలు అయిపోయింది. నల్గురిలో నవ్వుల పాలు అయిపోయింది. నా తమ్ముడు నాకు కాకుండా పొయ్యాడు.

వాడికి నీ మొహం చూడటం ఇష్టంలేక నీతో తెగతెంపులు చేసుకుని సన్యాసిలా ఇంట్లోంచి వెళ్ళిపొయ్యాడు.

ఆలాంటిది నీతో నాకు మాత్రం ఏమిటి సంబంధం ?

నువ్వు నాకు వాడ్నిచ్చే కదా?

వాడు ఎప్పుడైతే నిన్ను కాదని తిరస్కరించి ఇంట్లోంచి వెళ్ళి పొయ్యాడో....అప్పుడే నీకూ నాకూ...."

"అది ....కా...." సావిత్రి ఏదో చెప్పాలని ప్రయత్నించింది.

కాని—

వసుంధర ఏహ్యంగా మొఖం తిప్పుకుంది.

"అత్తయ్యా...." అంటూ ఆపేక్షతో అమాయకంగా ఎదురు వచ్చిన సుజాతని కూడా విదిల్చుకుని చేతిసంచి అందుకుని విసురుగా వెళ్ళిపోయింది. ఆ ఇంట్లో పచ్చి గంగ కూడా ముట్టుకోలేదు.

సావిత్రి స్థంభీభూతురాలు అయ్యింది.

నిన్నటిదాకా "అమ్మలా"అనిపించిన వసుంధరలో ఇప్పుడు అసలైన ఆడపడుచు కనిపించింది.

మనసంతా చేదు తిన్నట్లు అయ్యింది.

"....స్త్రీకి స్త్రీయే శత్రువు.

స్త్రీనుంచి స్త్రీకే సానుభూతిలేదు...." అని ఎందుకంటారో సావిత్రికి మొదటిసారిగా అర్థం అయిన క్షణం అది....

నిజమే.

కట్టుకున్న భర్తకే సానుభూతి లేనప్పుడు ఆడపడుచుకి ఎక్కడ్నుంచి వస్తుంది ఆపేక్ష?

ఆదర్శం వల్లించినంత తేలికా ఆచరించడం ?

పుస్తకాల్లో వ్రాసినంత సులభంగా సమస్యలు పరిష్కారం అవటానికి జీవితం కథకాదు.

సావిత్రికి ఒకానొక గొప్ప జీవిత సత్యం చిన్న వెలుగులా అవిష్కరణ అయ్యింది ?

"ఏం జరిగినా సరే ఏదీ జరగలేదు అనుకుని నిశ్చింతగా వుండటం నేర్చుకో—" అంటాడు "ఆర్నాల్డ్ బెన్నెట్"

కాని ఎలా?

o o o

తుపాకి శబ్దానికి పిట్టలన్నీ ఎగిరిపోయినట్లు ఒక చిన్న దుర్ఘటనతో సావిత్రికి "నా" అనుకున్న బంధుమిత్రులందరూ—ఆఖరికి భర్తతోసహా — దూరం అయిపొయ్యారు.

కట్టుకున్న భర్త ఇల్లు విడిచి వెళ్ళిపొయ్యాడు.

ఆడపడుచు అసహ్యించుకుంది.

లోకం వెలి వేసింది.

"అలా బ్రతకటంకంటే చావటం ఎంతో నయం కదా?"

ఆమె మనసంతా విరిగినట్లు అయ్యింది.

కాని సుజాతపై తల్లిప్రేమ కాలికి బలంగా సంకెళ్ళు వేస్తూంది.

సుజాతని ఒంటరిగా ఈ లోకంలో ఒదిలి తను చచ్చిపోతే రేపు దాని గతి సమాజంలో తనకంటె అధ్వాన్నంగా అయిపోతుంది.

తల్లిగా దీన్ని ఆ దుస్థితి నుంచి తప్పించటం తన బాధ్యత.

తను ఎలాగూ అన్యాయం అయిపోంది కదా ?

కాని తన కూతురు అలా కాకూడదు.

సావిత్రి మనసు రాయి చేసుకుంది.

ఇన్నాళ్ళూ భర్త ఉద్యోగరీత్యా ఆ ఊళ్ళో వుండటం తప్ప ఇతరత్రా ఆ వూరితో ఎటువంటి సంబంధ బాంధవ్యాలూ లేవు.

ఇళ్ళూ, భూములూ, ఆస్థిపాస్తులు సావిత్రికి అసలేలేవు.

ఇన్నాళ్ళూ భర్త రెక్కలే ఆధారం.

ఇప్పుడు ఆ ఆధారం కూడా లేకుండా అయ్యింది. ఆ ఊళ్ళో తిరిగి తల ఎత్తుకోలేని విధంగా నైతికంగా ఆమె స్థానం దిగజారిపోయింది.

అందుకే తక్షణం ఆ వూర్నించి మకాం ఎత్తెయ్యటానికి నిశ్చయించుకుంది.

ఒక షావుకారికి ఇంట్లోవున్న వస్తువులు అన్నీ అమ్మి, మొత్తం డబ్బు చేసింది.

చిల్లర బాకీలు అన్నీ తీర్చేసింది.

బట్టలు, కొద్దిపాటి పాత్ర సామానూ తీసుకుని ఊరు విడిచి పెట్టింది.

ఆ పరిసరాలకి దూరంగా వెళ్ళి రెక్కల కష్టంతో బ్రతకాలన్నది ఆమె ఆలోచన.

ఎక్కడన్నా చిన్న జీవనోపాధి చూసుకుని సుజాతని జాగ్రత్తగా పెంచి పెద్దదాన్ని చెయ్యాలి.

వున్నంతలో దీనికి కొంచెం సుఖప్రదమైన జీవితం ఏర్పాటు చెయ్యాలి.

అదే సావిత్రి జీవితాశయం.

వున్న కొద్దిపాటి బంగారం ఆ రాత్రి దొంగల హస్తగతం అయ్యింది.

ఇంట్లో వున్న సామానంతా అమ్మితే మూడు వేలదాకా డబ్బు చేతికి అందింది.

ఆ డబ్బు ఖర్చు కాకుండానే ఎక్కడయినా జీవనోపాధి చూసుకోవాలి.

ఇంతవరకూ భర్తతోడు లేకుండా ఒంటరిగా సినిమాకి కూడా వెళ్ళి ఎరగదు సావిత్రి.

అలాంటిది ఇప్పుడు ఏకాకిలా పూరుకాని వూళ్ళో బ్రతకాలంటే గుండెల్లో రాయిపడింది.

కడుపంతా దుఃఖం పొంగింది.

నిన్నటిదాకా గూటిలో రామచిలుక ఈ సావిత్రి.

మరి ఇప్పుడు?

గూడు లేదు.

తోడు లేదు.

రక్షణ లేదు.

రెక్కలు సగం విరిగి ఎగరలేని స్థితి.

మృత్యువు ఒడిలో తప్ప వేరెక్కడా శాంతి సుఖం దొరకవు.

కాని కన్నపాశం కాళ్ళకి బంధాలై పోతోంది కదా ?

అందాకా సావిత్రి ధైర్యాన్ని కూడగట్టుకుని బ్రతకటానికే నిశ్చయించుకుంది.

ఆ నిశ్చయంతోనే మూడో కంటికి తెలియకుండా ఆ ఊరు ఒదిలి వేరే వూరు చేరింది.

ఆ ఊళ్ళో ఆమెకి చుట్టాలుగాని పరిచయస్థులు కాని లేరు.

కాని ఉద్దేశ్య పూర్వకంగానే ఆ ఊళ్లో రైలు దిగింది.

కారణం ...అంతకు వారంరోజుల ముందు పేపర్లో ఒక చిన్న ప్రకటన పడింది.

"ఆ ఊళ్లో స్థిరనివాసం ఏర్పరుచుకున్న రిటైర్డ్ ఆర్మీ ఆఫీసరుగారింట్లో బాదరబందీలు లేని వంట మనిషి కావాలని, నెల జీతంతోపాటు ఒక పూట భోజనం కూడా పెడతారని, శుచి, శుభ్రం తెల్సిన స్త్రీకి ప్రాధాన్యత వుంటుందని—" ఆ ప్రకటన యొక్క సారాంశం.

ఆ ప్రకటన చూడగానే సావిత్రిలో ఒక చిన్న ఆశ తలయెత్తింది.

ప్రస్తుతం ఎలాగూ వున్న ఊరు ఒదిలి పెట్టాలి అనుకుంటోంది. కనక వెళ్ళి ఆ పనిలో చేరితే తనకి జీవనాధారం దొరికినట్లు అవుతుంది. కొంతవరకూ సమస్య పరిష్కారం అవుతుంది కదా అనిపించింది. కొత్త నిలదొక్కుకున్నాక ఎక్కడైనా కుట్టుమిషన్ పెట్టి స్వతంత్రంగా బ్రతకాలని సావిత్రి ఆశయం.

ఆ ఉద్దేశ్యంతోనే ఆ ఊరు చేరుకుంది.

రైలుదిగగానే పేపర్లో వున్న అడ్రస్ ప్రకారం ఆర్మీ ఆఫీసర్ గారింటికి వెళ్ళింది. పేరు పరశురామ్. రెండతస్తుల పెద్ద భవనం.

చుట్టూ ఎత్తయిన ప్రహారీ గోడతో విశాలమైన ఆవరణ....

రకారకాల పూలమొక్కలు క్రోటన్స్ పూలకుండీల్లో అందంగా పెంచారు.

సావిత్రి వెళ్ళేసరికి మాలి మొక్కలకి పైపుతో నీళ్ళు పెడు తున్నాడు.

సావిత్రి వచ్చిన విషయం విని లోపలికి వెళ్ళి చెప్పాడు.

పది నిమిషాల తరువాత పరుశురామ్ భార్య ఇవతలకి వచ్చింది.

నమ్రతగా శుభ్రంగా వున్న సావిత్రిని చూడగానే వాళ్ళకి సదభి ప్రాయం కలిగింది.

గత కొద్ది రోజులుగా వంటమనిషి దొరక్క చాలా ఇబ్బంది పడు తున్నారు.

పరశురామ్‌గారిక్కి నల్గురు కొడుకులు, ఇద్దరు కూతుళ్ళు. చదువు కుంటున్నారు.

ముగ్గురు కోడళ్ళూ వచ్చారు. వీళ్ళంతా కలిగిన కుటుంబాల్లోంచి వచ్చారు. పని పాటలు చేతకావట. వీళ్ళందరితోపాటు పరుశురామ్ గారికి వృద్ధులైన తల్లిదండ్రులు కూడా వున్నారు.

వీళ్ళందరికీ రెండు పూట్లా వంటచేసి పెట్టాలి.

ఒక పూట భోజనం పెడతారు. కాఫీ టిఫిన్సు ఇస్తారు. అవిగాక నెలకి రెండువందలు జీతం. వుండటానికి వసతి మాత్రం పూళ్ళో ఎక్కడైనా చూసుకోవాల్సిందే.

ఇంట్లో పని ఎక్కువే వుంటుంది అనిపించినా సంతోషంగా ఒప్పు కుంది సావిత్రి.

గడపదాటిన వెంటనే పరాయి వూళ్ళో ఆపాటి జీవనాధారం దొరకటం అదృష్టమే అనిపించింది సావిత్రికి.

సముద్రంలో కొట్టుకుని పోతున్న మనిషి చిన్న కర్రముక్క ఆధారం దొరికినా ఆ ఆసరాతో ఒడ్డున చేరాలని తాపత్రయం పడతాడు.

సరిగ్గా ఇప్పుడు సావిత్రి పరిస్థితి అలాంటిదే.

ఆ రోజు సాయంత్రం ఊరంతా వెతికి ఒక చిన్న గది అద్దెకు తీసుకుంది.

సావిత్రికి ఇల్లు అద్దెకిచ్చినావిడ పేరు రమణమ్మ.

ఆవిడకి భర్త చనిపొయ్యాడు.

ఒక కొడుకు, ముగ్గురు ఆడపిల్లలు. కొడుకు దూరంగా ఉద్యోగం మీద వున్నాడు. అది వాళ్ళ స్వగ్రామం. ఇల్లుకాక కొద్దిగా పొలాలు కూడా వున్నాయి.

చిన్నవాటా అద్దెకిచ్చి ఆడపిల్లలో గుట్టుగా జీవితం సాగిస్తూంది.

మనిషి మంచిదానిలాగే కనిపించింది సావిత్రికి.

సావిత్రి తన పరిస్థితి వివరించగానే పాతిక రూపాయిల బాడుగకి గది అద్దెకిచ్చింది.

ఆర్మీ ఆఫీసరు గారింట్లో పని కుదిరింది అనగానే మర్యాదగా లోపలికి రమ్మని ఆదరణగా మాట్లాడింది.

జీవనోపాధితోపాటు వుండటానికి ఇంత నీడ కూడా తొందరగానే దొరకటంతో సావిత్రికి కాస్త సంతృప్తి అనిపించింది.

ఆ మర్నాటినుంచి వంట పనికి వెళ్ళింది.

అదొక పెద్ద దేవిడి కొంప.

వంటలక్క పనికూడా అంత తేలికకాదు. పన్లోకి వెళ్ళిన మూడు రోజులకే సావిత్రికి ఒళ్ళంతా పట్టుకుపోయింది.

ఆ ఇంటికోడళ్ళ అజమాయిషీకి తలంతా తిరిగినట్లయ్యింది,

వాళ్ళందరూ ఆగర్భ శ్రీమంతులూ....అందగత్తెలూ అధిక విద్యావంతులు కావటంతో అహంకారం కూడా చాలా ఎక్కువే.

కనీసం....సావిత్రిని వంట మనిషిలా కూడా ట్రీట్ చెయ్యలేదు. అంతకంటే తక్కువగానే అజమాయిషీ చెయ్యసాగారు. సావిత్రి గుండెకి సూదులు గుచ్చుకున్నట్టుంది వాళ్ళ ప్రవర్తన.

అయినా మనసు చంపుకుంది.

ప్రస్తుత పరిస్థితిలో ఆ కాస్త జీవనాధారం కూడా లేకపోతే నిలువ నీడ వుండదు.

"ఎప్పటికైనా చాకిరి చేసి బ్రతకాల్సినదాన్నేకదా? ఒకళ్ళింట్లో పని చెయ్యటానికి వచ్చినప్పుడు ఇంతకంటే ఎక్కువ గౌరవం ఎలా దక్కుతుంది?" అనుకుంది విరక్తిగా.

అందుకే ఎంత శ్రమ అనిపించినా నిశ్శబ్దంగా చేసుకుపోసాగింది.

కాని సావిత్రికి రోజులు అలా కూడా వెళ్ళలేదు.

ముచ్చటగా మూడు నెల్లు గడవకముందే ఆ కాస్త పని కూడా పోయింది. ఆమె దురదృష్టవశాన ఒక రోజు అనూహ్యంగా ఒక దుర్ఘటన జరిగింది.

ఆర్మీ ఆఫీసరు గారింటికి ఒక చుట్టం వచ్చాడు.

ఆయన గవర్నమెంటు వకీలు....

పోలీసుల తరపున వచ్చిన కేసులన్నీ చూస్తాడు.

పేరు విశ్వనాథం.

ఆ యింటి పెద్దకోడలుకి వరసకి అన్నయ్య అవుతాడుట.

వచ్చి మూడురోజులు వున్నాడు.

వచ్చిన రోజే సావిత్రిని చూస్తూనే ఆయన భృకుటి ముడిపడింది.

"ఎక్కడో చూశాను" అనుకున్నాడు.

ఆలోచనలో పడ్డాడు.

ఆ రాత్రంతా అతనికి అదే ఆలోచన....

ఆఖరికి అతడి మెదడులో మెరుపు మెరిసింది.

గతంలో సావిత్రి కేసు అతని మిత్రుడి దగ్గరికి వచ్చింది.

నగరశివార్లలో ఆ దుర్ఘటన జరిగిన రాత్రి .... మిత్రుడితోపాటు విశ్వనాథం కూడా ఆ ప్రదేశానికి వెళ్ళాడు. హాస్పిటల్‌కి కూడా వెళ్ళాడు.

ఫోటో గ్రాఫర్లచేత దగ్గరుండి అన్ని "స్పాట్సు" నుండి "స్నాప్స్" తీయించాడు.

ఆ తరువాత పేపర్లకి న్యూస్ కూడా పంపించాడు.

ఆ విధంగా సావిత్రి కథ అతనికి క్షుణ్ణంగా తెలుసు.

ఆ కథ చదివి ఆంధ్రదేశం అంతా అట్టుడికినట్లు వుడికింది.

ఇంకా ఆ కేసు తాలూకూ ఫైల్సు, ఫోటోలు అలాగే వున్నాయి.

ఆ రాబర్సు గ్యాంగుని పట్టుకునేందుకు పోలీసులు హైరాన పడు తూనే వున్నారు.

ఆ దారిదోపిడి ముఠాకోసం ఇన్వెస్టిగేషన్ నడుస్తూనే వుంది.

భోజనాల బల్లదగ్గర వడ్డన చేస్తున్న సావిత్రిని చూడగానే విశ్వనాథం లాయరు బుర్ర పని చెయ్యటం మొదలు పెట్టింది.

"డేగ" చూపులతో సావిత్రిని పరిశీలించటం మొదలు పెట్టింది.

ఎక్కడో చూశాను....

ఎక్కడో చూశాను అనుకున్నాడు తలకొట్టుకుంటూ

అంతే!

గన్‌షాట్‌గా అతనికి జ్ఞాపకం వచ్చింది.

నగర శివార్లలో దారుణంగా రేప్ చెయ్యబడ్డ సావిత్రిగా గుర్తించాడు.

మరుక్షణం ఆ విషయం ఆర్మీ ఆఫీసరుగారి కుటుంబం చెవిన్ని వేశాడు.

దాంతో యజమానురాలు సాక్షాత్ భద్రకాళి అవతారం ఎత్తింది.

"నా తల్లే. ఇదా నీకథ. మాదెంతో పరువు ప్రతిష్టగల కుటుంబం" అంటూ మెడపట్టి గెంటినంత పని చేసింది.

సావిత్రి హతాశురాలు అయ్యింది.

మనసు చచ్చిపోయినట్లు అయింది.

ఎలాగో కంఠం పెగుల్చుకుని అంది.

"ఇందులో నేను చేసిన తప్పేముంది?"

దాంతో ఆర్మీ ఆఫీసరుగారి తల్లి గయ్యిమంది.

"సిగ్గులేకుండా తప్పేముందని అడుగుతున్నావా? ఆడదానివి అయి వుండి అంత పరాభవం జరిగాక సిగ్గులేకుండా తల ఎత్తుకోవటమే తప్పు. నీ స్థానంలో ఇంకొకత్తె వుంటే ఏ నుయ్యో గొయ్యో చూసుకునేది"

బాణం దెబ్బతిన్న పావురంలా సావిత్రి ప్రాణం విలవిల్లాడింది.

విద్యుత్‌ఘాతం తగిలినట్లు సావిత్రి ముఖం మాడిపోయింది.

—నిజమే

తనలాంటి ఆడది బ్రతకకూడదు.

కాని తను కోరికలతో బ్రతకటం లేదు కదా?

"లోకం" అంటే ఏమిటో తెలియని కూతుర్ని ముక్కు పచ్చలారని కూతుర్ని....అనాధని చెయ్యలేక దానికోసం జీవచ్ఛవంలా బ్రతుకు ఈడుస్తూంది....

....అయినా తను ఇప్పుడు వాళ్ళ ఇంట్లో వంట చేసినందువల్ల వాళ్ళకి వచ్చిన ఇబ్బందులు ఏమిటి ?

అణుమాత్రం అయినా అసభ్యంగా ప్రవర్తించలేదు.

అనుచితంగా మాట్లాడలేదు.

వంచిన తల ఎత్తకుండా పెదవి కదపకుండా నిశ్శబ్దంగా చేసుకుని పోతూంది.

అయినా ఆఫీసరుగారి భార్య తనని ఎంత హీనంగా వెళ్ళగొట్టింది? ఎంత నీచంగా మాట్లాడింది?

తన వల్ల వాళ్ళకి వచ్చిన నష్టం ఏమిటి?—

సావిత్రి కన్నీరు దిగమింగుకుంటూ ఇంటికి వచ్చేసింది.

పనిపోయిందే అన్న బాధ కాదు.

వాళ్ళు తనని అంత హీనంగా చూశారే అన్నదే ఆమె వేదన.

ఈ ప్రభంజనం అంతటితో ఆగలేదు. నాల్గు రోజుల్లో "సావిత్రి ఫలానా" అంటూ వూరంతా తెల్సిపోయింది.

అంతే !

ఇక చిలువలు పలవలుగా కథలు మొదలయ్యాయి.

"ఆ రాత్రి" నగర శివార్లలో జరిగిన దారుణం గురించి దినపత్రికలన్నీ మొదటి పేజీల్లో ఫోటోలతో సహా ప్రచురించారు.

ఆ వార్తని ఆంధ్రదేశం యావత్తూ ఎంతో ఆశక్తిగా చదివింది.

సమాజం అట్టుడికినట్లు వుడికింది.

"సీత పుట్టిన దేశంలో ఇంత అరాచకమా?" అంటూ లోకం యావత్తూ సావిత్రిపై సానుభూతి కురిపించింది.

పురుషులంతా తమ సోదరికే అన్యాయం జరిగినట్లు ఆవేశ పడ్డారు.

స్త్రీలు కడివెడు కన్నీరు కురిపించారు.

అయ్యో! పాపం....సావిత్రి!" అన్నారు.

కాని —

ఇప్పుడు "ఆ సావిత్రే ఈ సావిత్రి" అని తెలియగానే వింత జంతువుని చూసినట్లు చూస్తున్నారు. వెలి వేస్తున్నారు. వెకిలి చేష్టలు చేస్తున్నారు.

ఎక్కడికయినా పనికి వెడితే—

"ఇంకా సిగ్గులేకుండా తల ఎత్తుకుని బ్రతుకుతున్నది కాకుండా పన్లోకి వచ్చావా? నా తల్లే....ఆ పాపాష్టి కడుపుకి అన్నమే కావాలా?" అని ముఖంమీదె అడిగేస్తున్నారు.

"నీలాంటి దాన్ని పన్లో పెట్టుకుంటే మేం ఇంక సంసారాలు చెయ్యక్కర్లేదు" అంటున్నారు. కాని ఒక్కళ్ళు కూడా సావిత్రిమీద మనసారా సానుభూతి చూపించటం లేదు.

స్త్రీ స్త్రీనుంచే సానుభూతి లేదు" అనటానికి ఇంతకంటే నిదర్శనం వేరే ఏం కావాలి?"

ఇంక మగవాళ్ళు అయితే—

సావిత్రి పనిమీద బజారుకి వెడితే ఎగాదిగా చూసి —

"వస్తావా?" అంటున్నారు.

రాత్రి అవగానే వీధి తలుపులు దబదబా బాదిన శబ్దం అయ్యేది.

ఇంటిమీదే టపటపా రాళ్ళు వచ్చి పడేవి.

"ఏయ్....సావిత్రి....అంటూ కేకలు వినబడేవి.

సావిత్రి గుండెలనిండా భయం నిండిపొయ్యేది.

"చేప" నీటి జంతువు.

దాన్ని ఒడ్డున వేస్తే గిజగిజా తన్నుకుంటుంది.

స్త్రీ కూడా అంతే.

నీళ్ళలో చేప లాంటిది.

గుట్టుగా బ్రతుకుతుంది.

గుట్టు బట్టబయలు అయితే ఒడ్డున పడ్డ చేపలా అవుతుంది ఆమె బ్రతుకు.

ఇప్పుడు సావిత్రి జీవితం అంతే అయ్యింది.

నడిరోడ్డున నవ్వులపాలై పేపర్లకి ఎక్కింది.

నేటి నాగరిక సమాజంలో ఈ "రేప్" భయంకర వ్యాధిలా వ్యాపిస్తూ స్త్రీ జాతిని సర్వనాశనం చేస్తుంది. నైతికంగా పతనం చేస్తుంది.

అశ్లీలతని రూపు మాపుతామని, అసభ్యతని అరికడతామని, ఆడ పడుచుల కన్నీరు తుడుస్తామని వేదికలెక్కి కంఠశోషపడే ఈ రాజకీయ నాయకులు మరి ఎంతోమంది అబలలు అన్యాయం అయిపోవుతూ వుంటే, వేశ్యా గృహాలకి తరలిపోతూ వుంటే ఎందుకు పట్టించుకోవటం లేదో అర్థం కాదు.

సావిత్రికి ఎవరిమీదో తెలియని ఆవేశం వస్తూంది.

బ్రతుకు మోయలేని భారం అయిపోయింది.

ఎక్కడికి వెళ్ళినా అవమానాలు, సమస్యలు ఎదురవుతున్నాయి.

తన ఇంట్లో తను గుట్టుగా బ్రతుకుదామనుకున్న ఇంటిమీద రౌడీలు రాళ్ళు వేస్తున్నారు.

తలుపులు విరగ్గొడుతున్నారు.

లోకం అందరి నిఘా ఇప్పుడు తనపైనే.

ఎంతో సాత్వికురాలు అయిన రమణమ్మగారు అందంటే అనదూ?

ప్రక్కింటికి నిప్పు అంటుకుంటే ఆ నిప్పు తన ఇంటికి అంటుతుందేమోనని భయపడటంలో అవివేకం లేదు.

తను ఇప్పుడు ఈ సమాజానికి విషకాటకం నిప్పు.

ఆ నిప్పు బొట్టు పక్కల్ని కాలుస్తుంది.

ఆ విషం అంతటా వ్యాపిస్తుంది.

అందాక అందరూ తనని వెలివేస్తున్నారు.

చెట్టుకి చీడ పడితే ఆ కొమ్మను నరికేస్తారు.

ఇప్పుడు తను చీడపట్టిన కొమ్మ

స్త్రీకి ఇంతకంటే అవమానం వేరే ఏం వుంటుంది?

చెట్టున వున్న పూలు పూజకి పనికి వస్తాయి.

రాలిన పూలు పనికి వస్తాయా?

నిన్నటిదాకా ఎంత ఆనందంగా బ్రతికింది.

కాని ఇప్పుడు?

ఊళ్లో తల ఎత్తుకోలేని పరిస్థితి దాపురించింది కదా?

తన జీవితం ఎందుకిలాగ అయ్యింది?

తన పరువు మర్యాద అన్ని గంగపాలు అయ్యాయి.

దొంగతనంచేసి తల ఎత్తుకోవచ్చు.

నిలువునా ఖూనీచేసి తల ఎత్తుకోవచ్చు.

"దేర్ ఈజ్ నోవన్ ఇన్ద వరల్డ్ హూ ఈజ్ నాట్ బ్లేమ్" అంటాడు బుద్ధుడు.

ఈ లోకంలో ప్రతిమనిషి తప్పు చేస్తాడు.

తప్పులు చెయ్యటం సరిదిద్దుకోవటం మానవ సహజం.

కాని స్త్రీకి ఆ అవకాశం ఎందుకు లేదు?

సావిత్రిలో ఒక విధమైన "కచ్చ" రేగుతోంది. అణువు అణువునా అగ్ని రేగుతోంది.

ఆవేశం వస్తూంది.

అవునా....

అసలు తను ఎందుకు బ్రతకాలి?

ఈ లోకంలో "సావిత్రి" అన్న ఒక మనిషి లేకపోతే వచ్చిన నష్టం ఏమిటి?

తన కడుపున పుట్టిన ఖర్మానికి తన కూతురు అనాధ అవుతుందా?

అవనీ....

భార్యాబిడ్డల గురించి ఆ తండ్రికిలేని బాధ తనకి మాత్రం ఏమిటి?

ఏమైనా జరగనీ....

ఇంత అవమానం జరిగినా కూడా ఇంకా తను బ్రతకడం అవివేకం

కుక్క బ్రతుకుతుంది.

పంది బ్రతుకుతుంది.

ఈ సావిత్రి బ్రతుకుతుంది.

అంతే కదా?

తేడా ఏముంది?

పడగ విచ్చిన త్రాచులా సావిత్రిలో ఆవేశం పొంగింది. శవం ఎత్తినట్లు చివ్వున లేచి గబగబా వంటగదిలోకి వెళ్ళి కిరసనాయిల్ డబ్బా ఎత్తి ఒంటినిండా జల్లుకుంది.

అగ్గిపెట్టె తీసి పుల్ల గీసింది.

పగబట్టిన పాములా ఆమెలో ఆవేశం బుస కొడుతూంది.

మంచంలో అదమరిచి నిద్రపోతున్న సుజాత కేసి ఆఖరి సారి చూసింది.

"పనికిరాని చెత్తని విదిల్చుకున్నట్లు బంధనాలు త్రుంచుకుని భర్త వెళ్ళిపొయ్యాడు.

ఇప్పుడు ఆ పిల్లకి తనే దిక్కు.

కాని తను చచ్చిపోతే రేపు దాని దారి ఏమిటి ?

ఆ పసిది ఎలా బ్రతుకుతుంది.

రోడ్డుమీద బిచ్చం అడుక్కుంటూనా ?

అనాధగానా ?

అవును.

అంతే జరుగుతుంది.

ఎల్లుండి దాని లేత వయసు మొగ్గ తొడుగుతోంది.

అందరి కన్ను దానిమీదే పడుతుంది.

అప్పుడు బిచ్చ కత్తె నుంచి వ్యభిచారిగా అందరి చేతుల్లో నలుగుతూ....మురికిలో పడి క్రుళ్ళి.... మ్రగ్గి...."

నో....

నో....

సావిత్రి "కెవ్వు"న అరిచింది.

ఆ పాటి ఆలోచనే ఆమెని అదరగొట్టింది.

ఆ దాటికి చేతిలో వున్న అగ్గిపుల్ల జారి కాళ్ళ దగ్గరపడింది.

అంతే!

చీర అంటుకుని భగ్గున మండింది.

కిరోసిన్ వాసన గప్పున పొగలా వ్యాపించింది.

సావిత్రి అరిచిన ఆ అరుపుకి నిద్రలోంచి వులిక్కి పడి లేచింది సుజాత.

ఎదురుగా నిండా కిరోసిన్‌లో తడిసి నన్నని అగ్నిజ్వాలల మధ్య వున్న తల్లిని చూడగానే ...హడలిపోయింది.

"అమ్మా....అమ్మా...." అని కెవ్వున అరుస్తూ చప్పున మంచం లోంచి దూకి గబాల్న తల్లిని చుట్టుకుంది.

దాంతో సావిత్రి ఒంటినిండా తడిసిన కిరోసిన్ సుజాతకి కూడా అంటి ఎర్రని మంటలు నాలుకలు సాస్తూ ఆ పిల్ల చుట్టూకూడా ఎగబ్రాకటం మొదలుపెట్టాయి.

అప్పటికి సావిత్రికి పూనిన ఆవేశం దిగి ఒంటి మీదకి స్పృహ వచ్చింది.

తను ఎంతో అల్లారు ముద్దుగా పెంచుకున్న సుజాతని మంటలు మధ్య చూడగానే ఆ తల్లి మనసు తల్లడిల్లి పోయింది.

చప్పున ప్రక్కనే వున్న నీళ్ళబిందె ఎత్తి కూతురుమీద గ్రుమ్మరించి మిగిలినవి తనపై ఒంపుకుంది.

బిందె కింద పారేసి కూతుర్ని కౌగలించుకుని ఆ నీళ్ళ మడుగులోనే ధబ్బున కూలబడింది.

సావిత్రి గుండె చెరువు అయిపోయింది.

ఆమె కన్నీళ్ళు కూడా మడుగు కట్టి గదంతా పరుచుకున్నాయి.

సావిత్రి పాదాలు కాలి బుసబుసా పొంగి బొబ్బలెక్కి మండసాగాయి.

అప్పటికే సుజాత సొమ్మసిల్లి తల్లి ఒడిలో స్పృహ తప్పింది.

ఇల్లంతా పల్చగా పొగ....కిరసనాయిల్ వాసన....నేలంతా నీటి మడుగు ....

సావిత్రికి తను చేసిన పొరపాటు ఎలాంటిదో తెల్సి వచ్చింది.

నెమ్మదిగా లేచి సుజాతని మంచంలో పడుకో పెట్టింది.

చెక్కిళ్ళు కన్నీటితో నానిపోతూ వుంటే మూటా ముల్లె సర్దుకుంది.

దూరంగా ఠానాలో "ఠంగ్....ఠంగ్" మని గంటలు మ్రోగుతూ వుంటే నిశ్శబ్దంగా ఇల్లు విడిచింది.

రోడ్లన్నీ నిర్మానుష్యంగా వున్నాయి.

ఒక కుక్క సందు చివర కూర్చుని మోర ఎత్తి "ఓ...." అని ఏడుస్తోంది.

అర్ధరాత్రి....

నడిరోడ్డు....

పోలీసులు....

రౌడీలు....

వూర కుక్కలు...

ఎలా వుంది లోకం ?

ఆ రాత్రి తన బ్రతుకు అన్యాయం అయిపోయింది.

ఈ లోకంలోనే కదా?

సావిత్రి శరీరం జలదరించింది.

భయం వెన్నులోంచి జరజరా ప్రాకింది.

సుజాత ఓ ప్రక్క నిద్రకి జోగుతూంది.

అయినా సరే కూతురి చేతికి రెండు సంచులు ఇచ్చి తాను రెండు పట్టుకుని వడివడిగా రైలు స్టేషన్ చేరుకుంది.

సావిత్రి స్టేషన్‌కి వచ్చేసరికి ఏదో రైలుకూతవేసి బయలుదేరటానికి సిద్ధంగా వుంది.

గార్డు ప్లాట్ ఫారం మీద నిల్చుని పచ్చ జెండా వూపుతున్నాడు.

సావిత్రికి కొంచెం సేపు ఎటూ పాలుపోలేదు. ఆఖరికి ఎమైతే అవు తుందనుకొని కదులుతున్న రైల్లో ఎక్కి కూర్చుంది.

బోగి చాలా ఖాళీగా వుంది.

ఎవరో ఇద్దరు మగవాళ్ళు బెర్తుమీద కూర్చుని తీరుబడిగా చర్చించు కుంటున్నారు.

కొ_స్త మద్య వయసులో వున్నారు. బాగా ధనవంతులని చెప్పకనే తెలుస్తుంది. ఆ ఇద్దరిలో రాజసం, ఠీవి అంతగా పిరులొలుకుతూంది.

కంపార్ట్ మెంట్‌లో లైటు వెలగటం లేదు. మబ్బుగా బెడ్ లైటు వెలుగుతోంది. సావిత్రి డోర్ తెరుచుకొని లోపలికి వస్తూంటే ఆ ఇద్దరిలో ఒక వ్యక్తి అన్నాడు.

"ఇది ఫస్ట్‌క్లాస్ కంపార్ట్ మెంటమ్మా"

సావిత్రి తత్తర పడింది.

"ఏదో ఖంగారులో ఎక్కానండి. పక్క స్టేషన్‌లో దిగిపోతాను...." అంది.

ఆయన ఏమీ అనలేదు. ఒక్కక్షణం ఆమె కేసి చూసి తల తిప్పు కున్నాడు.

తిరిగి ఆ ఇద్దరూ సంభాషణలో మునిగిపోయారు.

సావిత్రి చేతిలోని బ్యాగులన్నీ ఒక వారగా పెట్టి నిశ్శబ్దంగా వచ్చి కిటికీ ప్రక్కన కూర్చుంది.

బెడ్ లైటు వెలుగు మబ్బులా గదంతా ఆవరించింది.

నిద్రకి జోగుతున్న కూతుర్ని ఒళ్ళో పడుకో పెట్టుకుని కిటికీలోంచి బయటకి చూస్తూ వుండిపోయింది.

రైలు స్టేషన్ విడిచి వేగం అందుకుంది. రాత్రి సమయం కావటంతో అంతటా నిశ్శబ్దం ఆవరించింది.

అమావాస్య రోజులు. బయటంతా చీకటి చిక్కగా ఆవరించింది.

సావిత్రి కిటికీలో తలపెట్టి ఆ చీకట్లోకి చూస్తు వుండిపోయింది.

సావిత్రి చెక్కిళ్ళు కన్నీటితో తడిసిపోతున్నాయి.

ఆ రైలు ఎక్కడికి వెడుతుందో తెలియదు. తను ఎక్కడికి వెళ్ళాలో అసలే తెలియదు.

గమ్యంలేని ప్రయాణం.

అర్థంలేని బ్రతుకు.

"ఏమిటి తన జీవితం!"

సావిత్రికి ఏడుపు వస్తూంది. నవ్వూవస్తూంది. తను గతంలో ఎంత వైభవంగా బ్రతికింది!

కాని ఇప్పుడు!—

ముళ్ళ కంచెల మధ్య పడ్డ పువ్వులా అసలు ఎందుకిలాగ అయిపోయింది తన జీవితం.

సావిత్రికి కృష్ణ జ్ఞాపకం వస్తున్నాడు....

తనకెంత ప్రియమైన మనిషి !

అతన్ని ఎంతగా ప్రేమించి ఆరాధించింది!

తన బ్రతుకంతా అతని పాదాలవద్ద పెట్టింది కదా!

తననింత నిరాశలో నిస్పృహలో ముంచి యెంత స్వార్థంగా వెళ్ళిపోయాడు.

అసలిప్పుడు ఎక్కడ వున్నాడు.

వున్నాడా?

లేక....దుఃఖం వచ్చింది.

సావిత్రికి చచ్చిపోవాలని వుంది. ఏ కోశాన బ్రతుకుమీద తీపి లేదు.

కాని సుజాత మాట ఏమిటి? ఈ దగాకోరు ప్రపంచంలో అది నెగ్గగలదా?

పోనీ....తనతోపాటు దాని ప్రాణం తీసేస్తే .... సమస్య వుండదు కదా.

ఊహూ....తను అంత పని చెయ్యలేదు. ఇప్పటికే తనకి భగవంతుడు పెద్ద శిక్ష వేశాడు. దీనికితోడు ఇంకా శిశుహత్య కూడాచేసి ఆ పాపం కూడా మూటకట్టుకోలేదు.

అసలు ఇన్ని సమస్యల వలయంలో ఎలా చిక్కుకుంది?

ఎందుకిలా అయిపోయింది తన జీవితం ?

సావిత్రి గుండెల్లో అగ్ని రగులుతోంది. చెక్కిళ్ళపై వెచ్చగా కన్నీళ్ళు రాలుతుండే నిశ్శబ్దంగా కిటికీ ఇనుపకమ్మికి తలదించుకుంది. అలిసి పోయిన ఆమె అలాగే నిద్రలోకి జారిపోయింది.

అలా ఎంత సేపు పడుకుందో సావిత్రికే తెలియదు.

చిన్న కుదుపుకి కిటికీ రెక్కకి తల కొట్టుకోవటంతో గభాల్న మెళ కువ వచ్చింది. చీకటిని చీల్చుకుంటూ రైలు వేగంగా పరిగెడుతోంది.

బోగీలో ఆ ఇద్దరు వ్యక్తులు బెర్తులమీద విశ్రాంతిగా పడుకుని ఏదో తీవ్రంగా చర్చించుకుంటున్నారు.

అందులో ఒక వ్యక్తి అంటున్నాడు—

"అసలు ఒకప్పుడు నా గార్మెంట్ సెంటర్‌కి డిస్ట్రిక్టులెవెల్లో పేరు ప్రఖ్యాతులు వుండేవి. మా సెంటర్‌లో తయారైన డ్రెసెస్‌ని క్రేజీగా కొనే వారు జనం. మా డ్రెసెస్‌కి మంచి మార్కెట్టు వుండేది. ఎంతో లాభసాటిగా వుండేది వ్యాపారం. బంగారంలాంటి మా సంస్థ ఇప్పుడు మూతపడింది" ఆయన కంఠంలో స్పష్టంగా దిగులు ధ్వనిస్తోంది.

"........"

"ఎంతో మెటీరియల్ కొన్నాను రామ్‌జీ ... ? దీనిపై నా పెట్టుబడి అంతా నష్టం అయిపోతోంది. పోనీ అమ్మేద్దామా అనిపిస్తోంది.

....అంతకు ముందు లీలారాణి అని మంచి "ఇన్‌స్ట్రక్టర్" వుండేది. చాలా మంచి అమ్మాయి. టైలరింగ్‌లో ఎక్స్‌పర్ట్. పెళ్ళిచేసుకొని పూనా వెళ్ళిపోయింది. దాంతో మా సంస్థ కుంటుపడింది.

తరువాత వచ్చిన వాళ్ళు సరిగా పనిచెయ్యటంలేదు. బట్టలు మాయం చేస్తున్నారు. డ్రెసెస్ తయారీ కూడా బాగుండటంలేదు.

దాంతో సేల్సు దెబ్బతిన్నాయి. ఆ నష్టం భరించలేను.

అందుకే కొన్నాళ్ళపాటు మా ఫర్మ్‌ని మూసి వెయ్యాలి అనుకుంటున్నాను...."

అతను ఇంకా ఏదో చెప్తూనే వున్నాడు.

కానీ సావిత్రికి ఆ మాటలు వినిపించటం మానేశాయి.

అంతర్గతంగా ఆమెలో ఆలోచన్లు చెలరేగుతున్నాయి.

దాదాపు పావుగంట సేపు వాళ్ళ సంభాషణ అంతా విన్న సావిత్రి మనసులో ఆశలు చిగురు మొగ్గలు తొడుగుతున్నాయి.

పెళ్ళికి ముందే మెట్రిక్ పరీక్షతోపాటు కుట్టులో డిప్లమా కూడా పాసయ్యింది.

ప్రస్తుతం జీవనాధారం ఏదీ లేక బాధపడుతూంది.

పోనీ ఆయన తన సంస్థలో ఏదైనా చిన్న ఉద్యోగం ఇస్తే తన పనితనం చూపించుకోవచ్చు కదా, అనపించింది సావిత్రికి.

పెదవి కదిపి ఏదో అనబోయింది.

కాని ఎందుకో మాటరాలేదు.

కనీస పరిచయం కూడా లేకుండా ఉద్యోగం అడగాంటే ఏలాగో.... "గిల్టి"గా అనిపించింది.

మనసు వెనక్కి లాగింది.

ఎన్నో సందేహాలు చెలరేగాయి.

"తనకిగా తాను ఆయన్ని పలకరిస్తే తన గురించి తక్కువగా అంచనా వేసుకోడు కదా!

చులకనగా మాట్లాడడు కదా! తన గతం గురించి అడిగితే!.... ఏం చెప్పాలి.

సావిత్రి డైలమాలో పడిపోయింది.

పది నిముషాలు ఎటూ నిర్ణయించు కోలేక నిశ్శబ్దంగా కూర్చుండి పోయింది.

ఏదో స్టేషన్ దగ్గర పడుతున్నట్టుంది.

వాళ్ళ బెర్తులమీంచి లేచి నెమ్మదిగా పరిచిన బ్లాంకెట్లు మడతలు పెట్టటం మొదలు పెట్టారు.

బహుశా వాళ్ళు దిగిపోతారు కాబోలు ....

"పోనీ....ఏదైనా జరగనీ....అడిగేస్తే సరి" అని నిర్ణయించుకుంది సావిత్రి.

కిటికీలోంచి తల లోపలికి తిప్పి "బాబు గారూ...." అని పిల్చింది సిల్కులాల్చి ధరించిన వ్యక్తిని.

అతని పేరు శంకర్‌లాల్ అని, ఆ డ్రెస్‌ల్యాండ్ అతనిదేనని వాళ్ళ మాటలవల్ల అర్థం చేసుకుంది సావిత్రి.

అతడు బ్లాంకెట్ మడత పెట్టటం ఆపి "ఏమిటి!" అన్నట్లు ఆశ్చర్యంగా సావిత్రి మొఖంలోకి చూశాడు.

"అయ్యగారూ? దయచేసి ఏమీ అనుకోకండి.

ఇందాకట్నుంచి మీ మాటలు అన్నీ విన్నాను.

నా పేరు సావిత్రి. మెట్రిక్ పాసయ్యాను.

టైలరింగ్‌లో డిప్లమా చేశాను. అన్నిరకాల మిషనరీ వర్కు వచ్చు. కేవలం నేర్చుకున్న విద్యే కాదు బాబుగారూ? చిన్నప్పట్నుంచి నాకు అల్లికలు కుట్లు అంటే ప్రాణం అందుకే ఎక్కువగా చదువుమీద శ్రద్ధ చూపించ లేదు. మీకు అభ్యంతరం లేకపోతే మీ ఫర్మ్‌లో ఏదైనా చిన్నపని ఇప్పించి పుణ్యం కట్టుకోండి.

బ్రతుకు తెరువుకి ఏ ఆధారందొరక్క బాధపడుతున్నాను. ఇదిగో.... ఈ అమ్మాయి నా కూతురు. దీన్ని బ్రతికించాల్సిన బాధ్యత నామీద వుంది" అంది దీనంగా.

ఆమె మొఖంలోని అమాయకత్వం, గొంతులోని దీనత్వం శంకర్‌లాల్‌ని కదిలించింది.

ఒక్క క్షణం రెప్పలు వెయ్యకుండా ఆమె ముఖంలోకి తదేకంగా చూశాడు.

మనిషి చాలా అందమైంది....

సందేహం లేదు....

కాని....

"మీ పేరేమిటమ్మా!"

"సావిత్రండీ...."

"మరి... మీ వారు...." ఆమె నుదుట కుంకుమ చేతులకి గాజులు చూస్తూ సందేహంగా ఆగిపొయ్యాడు.

"మా వారు సిపాయండి.

యుద్ధంలో ఆయన జాడ తెలియలేదు.

శవం కూడా దొరకలేదు. అప్పట్నుంచి ఇలా ఒంటరిగా బ్రతుకు తున్నాను" అంది తడుము కోకుండా.

ఈ మధ్య ఆ ప్రశ్న చాలా మంది అడిగారు.

అందుకే చిన్న కట్టు కథ అల్లి చెప్పుకోవటం మొదలు పెట్టింది.

ఈ సమాజంలో భర్త చనిపోయిన స్త్రీకి సానుభూతి వుంది.

కాని భర్త చేత త్యజించబడిన స్త్రీకి కనీస సానుభూతి కూడా లేదు.

అందుకే ఎవరడిగినా భర్త గురించి కట్టు కథ చెప్పటం మొదలు పెట్టింది.

శంకర్‌లాల్ ఒకసారి పరిశీలనగా ఆమె ముఖంలోకి గుచ్చి చూశాడు.

పేదరికంలో వున్న మకిలిపట్టిన మాణిక్యం లాంటి ఆమె సోయగం అతన్ని ఆకర్షించింది.

అసలు సావిత్రి రైలు పెట్టెలో ఎక్కుతున్నప్పుడే అతని మనసు ఆమె పట్ల "బందీ" అయ్యింది.

అందుకే సావిత్రి లోపలికి వస్తుంటే దౌర్జన్యంగా ఆమెని దింపెయ్యలేక పొయ్యాడు.

ఇప్పుడు సావిత్రి తనకిగా తాను తన దుస్థితి వివరించుకోవటంతో శంకర్‌లాల్ మెదడు పదునుగా పనిచెయ్యటం మొదలుపెట్టింది.

వెదకబోయిన తీగె కాలికి తగిలినట్లు అనిపించింది.

"మీకు నా మీద అంత నమ్మకం లేకపోతే కొన్నాళ్ళు నా పనితనం చూసి ఆ తరువాత నా ఉద్యోగం నిర్ణయించండి అయ్యగారూ ?" అంది వినయంగా ఎంతో ఆశతో సావిత్రి.

"ఇప్పుడు మీరు ఎక్కడికి వెళుతున్నారు !" అన్నాడు శంకర్‌లాల్.

"నాకు ఒక ఊరు అంటూ లేదండి. ఎక్కడ పని దొరికితే అదే నా ఊరు" అంటూ పెట్టె తెరిచి తన మెట్రిక్ సర్టిఫికెట్టు డిప్లమా సర్టిఫికెట్స్ ఆతనికి చూపించింది.

శంకర్‌లాల్ కళ్లు సంతృప్తితో మెరిశాయి.

అంగీకార సూచకంగా తలవూపాడు.

"సరే, కొంతకాలం మీరు నా దగ్గర పని చెయ్యండి అన్నివిధాల మాకు సంతృప్తి అనిపిస్తే మూడు నెల్ల తరువాత మీ ఉదోగం పర్మినెంటు చేస్తాను.

నీ జీతం కూడా అప్పుడే నిర్ణయిస్తాను. లేకపోతే పనిలోంచి తొలగిస్తాను" అన్నాడు నిక్కచ్చిగా.

సావిత్రికి ఎంతో సంతోషం అనిపించింది.

"గమ్యం" తెలియకుండా గాలికి కొట్టుకుపోతున్న తనకి తలవని తలంపుగా ఒక ఆధారం దొరకటం భగవంతుడి కృప అనిపించింది.

"మాది చాలా పెద్ద సంస్థ. చాలామంది వర్కర్స్ వుంటారు. అయితే అంతా ఆడవాళ్ళే. ఆఫీసు రికార్డు వర్క్ అదీకూడా నువ్వే మెయిన్‌టైన్ చెయ్యాలి.

అప్పుడప్పుడు పైనుంచి ఆఫీసర్సు చెకింగ్‌కి కూడా వస్తూ వుంటారు.

ఏ పరిస్థితుల్లోనూ నాకు మాట రాకుండా జాగ్రత్తగా అంతా చూసుకోవాలి. మరి చెయ్యగలవా!" అన్నాడు.

సావిత్రి వినయంగా తలూపింది.

"చెయ్యగలనండి. నా చిన్నప్పుడు మా మహిళా మండలిలో డ్రెస్ మేకింగ్ సెంటర్ ఓపెన్ చేశారు. అక్కడ ఫ్రీగా కొన్నాళ్లు పని చేశాను. ఆ వర్క్‌లో కూడా నాకు కొంచెం అనుభవం వుంది...." అంది.

"సరే...."

"...."

"మా సంస్థ పెద్దది. అన్ని విషయాల్లోనూ నువ్వు చక్కగా పని చేస్తే నీ ఉద్యోగం మూడు నెల్ల తరువాత పర్మనెంటు చేస్తాను. మంచి జీతం కూడా వుంటుంది....

....ప్రస్తుతం మా సంస్థకి కష్టపడి పనిచేసే "ఇన్‌స్ట్రెక్టస్ ఎంతైనా అవసరం.

మీరు వుండటానికి నివాసం కూడా మేమే ఇస్తాము."

"...."

"మీకు అభ్యంతరం లేకపోతే పక్క స్టేషన్‌లో నేను దిగిపోతున్నాను. నాతోపాటు మీరు దిగచ్చు" అన్నాడు ఆమెని పరిశీలనగా చూస్తూ.

శంకర్‌లాల్ మాటలు తేనె లొలుకుతున్నా, సూదుల్లా చూపులు మాత్రం పదునుగా గుచ్చుకుంటున్నాయి సావిత్రిని.

మాటల మధ్య రైలు స్టేషన్‌లోకి వచ్చి ఆగింది.

శంకర్‌లాల్ సూట్‌కేసు పట్టుకుని దిగాడు.

మనసులో ఆందోళన చెలరేగుతున్నా.... వేరే మార్గం లేక సావిత్రి కూడా తన లగేజి తీసుకుని నిశ్శబ్దంగా రైలు దిగి శంకర్‌లాల్ వెనకాలే నడిచింది.

o o o

అది ఒక చిన్న డిస్ట్రిక్ట్.

అక్కడ బిజినెస్ షిపుల్ ఎక్కువ.

వ్యాపారాభివృద్ధికి అనువైన ప్రదేశం కావటంతో నేషనల్ బ్యాంక్సు కూడా నెలకొన్నాయి.

ఊరు చివర ఒక ఇండస్ట్రియల్ ఎస్టేట్ వెలసింది.

గత పది సంవత్సరాలుగా ఆ ఇండస్ట్రియల్ ఎస్టేట్‌లో దాదాపు డజను పైగా కుటీర పరిశ్రమలు నెలకొన్నాయి.

కొవ్వొత్తులు, పాలిథిన్ కవర్లు, బైండింగ్ వర్క్సు, అగ్గిపెట్టెలు, పైర్ సామాన్లు, బీడీలు, చిన్న చిన్న ఎలక్ట్రికల్ పరికరాలు.... టూల్సు, ఇలాంటివన్నీ తయారుచేసే వ్యాపార పరిశ్రమను దాదాపు డజను పైగా వున్నంతలో కొద్దిపాటి లాభాలతో పనిచేస్తున్నాయి.

ఆ పరిశ్రమలు నెలకొల్పాక ఎందరో కార్మిక స్త్రీలకి పురుషులకి పిల్లలకి కూడా అక్కడ జీవనోపాధి లభించింది.

ఒక బిల్డింగుకి మరొక బిల్డింగుకి మధ్య దాదాపు అరఫర్లాంగు దూరం వుంటుంది.

శంకర్‌లాల్ గార్మెంట్ సెంటర్ కూడా అక్కడే వుంది.

శంకర్‌లాల్ మహారాష్ట్రియన్.

తెల్లగా ఎత్తుగా కాస్త లావుతో వుంటాడు.

పాము కుబుసంలా మెరిసే సిల్కు లాల్చి, పొందూరు ఖద్దరు పంచ ధరిస్తాడు.

మెడలో సన్నటి పులిగోరు గొల్సు, వేళ్ళకి రాళ్ళ ఉంగరాలు.

ఎంత అర్జంటు వ్యవహారాలు వున్నా మిన్ను విరిగి, మీదపడుతున్నా ప్రతిరోజూ ఉదయం ఒక గంటసేపు గీతార్చన చేస్తాడు.

అప్పుడు పెట్టిన గంధం కుంకం బొట్టు మర్నాటి ఉదయం దాకా అలాగే వుంటుంది. దైవ భీతి ఎక్కువ.

పోనీ అలా అని పాపాలు చెయ్యడా అంటే చేస్తాడు.

ఆ పాప ప్రక్షాళన కోసమే దేవతార్చన చేసి చెంపలు వాయించుకుంటాడు.

శంకర్‌లాల్ కుటుంబం తరతరాలుగా బట్టలవ్యాపారస్థులు తరిగిపోని ఆస్థి సంపాదించి పెట్టారు.

శంకర్‌లాల్ తన అపారమైన తెలివితేటలతో తన ఆస్థిని రెండింతలు చేసుకున్నాడు.

దాదాపు ఐదు సంవత్సరాల క్రితం ఆ ఇండ్రస్ట్రియల్ ఎస్టేటులో రెండు ఏకరాల స్థలం కొని విశాలమైన గదులతో ఒక అందమైన బిల్డింగ్ కట్టాడు.

"శంకర్‌లాల్ అండ్ సన్స్" అని బయట బోర్డుపెట్టి "రెడీ మేడ్ గార్‌మెంట్ సెంటర్ విత్ ఎంబ్రాయిడరీ డెకరేషన్స్" అన్న పేరుతో ఒక చిన్న సంస్థని స్థాపించాడు.

అందులో "డిసెర్టెడ్ ఉమెన్‌కి" (అనగా విడోస్, భర్త) పరిత్యక్తలు, వృద్ధ కన్యలు, వగైరా స్త్రీలకి మాత్రమే తన సంస్థలో ఉద్యోగాలు ఇచ్చాడు.

అంటే— ఏ స్త్రీకయితే తన ఫామిలీని పోషించవలసిన బాధ్యత వుందో.... అలాంటి స్త్రీలకి మాత్రమే తన సంస్థలో "అడ్మిట్" ఇచ్చాడు.

అయితే వాళ్ళల్లోకూడా కాస్త అందమైన వాళ్ళకీ, వయసులో వున్న వాళ్ళకే ప్రాధాన్యత ఇచ్చేవాడు శంకర్‌లాల్.

కుట్టు పనిలో ఎంత ప్రావీణ్యం వున్నా పై రెండు విషయాల్లోతగిన అర్హత లేకపోతే పని ఇవ్వకండా పంపించేసేవాడు.

అసలు ఈ సంస్థ స్థాపించటంలో శంకర్‌లాల్ అంతరంగం ఇక్కడే బయట పెడుతుంది.

ఎంబ్రాయిడరీ కుట్టు సెంటర్ స్థాపించి అందులో ఇరవై మంది "డెసెర్టెడ్ వుమెన్‌కి" తన సంస్థలో స్థానం కల్పించాడు.

ప్రొడక్షన్ యూనిట్‌కోసం మాడరన్ నిట్టింగ్‌మిషన్, ఎలక్ట్రిసిటీ వితవుట్ స్ట్రెయిన్ వగైరా— ఒక్కొక్కటి ఐదువేల చొప్పున ఇరవై వేలు ఖర్చుపెట్టి- నాలుగు మిషన్లు కొన్నాడు.

ఆ మిషన్ల ఓపెనింగ్‌కి ఒక వుప నాయకుడ్ని సగౌరవంగా ఆహ్వానించాడు.

ఊళ్ళో ప్రముఖులందరి చేత ఆ నాయకుడికి పెద్ద ఎత్తున స్వాగతం చెప్పి ఘనంగా సన్మానంచేసి సత్కరించాడు.

పగటి మర్యాదలు—రాత్రి మర్యాదలు చేసి ఒక "పుష్పాన్ని" కానుకగా సమర్పించాడు.

ఆ తరువాత ఆ నాయకుడి సిఫార్సు ద్వారా జిల్లాలో వున్న వెల్‌ఫేర్ ఆఫీసులు, డి.పి.ఎ.పి సంస్థలు, ఇండస్ట్రీస్ ఆఫీసుల్నుంచి అతి సులభంగా నిధులు, రుణాలు, సబ్సిడి సదుపాయాలు పెద్ద ఎత్తున సంపాదించుకున్నాడు.

ఆ డబ్బుతో తన వ్యాపారాన్ని అంచెలంచెలుగా పెంచుకున్నాడు.

ప్రభుత్వంగాని ప్రజలుగాని వున్నవాడికే ఇంకా అందజెయ్యటం రివాజు. శంకర్‌లాల్ విషయంలోనూ అదే జరిగింది. ఆ గ్రాంట్సు ద్వారా వ్యాపారంలో లాభంతో పాటు స్త్రీ జనోద్ధరణ అని పేరు కూడా సంపాయించుకున్నాడు.

తన సంస్థ తరపున ఏ చిన్న ఫంక్షన్ జరిగినా రాజకీయ ప్రముఖుల్ని ఆహ్వానించి డబ్బు పెద్ద ఎత్తున ఖర్చుపెట్టి "పుష్పాలని" సమర్పించి ఘనంగా సన్మానాలు చేసి పంపించే వాడు. తద్వారా పనులు చేయించుకునే వాడు.

దాంతో శంకర్‌లాల్ కీర్తి ప్రతిష్టలు ఆ చుట్టుప్రక్కల జిల్లాల్లో క్షణాల్లో మారుమ్రోగి పోయ్యాయి.

ఆ విధంగా శంకర్‌లాల్ తన రెడీమేడ్ గార్మెంట్సు సంస్థ ద్వారా, అందులో పనిచేసే అమ్మాయిలద్వారా డబ్బు, పాప్యులారిటీ, కీర్తి సంపాదించుకున్నాడు.

ఆ "కీర్తి" ఎంత ఎత్తుకి పెరిగిందంటే....

ఇపుడు ఊళ్ళో వున్న రాజకీయ వ్యక్తులు తదితర ప్రముఖులందరికీ ఏ చిన్న అవసరం వచ్చినా పలుకుబడి కోసం శంకర్‌లాల్ అతని సంస్థ జ్ఞాపకం వస్తున్నారు.

ఊళ్ళోకి ఏ సంస్థ ప్రారంభోత్సవానికో ఒక కేంద్ర మంత్రి వస్తున్నాడంటే ఊళ్ళో వున్న నాయకులకి ఉపనాయకులకి ముందు జ్ఞాపకం వచ్చేది శంకర్‌లాల్. మంత్రికి పగటి మర్యాదలు చెయ్యటానికి సతమతమవుతున్న తరుణంలో సలహా సంప్రదింపుల కోసం శంకర్‌లాల్ దగ్గరికి పరుగెత్తుకొచ్చేవారు. రాత్రి మర్యాదల కోసం ఒక మెలికలాంటి అమ్మాయిని తన సంస్థ తరపున వుపయోగించేవాడు శంకర్‌లాల్.

ఈ విధంగా శంకర్‌లాల్ సమాజంలో పెద్ద పెద్ద ఆఫీసర్లకి అఫిషియల్స్‌కి అనఫిషియల్స్‌కి, ఎమ్మెల్యేలకి చాలా దగ్గరయ్యాడు.

ఆ పలుకుబడితో క్రమంగా డ్రెస్ మేకింగ్ సెంటర్, గారమెంట్ సెంటర్, ఉలెన్ గారెమెంట్స్, ప్రొడక్షన్ యూనిట్ ఇవన్నీ డెవలప్ చేసుకున్నాడు.

రకరకాల చిన్న పిల్లల దుస్తులు ఉలెన్ బట్టలు తన సంస్థ ద్వారా వుత్పత్తి చేసి హోల్‌సేల్‌గా రిటైల్‌గా అమ్మకాలు చేసి తద్వారా మంచి పేరుతో చక్కని లాభాలు కూడా గడించారు.

కాని గత కొద్ది మాసాలుగా సరి అయిన వర్కర్స్ లభించని కారణాన "బంగారు బాతులా" లాభాలు సంపాదించిపెట్టే ఆ సంస్థ కుంటినడకలు నడుస్తోంది.

అంతకుముందు అందులో పనిచేసే అందమైన "ఇన్‌స్ట్రక్టస్". లీలారాణిని ఒక యువకుడు ప్రేమించి ఆదర్శ వివాహం చేసుకున్నాడు. ఆ తరువాత లీలారాణి ఆ ఉద్యోగానికి రిజైన్ చేసి దూర దేశానికి వెళ్ళిపోయింది.

దాంతో శంకర్‌లాల్‌కి చెయ్యి విరిగినట్లుగా అయ్యింది.

తక్కువ పెట్టుబడితో ఎక్కువ లాభాలు ప్రముఖ రాజకీయవేత్తల మధ్య "కీర్తి ప్రతిష్టలు" ఆర్జించి పెట్టే సంస్థ మూత పడే స్థితికి రావటం శంకర్‌లాల్‌లో ఎంతో ఆందోళనల్ని రేకెత్తించింది. సరిగ్గా ఆ పరిస్థితిలో యాదృచ్ఛికంగా ట్రైన్ పరిచయంలో సావిత్రి తటస్థపడింది.

విరిసిన ముద్ద బంతిలాంటి ఆమె అందం మొదటి చూపులోనే శంకర్ లాల్ని విచలితుడ్ని చేసింది.

అంతకుముందు అక్కడ పనిచేసిన "ఇన్స్ట్రెక్టస్" లీలారాణి అందంలో పట్నవాసపు నాజూకు తనం కనిపిస్తే సావిత్రి. అందంలో పల్లెటూరి ముగ్ధత్వం గోచరించింది శంకర్ లాల్ కి.

ఆమెలోని అమాయకత్వం అతడ్ని ఆకర్షించింది. నిజానికి ఆతనికి పల్లెటూరి అమ్మాయిలంటేనే ఇష్టం.

అందుకే సావిత్రి చిన్న ప్రైస్ పరిచయంతో ఉద్యోగం అడగ్గానే మరొక ఆలోచన లేకుండా వర్క్ సరిగా చేస్తుందో చెయ్యదోనన్న సందేహం కూడా పెట్టుకోకుండా తన సంస్థలో "ఇన్స్ట్రెక్టస్"గా ఉద్యోగం ఇచ్చేశాడు.

ఇదెంత విషవలయమో ఇక్కడెన్ని ఇబ్బందులు ఎదురవుతాయోనన్న ఆందోళన కడుపులో ఓ ప్రక్క రగులుతున్నా వేరే మార్గంలేక తలవంచుకుంది సావిత్రి.

ఎడారిలో పయనించే పాంధుడు తాటిచెట్టు నీడ దొరికినా సేదదీరాలని తాపత్రయ పడతాడు.

ఇప్పుడు సావిత్రి పరిస్థితి కూడా అంతే!

సాలెగూటిలో పురుగులా అందులోకి ప్రవేశించింది.

o o o

దాదాపు రెండెకరాల విశాలమైన ఆవరణలో ఆ అందమైన భవంతి చుట్టూ ఇనుపతీగెల ఫెన్సింగ్...

"శంకర్లాల్ అండ్ సన్స్" అన్న నేమ్ బోర్డుకి వెనకగా రేకుల షెడ్ వేసిన చిన్న అవుట్ హవుస్.

అందులో వాచ్ మెన్ యాదగిరి భార్యా, ఇద్దరు చిన్న పిల్లలతో కాపురం వుంటున్నాడు....

డాబా వెనకగా రెండు గదుల చిన్న అందమైన పోర్షన్.

అందులోనే సావిత్రి నివాసం.

మిగతా గదులన్నీ కుట్టుపనికే కేటాయించబడ్డాయి.

బిల్డింగ్ చుట్టూరా రకరకాల కూరగాయ మొక్కలు, పూలమొక్కలు అందంగా పెంచబడ్డాయి.

చక్కటి గాలి, వెలుతురు, నీరు .... అన్ని సౌకర్యాలు బాగున్నాయి.

అది ఇండస్ట్రియల్ ఎస్టేటు కావటంతో చుట్టు ప్రక్కలన్నీ పెద్ద పెద్ద భవనాలే.

ఒక బిల్డింగ్‌కి ఇంకొక బిల్డింగ్‌కి మధ్య దాదాపు అరఫర్లాంగు దూరం వుంటుంది.

ప్రతి బిల్డింగ్‌కి ఒక అవుట్ హవుస్ అందులో వాచ్‌మెన్‌ల సంసారం.

అక్కడక్కడ చిన్న చిన్న సంసారాలు కూడా లేకపోలేదు.

కాని ఒక యింటికి మరొక యింటికి మధ్య చాలా దూరం వుండేది.

సావిత్రి తనకి కేటయించబడిన వాటాలో దక్షిణంవైపు గది గుమ్మం దగ్గర నిల్చుంటే ఇవన్నీ కనిపించేవి.

వాతావరణం ఆహ్లాదంగా తోచేది కాని—

ఉత్తరం వైపు కిటికీ తెరిస్తే సావిత్రి గుండె ఆగినట్లు అయ్యేది ....

సన్నగా రివటల్లా నిలువెత్తున సరుగుడు తోటలు....గట్టును ఒరుసుకుంటూ జలజల పారే సెలయేరు. ఆ వెనుక చిన్న చిన్న గోరీలతో శిధిల సమాధులతో శ్మశానం....?

సావిత్రికి గుండెలు జలదరించేవి,

ఆ ప్రాంతమంతా పగలు కార్మికులతో పిల్లలతో చాలా సందడిగా వుంటుంది.

ఉదయాన కోడి కూతతో పాటే కార్మికులు క్యారేజీలలో అన్నాలు పెట్టుకుని గుంపులు గుంపులుగా ఫ్యాక్టరీలకి వస్తారు.

సగం మంది స్త్రీ కార్మికులే. అప్పడాలు ఒత్తటం, బీడీలు చుట్టడం, కొవ్వొత్తులు తయారు చెయ్యటం, అగ్గిపెట్టెల తయారీ వగైరా పన్లు అన్నీ స్త్రీ కార్మికులే ఎక్కువగా నిర్వహిస్తున్నారు.

కొంత మంది కుటుంబాలకి కుటుంబాలే అక్కడికి తరలి వచ్చే వారు,

పిల్లలకి, వృద్ధులకి కూడా అక్కడ పన్లు లభ్యం అవుతాయి.

సాయంత్రం ఆకాశంలో పిట్టలు గూళ్ళకు మరలుతూ వుంటే వాళ్ళు కూడా ఖాళీ టిఫిన్ క్యారేజీలతో గృహోన్ముఖులు అవుతారు.

వాళ్ళని చూస్తుంటే కష్టపడి పనిచెయ్యటంలో కూడా ఆనందం వుంది కదా అనిపిస్తుంది.

పగలు ఎంత సందడిగా వున్నా రాత్రి ఏడు గంటలు అయ్యేసరికి ఆ ప్రాంతం మొత్తం నిర్మానుష్యం అయిపోతుంది.

బెల్లం చుట్టూ చేరిన చీమలు, ఆ బెల్లం గడ్డ తీసెయ్యగానే చీమలన్నీ చెదురు అయినట్లు....పగలు ఎక్కడ చూసినా జనసందోహంతో ఎంత సందడిగా వుంటుందో....

రాత్రి అయ్యేసరికి అంత భయంకర నీరవ నిశ్శబ్దం!

ఊరి చివర....

ఈ శ్మశానాల దగ్గర ఎలా కాపురం చెయ్యాలిరా భగవంతుడా అని వచ్చిన రోజే సావిత్రి గుండెల్లో "రాయి" పడింది.

ఆమె భయపడినట్లే సావిత్రి అక్కడికి వచ్చిన మూడు రోజులకే రెండు శవాలు ఏడుపు పెడబొబ్బలతో సావిత్రి ఇంటి ముందునుంచే శ్మశానంలోకి వెళ్ళాయి.

సావిత్రి గుండె ఝల్లుమంది. శరీరం అంతా గడ్డకట్టినట్లు అయ్యింది.

"మీకు భయం వెయ్యదా? శ్మశానాలు ఇంత దగ్గరగా వున్నాయి కదా?" అంది వాచ్ మెన్ భార్య రత్నమ్మతో ఒకసారి వచ్చిన కొత్తలో.

రత్నమ్మ చిన్నగా నవ్వింది.

"ఎందుకు భయం? ఏదో ఒక నాటికి మనం ఆడికి పొయ్యేవాళ్ళమే కదా?" అంది నిర్వికారంగా.

వాళ్ళ పిల్లలు కూడా శవం వెనకాలే వెళ్ళి డబ్బులు ఏరుకుని శవం కాలుతుంటే చూసి వస్తారుట.

"అలా శవంమీద జల్లిన డబ్బులు ఏరుకోకూడదు కదా?" అంది సావిత్రి.

"పోరగాళ్ళు....ఇనుకోరమ్మా" అంది మళ్ళీ అదే చిరునవ్వుతో తేలిగ్గా రత్నమ్మ.

సావిత్రికి ఆశ్చర్యం అనిపించింది.

వచ్చిన రోజు రాత్రి ఆమెకి అసలు నిద్రపట్ట లేదు.

ఆమె గుండెల్లో ఎన్నో భయాలు గూడు కట్టుకోసాగాయి.

ఆ ఊరి చివర....శ్మశానాలకి అంత దగ్గరగా వుంటూ ఎలా జీవించాలో సావిత్రికి అర్థం కాలేదు.

ఆ శంకర్‌లాల్ పైకి మంచివాడు లాగానే కనిపిస్తున్నాడు.

కాని లోపల ఎలాంటివాడో అస్సలు అర్థం కావటంలేదు.

ఆ పరిసరాలు....ఆ ఉద్యోగం ఒక విషవలయం అనిపించినా.... ఆ కాస ఆధారం కూడా పోగొట్టుకుంటే నిలువ నీడ కూడా వుండదు.

అందుకే గుండె రాయి చేసుకుంది.

ఎలాంటి పరిస్థితులు ఎదురయినా ఎదురొడ్డి ఆ ఉద్యోగంలో నిల ద్రొక్కుకోటానికే నిర్ణయించుకుంది సావిత్రి.

పరిస్థితుల ప్రభావానికి ఎంతటి వాళ్ళూ తల వంచక తప్పదు. విధికి మనిషి బానిస.

సావిత్రి వచ్చిన మర్నాటి నుంచి తిరిగి గార్మెంట్ సెంటర్ పని చెయ్యటం మొదలుపెట్టింది.

సావిత్రి అడుగుపెట్టిన దగ్గర్నుంచి, శంకర్‌లాల్ ఆ ఏర్పాట్లలోనే వున్నాడు.

గదుల్లో ఇనుప బీరువాలనిండా రకరకాల కట్‌పీస్ ముక్కలు....

సగం సగం కుట్టి వదిలేసిన వివిధ ఫాషన్ల దుస్తులు మేటలు మేటలుగా పేరుకుపోయి వున్నాయి.

లీలారాణి వెళ్ళిపోయాక సరిఅయిన మనిషి దొరక్క ఆ సంస్థ మూత పడింది.

కొన్ని వేలుపెట్టి తెచ్చిన మెటీరియల్ అంతా బీరువాల్లోనే వుండి పోయింది.

దుస్తుల తయారీ ఆగిపోవటంతో లాభాలమాట అటుంచి అసలుకే మోసం వచ్చింది.

బోల్డన్ని ఆర్డర్స్ కూడా బుక్ అయి వున్నాయి దాదాపు. ఒక ఏడాది నుంచి అసలు పెట్టుబడికే మోసం రావటంతో శంకర్‌లాల్ ప్రాణం గిజగిజ లాడిపోతూంది.

సావిత్రి వచ్చాక తిరిగి వూపిరి పీల్చుకున్నాడు.

శంకర్‌లాల్ ఒక రెండు రోజులపాటు ఇద్దరు అసిస్టెంట్సుతో సావిత్రిని కూర్చోపెట్టి ఆఫీసు రికార్డు, వర్క్ అంతా ఆమెకి ఎలాట్ చేశాడు.

విశదంగా ఆ సంస్థ వర్క్ చేసే విధానం గురించి చెప్పి అన్నీ తెల్సు కుందుకు వుపయోగించే పుస్తకాలు ఇచ్చాడు.

పాత డైరీలు వర్క్ అంతా దగ్గరుండి చూపించాడు.

దాంతో సావిత్రికి కష్టం అనిపించలేదు.

శంకర్‌లాల్ నాలుగురోజులు వున్నాడు.

ఆ నాల్గు రోజులు తల మునిగే పనితోనే సరిపోయింది సావిత్రికి.

మర్నాడు వూరికి వెళ్ళిపోయాడు.

ఆయన కుటుంబం అంతా పక్క జిల్లాలో వుంటుంది. శంకర్‌లాల్ బట్టల దుకాణం స్వంత మేడలు కూడా అక్కడే వున్నాయి శంకర్‌లాల్‌కి భార్యలేదు. పది సంవత్సరాలక్రితమే చనిపోయింది. సంతానం ఎక్కువే. ఆరుగురు కొడుకులు, ఇద్దరు ఆడపిల్లలు. చాలా పెద్ద కుటుంబం.

ఆడపిల్ల లిద్దరికీ ఘనంగా పెళ్ళిళ్ళు చేశాడు. ముగ్గురు కోడళ్ళు వచ్చారు. జాయింటు ఫామిలీ ఇంకా ఆస్థి పంపకాలు జరగలేదు.

శంకర్‌లాల్ పూర్వీకుల నుంచి బట్టల వ్యాపారస్థులే. అందులోనూ ఆ డిస్ట్రిక్టు లెవల్లో శంకర్‌లాల్ బట్టల దుకాణానికి ఇంకా పేరు ప్రఖ్యాతులు ఎక్కువ.

"శంకర్‌లాల్ అండ్ సన్స్" అన్న పేరుతో పెద్ద పెద్ద పట్టణాల్లో కూడా బ్రాంచీలు ఓపెన్ అయ్యాయి. అవన్నీ కొడుకులు అల్లుళ్ళు స్వయంగా మేనేజ్ చేస్తారు.

శంకర్‌లాల్ వూరికి వెళ్ళేముందు ప్రత్యేకం సావిత్రి దగ్గరికి వచ్చాడు.

అప్పుడు సావిత్రి తనకి కేటాయించిన గదుల్లో రత్నమ్మ సాయంతో సామాన్లు సర్దుకుంటుంది.

శంకర్‌లాల్‌ని చూసి చేతిలో పని ఆపి కొంగుతీసి భుజాలనిండా కప్పుకుని గడప దగ్గరకి వచ్చింది.

"సావిత్రీ! నాకు చాలా అర్జంటు వ్యవహారాలు వున్నాయి. అందుకే వెళ్ళిపోతున్నాను. మళ్ళీ వీలు చూసుకుని తొందర్లోనే వస్తాను. ఇంకా ఇక్కడ మిగిలిపోయిన వ్యవహారాలు ఏమైనా వుంటే చూస్తాను. జాగ్రతగా వుండగలవు కదా?" అన్నాడు.

సావిత్రి తలూపింది.

"రత్నమ్మా! మీ అమ్మగారికి ఏం కావల్సి వచ్చినా కనిపెట్టుకుని వుండు." అంటూ జేబులోంచి మూడువందలు తీసి సావిత్రి చేతిలో పెట్టాడు.

"సావిత్రీ! మూడు నెల్ల తరువాత నీ ఉద్యోగం పర్మనెంటుచేసి జీతం నిర్ణయిస్తాను. ఆ క్షణం నుంచి ఈ ఫర్మ్ బాధ్యతలన్నీ నీవి. మరి ఎలా మానేజ్ చేస్తావో ఏమో....నీవు మంచి పనివంతురాలవని నీ సర్టిఫికెట్ చూసి నమ్మకంతో ఈ బాధ్యత నీకు అప్పగిస్తున్నాను. ఈ క్షణంనుంచి ఇది నీ స్వంత ఫర్మ్ అనుకుని వర్క్ చెయ్యాలి. నేనూ తరచూ వస్తూ వుంటానూ. ఏదైనా అవసరంవస్తే టెలిఫోన్ చెయ్యి...." అన్నాడు ఎంతో ఆదరంగా....స్వంత మనిషికి చెప్పినట్లు.

ఎన్నో రోజుల తరువాత ఆపాటి ఆప్యాయత లభించటంతో సావిత్రి మనసు చల్లగా అయ్యింది.

డబ్బు అందుకుంటూ వుంటే కృతజ్ఞతతో కళ్ళలో నీళ్ళు వచ్చాయి.

"సావిత్రీ! చాలా వూళ్ళనుంచి ఆర్డర్స్ బుక్ అయివున్నాయి. ఎంత తొందరగా పస్లు అయితే అంత మంచిది. కొన్నాళ్ళపాటు స్టాఫుని రాత్రిళ్ళుకూడా వర్క్ చెయ్యమను. కాస్త ఓవర్ టైమ్‌ఇద్దాము...." అంటూ తాళాలగుత్తి ఆమెకి అందించి అప్పగింతలుచేసి వెళ్ళిపోయాడు.

సావిత్రికి చేతినిండా డబ్బు అంతకుమించి బాధ్యత కూడా వచ్చాయి.

రోజూ ఉదయం ఎనిమిది గంటలకల్లా కుట్టుపనిచేసే ఆడవాళ్ళు వచ్చేవారు.

అప్పటికే సావిత్రి గృహకృత్యాలు ముగించుకుని సెంటర్‌లో కూర్చునేది.

ఒక రొకరుగా వర్కర్స్ వచ్చేవారు. అంతా ఆడవాళ్ళు కావటంతో సమస్యలు వేరే లేవు. సరదాగా కల్సిమెల్సి కబుర్లు చెప్పుకుంటూ పని చేసేవారు.

సావిత్రి పని దుస్తులు కత్తిరించటం, దగ్గరుండి స్టాఫ్‌చేత పర ఫెక్టుగా వర్క్ చేయించటం, డే - బుక్స్, ఆఫీసు రికార్డ్స్, రిజిస్టర్.... నీట్‌గా మెయిన్‌టైన్ చేయటం దుస్తులు దొంగతనంగా మాయం అవ కుండా జాగ్రత్తగా చూడటం....ఇదంతా సావిత్రి బాధ్యతే.

డబ్బు వ్యవహారం మాత్రం ఆమెకి సంబంధంలేదు.

నెలనెలా శంకర్‌లాల్ వచ్చి స్టాఫ్‌కి జీతం ఇచ్చి సంతకాలు తీసు కుంటాడు.

ఇది సావిత్రి ఉద్యోగం.

అయితే అక్కడ కూడా లోపాయకారీగా అవినీతి అక్రమం వుందని పించినా ఒక రకంగా ఆ జీవితం ఫరవాలేదు అనిపించింది సావిత్రికి.

ఆపాటి ఆధారం చూపించినందుకు భగవంతుడికి మనసులోనే కృతజ్ఞతలు చెప్పుకుంది.

సరిగ్గా వారం రోజుల తరువాత శంకర్‌లాల్ మళ్ళీ వచ్చాడు.

బంగాళాఖాతంలో వాయుగుండం లేచిందట.

ఆ రోజు ఉదయం నుంచి ఆకాశం మబ్బుగా వుంది. తుపాను వచ్చే సూచనలు కనిపిస్తున్నాయి.

ఆగి ఆగి సన్నగా చినుకు పడుతోంది.

చల్లగా ఈదః గాలులు వీస్తున్నాయి.

తలవని తలంపుగా శంకర్‌లాల్ బ్రీఫ్‌కేసుతో లోపలికి వస్తుంటే ఆశ్చర్యపోయింది సావిత్రి.

ఆ వూళ్ళో అతనికి కొద్దిగా పొలాలు కూడా వున్నాయిట!

రైతులు కబురు పెట్టారని, ఆ పన్లమీద రావల్సి వచ్చిందని, ఆ మర్నాడు వెళ్ళిపోతానని చెప్పాడు శంకర్‌లాల్.

వచ్చేటప్పుడు ఒక చిన్న ప్యాకేజి పెట్టెనిండా - స్టిఫ్ కాలర్లు, ఇలాస్టిక్, స్టిక్కర్లు లాంటివి....డ్రెస్ మెటీరియల్ కూడా తెచ్చాడు.

వాచ్‌మెన్ టాక్సీలోంచి ఆ పెట్టె దించి లోపలికి తెచ్చి సావిత్రికి అప్పగించాడు.

ఆ రోజు పగలంతా బిజీగా పన్లమీద తిరిగాడు శంకర్‌లాల్.

ప్రొద్దు గ్రుంకుతున్నకొద్దీ దట్టంగా మబ్బులు కూడా ముసురుకోసాగాయి.

తుఫాను గాలులు ఎక్కువయ్యాయి.

రాత్రి తొమ్మిది గంటల ప్రాంతంలో గాలి విసురుతో పాటు వాన సందడి కూడా మొదలయ్యింది.

సావిత్రి పెంద్రాళే భోజనం చేసి తలుపు వేసుకుంది.

సుజాత అప్పటికే అదమరిచి నిద్రపోతూంది.

పగలంతా సావిత్రికి కావల్సినంత సందడి.

అనుక్షణం రత్నమ్మ కూడానే వుంటుంది.

కాని రాత్రి అయితే పిలిస్తేనే గాని ఇంట్లోంచి బయటికి రాదు.

అందుకే సావిత్రికి ప్రొద్దు గ్రుంకుతోందంటే భయంగా వుండేది.

పైగా ఆ రోజు బాగా వర్షం....

కరెంటుగాని పోతుందేమోనని కిరసనాయిల్ దీపం వెలిగించి గూట్లో పెట్టింది.

ఆఫీసు వర్క్‌కి సంబంధించిన పుస్తకాలు వుంటే చదువుతూ కూర్చుంది.

నాలుగు పేజీలు చదివిందేమో....

ఇంతలో తలుపు టకటకా శబ్దం అయ్యింది. ఎందుకైనా రత్నమ్మ వచ్చి వుంటుందనుకుందని సావిత్రి. చేతిలో పుస్తకం పక్కన పెట్టి లేచి వెళ్ళి తలుపు తీసింది.

"........" ఎదురుగా వున్న మనిషిని చూస్తూనే హతాశురాలు అయ్యింది సావిత్రి.

సగం తడిసిన దుస్తుల్లో ఎదురుగా శంకర్‌లాల్....

సావిత్రి రెండు నిమిషాలసేపు రెప్ప వెయ్యకుండా అలాగే చూస్తూ నిల్చుండిపోయింది.

ఒక్క క్షణం ఆమె గుండె ఆగి తిరిగి రెట్టింపు వేగంతో కొట్టుకో సాగింది.

స్తంభించినట్లు అచేతనంగా అయిపోయింది.

నోట మాట రాలేదు.

చేతిలో గొడుగు మడిచి లోపలికి వస్తూ శంకర్‌లాల్ చిన్నగా నవ్వాడు.

"ఏమిటి, సావిత్రీ? నేను లోపలికి రానా? వద్దా?"

సావిత్రి వులిక్కి పడింది.

చప్పున గడపలోంచి తప్పుకుని లోపలికి వచ్చింది.

అతని సంస్థలో ఉద్యోగానికి వచ్చింది. నేలని కూలుతున్న అతకి ఒక ఆధారం చూపాడు.

అలాంటి "పెద్ద" మనిషిని లోపలికి రావద్దని ఎలా అన గలదు ?

అసలు....అతను ఎప్పుడో ఒకప్పుడు లోపలికి వస్తాడేమోనని కడుపులో బెంగగానే వుంది.

అయినా పరిస్థితులకి బానిస అయి ఆ ఉద్యోగానికి వచ్చింది.

మనసు అనుక్షణం ప్రతిఘటిస్తూంది. అయినా ఆత్మ వంచన బ్రతుకు అయిపోయింది. సావిత్రి నిశ్శబ్దంగా లోపలికి వచ్చింది. సావిత్రి వెనకాలే శంకర్‌లాల్ లోపలికి వచ్చాడు.

అప్పటికే బయట కొంచెం వానసందడి హెచ్చింది. గాలి విసురు కూడా బాగానే వుంది. తెరిచిన తలుపుల్లోంచి వానజల్లు ఏటవాలుగా గదంతా చిమ్ముతోంది.

శంకర్‌లాల్ వెనక్కి తిరిగి వీధి తలుపులు మయ్యబోయాడు.

సావిత్రి గుండె ఝల్లుమంది.?

"వద్దు" అంది అరిచినట్టు. అప్రయత్నంగానే ఆమె నోట్లోంచి వచ్చింది ఆ మాట.

కాని—

ఆ గొంతులో స్పష్టత లేదు.

వెయ్యి బారల నూతులోంచి వచ్చినట్లు వుంది.

"ఫరవాలేదులే సావిత్రీ? ఇక్కడ పరాయి వాళ్ళు ఎవరున్నారని? నేనే కదా?" అంటూ నిర్లక్ష్యంగా వీధి తలుపులు మూశాడు.

ఆ చేత్తోనే కిటికీలు కూడా మూశాడు.

పులి — మేక ఒకే బోనులో వచ్చిపడ్డట్టు వుంది సావిత్రికి. మర్చి పోదామనుకుంటున్నా "గతం" జ్ఞాపకం వచ్చింది.

శరీరం ఒణుకు తుంటే తలదించుకుని నిశ్శబ్దంగా గోడవారగా నిల్చుంది.

"సావిత్రీ ?"

సావిత్రి వులిక్కిపడి తల ఎత్తి మళ్ళీ దించుకుంది.

శంకర్‌లాల్ కళ్ళు ఎర్రగా జ్యోతుల్లా వెలుగుతున్నాయి.?

అతని దగ్గర సన్నగా బ్రాందీ వాసన వస్తూంది.

మాట కూడా ముద్దగా నానుతున్నట్లు వుంది.

"సా....వి....త్రీ! పొలం పని అయిపోయింది. వూరికి వెళ్ళిపోదా మనుకున్నాను. కాని ... నువ్వు జ్ఞాపకం వచ్చావ్. రేపెళ్ళచ్చు లెమ్మని ఇటు వచ్చాను....సా....వి....త్రి?"

సావిత్రి గుండెల్లో "రాయి" పడింది.

అసలు నిజంగా పొలం పని వుండి రాలేదు. కావాలనే వచ్చాడు అని పించింది సావిత్రి మనసుకి.

ఆ సంస్థలో అడుగు పెట్టిన మొదటి క్షణంలోనే సావిత్రి గ్రహించుకుంది.

అతనిలో ఎప్పుడో ఒకప్పుడు అలాంటి సందర్భం ఒకటి తన బ్రతుకులో రాసి పెట్టివుందని సావిత్రికి తెల్సు.

కాని అంత తొందరగా ఆ సంఘటనని ఎదుర్కోవాల్సి వస్తుందని మాత్రం అనుకోలేదు.

శంకర్‌లాల్ కుర్చీలోంచి లేచి నాలుగు అడుగులు వేసి సావిత్రికి దగ్గరగా వచ్చి ఆమె భుజంమీద చెయ్యివేశాడు.

సావిత్రి వెంటనే చురుగ్గా ఆ చేతిని తొలగించింది.

సావిత్రికి తను నిలువునా "ఊబి"లో కూరుకుని పోయానని తెల్సు.

అందులోంచి విముక్తి లేదనీ తెల్సు.

కాని అది కేవలం చిన్న ప్రయత్నం మాత్రమే.

సావిత్రి తన చేతిని విసురుగా తొలగించటంతో శంకర్‌లాల్ హతాశుడయ్యాడు.

"ఆ రోజు....రైల్లో తను చెప్పిన వన్నీ శ్రద్ధగా విందికదా ?"

తను ఇచ్చిన ఉద్యోగంలో చేరింది కదా!

తన మనసు అర్థం చేసుకుందనే అనుకున్నాడు.

సులభంగా తనకి లొంగిపోతుందనే అనుకున్నాడు.

కాని ...ఇప్పుడీ ప్రతిఘటన ఏమిటి?

శంకర్‌లాల్‌కి కోపం వచ్చింది.

ఆమె చెయ్యి తోసెయ్యటంతో దెబ్బతిన్నట్టు ఆమెకేసి వదునుగా చూశాడు.

మళ్ళీ అంతలోనే తనని తాను తమాయించుకున్నాడు.

ఆడవాళ్ళు అలగటం, మగవాళ్ళు బ్రతిమాలడటం జన్మ హక్కు కదా ?

"........"

ఇద్దరి మధ్య కొద్ది క్షణాలు నిశ్శబ్దం.

తరువాత శంకర్‌లాల్ అన్నాడు నెమ్మదిగా.

"సావిత్రీ!"

నాకు మనసులో ఒకటి పెట్టుకుని పైకి ఒకటి మాట్లాడటం చాతకాదు.

ఆ రోజు ట్రైను ఎక్కి లోపలికి వస్తున్నప్పుడు మొదటిసారిగా.... నిన్ను చూశాను.

నీ అందం ఆ క్షణంలోనే నా మనసులో ముద్రపడిపోయింది.

దానికి తోడు నీకుగా నువ్వు నీ జాలి కథ నాకు చెప్పుకున్నావు. నా మనసు కరిగినట్లు అయిపోయింది.

ఇంతవరకు నా సంస్థలో "ఇన్‌స్ట్రెక్టన్"గా పనిచేసిన అమ్మాయి లందరూ గ్రాడ్యుయేట్లు. కాని నీవు మెట్రిక్యులేట్ వి. రికార్డు ఆఫీసు వర్కు అంతా సమర్ధవంతంగా నిర్వహించగలవో లేదో అనికూడా ఆలోచించకుండా.,. కేవలం నీ మీద ఏర్పడిన అభిమానంతో నిన్ను ఆదుకోవాలని నిర్ణయించు కున్నాను.

ఇప్పుడు చెప్పు....

నువ్వు కాదంటే ఈ క్షణంలో వెళ్ళిపోతాను. కాని....

రేపే నీ స్థానంలో ఇంకొకర్ని నియమిస్తాను. నేను అక్కర్లేనపుడు నా ఫర్మ్‌లో ఉద్యోగం మాత్రం ఎందుకు¿

అతని దగ్గర సన్నగా బ్రాందీ వాసన వస్తూంది.

మాట కూడా ముద్దగా నానుతున్నట్లు వుంది.

"సా....వి....త్రీ! పొలం పని అయిపోయింది. వూరికి వెళ్ళిపోదా మనుకున్నాను. కాని ...నువ్వు జ్ఞాపకం వచ్చావ్. రేపెళ్ళచ్చు లెమ్మని ఇటు వచ్చాను....సా....వి....త్రి?"

సావిత్రి గుండెల్లో "రాయి" పడింది.

అసలు నిజంగా పొలం పని వుండి రాలేదు. కావాలనే వచ్చాడు అని పించింది సావిత్రి మనసుకి.

ఆ సంస్థలో అడుగు పెట్టిన మొదటి క్షణంలోనే సావిత్రి గ్రహించుకుంది.

అతనిలో ఎప్పుడో ఒకప్పుడు అలాంటి సందర్భం ఒకటి తన బ్రతుకులో రాసి పెట్టివుందని సావిత్రికి తెల్సు.

కాని అంత తొందరగా ఆ సంఘటనని ఎదుర్కోవాల్సి వస్తుందని మాత్రం అనుకోలేదు.

శంకర్‌లాల్ కుర్చీలోంచి లేచి నాలుగు అడుగులు వేసి సావిత్రికి దగ్గరగా వచ్చి ఆమె భుజంమీద చెయ్యివేశాడు.

సావిత్రి వెంటనే చురుగ్గా ఆ చేతిని తొలగించింది.

సావిత్రికి తను నిలువునా "ఊబి"లో కూరుకుని పోయానని తెల్సు.

అందులోంచి విముక్తి లేదనీ తెల్సు.

కాని అది కేవలం చిన్న ప్రయత్నం మాత్రమే.

సావిత్రి తన చేతిని విసురుగా తొలగించటంతో శంకర్‌లాల్ హతాశుడయ్యాడు.

"ఆ రోజు....రైల్లో తను చెప్పిన వన్నీ శ్రద్ధగా విండి కదా ?"

తను ఇచ్చిన ఉద్యోగంలో చేరింది కదా!

తన మనసు అర్థం చేసుకుందనే అనుకున్నాడు.

సులభంగా తనకి లొంగిపోతుందనే అనుకున్నాడు.

కాని ....ఇప్పుడీ ప్రతిఘటన ఏమిటి?

శంకర్‌లాల్‌కి కోపం వచ్చింది.

ఆమె చెయ్యి తోసెయ్యటంతో దెబ్బతిన్నట్టు ఆమెకేసి పదునుగా చూశాడు.

మళ్ళీ అంతలోనే తనని తాను తమాయించుకున్నాడు.

ఆడవాళ్ళు అలగటం, మగవాళ్ళు బ్రతిమాలడటం జన్మ హక్కు కదా ?

"........"

ఇద్దరి మధ్య కొద్ది క్షణాలు నిశ్శబ్దం.

తరువాత శంకర్‌లాల్ అన్నాడు నెమ్మదిగా.

"సావిత్రీ!"

నాకు మనసులో ఒకటి పెట్టుకుని పైకి ఒకటి మాట్లాడటం చాతకాదు.

ఆ రోజు ట్రైను ఎక్కి లోపలికి వస్తున్నప్పుడు మొదటిసారిగా.... నిన్ను చూశాను.

నీ అందం ఆ క్షణంలోనే నా మనసులో ముద్రపడిపోయింది.

దానికి తోడు సికుగా నువ్వు నీ జాలి కథ నాకు చెప్పుకున్నావు. నా మనసు కరిగినట్లు అయిపోయింది.

ఇంతవరకు నా సంస్థలో "ఇన్‌స్ట్రెక్టస్"గా పనిచేసిన అమ్మాయి లందరూ గ్రాడ్యుయేట్లు. కాని నీవు మెట్రిక్యులేట్‌వి. రికార్డు ఆఫీసు వర్క్ అంతా సమర్థవంతంగా నిర్వహించగలవో లేదో అనికూడా ఆలోచించకుండా.,. కేవలం నీ మీద ఏర్పడిన అభిమానంతో నిన్ను ఆదుకోవాలని నిర్ణయించు కున్నాను.

ఇప్పుడు చెప్పు....

నువ్వు కాదంటే ఈ క్షణంలో వెళ్ళిపోతాను. కాని....

రేపే నీ స్థానంలో ఇంకొకర్ని నియమిస్తాను. నేను అక్కర్లేనపుడు నా ఫర్మ్‌లో ఉద్యోగం మాత్రం ఎందుకు?

బాగా ఆలోచించుకో ....

"........"

కొంచెం తీవ్రస్థాయికి వెడుతున్న గొంతుని అతి ప్రయత్నంతో స్వాంతనకి తెచ్చుకున్నాడు.

"..........." సావిత్రికి ఎటు చెప్పడానికి తోచలేదు. నిశ్శబ్దంగా వుండిపోయింది.

మళ్ళీ శంకరే అన్నాడు....

"సావిత్రీ! నీ గతం ఏమిటో నాకు తెలియదు. అనవసరం కూడా.

కాని నీతి నియమం కూడుపెడుతుందా చెప్పు ?

నువ్వు వయసులో వున్నావు. అందమైన దానివి. తోడు నీడ లేదు. రక్షణలేదు. సమాజం నిన్ను బ్రతకనిస్తుందా చెప్పు।

పోనీ....

నువ్వు కూలో నాలో చేసుకుని బ్రతికినా ఆ సంపాదన నీ తిండికే సరిపోదు.

రేపు నీ కూతురు పెద్దది అవుతుంది. పెళ్ళి పేరంటం వుంటాయి కదా?

అంత డబ్బు ఎక్కడ్నుంచి తెస్తావు? రోజులెపుడూ ఒకేలా ఉండవు. కీడెంచి మేలెంచమన్నారు.

ఈలోపు నీకేదన్నా జరిగిందే అనుకో.

అప్పుడు నీ కూతురు గతేమిటి?

ఇవన్నీ ఎప్పుడైనా నువ్వు ఆలోచించావా?

లేదు....

నేను ఇవన్నీ ఆలోచించి కేవలం నీమీద అభిమానంతో నీకు నా ఫర్మ్‌లో ఉద్యోగం ఇచ్చాను.

నెలకి ఆరువందలు జీతం ఇస్తాను.

నీ ఖర్చులు పోను ప్రతినెలా బ్యాంకులో డబ్బు దాచుకోవచ్చు. ఇంకా ఏదన్నా ఆదనంగా ఖర్చులు వస్తే నేను ఆదుకుంటాను.

మీ అమ్మాయిని బాగా చదివించాలని కదా నీ కోరిక.

అలాగే చేద్దువుగాని....

సిటీలో మంచి స్కూల్సు బోర్డింగ్సు ఉన్నాయి.

అక్కడ చేర్పిద్దాము. తొందర్లోనే ఆ ఏర్పాట్లు కూడా నేనే చూస్తాను.

ఇంత చేసినవాడ్ని నీ కూతురి పెళ్ళి పేరంటం మాత్రం చెయ్యలేనా చెప్పు!...."

శంకర్‌లాల్ హితవు చెప్తున్నాడు.

లోకరీతి వివరిస్తున్నాడు.

అవన్నీ సావిత్రికి తెలియనివి కాదు. కాస్త వినటానికి చేదుగావున్నా అతను చెప్పేదంతా నిజమే।

ఏమనగలదు?

నిశ్శబ్దంగా తల వంచుకుంది.

సావిత్రి కళ్ళనుంచి చుక్కలు చుక్కలుగా రాలిన కన్నీరు చెక్కిళ్ళపై ధారలు కట్టింది.

"చివరికి నా జీవితం ఇలాగ అయిపోయింది కదా ? ఇంత నీచస్థితికి దిగజారిపోయింది కదా" అన్న వేదనకి ప్రతిరూపమే ఆ కన్నీరు.

శంకర్‌లాల్ కుర్చీలోంచి లేచి సావిత్రి దగ్గరకి వచ్చి మృదువుగా ఆమె చెక్కిళ్ళపై జారుతున్న కన్నీరు తుడిచాడు.

"సావిత్రీ! ఎందుకు బాధపడతావ్ ? మారుతున్న పరిస్థితులతోపాటు మనమూ మారకతప్పదు...."

"........"

శంకర్‌లాల్ లైట్ స్విచ్ ఆర్పి తిరిగి సావిత్రి భుజంమీద చెయ్యి వేశాడు.

ఈసారి సావిత్రి ఆ చేతిని తొలగించలేదు.

సింహం గుహలో మేక నాట్యం ఆడగలదా?

కానీ-ఆమె గుండెల్లో మూగగా ఒక చిన్న ఆర్తనాదం....

"అయ్యో! ఊబిలో కూరుకుని పోతున్నాను. రక్షించండి...." అంటూ మూగగా అంతరాత్మ పిలుపు....

కానీ ఈ లోకంలో ఆడదాని 'ఘోష' పట్టించుకునే దెవరు ? డబ్బు పేదరికాన్ని జయించింది.

కాలం ఎంత మారినా దుర్మార్గం ఇంకా అలాగే వుంది.

కసాయి చేతిలో మేకపిల్ల....

వేద భూమిలో ఆడపిల్ల....

అయ్యో! !

ఆ మర్నాడు సావిత్రి నిద్ర లేచేసరికి బారెడు పొద్దు పొడిచింది.

కళ్ళు ఎర్రబారి చురచురా మండుతున్నాయి.

శంకర్‌లాల్ తెల్లవారుజామునే లేచి వెళ్ళిపొయ్యాడు.

సావిత్రి నిరాశక్తంగా ఇంటిపన్లు పూర్తిచేసింది.

స్నానంచేసి వంటచేస్తూ "స్టౌ"ముందు కూర్చుంది.మనసు మనసులో లేదు.

ఎదురుగా గోడకి పెద్ద కాళీమాత క్యాలండర్ తగిలించి వుంది.

ఆ బొమ్మలోకి చూస్తూ తదేక ధ్యానంగా వుండిపోయింది.

ఆమె మనసంతా ఒక విధమైన స్తబ్దత.

వైరాగ్యం....

చెట్టుకి పట్టిన బెరడు క్రమంగా ముదిరి పెళ్ళలు పెళ్ళలుగా విరిగి రాలినట్లు....

సావిత్రి మనసులోంచి భక్తిభావం రోజురోజుకి ఎండి రాలిపోతోంది.

క్యాలండర్‌లోని మహిషాసురమర్దని బొమ్మలోకి చూస్తుంటే చిత్రమైన అనుభూతి....

సుజాతకి చిత్రకళ అంటే—గొప్ప అభిమానం.

ఆ క్యాలండర్ ఎమ్.సి. వాళ్ళ డస్ట్‌బిన్ దగ్గర పడివుంటే దుమ్ము దులిపి ఇంటికి తీసుకువచ్చింది.

అన్నం మెతుకులు రాసి చిరిగినచోట చక్కగా అంటించింది.

గుడ్డతో శుభ్రంగా తుడిచి గోడకి అంటించింది.

అది "రవివర్మ" కళాఖండం.

చక్కని గ్లేసీ ప్రింటుమీద ఎంతో అందంగా వుంది.

కాగితం చిరిగినా రంగు చెక్కు చెదరలేదు.

అమ్మవారి ముఖం కళ కళలాడిపోతుంది. నుదుట పెద్ద బొట్టుతో రక్తం ఓడుతున్న ఎర్రని నాలుక చాచి, చేతులనిండా ఆయుధాలతో.... కధాకళి ఆడుతూ మహిషాసురుణ్ని వధిస్తున్న భంగిమలో కాస్త భయానకంగా.... చంటి పిల్లలు చూస్తే జడుసుకునేలా.... వుంది ఆ క్యాలండరు.

కానీ సావిత్రికి ఆ క్యాలండర్ లోకి చూస్తూంటే భయం వెయ్యడం లేదు.

స్త్రీ యొక్క విస్తృతమైన సౌందర్యం కనిపిస్తోంది.

ఆరాధన భావం జనిస్తోంది.

అలౌకికానందం కలుగుతోంది.

ఆ డస్ట్‌బిన్ లోంచి తెచ్చిన అమ్మవారి క్యాలండరుకి సావిత్రి ఎన్నో సార్లు కుంకుమ పూలు జల్లి పూజ చేసింది. హారతి పట్టింది.

నిజమే!!

ఒకోసారి తులసి మొక్క పెంట కుప్పలమీద మొలుస్తుంది. అంత మాత్రం చేత తులసి పవిత్రం కాదు అనగలమా?

ఏదైనా అంతే....

పవిత్రత....

అపవిత్రత మన భావనలోనే వున్నాయేమో....

సావిత్రి నెమ్మదిగా లేచి బుట్టనిండా పూలుకోసి తెచ్చింది.

కాళికా దేవి పటం ముందు కూర్చుని ప్రమిదలో దీపారాధన చేసింది.

పూలు అలంకరించింది.

చిన్న గిన్నెలో పాలు చక్కెర కలిపి అక్కడ పెట్టింది.

హారతి వెలిగించి రెండు చేతులూ జోడించింది.

కాళీమాత విశాలమైన పెద్ద కళ్ళల్లోకి మూగగా చూస్తూ అనుకుంది.

"తల్లీ! నేను పుట్టి బుద్ధి తెలిసినప్పట్నుంచి నీ పూజలు చేశాను గదా ?

మనసారా నిన్ను కొలిచాను కదా!

చివరికి ఇంత దారిద్ర్యంలో....ఇంత దిగజారిన స్థితిలో కూడా నిన్ను కొలుస్తున్నాను.

కానీ....

నువ్వు నాకు ఎలాంటి జీవితాన్ని వరంగా ప్రసాదించావు తల్లీ!

దయగల తల్లి వి.

నీ బిడ్డలమీద నీకు ఎంత కరుణ!!

నా మీద అక్రమంగా అత్యాచారం జరుగుతుంటే నా బ్రతుకు అన్యాయం అయిపోతుంటే.... దేవతగా.... సాటి స్త్రీగా నీ భక్తురాల్ని ఆదుకోదేం తలి!

అమ్మల గన్న యమ్మ, ముగురమ్మల మూలపుటమ్మా. చాలా పెద్దమ్మ దయాంబు రాసివి గదమ్మా.... ఇవన్నీ నీ బిరుదులే కదూ!

అసలు నువ్వు వున్నావా తల్లీ!

ఇప్పుడు ఈ సావిత్రి బురదలో పడ్డ పువ్వు....

కనీసం పసిడి మొగ్గలాంటి నా బిడ్డనయినా చల్లగా దయ చూడు తల్లీ ....?!

చెక్కిళ్ళమీద కన్నీరు వర్షిస్తుంటే సావిత్రి నిశ్శబ్దంగా పూజ ముగించింది.

"సాయిబాబా భజన మండలి" అని బయట పెద్ద బోర్డు తగిలిస్తారు.

కాని లోపల "బార్" నడుస్తుంది.

బయట "స్త్రీ సంక్షేమం" అని బోర్డు.

కాని లోపలంతా స్త్రీ సంక్షోభమే.

పైకి అది అతి పవిత్ర దేవాలయం.

లోపల మాత్రం జారులు-చోరులు ??

అనాథ హరిజన బాలికల పేరుతో నడిచే ఉచిత హాస్టల్సులో ఎంతో అవినీతి, ఎన్నో రకాల అక్రమాలు అరాచకాలు జరుగుతాయని పలురకాల కథలు వార్తలు వింది సావిత్రి.

కానీ—

కేవలం 'డెసెర్టెడ్' వుమెన్ సంక్షేమం కోసం స్థాపించిన శంకర్ లాల్ అండ్ సన్స్ డ్రస్‌ల్యాండ్‌కి వచ్చాక ఆ వార్తల్లోని నిజానిజాలు కళ్ళకు కట్టినట్టు కనిపించసాగాయి.

రోజులు గడుస్తున్న కొద్దీ ఆ సంస్థ ఎంత ఊబిగుంటో కూడా అర్థం కాసాగింది.

డబ్బు పలుకుబడి వుంటే ఎంత నీచపు పని అయినా నజావుగా సాగిపోతుందని అర్థం చేసుకుంది సావిత్రి.

శంకర్‌లాల్ వ్యాపారంలో కూడా ఎంతో అవినీతి వుంది.

అక్రమం వుంది. దోపిడీ వుంది.

ఆ సంస్థలో పనిచేసే వారందరూ కూడా ముప్పయి ఏళ్ళ లోపు స్త్రీలే !

ఆ స్త్రీలందరూ కూడా సావిత్రిలాగే ఏదో ఒకరకంగా జీవితంలో ఎదురు దెబ్బలు తిన్న పూర్ విక్టిమ్స్. ఎన్నో రకాలుగా నిస్సహాయులు.

భర్తృ విహీనులు, భర్తలచే త్యజింపబడిన వారూ, పెళ్ళి కాకుండా వయసు మించిపోతున్నవారు.... పతితలు.... పరాజితులు....

వాళ్ళకి ఆ డ్రెస్‌ల్యాండ్‌లో కుట్టుపనే జీవనాధారం.

శంకర్‌లాల్‌ని ఎదిరిస్తే ఆ కాస్త బ్రతుకుతెరువుకూడా పోతుంది.

అందుకే ఇష్టం వున్నా లేకపోయినా తలలు వంచుకున్నారు.

అక్కడే కాదు. నిస్సహాయ స్థితిలో స్త్రీ ఎక్కడికి వెళ్ళినా అదే పరిస్థితి.

కాలం మారింది.

"చట్టం" స్త్రీల కోసం ఎన్నో సవరణలు సదుపాయాలు చేసింది.

కాని స్త్రీల దుస్థితి ఏం మారింది.

అసలు సమస్య అలాగే వుంది.

స్త్రీలపై మగవాడి దుర్మార్గం, దురహంకారం కూడా అలాగే వున్నాయి.

ఆడదాని కన్నీరు అలానే వుంది.

లేకపోతే -

ఈ నవీన నాగరిక యుగంలో కూడా ఈ రేపింగ్స్ ఏమిటి!

వరకట్నపు సజీవ దహనాలు ఏమిటి !

ఎందరో విద్యావంతులు ఉద్యోగినులు అయిన స్త్రీలు సహితం అధికారుల అత్యాచారాలు భరించలేక ఆత్మహత్యలు చేసుకుంటున్నారు.

కుష్టు, క్షయ, కేన్సర్.... సమాజంలో భయంకరమైన వ్యాధులు.

కానీ ఈనాడు అంతకంటే భయంకరమైన వ్యాధి ఈ సెక్స్ ఎక్స్ప్లాయిటేషన్.

స్త్రీ జాతి వినాశనానికి కారణం మగవాడిలోని ఈ భయంకరమైన

ఈ జబ్బు రూపుమాసే వరకూ స్త్రీజాతికి విముక్తిలేదు.

అంతవరకూ ఎందరో అబలలు ఏదో ఒక రకంగా ఆహుతి అవుతూనే వుంటారు....

రాత్రిళ్ళు సావిత్రికి నిద్రపట్టేది కాదు.

ఆలోచిస్తుంటే మనసంతా అల్లకల్లోలం అయిపొయ్యేది.

మంచంలో పడుకుని నిశ్శబ్దంగా అలా చీకట్లోకి చూస్తూ వుండిపోయేది.

సాలెగూట్లో చిక్కిన పురుగులా అనిపించేది జీవితం రోజులు గడుస్తున్న కొద్దీ....శంకర్‌లాల్ వ్యాపారంలోని లొసుగులు....అవినీతి....తెలుస్తున్న కొద్దీ సావిత్రి గుండెల్లో కొత్త భయాలు చోటు చేసుకోసాగాయ్.

గోతుల్లోంచి లేచి నూతుల్లో పడినట్లుగా వుంది పరిస్థితి.

పోనీ అక్కడ్నుంచి వెళ్ళిపోదామా అనుకుంది చాలాసార్లు.

కానీ ఎక్కడికి పోగలదు?

ఎక్కడికి వెళ్ళినా ఏదో ఒక సమస్య. విషమ పరిస్థితి ఎదురవుతుంది.

ఒంటరి తనం....

బ్రతుకు భయం....

o....

ఈ పరిస్థితుల్లో ఆ కాస్త నీడా కూడా పోగొట్టుకొని ఎక్కడికి పోగల్దు.

ఈ పరిస్థితుల్లో పాపకూపం అయినా, శ్మశానాల దగ్గర వున్న ఆ ఉద్యోగం....ఆ ఇల్లే కాస్త నయంగా అనిపిస్తూంది.

తన కోసం కాకపోయినా సుజాత కోసం అయినా తను బ్రతకాలి కదా! అనుకుంది.

అందుకే తనని తను ఓదార్చుకుంది. రోడ్డున పడి అడుక్కోనక్కర్లేదు.

రౌడీల బెదరింపులు, ఇరుగు పొరుగు అమ్మలక్కల పోరు లేదు. ఆర్థికంగా కూడా బాగానే వుంది.

"పోనీ....ఈ విధంగానైనా జీవితం గడిచిపోతే అంతే చాలు. భగవంతుడు కరుణించినట్టే...." అనుకుని తృప్తిపడింది.

పూరి గుడిసెల్లో వుండేవాడు "మిద్దె" యింట్లో ఉండాలని ఆశిస్తాడు.

"మిద్దె"లో వుండేవాడు మేడకోసం కలవరిస్తాడు.

మేడల్లో వుండేవాడు అంతస్తులపై అంతస్తులతో ఆకాశహర్మ్యాలు నిర్మించాలని తపిస్తాడు.

ఇది మానవనైజం.

ఈ లోకంలో గంజినీళ్ళు తాగుతూ చెట్టుకింద నివశిస్తూ తృప్తిపడే వాళ్ళూ వున్నారు.

పంచభక్ష్యాలు తిని మెత్తటి పరుపుల్లో నిద్రలేమితో అశాంతితో పొర్లేవారూ వున్నారు.

ఒకప్పుడు సావిత్రి అంధమైన భవనంలో ఎంతో ఆనందంగా బ్రతికింది.

కానీ ఇప్పుడు ఊరి చివర ఆ శ్మశానాలకి దగ్గరగా వున్న ఇంట్లో అయినా కాస్త నిలకడగా బ్రతగ్గలిగితే చాలు....అని ఆశ పడుతోంది.

"పరిస్థితులు మనిషిని ఎట్లా మారుస్తాయి! ఎట్లా తలవంచేలా చేస్తాయి!" అనటానికి ఇంతకంటే వేరే నిదర్శనం ఏం కావాలి!

జరిగినది....జరుగుతున్నది తల్చుకుంటే ఒకోసారి సావిత్రికి ఎంతో విచిత్రం అనిపిస్తుంది.

వేదన రగులుతుంది.

ఏమిటి తన జీవితం.

ఎందుకిలాగా అయ్యింది ?

రేపు ఏమిటి ?

ఇలా ఎన్నాళ్ళు ?

ఈ సమాజం తనని ఎప్పటికి గౌరవంగా చూస్తుంది ?

తన చిన్నారి సుజాత జీవితానికి ఒక రక్షణ ఏర్పడుతుందా ?

లేక.... తనలాగే....

రాత్రిళ్ళు పడుకుంటే సావిత్రికి నిద్రపట్టేది కాదు.

ఊరు చివర ప్రదేశం కావడంతో సాయంత్రం అయ్యేసరికి గాలి విసురు ధారాళంగా వుండేది.

జువ్వి చెట్టుమీదగా గాలి వీచినపుడు వింత వింత వూళలు వీచేవి.

ఎంత గుండె నిబ్బరం తెచ్చుకున్నా సావిత్రికి భయంతో నుదురంతా చిరు చెమటలు క్రమ్మేవి.

అరచేతులూ కాళ్ళూ చల్లబడేవి.

తుఫానులో ఆకులా శరీరం కంపించిపోయేది.

ఊరు చివర....

ఒకప్రక్క జీదురుమనే పంటచేలు. మరొకప్రక్క సరుగుడు తోటల మీదుగా స్మశానవాటిక.

పగలూ అదే వాతావరణం.

కానీ రాత్రిళ్ళు....నీరవ నిశ్శబ్దంలో ఆ వాతావరణం ఆమెని భయ భ్రాంతను చేసేది.

శరీరంలోని రక్తం అంతా గడ్డ కట్టినట్లు అయ్యేది.

దానికితోడు మనసంతా అశాంతి.

అలా ఎంతోసేపు నిద్రలేమితో, మంచంలో అటు ఇటు కదిలేది.

దూరంగా టౌనులో "ఠంగ్.... ఠంగ్ ..."మని పన్నెండు గంటలు వినిపిస్తుంటే ఇసుక గుప్పించినట్లు సావిత్రి కనురెప్పలు బరువుతో మూతలు పడేవి.

ఒకోసారి....

ఆపాటి అదృష్టం కూడా లేకుండా దూరంగా సన్నగా ఏడుపులు.... నక్కల్ని అదిలించే కాటికాపరి అరుపులు వినిపించేవి.

శ్మశానంలోంచి "శవం" కాలుతున్న కవురు వాసన గాలిలో నిండేది.

సావిత్రి నెమ్మదిగా లేచి కిటికి తలుపులు తెరిచి చూస్తే దూరంగా నల్లని చీకట్లో....సన్నగా....ఎర్రగా మంటలు కనిపించేవి.

ఆ మంటల వెలుగుల్లో తోకలు ఆడిస్తూ నక్కలు....

సావిత్రి ఒళ్ళు "ఝల్లు" మనేది.

నిద్రరాని కళ్ళతో, స్థంభించిన హృదయంతో, అలాగే .. ఆ సన్నని ఏడుపులు.... వింటూ దూరంగా చీకట్లో కనిపించే ఆ ఎర్రని మంటల్ని చూస్తూ, శవం కాలుతున్న కవురు వాసనలు పీలుస్తూ కిటికీ రెక్కకి తలఆన్చి గంటలు గంటలు శిలలా అచేతనంగా వుండిపొయ్యేది.

మెదడంతా స్థభించి పోతున్నట్లు....

రక్తం గడ్డ కడుతున్నట్లు....

ఆమెలో ఒక విధమైన జడత్వం.

పంచభక్ష్యాలు తిని మెత్తటి పరుపుల్లో నిద్రలేమితో అశాంతితో పొర్లేవారూ వున్నారు.

ఒకప్పుడు సావిత్రి అందమైన భవనంలో ఎంతో ఆనందంగా బ్రతికింది.

కానీ ఇప్పుడు ఊరి చివర ఆ శ్మశానాలకి దగ్గరగా వున్న ఇంట్లో అయినా కాస్త నిలకడగా బ్రతగ్గలిగితే చాలు....అని ఆశ పడుతోంది.

"పరిస్థితులు మనిషిని ఎట్లా మారుస్తాయి! ఎట్లా తలవంచేలా చేస్తాయి!" అనటానికి ఇంతకంటే వేరే నిదర్శనం ఏం కావాలి!

జరిగినది....జరుగుతున్నది తల్చుకుంటే ఒకోసారి సావిత్రికి ఎంతో విచిత్రం అనిపిస్తుంది.

వేదన రగులుతుంది.

ఏమిటి తన జీవితం.

ఎందుకిలాగా అయ్యింది ?

రేపు ఏమిటి ?

ఇలా ఎన్నాళ్ళు ?

ఈ సమాజం తనని ఎప్పటికి గౌరవంగా చూస్తుంది ?

తన చిన్నారి సుజాత జీవితానికి ఒక రక్షణ ఏర్పడుతుందా ?

లేక.... తనలాగే....

రాత్రిళ్ళు పడుకుంటే సావిత్రికి నిద్రపట్టేది కాదు.

ఊరు చివర ప్రదేశం కావడంతో సాయంత్రం అయ్యేసరికి గాలి విసురు ధారాళంగా వుండేది.

జువ్వి చెట్టుమీదగా గాలి వీచినపుడు వింత వింత వూళలు వీచేవి.

ఎంత గుండె నిబ్బరం తెచ్చుకున్నా సావిత్రికి భయంతో నుదురంతా చిరు చెమటలు క్రమ్మేవి.

అరచేతులూ కాళ్ళూ చల్లబడేవి.

తుఫానులో ఆకులా శరీరం కంపించిపోయేది.

ఊరు చివర....

ఒకప్రక్క జీదురుమనే పంటచేలు, మరొకప్రక్క సరుగుడు తోటల మీదుగా స్మశానవాటిక.

పగలూ అదే వాతావరణం.

కానీ రాత్రిళ్ళు....నీరవ నిశ్శబ్దంలో ఆ వాతావరణం ఆమెని భయ భ్రాంతను చేసేది.

శరీరంలోని రక్తం అంతా గడ్డ కట్టినట్లు అయ్యేది.

దానికితోడు మనసంతా అశాంతి.

అలా ఎంతోసేపు నిద్రలేమితో, మంచంలో అటు ఇటు కదిలేది.

దూరంగా ఠాణాలో "ఠంగ్.... ఠంగ్ ..."మని పన్నెండు గంటలు వినిపిస్తుంటే ఇసుక గుప్పించినట్లు సావిత్రి కనురెప్పలు బరువుతో మూతలు పడేవి.

ఒకోసారి....

ఆపాటి అదృష్టం కూడా లేకుండా దూరంగా సన్నగా ఏడుపులు.... నక్కల్ని అదిలించే కాటికాపరి అరుపులు వినిపించేవి.

శ్మశానంలోంచి "శవం" కాలుతున్న కవురు వాసన గాలిలో నిండేది.

సావిత్రి నెమ్మదిగా లేచి కిటికి తలుపులు తెరిచి చూస్తే దూరంగా నల్లని చీకట్లో....సన్నగా....ఎర్రగా మంటలు కనిపించేవి.

ఆ మంటల వెలుగుల్లో తోకలు ఆడిస్తూ నక్కలు....

సావిత్రి ఒళ్ళు "ఝల్లు" మనేది.

నిద్రరాని కళ్ళతో, స్థంభించిన హృదయంతో, అలాగే .. ఆ సన్నని ఏడ్పులు.... వింటూ దూరంగా చీకట్లో కనిపించే ఆ ఎర్రని మంటల్ని చూస్తూ, శవం కాలుతున్న కవురు వాసనలు పీలుస్తూ కిటికీ రెక్కకి తలఆన్చి గంటలు గంటలు శిలలా అచేతనంగా వుండిపొయ్యేది.

మెదడంతా స్థభించి పోతున్నట్లు....

రక్తం గడ్డ కడుతున్నట్లు....

ఆమెలో ఒక విధమైన జడత్వం.

అటువంటి నైరాశ్యం లోనే ఆమెలో ఎన్నోసార్లు ఒకేఒక్క ప్రశ్న మాటిమాటికి తల ఎత్తేది.

ఏమిటీ జీవితం—?

ఎందుకిలాంటి సృష్టి?

మనిషికి...

చావు....

పుట్టుక

అసలు....

ఎందుకు!

సావిత్రిలో వేదాంతం.

అసలు తరచి చూస్తే ఈ జీవితమే ఒక పెద్ద ఫిలసాఫికల్ మ్యూజింగ్.

అందులో ప్రతి ఒక్కడూ ఎదో ఒక రకంగా సోషల్ ఫిలాసఫర్.

కొందరు ప్రేమ గురించి

ఇంకొందరు డబ్బు గురించి

మరి కొందరు సుఖాల గురించి, స్త్రీ గురించి సెక్సు గురించి, ఇలా ఎవర్ని కదిపినా ఏదో ఓకదాని గురించి వేదాంతం చెప్తారు.

మరి వీళ్ళంతా తింటం లేదా పండటం లేదా? అంటే అంతా తింటారు పంటారు.

మళ్ళీ ఈ వేదాంతం ఏమిటయ్యా అంటే అదే జీవితం.

* * *

సావిత్రి ఆ డ్రస్ ల్యాండ్‌కి వచ్చి మూడు నెల్లు గిర్రున తిరిగాయి.

ఒక్క అందచందాల విషయంలోనేగాక మిగత అన్నివిధాల సావిత్రి తనమనసుకి నచ్చిన విధంగా అనుకూలంగా వుండటంతో శంకర్‌లాల్‌కి ఆమెపై చాలా నమ్మకం ఏర్పడింది.

అందుకే నెలకి ఆరువందల జీతంలో తనఫర్మ్‌లో ఆమెని "ఇన్‌స్ట్రక్టర్"గా అపాయింట్ చేసుకున్నాడు.

ఆఫీసు తాళాలు, ఫర్మ్ బాధ్యత మొత్తం ఆమెకి అప్పగించాడు.

నూలు తెగిన గాలిపటంలా ఏ ఆలంబన లేకుండా తిరుగుతున్న తన జీవితానికి అనూహ్యంగా అంత చక్కని ఆధారం ఒక బలమైన జీవనోపాధి దొరకటంతో సావిత్రికి ఎంతో సంతృప్తి అనిపించింది.

శంకర్‌లాల్‌పట్ల కృతజ్ఞతతో మనసంతా నిండిపోయింది.

రోజులు ఆ విధంగా గడిచిపోయినా చాలు అనుకుంది.

అయితే అక్కడ సావిత్రికి నచ్చని విషయాలు ఎంతో అవినీతి కూడా పేరుకుని పోయ్యాయి.

ట్రైనీస్‌కోసం వచ్చిన ఫండ్స్ అన్నీ శంకర్‌లాల్ జేబుల్లోకి వెళ్ళి పోతాయి. గవర్నమెంటు శాంక్షన్స్‌గాని, ఒ. పి., ఎ. సి. సంస్థ అందించే నిధులు, సహాయాలుగాని, ఏవీ అక్కడ పనిచేసే వర్కర్స్‌కి అంద నివ్వడు. అన్నీ తన గల్లా పెట్టెలో వేసుకుంటాడు.

తన ఫర్మ్‌లో పనిచేసే వాళ్ళందరికి నెలనెలా జీతాలు మాత్రం సక్రమంగా ఇస్తాడు. కాని వాళ్ళచేత రెట్టింపు కష్టం చేయించుకుంటాడు.

ఇచ్చే జీతానికి రెట్టింపు అమౌంటు రిజిస్టరులో వేసి సంతకాలు పెట్టించుకుంటాడు.

"అయ్యో? ఆడవాళ్ళు కదా?" అని జాలి తలచడు.

అన్నిటికంటే తన వ్యాపారం, తన లాభాలే ప్రధానం.

ఆ శంకర్‌లాల్ అరాచకం అక్కడితో ఆగినా సావిత్రి అంతగా బాధ పడకపోను.

కాని ఊళ్ళోకి ఎవరైనా ప్రముఖులు దిగితే వాళ్ళకి ఘనంగా సత్కారాలుచేసి వాళ్ళని మెప్పించడంకోసం తన సంస్థలో పనిచేసే అమ్మా యిల్ని ఎరగా ఉపయోగించేవాడు.

ఆ విధంగా అన్నివిధాల పై అధికారుల్ని అన్ని రకాలుగా సంతృప్తుల్ని చేసి వాళ్ళ పలుకుబడితో తనకి కావలసిన పన్లు అన్ని చేయించు కుని లాభాలు పొందేవాడు. వ్యాపారం డెవలప్ చేసుకునేవాడు.

అక్కడ పనిచేసే స్త్రీ లందరిది చాలా తక్కువ విద్యాస్థాయి. పూట

గడవని పేదరికం. "నా" అనుకుందుకు సరిఅయిన అండదండలు లేని నిస్సహాయత.

అందుకే శంకర్‌లాల్‌ని ఎదిరించే సాహసం ఎవ్వరూ చెయ్యలేక పొయ్యారు.

ఆ పాటి జీవనాదారం కూడా పోగొట్టుకోవటం ఇష్టంలేక అన్నిరకాల అరాచకాలు నిశ్శబ్దంగా భరించటం నేర్చుకున్నారు.

స్త్రీ ఎన్నిరకాలుగ సమాజంలో దోపిడికి "గురి" అవుతుందో అక్కడికి వచ్చాక సావిత్రి కళ్ళకి కట్టినట్లు కనిపించసాగింది.

ఎందరు స్త్రీలు ఎన్ని రకాలుగ "బలి" అవుతున్నారో .... ప్రత్యక్ష సాక్ష్యాలతో తెల్సివచ్చింది.

సావిత్రి కడుపంతా రగిలినట్లు అయ్యేది.

తను ఎలాంటి చోటికి వచ్చిందో .... తన బ్రతుకు సాలెగూట్లో చిక్కిన పురుగులా ఎలా చిక్కుకుని పోయిందో క్రమంగా అర్థం కాసాగింది.

కప్పని పాము మింగేసినట్లు ఆడదాన్ని మగాడు మింగేస్తున్నాడు.

పోనీ అక్కడ్నుంచి వెళ్ళిపోదామన్నా ఎక్కడికి పోగలదు?

ఎక్కడికి వెళ్ళినా అదే పరిస్థితి కదా?

ఇప్పటికి జరిగిన చేదు అనుభవాలు తనకి అదే చెప్పాయి.

స్త్రీ ఎక్కడ ఒంటరిగా వుంటుందో .... ఎక్కడ నిస్సహాయంగా వుంటుందో అక్కడ రొచ్చు వుంటుంది. అవినీతి వుంటుంది.

ఇప్పుడు తను నిస్సహాయ, ఒంటరి.

ఈ స్థితిలో ఎక్కడికి వెళ్ళినా తన గతి ఇంతేకదా?

రాత్రిళ్ల పడుకుంటె నిద్ర పట్టేదికాదు సావిత్రికి.

మనసంతా ఆందోళన చెలరేగేది.

అయినా సరే మనసు రాయి చేసుకుని బ్రతకటానికి నిర్ణయించు కుంది.

ఇప్పుడు సావిత్రికి తన గురించి దిగుల్లేదు. తను ఏమయిపోయినా ఫరవాలేదు.

సుజాత బంగారు భవిష్యత్తు ఆమెకి ముఖ్యం. "ఇన్‌స్పెక్టర్"గ ఉద్యోగం ఖాయం అయి జీతం చేతికి రాగానే సావిత్రి చేసిన మొదటి పని సుజాతని దగ్గరవున్న సిటీలో మిషనరీ స్కూల్లో చేర్పించింది.

వాళ్ళ తరఫున నిర్వహించబడుతున్న హాస్టల్‌లో పెట్టింది.

ఆ ఏర్పాట్లన్నీ కూడా శంకర్‌లాల్ స్వయంగా చూశాడు.

దాంతో సావిత్రి మనసుకి ఎంతో ప్రశాంతత చేకూరింది.

తన బ్రతుకు ఎలాగూ నూలు తెగిన గాలిపటం అయ్యింది.

కాని తన కూతురు జీవితం అలా కాకూడదు.

పచ్చని సంసార జీవితంతో పిల్లా పాపలతో అది కలకల్లాడాలి.

పతితగా పరాజితగా వ్రేలెత్తి చూపిన ఈ సమాజం తన కూతుర్ని చూసి ఈర్ష్య పడాలి.

అప్పుడే తన ఈ మోడు బ్రతుకూ సార్థకత అనుకుంది సావిత్రి.

ఆ ఆశతోనే శంకర్‌లాల్ అభిమానాన్ని పొంది ఆ ఉద్యోగంలో నిలద్రొక్కుకోవాలని నిశ్చయించుకుంది.

శంకర్‌లాల్ నెలలో ఒక వారం అంతా "ఫర్మ్"లో వుండి అక్కడి వ్యాపార వ్యవహారాలు స్వయంగా దగ్గరుండి చూసుకునేవారు.

సావిత్రి చేస్తున్న ఆఫీసు వర్క్, రికార్డు మెయిన్‌టెన్స్ అన్నీ జాగ్రత్తగా పరిశీలించేవాడు.

ఎక్కడైనా లోపాలు కనిపిస్తే సరిదిద్ది దగ్గరుండి వర్క్ చెయ్యాల్సిన పద్ధతి, ప్రొసీజర్ అంత వివరంగా బోధించేవాడు.

దాంతో సావిత్రికి ఏ విధమైన కష్టం అనిపించేదికాదు.

ఆమెకి మొదట్నుంచి కుట్టుపన్ల పట్ల వున్న ఆసక్తివల్ల స్వయంగా అవన్నీ నిర్వహించేది.

కేవలం జీతంకోసం అన్నట్లుకాక ఎంతో వుత్సాహంతో ఆ పన్లు అన్నీ శ్రద్ధగా చేసేది.

సావిత్రి వచ్చాక తిరిగి మునుపటి చైతన్యం వుత్సాహంతో ఆ సంస్థ కళకళలాడసాగింది.

కాలగర్భంలో ఆరునెల్లు గిర్రున తిరిగాయి.

○ ○ ○

ఆ రోజు ఉదయం తొమ్మిది గంటలు కావస్తోంది.

సావిత్రి ఇంటిపని ముగించుకుని ఆఫీసులోకి వచ్చి కూర్చుంది.

అంతకు ముందురోజు పోస్టులో మార్కెట్‌లో ఉత్పత్తి చెయ్య వలసిన గార్‌మెంట్సు గురించి లేటెస్టు మాడల్సుతో రకరకాల కేటలాగులూ వచ్చాయి.

ఆ బుక్‌పోస్టులన్నీ ఓపెన్‌చేసి ఆ కేటలాగులు చూస్తూ కూర్చుంది సావిత్రి.

అప్పటికే కొంతమంది అమ్మాయిలు మిషన్లమీద వర్క్ చేస్తున్నారు.

సరిగా ఆ సమయంలో ఇంటిముందు -

జీపు ఆగింది.

గవర్నమెంటు అధికారులు సర్‌ప్రైజ్ చెకింగ్‌కి వచ్చారు.

డి. పి. ఎ. సి. వెల్‌ఫేర్ అధికారులు ఇచ్చిన ఫండ్స్, గ్రాంట్సు... "మిస్‌యూజ్" అవుతున్నాయని రిపోర్ట్సు వెళ్ళాయిట?

అందుకని సర్‌ప్రైజ్ చెకింగ్‌కి వచ్చారు.

ఈ వార్త వింటూనే సావిత్రి దిగ్భ్రాంతి అయింది.

శరీరం సన్నగా కంపించటం మొదలు పెట్టింది.

ఒక్కక్షణం ఏం చెయ్యాలో ఎటూ పాలుపోలేదు.

అలాంటి సందర్భాలని ఆ నోట ఈనోట వినటమేగాని అంతవరకు అనుభవంలేదు.

వాళ్ళని ఆఫీసు రూమ్‌లో కూర్చోపెట్టి లోపలికి వచ్చింది.

ట్రంక్‌కాల్‌చేసి పిలిపిద్దామన్నా శంకర్‌లాల్ వూళ్ళోలేడు. టూర్ ప్రోగ్రాంలో వున్నాడు. పైగా ఫోను అధికారులు కూర్చున్న ఆఫీసు రూమ్‌లోనే వుంది.

సావిత్రికి అయోమయంగా అనిపించింది.

అక్కడ పనిచేసే స్త్రీ అందరూ సావిత్రికి అనుకూలంగానే సహకరిస్తారు.

కాని రికార్డ్సు సబ్‌మిట్ చెయ్యాలి. మాటలు పని చెయ్యవు.

శాశ్వతంగా మూతపడుతుందనుకున్న శంకర్‌లాల్ డ్రెస్‌లాండ్ తిరిగి ఓపెన్ అవటమే కాక తిరిగి మంచి లాభాలతో పని చెయటంతో శంకర్‌లాల్ విరోధులు కొందరు శంకర్‌లాల్ డ్రెస్ ల్యాండ్‌లో అవినీతి నడుస్తోందని, ఫండ్స్ "మిస్‌యుజ్" అయ్యాయని రిపోర్ట్సు పంపారు.

దాంతో సర్‌ప్రైజ్ చెకింగ్‌కి దిగారు అధికారులు.

నిజానికి రిపోర్ట్సులోవున్న అంశాలన్నీ చాలావరకు నిజమే.

డి.సి.ఎ.పి సంస్థలు, ఇండస్ట్రీస్ ఆఫీసులు రిలీజ్ చేస్తున్న నిధులు. గ్రాంట్సు, సబ్సిడీ సదుపాయాలు....ఇలాంటి వేమీ ప్రొడక్షన్ యునిట్‌కి అందటం లేదు.

కాని ఆ విషయం బయటకి వస్తే తక్షణం గ్రాంట్సు ఆగిపోతాయి.

ఆ సంస్థ కొంతకాలం మూతపడుతుంది.

దాంతో పాటే తమ బ్రతుకులు మూతపడతాయి.

అందాక సావిత్రి ధైర్యం తెచ్చుకుంది.

కొంచెం సేపు స్టాఫ్‌తో అదే విషయం చర్చించి తరువాత ధైర్యం తెచ్చుకుని ఆఫీసు రూములోకి వచ్చింది.

ఓనర్ టూర్‌మీద వున్నాడని, తను ఆరునెల్ల క్రితం అక్కడికి కొత్తగా ఉద్యోగానికి వచ్చానని, తను ఎక్కువగా చదువుకోలేదని ఒక్క రోజు అవకాశం ఇప్పిస్తే మర్నాటికల్లా రికార్డ్సు అన్నీ తీసి చూపిస్తానని రిక్వెస్టు చేసింది.

కాస్త పల్లెటూరి వాటంతో అమాయకంగా వున్న సావిత్రి ఒక్కరోజులో రికార్డ్సు తారుమారు చెయ్యగలదన్న ఆలోచన వాళ్ళకి రాలేదు.

మర్నాడు ఉదయానే వస్తామని, రికార్డ్సు అన్నీ సబ్‌మిట్ చెయ్యాలని చెప్పి అధికారులు వెళ్ళిపోయ్యారు.

సావిత్రికి పోయిన ఊపిరి తిరిగి వచ్చినట్లు అయ్యింది.

ఆ సంస్థలో ఎన్నో అవకతవకలున్న మాట నిజమే.

కాని సెంటర్ మూత పడితే తమకి ఆ కాస్త జీవనాధారం కూడా పోతుంది.

అందుకే ఎవర్నీ వ్యతిరేకంగా జవాబులు చెప్పవద్దని శంకర్‌లాల్‌కి అనుకూలంగానే అధికారుల ముందు ప్రవర్తించాలని యూనిట్‌కి వచ్చ చెప్పింది.

యూనిట్‌తో కల్సి ఆ రాత్రంతా పనిచేసింది.

ఇరవై మంది అమ్మాయిలకి వందరూపాయిల చప్పున స్టయిఫండ్ ఇస్తున్నట్లు "ఎక్విటెన్సు" రాసింది.

స్టాఫ్ అందరిచేత సంతకాలు తీసుకుంది.

తను నెలనెలా ఆరు వందల జీతం తీసుకుంటున్నట్లు రిజిస్టర్‌లో వ్రాసి సంతకాలు చేసింది.

పాత రికార్డ్సు కూడా బయటికి తీసి అవసరం అయినంత వరకూ నకళ్ళు తయారు చేసింది.

తెల్లవారే సరికి ముఖ్యమైన రికార్డులు, సిలబస్ అటెండన్సు రిజిస్టర్ ప్రొడ్యూస్ చేసింది.

ఆ మర్నాడు ఉదయమే అధికారులు వచ్చారు.

సావిత్రి సబ్‌మిట్ చేసిన రికార్డ్సు చూసి కొంత వరకూ సంతృప్తి పడ్డారు.

ఆ సంస్థ యూనిట్‌లో కూడా ఎవ్వరూ తమకి అందిన రిపోర్ట్సుకి అనుగుణంగా చెప్పకపోవటంతో గిట్టని వాళ్ళు చేసిన పని అని అధికారులు నిర్ణయించుకున్నారు.

ప్రొడక్షన్ యూనిట్‌లో ఐక్యత, మాడరన్ నిట్టింగ్ పనితనం, అంతా చూసి సంతృప్తి చెంది మంచి రిపోర్ట్సు వ్రాసి వెళ్ళారు.

పైగా అక్కడ స్టాఫ్ అంతా స్త్రీలు పెద్దగా డిగ్రీల లెవెల్ చదువు కోలేదు. అటువంటి వాళ్ళు ఒక్క రాత్రిలో రికార్డ్సు విషయంలో లోపాయి కారితనం చేస్తారని అనుకోలేదు.

కాని యూనివర్సిటీల చదువు కంటే 'అనుభవం' నేర్పే జీవిత పాఠాలు గొప్పవన్న విషయం ఎందరికి తెల్సు!

సావిత్రి, తదితర యూనిట్ అంతా కల్సి చెకింగ్ అయిన తరువాత అధికారులకి మంచి మర్యాద చేశారు. వున్నంతలో చక్కని తేనీటి విందు ఇచ్చారు.

దాంతో అధికారులు సంతృప్తి చెందారు పైగా మేనేజర్ శంకర్‌లాల్ వూళ్ళో లేడు. ఆయన ఎదురుగా వుంటే భయపడ్డాడు అనుకోవచ్చు.

కాని....ఓనరు వూళ్ళో లేడు.

తమకి రిపోర్టులో అందినట్లు ఆ సంస్థలో పనిచేసే సిబ్బందికి ఏమైనా లోటుపాట్లు ఇబ్బందులు వుంటే పై అధికారులకి చెప్పుకుందుకు అంతకంటే మంచి అవకాశం వేరే ఏం వుంటుంది!

కాని అక్కడ పనిచేస్తున్న ఆడవాళ్ళంతా ఓనరు పట్ల, ఆ సంస్థ పట్ల సదభిప్రాయాల్ని వ్యక్తం చేస్తున్నారు.

దాంతో ఆ ఫర్మ్ పట్ల అది పనిచేసే విధానాల పట్ల అధికారులకి సంతృప్తి గొప్ప నమ్మకం ఏర్పడ్డాయి.

దాంతో—ఫండ్స్ అన్నీ సద్వినియోగం అవుతున్నట్లు డిసర్టెడ్ వుమన్ సంక్షేమంతో పాటు వాళ్ళకి చక్కని జీవనోపాధి లభించిందని, ఆ సంస్థ తరపున ఆకర్షణీయమైన మంచి మంచి దుస్తులు వుత్పత్తి అవుతున్నాయని అధికారులు సదభిప్రాయాల్ని వ్యక్తం చేస్తూ గూడా రిపోర్టు వ్రాసి వెళ్ళారు.

జీపు కనుమరుగు అవుతుంటే "గండం గడిచిందిరా భగవంతుడా!" అని గుండెల మీద చెయ్యి వేసుకుని తేలిగ్గా వూపిరి పీల్చుకుంది సావిత్రి.

ఆ రాత్రి........చొక్కా తెగి పడినట్లు శంకర్‌లాల్ వూర్నించి వచ్చాడు.

అంతకుముందే రెండుసార్లు శంకర్‌లాల్ ఫోను కోసం ట్రై చేసింది సావిత్రి.

కాని అతను ఫోనులో దొరకలేదు.

ఆ రోజు సాయంత్రం పొద్దునాటారుతుంటే హడావుడిగా గేటు ముందు టాక్సీ దిగాడు.

తన "ఫర్మ్"పై గవర్నమెంటు అధికారులు సర్‌ప్రైజ్ చెకింగ్ జరిపారన్న వార్త ఆరోజు ఉదయమే శంకర్‌లాల్‌కి ఒక ప్రాణ స్నేహితుడి ద్వారా తెల్సింది.

గుండెల్లోంచి వణుకు వచ్చింది.

వెంటనే టూర్ ప్రోగ్రాం క్యాన్సిల్ చేసుకుని బయలుదేరాడు.

నిజానికి శంకర్‌లాల్‌కి గత రెండు రోజులుగా ఒంట్లో నలతగా వుంది. ఫ్లూ జ్వరం తగిలి ఒంటి నొప్పులతో బాధపడుతున్నాడు.

ఒక రోజంతా బయటికి వెళ్ళకుండా హోటల్ రూమ్‌లోనే వుండి పోయ్యాడు.

అసలు తిరుగు ప్రయాణం అయి ఇంటికి వెళ్ళిపోదామా అనుకుంటున్న సమయంలో తన సంస్థపై అధికారులు చెకింగ్ జరిపారన్న వార్త అశని పాతంలా వినిపించింది.

పిడుగు దెబ్బ తిన్నట్లు కృంగిపొయ్యాడు.

సావిత్రి, తక్కిన వర్కర్సు కూడా ఎక్కువగా చదువుకోలేదు.

అతని సంస్థలో లోపాలు, అవినీతి, ఎన్నో అతకతవకలు వున్న మాట నిజమే.

అయితే ఇన్నాళ్ళూ అధికారుల్ని మంచి చేసుకుని లోపాలు కప్పి పెట్టుకుని లాభాలు సంపాదిస్తున్నాడు.

కొన్నాళ్ళ నష్టంతో కుంటి నడకలు నడిచిన సావిత్రి వచ్చాక వాణ్ళ మునుపటి పద్ధతిలో లాభసాటిగా తళతళ లాడుతూంది.

ఆ సంస్థమీద తను ఎన్నో ఆశలు పెట్టుకున్నాడు. అలాంటి పరిస్థితిలో అధికారులు దాడి ఏమిటి!

శంకర్‌లాల్‌కి మతి పోయినట్టయ్యింది.

లీలారాణి వున్నప్పుడు శంకర్‌లాల్‌కి ఇలాంటి దిగుళ్ళు వుండేవి కావు.

ఆ అమ్మాయి డిగ్రీ హోల్డరు మెరికలాంటి పిల్ల, ఎలాంటి సమస్యలు వచ్చినా చాలా తెలివిగా మానేజా చేసేది. పైఅధికారుల్ని బుట్టలో పెట్టేది.

కాని సావిత్రి కొత్త వల్లెటూరి రకం?

ఏం కొంప లంటుకున్నాయో ఏమిటో....అన్న ఆందోళన శంకర్‌లాల్‌ని నిలవ నియ్యలేదు.

తను నాల్గురూపాయలు లాభాలు పొందటం చూసి తన విరోధులకి కన్ను కుట్టింది.

వాళ్ళ పన్నాగమే ఇది.

తన సంస్థని ఎలాగైనా మూతపడేలా చేసి ఆ స్థానంలో అలాంటిదే మరొక సంస్థ తెరవాలని స్థానికంగా వున్న కొందరు వ్యాపార వేత్తలు కలలు కంటున్న సంగతి శంకర్‌లాల్‌కి తెలియంది కాదు.

ఆ కుట్ర ఫలితమే ఇదంతా.

కాకపోతే ఏమిటి?

శంకర్‌లాల్‌కి కడుపంతా మండినట్లు అయ్యింది.

సాయంత్రానికల్లా రెక్కలు కట్టుకుని "ఫర్మ్" ముందు వాలాడు.

అధికారులు ఎంత దారుణంగా రిపోర్ట్సు వ్రాశారు.

మళ్ళీ తన సంస్థ ఎక్కడ మూతపడుతుందో‍‍ ఎన్నిసార్లు కోర్టుల చుట్టూ తిరగాల్సి వస్తుందో, ఎంత డబ్బు ఖర్చవుతుందో అన్నదే ఆయన ఆందోళన.

ప్రమిదలో నూనెపోసి తులసి కోటముందు సంధ్యాదీపం వెలిగిస్తున్న సావిత్రి ఇంట్లోకి వస్తున్న శంకర్‌లాల్‌ని చూసి ఒక క్షణం నివ్వెరపోయింది.

వడిలిన తోటకూర కాడలా బడలికగా అలసి పోయినటు వున్నాడు.

సావిత్రి గభాల్న తులసికోట ముందునుంచి లేచి ఇంట్లోకి వచ్చింది.

సావిత్రి చెప్పిందంతా విని శంకర్‌లాల్ ఆశ్చర్యపోయాడు.

రికార్డ్సు, అధికారులు వ్రాసిన రిమార్కు చూశాక కూడా అతడు తనకళ్ళని తనే నమ్మలేక పోయ్యాడు.

పట్టరాని ఆనందంతో రెండు క్షణాలు నోట మాటరాలేదు.

....... డెసిట్యూడ్ ఉమన్ కోసం స్థాపించబడిన ఆ సంస్థ పనిచేసే తీరుతెన్నులు సంతృప్తికరంగా వున్నాయని, అక్కడి స్త్రీలంతా ఒక కుటుంబంగా కల్సిపోయి పని చేస్తున్నారని, ఆ సంస్థద్వారా స్త్రీలకి మంచి జీవనోపాధి సౌకర్యం లభిస్తోందని, ఫండ్స్ "మిస్‌యూజ్" అవుతున్నాయన్న వార్త అసత్యమని, అధికారులు చక్కగా శంకర్‌లాల్‌కి అనుకూలంగా రిపోర్ట్సు వ్రాశారు.

ఆ వాక్యాలు చదువుతున్నప్పుడు, రాత్రికి రాత్రి ఎంతో కష్టపడి సావిత్రి వ్రాసిన ఆ రికార్డ్సు చూస్తున్నప్పుడు....ఆనందంతో శంకర్‌లాల్ మనసు మూగబోయింది.

ఎంతో దైన్యస్థితిలో తన చేతికింద పనిచెయ్యటానికి వచ్చిన సావిత్రి—

అమాయకంగా పల్లెటూరి వాటంతో కనిపించే సావిత్రి -

వేరే దారిలేక తప్పనిసరిగా తనకి లొంగిపోయిన సావిత్రికి గుండెల నిండా తనపై ద్వేషం, పగ పేరుకునిపోయి వుంటాయి అనుకున్నాడు శంకర్‌లాల్.

కాని తనకి దేవతలా ఇంత మేలు చేస్తుంది అనుకోలేదు.

ఈ "చెకింగ్" వల్ల తన సంస్థ శాశ్వతంగా మూతపడుతుంది అనుకున్నాడు.

కాని తన కెంతో మేలు జరుగుతుందని కాని ఆ రిపోర్ట్సువల్ల తనకి మరిన్ని ఫండ్స్ శాంక్షన్సు అయ్యే అవకాశం వుంటుందని గాని కలగానైనా వూహించలేదు.

శంకర్‌లాల్ హృదయం ఆనందంతో ఒక్క క్షణం ఆగినట్లు అయ్యింది.

చప్పున లేచి సావిత్రిని రెండు చేతులా బంధించి హృదయానికి దగ్గరగా తీసుకున్నాడు.

మృదువుగా ఆమె చెక్కిళ్ళమీద ముద్దు పెట్టుకున్నాడు.

"సావిత్రి...."

"...."

"నువ్వు నిజంగా నాకింత మేలు చేస్తావని అనుకోలేదు సావిత్రి.

నాకు చిన్నప్పట్నుంచి అందమైన అమ్మాయిలంటే చాలా ఇష్టం.

ఆ ఇష్టంలోనే నీ రూపం చూసి ముచ్చటపడి ఉద్యోగం ఇచ్చాను.

కాని........

నువ్వు ఇంత తెలివిగా రికార్డ్సు వ్రాయగలవని కాని, ఆఫీసు వర్క్ చెయ్యగలవని కాని నేను ఎప్పుడూ అనుకోలేదు సావిత్రి?....

....నువ్వు ఇంత యాక్టివ్‌గా రిస్క్ తీసుకుని ప్రవర్తించబట్టి సరి పోయిందిగాని లేకపోతే ఈ పాటికి మనసంస్థ మూతపడి వుండేది తెలుసా!" అన్నాడు.

ఆ మాటలు చెప్తున్నప్పుడు శంకర్‌లాల్ గొంతులో తేనె వాగు ప్రవహించింది. కళ్ళలో అమృతం కురిసింది.

ఆ మర్నాడు స్టాఫ్ అందరికీ ఒక నెల జీతం బోనస్‌గా ప్రకటించాడు.

ఆ తరువాత రెండురోజులు అక్కడే వుండిపొయ్యాడు.

సావిత్రిపై అనురాగవర్షం కురిపించాడు.

ఎంతో కాలంగా మరిచిపోయిన ప్రేమ, ఆప్యాయత తిరిగి జ్ఞాపకం వచ్చాయి. సావిత్రికి ఎండిపోయిన పల్లెపూలలోంచి .... అరిగిపోయిన గంధపు చెక్కలోంచి సన్నగా పరిమళాలు విరిసినట్లు.... ఆ జ్ఞాపకాలు....

కృష్ణతో గడిపిన పాతరోజులు మధురస్మృతులు....మళ్ళీ ఇన్నాళ్ళకి లీలగా....ఆమె మనసులో మధురోహలు రేపాయి.

చెక్కిళ్ళపై ధారగా కన్నీరు జారిపోయింది.

ఆ కన్నీరు తుడిచి ఆప్యాయంగా ఆమెని అక్కున చేర్చుకున్నాడు శంకర్‌లాల్.

అంతవరకూ ఆమెది అవసరం....

అతనిది ఆనందం....

కాని....

ఆ క్షణం...

ఇద్దరిమధ్య ఒక అనిర్వచనీయమైన అనుభవం....

ఉషోదయాన పచ్చని గరికపై మంచు బిందువులు....సన్నగా జారి పడినట్లు....

సావిత్రి మనసు చల్లగా ఆర్ద్రం అయ్యింది.

ఆమె హృదయం మెత్తగా స్పందించింది.

అది ప్రేమా!

కావచ్చు.

కాకపోనూ వచ్చు.

కేవలం అవసరం కోసం రెండు జీవితాలమధ్య ఏర్పడిన ఒప్పందమే అయినా అందులోనూ ఆనందం వుంది.

అనుభూతి వుంది.

కొండలోయలో పుట్టి....రాళ్ళు రప్పలు దాటి....ప్రవహించే సన్నని నీటి పాయలా....

సహజమైన చల్లని ఆనందం....

ఈ ప్రకృతిలో ప్రతీ ప్రాణిని చెట్టుని పిట్టని కూడా కట్టి పడవేసే ఆనందం....

మరి ఆ....ఆనందం పేరే ప్రేమా!

అసలు ప్రేమంటే ఏమిటి?

జీవితమనే అమావాస్య చీకటిలో....ఒక సన్నని వెలుగురేఖ....

భయంకరమైన బ్రతుకు ఎడారిలో ఒక తోడు ....

అదేనా ప్రేమంటే.

అసలు ఈ ప్రేమ అనే పదార్థం ఒకటి వుందా!

వుందేమో ? లేకపోతే అంతంత గొప్పగా ఎందుకు రాస్తారు. పుస్తకాల్లో!

ప్రేమ త్యాగాన్ని కోరుతుంది అంటారు కదా !

మరి....అదే నిజమయితే కృష్ణ తనని ఎందుకు వదిలేశాడు?

అతనికి తనపై ప్రేమ లేదేమో ....

ఆ రోజుల్లో....అతని ప్రేమంతా నటనేనేమో....

సావిత్రి కళ్ళనుంచి చుక్కలు చుక్కలుగా కన్నీరు రాలుతుంటే శంకర్‌లాల్ చేతుల మధ్య ఎప్పుడో నిద్రలోకి ఒరిగింది.

ప్రతీరాత్రి లాగే ఆ రాత్రి తెల్లవారింది.

కాని....

సావిత్రి బ్రతుకులో ఎంత తేడా!

o o o

గుండె గాయాలని మాన్పే మందులా కాలం నిశ్శబ్దంగా సాగిపోతోంది.

కాలగర్భంలో పది సంవత్సరాలు గిర్రున తిరిగాయి.

సుజాత ఇంటర్ మీడియట్ పరీక్షలు వ్రాసింది.

పరీక్షలు అయిపోగానే సెలవులు ఇస్తున్నట్లు హాస్టల్ ఖాళీచేసి తల్లి దగ్గరకి వస్తున్నట్లు ఉత్తరం వ్రాసింది సుజాత.

రెండు నెల్లపాటు వేసంగి సెలవులు వుంటాయి.

ఈ లోగా రిజల్ట్సు వస్తాయి.

ఆ తరువాత సీనియర్ కాలేజీకి వెళ్ళాలి.

ప్రస్తుతం అదీ సుజాత ఫ్యూచర్ ప్లాన్.

సుజాత చదువుకుంటున్న స్కూలు కిండర్‌గార్డెన్ నుంచి ఇంటర్ మీడియట్ వరకూ వుంది.

ఇన్నాళ్ళూ ఎప్పుడు సెలవులు వచ్చినా సావిత్రి కూతుర్ని ఎక్కువగా తన దగ్గరకి పిలిపించుకునేది కాదు.

ఎప్పుడైనా సుజాత వచ్చినా ఎక్కువ రోజులు వుండనిచ్చేదికాదు. ఎప్పుడు చూడాలనిపించినా తనే సిటీకి వెళ్ళి కూతుర్ని చూసి వచ్చేది.

రకరకాల తినుబండారాలు తయారు చేసేది.

చిన్న చిన్న సీసాల్లో వూరగాయలు, పొడుల్నా నద్దేది.

అవన్నీ తీసుకునివెళ్ళి కూతుర్ని చూసి రెండురోజులు హాస్టల్లో పేయింగ్ గెస్టుగా వుండి వచ్చేది.

ఒకోసారి శంకర్‌లాల్ తన ఎంజాయ్‌మెంటుకోసం సావిత్రిని దగ్గరుండి పట్నం తీసుకు వెళ్ళేవాడు.

ఇద్దరూ కల్సి పోష్ హోటల్స్‌లో బసచేసేవారు.

సావిత్రి తన స్టాఫ్‌తో కల్సి సెంటర్ పనిమీద వచ్చాననీ, పరిచయస్థుల ఇంట్లో వున్నాననీ చెప్పేది. కాని అసలు విషయం తెలియనిచ్చేది కాదు సుజాతకి.

శంకర్‌లాల్ సావిత్రిని రెండో ఆట సినిమాకి తీసుకెళ్ళేవాడు.

షాపింగ్‌కి తీసుకెళ్ళి మంచి చీరలు కొనిచ్చేవాడు.

నాల్గురోజులు వుండి తిరిగి వచ్చేసేవాడు.

ఈ విషయాలేవీ సావిత్రి కూతురికి తెలియ నివ్వలేదు.

తను ఏమైనా కూతుర్ని చాలా జాగ్రత్తగా పెంచటానికి నిర్ణయించుకుంది సావిత్రి.

రెడీమేడ్ గార్‌మెంట్ సెంటర్ పేరుతో నడుస్తున్న ఆ సంస్థలో ఎంతో కుళ్ళు వుంది. అవినీతి వుంది. దోపిడి వుంది.

ఊళ్ళో ఏ చిన్న ఫంక్షన్ జరిగినా, ఏ ఒక్క ప్రముఖుడు వచ్చినా, అతని ఒక్క రాత్రి ఆనందంకోసం ఆ సంస్థ నుంచి ఒక అమ్మాయి "బలి" అవుతుంది.

అలాంటి కల్మష వాతావరణంలోకి తన చిన్నారి కూతురు కాలు పెట్టటం సావిత్రికి ఎంతమాత్రం ఇష్టంలేదు.

అందుకే సాధ్యమైనంత వరకూ దూరంగా వుంచటానికే ప్రయత్నించింది.

తను మురికిలో బ్రతుకుతున్న బురదలోంచి వచ్చిన కమలంలా కూతురు జీవితం కలకల లాడాలన్నదే సావిత్రి ఆశయం.

అంత మాత్రంచేత సుజాతకి బొత్తిగా తమ జీవితాల గురించి తెలియదని కాదు.

తన తండ్రి తల్లిని ఎందుకు విడిచిపెట్టి వెళ్ళిపోయ్యాడో........ తమ్ముడు ఎంత దారుణంగా తల చితికి చచ్చిపోయ్యాడో, ఒకప్పుడు మహా రాణిలా బ్రతికిన తన తల్లి ఇప్పుడు ఒకరికింద తల వంచి యెంత దాకిరిచేసి బ్రతుకుతుందో....సుజాతకి తెలియని విషయాలు కావు.

సుచాయగా అన్నీ తెల్సు.

కాని తల్లి కూతురు యెప్పుడూ ఆ విషయాల గురించి చర్చించుకో లేదు.

పాలవంటి కూతురి జీవితానికి కళంకం అంటకుండా....నిర్మలమైన, ఆరోగ్యకరమైన వాతావరణంలో చాలా జాగ్రత్తగా పెంచాలన్నదే సావిత్రి తాపత్రయం.

పైగా ఇప్పుడు ఆమె జీవితం శంకర్‌లాల్‌తో పూర్తిగా ముడి పడింది.

శంకర్‌లాల్ నెలలో పదిరోజులు అక్కడే వుంటాడు.

చట్టరీత్యా, నైతిక విలువలదృష్ట్యా....అది నేరమే అయినా భార్యాభర్తల్లాగనే తామిద్దరూ కల్సి జీవిస్తున్నారు.

అతని సంస్థలో పనిచేసే ఆడవాళ్ళతో కూడా శంకర్‌లాల్‌కి సంబంధాలున్నాయి.

వాళ్ళ నిస్సహాయత, అతని డామినేషన్, ఈ రోజు కొత్తకాదు.

కాని కూతురికి అలాంటి వాతావరణం గురించి తెలియటం సావిత్రికి అంతగా ఇష్టంలేదు.

సాధ్యమైనంత నిర్మలంగా, దూరంగా సుజాతని పెంచాలన్నదే సావిత్రి తాపత్రయం.

సుజాత సెలవలకి ఎప్పుడైనా వచ్చినా నాల్గురోజులకంటే ఎక్కువ వుండనిచ్చేది కాదు.

సెలవుల్లో కూడా హాస్టల్‌లోనే వుంచేది.

ఆ తీరిక సమయంలో వేరే ఏమన్నా నేర్చుకోమని చెప్పేది.

తల్లి ప్రోత్సాహంతో సుజాత మైపు నేర్చుకుంది.

హిందీ పరీక్షలు చదువుతూంది.

కాని ఈసారితో జూనియర్ కాలేజి చదువు పూర్తి అయిపోవటంతో రూల్సు ప్రకారం తప్పనిసరిగా హాస్టల్ ఖాళీ చెయ్యవలసి వచ్చింది.

అందుకే సుజాత తన సామానంతా తీసుకుని హాస్టల్ విడిచి సెలవులకి ఇంటికి వచ్చేస్తుంటే, వేరే మార్గంలేక తప్పనిసరిగా ఒప్పుకుంది సావిత్రి.

రిజల్సు వచ్చాక సుజాతని డిగ్రీ కాలేజీలో చేర్పించి తిరిగి హాస్టల్‌లో పెట్టాలి.

అంతవరకూ మనస్సు స్థిమితం వుండదు.

తన కూతురు గ్రాడ్యుయేట్ అయి ఏదైనా చిన్న ఉద్యోగం సంపాదించుకుని ధాని కాళ్ళమీద అది స్వతంత్రంగా బ్రతకాలి.

ఆ తరువాత భగవంతుడు అనుగ్రహిస్తే తగిన వరుడ్ని చూసి సుజాత పెళ్ళి జరిపించాలి.

తన బిడ్డ భోగభాగ్యాలతో తులతూగక పోయినా పిల్లపాపలతో భర్త ఆదరణలో వున్నంతలో ఆనందంగా బ్రతకాలి.

అంతే.

అప్పుడే తన ఈ కన్నీటి బ్రతుక్కి సార్థకత.

అదే తన జీవితాశయం.

సావిత్రి ఆ మంచి రోజు కోసం ఘడియలు లెక్కపెడుతూ బ్రతుకుతూంది.

o o o

ఇంటి ముందు ఆటో రిక్షా దిగి సూట్‌కేసులు చేతుల్లో పట్టుకుని.... "అమ్మా" అంటూ ఆప్యాయంగా పిలుస్తూ ఇంట్లోకి వస్తున్న సుజాతని చూడగానే ఆనందంతో సావిత్రి కళ్ళు చెమ్మగిల్లాయి.

కొద్ది క్షణాలు గుండె ఆగినట్లు మనసు నిశ్శబ్దంగా మూగ బోయింది.

ఆఫ్ శారీలో....పదహారేళ్ళ లేత వయసులో గులాబీ మొగ్గలా.... ముగ్ధ మనోహరంగా వుంది సుజాత.

రెండు సంవత్సరాల ఇంటర్ మీడియట్ కోర్సు ముగించింది.

చేతిలో సూట్ కేస్ పట్టుకుని ఒంకీలు తిరిగిన రెండు జడలు భుజాల మీంచి ముందుకు జారుతూంటే చిరునవ్వులు ఒలికిస్తూ గడపలో నిల్చున్న కూతుర్ని చూడగానే సావిత్రి మాతృ హృదయంల పౌర్ణమినాటి సముద్రంలా పొంగింది.

చేతిలో పని వదిలేసి గభాల్న వెళ్ళి కూతుర్ని కౌగలించుకుంది.

ఆనందంతో ఆమె కళ్లు వర్షించాయి.

ఆ రోజంతా కూతురు ప్రక్కనే కూర్చుండి పోయింది.

మనసు మనసులో లేకుండా తబ్బిబ్బు పడింది.

ఏ పని చేద్దామన్నా మనసు సరిగ్గా లగ్నం కాలేదు.

మోకాళ్ళదాకా గౌన్లు వేసుకుని తిరిగే కూతురు చూస్తూ వుండగానే నిలువెల్లా పూలచెట్టులా ఎదిగిపోయింది కదా.... అనుకుంటే ఆనందమో దుఃఖమో తెలియని ఒక ఉద్వేగపు అల సావిత్రి గుండెని ముంచెయ్య సాగింది.

ఆ రోజు సుజాతకి ఇష్టమైన వంటకాలన్నీ చేసింది.

దగ్గర కూర్చుని కొసరి కొసరి తినిపించింది.

ఎర్రటి శరీరచ్ఛాయ. విశాలమైన కోలకళ్ళు ఒంకీలు తిరిగి నల్లగా తుమ్మెద రెక్కల్లాంటి జుత్తు. చిన్న మందార మొగ్గల్లాంటి నోరు.

సుజాత అచ్చుగుద్దినట్లున్న.... సావిత్రి యొవ్వురేఖల్తో ఒకే మూస నుంచి తీసినట్లు వుంది.

సుజాత జుట్టు బాగా వుంగరాలు తిరిగి కాస్త ఒత్తుతో కురచగా వుంటుంది.

అందుకని రెండు జళ్ళు వేసుకుంటుంది.

ఆ జళ్ళు ఎప్పుడూ ఆమె గుండ్రని భుజాలమీంచి జారి ఛాతీ పై ముందుకి వాలుతాయి,

సుజాత సావిత్రిలా మందకొడి కాదు.

తండ్రిలా చాలా చలాకీ గుణం ఆ అమ్మాయిది.

వీళ్ళని చూసి త్రుళ్ళింతలు చేసే చేప పిల్లలా మాటకి ముందు గల గలా చిలిపి నవ్వులు విసురుతూ చలాకీగా వుంటుంది,

అలా ఆనందంగా నిర్మలంగా నవ్వుతున్న కూతుర్నిచూస్తే సావిత్రికి ఎంతో ఆనందం.

తన కూతురు ఎప్పుడూ అలా హాయిగా నవ్వుతూ బ్రతకాలన్నదే ఆమె కోరిక.

పదహారేళ్ళ తియ్యని వయస్సులో వున్న సుజాతని చూస్తుంటే.... ఇరవై ఏళ్ళక్రితం తనని తను అద్దంలో చూసుకున్నట్లు థ్రిల్లింగ్‌గా అని పిస్తోంది.

ఇప్పుడంటే తన బ్రతుకు ఇలాగ అయిపోయింది గాని.... ఒకప్పుడు తను అంత అందంగా.... అంత ముగ్ధంగా వుండేదికదా అనుకుంటే సావిత్రి మనసు పులకిస్తూంది.

మరి....మంచి ఉద్యోగ హోదాతో....అందంగా హీరో వర్‌షిప్‌తో వున్న కృష్ణ కట్నం కానుకలు ఆశించకుండా తనని ప్రేమించి పెళ్ళి చేసు కున్నాడంటే- ఆ అందం చూసేకదా !

తన తలవ్రాత బాగుండక తన బ్రతుకు ఇలాగ మారిపోయింది గాని లేకపోతే భర్త అనురాగంతో తన జీవితం ఎంత ఆనందమయంగా గడిచి పోయివుండేది !

కాని "విధి" తనని చిన్నచూపు చూసింది.

భగవంతుడే తన పాలిటి విలన్ అయిపోయ్యాడు ...

సావిత్రికి తన గతం జ్ఞాపకం వస్తే కడుపంతా పొయ్యి మండు తున్నట్లు వుంటుంది.

కృష్ణ రూపం కళ్ళ ముందు కదిలితే గుండెల్లో విషజ్వాలలు లేస్తాయి.

తనని నట్టనడి సంద్రాన ఒదిలి ఎంత నిర్దాక్షిణ్యంగా వెళ్ళి పొయ్యాడు !

ఇప్పుడు ఎక్కడ వున్నాడు ?

అసలు వున్నాడా ?

వుండే వుంటాడు.

కాని తనలా కాదు.

హాయిగా ఆనందంగా.... మరొక అమ్మాయిని పెళ్ళి చేసుకుని సంతోషంగా వుండి వుంటాడు.

మరి మగమహారాజా కదూ!....

సావిత్రి మనసంతా అశాంతి చెలరేగేది.

గుండెల్లో జ్వాలలు చెలరేగేవి.

అయినా ఒక విధమైన నిర్లిప్తత అలవరుచుకుంది. కడుపులో లావా మరుగుతున్నా పైకి అగ్ని పర్వతంలా నిశ్చలత.

కూతుర్ని చూసుకుని ఆవేదన అంతా మర్చిపోవాలన్నదే సావిత్రి తాపత్రయం.

నా గతం ఒక పీడకల.

మళ్ళీ మళ్ళీ ఎందుకు తల్చుకోవటం !

నేను జీవిస్తున్నది నా కోసం కాదుకదా !

నా కూతురి కోసం కదా! అనుకుంటుంది సావిత్రి.

పచ్చగా ముద్దబంతిలా సుజాత ఇంట్లో తిరుగుతుంటే సావిత్రికి పండగ....

o o o

ఆదివారం.

ఆ రోజు సెంటర్‌కి సెలవు.

సుజాత సెంటర్‌లో పనిచేసే గాయత్రితో కల్సి మ్యాట్నీ సినిమాకి వెళ్ళింది.

సావిత్రి భోజనం చేసి బట్టలుతికే ప్రయత్నంలో పడింది.

సుజాత బట్టలు కూడా వుతకాల్సినవి ఏమైనా వున్నాయేమో నని సూట్‌కేస్ తెరిచింది.

హాస్టల్‌లో వుతికించుకున్నట్లు వుంది. బట్టలన్నీ చక్కగా తెల్లగా వుతికి ఇస్త్రీ మడతలు పెట్టి వున్నాయి.

అడుగున మాత్రం రెండు ఓణీలు మాసి కనిపించాయి.

వాటిని బయటికి తీస్తుంటే బట్టల్లోంచి ఒక చిన్నడైరీ జారి కింద పడింది.

లేత ఆకుపచ్చ రంగు క్యాలికో అట్టతో గులాబీ ఆకులు ప్రింటు చేసి చాలా అందమైన డిజైన్లుగా వుంది డైరీ.

"సుజాకి డైరీ వ్రాసే అలవాటు వుందా!"

చేతుల్లోకి తీసుకుంది సావిత్రి.

మొదటి పేజీలో ఆకుపచ్చ ఇంకుతో అందంగా వ్రాసే వుంది.

....డియర్ ఫ్రెండ్ సుజాతకి....

—నందకుమార్....

సావిత్రి సంభ్రమంగా అయ్యింది.

ఎవరీ నందకుమార్....!

ఇదిగాని ప్రేమలో పడలేదు కదా!

బట్టలు వుతకటం సంగతి మర్చిపోయి పక్కనే వున్న కుర్చీలో కూర్చుంటూ ఆశక్తిగా డైరీ పేజీలు తిరగేసించి.

సుజాత తన మనసులోని భావాలని.... అందంగా అక్కడ కూడా వ్రాసుకుంది....

o o o

హాపీ న్యూయిర్....

నాకు డైరీ వ్రాసే అలవాటు లేదు.

కాని నందూ బహుకరించాడు.

ఏమని వ్రాయను!

పోనీ...

అతని గురించే వ్రాయనా!

ఊహూ....

అతనికీ నాకూ మధ్య అసలు ఏమన్నా వుంటే కదా!

గీతాంజలి అన్నయ్యగ కొద్దిపాటి పరిచయం అంతే!

o o o

సమయం రాత్రి పదకొండు గంటలు.

బుధవారం.

ఈ రోజు ఫ్రెండ్సుతో బజార్నుంచి వస్తుంటే షాపింగ్ సెంటర్ దగ్గర నందకుమార్ కనిపించాడు.

షాపింగ్ చేసే సందడిలో నేను అతన్ని చూడలేదు.

అతనే ముందుగా నన్ను పలకరించాడు.

కాని ఆ పిలుపులో నేను ఆశించిన ఆప్యాయత లేదు.

స్నేహితుల మధ్య పల్కరింపులాగనే వుంది.

అతను నాకేసి చూసినపుడు ఆ చూపులు మామూలుగ వుండవు.

నాలో దేన్నో వెదుకుతాడు.

ఏమిటది!

ప్రే....మా!

o o o

నేను చాలా అందంగా వుంటానని అంటారు నా ఫ్రెండ్సు.

నేనూ మా హాస్టల్ బ్యూటినిట!

సినిమాలకి బజారుకి వెడితే అబ్బాయిల చూపులు నన్ను వెంటాడుతాయి.

కాని మా నందూ....మాత్రం నన్ను ఎదురుగా కూర్చోపెట్టుకుని నిర్లిప్తంగా ఎక్కడో చూస్తాడు.

సన్యసించేముందు సిద్ధార్థుడిలా....

ఛల్....

o o o

సెలవులు ఇచ్చారు.

ఫ్రండ్స్ అంతా ఇళ్ళకి వెళుతున్నారు.

కాని అమ్మ నన్ను రావద్దని హాస్టల్‌లోనే వుండమని వ్రాసింది.

ఎందుకో....!

అమ్మ ఎప్పుడూ అలాగే వ్రాస్తుంది.

ఆ రోజు సాయంత్రం అయిదు గంటలకు గీతాంజలి మా హాస్టల్‌కి వచ్చింది.

నెక్స్టుమంత్ ఆమె భర్తుడే వుందట.

డ్రెస్ సెలక్షన్‌కి రమ్మని పిలిచింది.

వాళ్ళ నాన్నగారు బట్టలు కొనుక్కోమని డబ్బిచ్చారుట.

వేరే వాళ్ళ నాన్నమ్మ రెండు వందలు ఇచ్చిందిట.

"ఏం కొనుక్కోనే సుజా! ఇప్పుడంతా సిల్వర్ జుయలరీ సెట్స్ పెట్టుకుంటున్నారు కదా। సర్దాగా నేనూ కొనుక్కోనా!" అంది.

అవును మా కాలేజీలో హాస్టల్‌లో చాలామంది వెండి గొలుసులు వేసుకుంటున్నారు ఫ్యాన్సీగా.

డబ్బున్న వాళ్ళకి అన్నీ సరదాలే.

గీతకి ఏం లోటువుంది.

తండ్రి పెద్ద డాక్టరు.

నాన్నమ్మ ఆస్థిపరురాలు.

నాకు ఆ రోజు ఎందుకో కొద్దిగా అన్‌హెల్తీగా వుంది.

రానన్నాను.

కాని గీత వూరుకోదు కదా.

ఆ అమ్మాయికి నా సెలక్షన్ అంటే ఇష్టం.

వెళ్ళటం తప్పనిసరి అయి బయలుదేరాను.

"ఆటోలో పోదామా." అన్నాను హాస్టల్ బిల్డింగ్స్ దాటుతూ.

"నీ మొఖం....బయట అన్నయ్య కారులో మనకోసం వెయిట్ చేస్తున్నాడు" అంది.

నా గుండె ఝల్లుమంది.

నా అణువు అణువునా కోటి వీణలనాదాలు....

మబ్బుని చూసిన మయూరిలా అతన్ని చూస్తే నా కెందుకింత పరవశం.

"మా అన్నయ్య సంగతి నీకు తెలుసుకదా! బుద్ధూ .... చీరలు రంగులు ఆయనకి పట్టవు అందుకే పనిగట్టుకుని నిన్ను తీసుకెడుతున్నాను. మా అన్నయ్య కాబోయే మెకానికల్ ఇంజనీరు........వృత్తికే కాదు. ప్రకృతి కూడా....ఏ అమ్మాయి చేసుకుంటుందోగాని....బాబోయ్...."

గీత కిలకిలా నవ్వింది.

నాకూ నవ్వు వచ్చింది.

నిజమే.

నందకుమార్ చక్కని అందంతో హీమాన్‌లా హుందాగా వుంటాడు. పాతికేళ్ళ ప్రాయంలో ఉన్నాడు.

స్థితిపరుడు, ఏలోటూ లేదు.

అమ్మాయిలు అతన్ని చూస్తే మొదటి క్షణంలోనే మనసు పారేసుకుంటారు.

అంతటి అట్రాక్షన్ అతనిలో ఉంది.

కాని....

ఎందుకో....చాలా నిర్లిప్తంగా యాంత్రికంగా వుంటాడు.

నేను, గీత వెనకాల కూర్చున్నాం.

నందూ నిశ్శబ్దంగా డ్రైవ్ చేస్తున్నాడు.

కోటేరేసిన ముక్కు, బిగించిన పెదవులు, ఒత్తయిన హిప్పీ క్రాప్....

ఆ భంగిమలో అతను ఎంతో అందంగా వున్నాడు.

అతని ప్రక్కన కూర్చునే అదృష్టవంతురాలు ఎవరో....

గీత "డిస్కో" చీర కొనుక్కుంది. లేత ఆకుపచ్చరంగుమీద సన్నటి జరీగీతలు, చీర చాలా బాగుంది.

నూట డెబ్బయిపెట్టి వెండి నగలసెట్టు కొనుక్కుంది.

మూడు పేటల గొలుసు, ఇయర్ రింగ్సు, వ్రేలికి ఉంగరం.

చాలా అప్టుడేటుగా వున్నాయి.

అంతా డిస్కో ఫాషన్.

షాపింగ్ పూర్తయిన తరువాత నందకుమార్ ఇంటర్నేషనల్ హోటల్ ముందు కారాపాడు. వద్దంటే వినలేదు.

"లైట్‌గా ఏదైనా తిని వెళదాం" అంది గీత.

ముగ్గురం ఒకే టేబిల్ దగ్గర కూర్చున్నాము.

"అన్నట్టు అన్నయ్యా మా సుజీకి క్యాడ్‌బరీస్ ఐస్‌క్రీం, వెజిటిబుల్ బిర్యానీ అంటే చాలా ఇష్టం." అంటూ అదే ఆర్డరు చేసింది.

నందకుమార్ నా కళ్ళల్లోకి చూసి చిన్నగా నవ్వాడు.

సన్నని వెన్నెల జాలులో మల్లెపూలు అరవిరిసి మత్తుగా పరిమళాలు విరజిమ్మినట్లు—

ఎంత చక్కని నవ్వు.

ఎన్ని వలపులు రువ్వు.

టిఫిన్, కాఫీ అయ్యాక ఇంక వెళదామనుకుంటుంటే—

"జస్టు వన్ మినిట్" అంటూ గీత లేచి టాయిలెట్‌కు వెళ్ళింది.

ఎన్నడూ లేంది ఎందుకో నందకుమార్ మాటిమాటికి తదేకంగా చూస్తున్నాడు.

ఆ రోజు నా మేకప్ కూడ ఎంతో స్పెషల్‌గానే వుంది.

నా కెంతో ఇష్టం అయిన లేత గులాబిరంగు రూబీ వాయిల్‌చీర కట్టుకున్నాను.

చెవులకి నల్లటి క్రిష్టల్స్ పొదిగిన జ ంకీ పెటుకున్నాను.

ఆ మాచింగ్సులో చాలా అందంగా వుంటానని ఫ్రెండ్సు అంతా అంటారు.

అందుకేనేమో—తపోభంగం అయిన మునీశ్వరుడిలా నందకుమార్ మాటి మాటికి నా వైపు చూస్తున్నాడు.

ముకుళించుకున్న అతని పెదవులమీద మాటిమాటికి చిరునవ్వు నాట్యం ఆడుతోంది. హఠాత్తుగా అడిగాడు.

"సుజాత! వాటీజ్ యువర్ ఫ్యూచర్ ప్లాన్....?"

"చెప్పటం ఇష్టంలేదా?"

"ఇందులో ఇష్టం లేకపోవటానికి కేముంది? డిగ్రీ పూర్తిచేసి ఏదైనా చిన్న జాబ్ చూసుకుంటాను."

"మీ ఫాదర్ లేరని విన్నాను. నిజమేనా?"

"ఊఁ...."

"మీ మదర్ ఏం చేస్తారు?"

"కుట్టు టీచర్" అని చెప్పాను.

అంతే.

ఒక్క క్షణం ఆతని మొఖంలో కాంతి తరిగింది.

"........"

"........"

ఆ తరువాత అతనేమీ మాట్లాడలేదు.

ఎందుకో—!

ఊహాలు నిజాలవుతున్నాయి.

నా భ్రమలు కరిగిపోతున్నాయి.

నా అందం అతన్ని ఆలరిస్తోంది.

నన్ను అతను నిస్సందేహంగా కోరుకున్నాడు.

కాని అంతస్తు మా ఇద్దరిమధ్య అడ్డుగోడ అవుతోంది.

ఆత్మీయతకంటే అంతస్తు ముఖ్యమా.

కావచ్చు.... కొందరికి....

రోజు రోజుకీ అతని మనసు స్పష్టం అవుతూంది.

బట్....

ఐ లవ్‌యూ....

యస్....

o o o

గీత నేను ప్రాణ స్నేహితులం.

మిగతా విషయాల మాట ఎలా వున్నా మా స్నేహం విడిపో కూడదు. సృష్టిలో తియ్యనిది స్నేహమేకదా ?

లాంగ్ లివ్ ఫ్రెండ్‌షిప్.

o o o

నాన్న యుద్ధంలో చచ్చిపోలేదు.

అమ్మని వదిలేశాడు.

........

అమ్మ మంచిదే

కాని పాపం....

o o o

ఇవ్వాళ గీత వాళ్ళ పెద్దక్క అనూరాధకి ఎంగేజ్‌మెంటు జరిగింది.

ఆమె మెడికో ఫియాన్సీ కూడా మెడికోనే! గత రెండేళ్ళుగా లవ్ ఎఫైర్.... వుందట....

చదువు, అందం, డబ్బు.... అన్నింటిలోనూ ఇద్దరూ మేడఫర్ ఈచ్ అదర్ అన్నట్లుగా వున్నారు.

అతనికి "జెసారాన్"లో ఏడేళ్ళ కాంట్రాక్టు మీద ఉద్యోగం వచ్చిందట.

అందుకని తప్పనిసరి అయి పదిహేను రోజుల వ్యవధిలో మారేజ్ సెటిల్ చేశారు.

ఎంగేజ్‌మెంట్ చాలా గ్రాండ్‌గా జరిగింది.

ఆగర్భ శ్రీమంతులు వాళ్ళకేం తక్కువ ?

ఆ రోజు వీధంతా కార్లతో నిండిపోయింది.

గీత నన్ను డిన్నర్ కి పిలిచింది.

రానన్నాను.

"మీ అక్క పెళ్ళయితే నాకేంటి! నీ పెళ్ళికిపిలు వస్తాను" అన్నాను నవ్వుతూ.

కాని వూరుకోలేదు.

"ఇదిగో! నేను వూరుకున్నా మా అన్నయ్య వూరుకోడు. మీ ఫ్రెండుని పిలవలేదా!" అంటాడు అంది సన్నని చిరునవ్వుతో.

నిజమే.

నేను కనిపిస్తే అతని కళ్ళల్లో ఒక చిన్న మెరుపు మెరిసి మాయం అవుతుంది.

వాళ్ళింట్లో ఏ చిన్న ఫంక్షన్ అయినా గీత నన్నూ పిలుస్తుంది.

ఒకసారి వాళ్ళింట్లో ఏదో వ్రతం చేసి చిన్న ఫంక్షన్ చేశారు.

గీత తనని రమ్మని మరీ మరీ పిలిచింది.

కాని ఎందుకో వీలుపడక హాస్టల్ లోనే వుండిపోయింది.

ఆ తరువాత ఇరవై రోజులకి వాళ్ళింటికి వెళ్ళింది.

"మొన్న మా ఇంటికి ఫంక్షన్ రోజు రాలేదేం!" అని ఎంతో జ్ఞాపకం పెట్టుకొని మరీ అడిగాడు నందకుమార్.

అది ప్రేమా ?

ప్చ్.... కాదు.

కొద్దిగా అభిమానం కావచ్చు.

తియ్యని స్నేహం కావచ్చు.

ఏదైనా కాని....

మొత్తానికి అతనికి నామీద కొంచెం అభిమానం మాత్రం వుంది.

ఈ సృష్టిలో ప్రేమని మించిన పవిత్రం అయినది వేరే ఏదీ లేదు" అంటారు గాంధీజీ. తల్లి పిల్లల మధ్య ప్రేమ కావచ్చు, భార్యా భర్తల మధ్య ప్రేమ కావచ్చు. ప్రేయసీ ప్రియుల మధ్య, స్నేహితుల మధ్య ప్రేమ

కావచ్చు. ప్రకృతిమీద పెంపుడు జంతువులమీద ప్రేమ కావచ్చు" కానీ "ప్రేమ" అన్న ఆ రెండు అక్షరాల పదం ఈ సృష్టిలో ఎంత తియ్యనిది! ఎంత పవిత్రమైనది!

o o o

ఎక్స్ ట్రీమ్ లీ...
ఐలవ్ నందూ....
ఐ లైక్ నందూ....
ఐ యామ్ ఫాండ్ ఆఫ్ నందూ....
యస్....
ఎక్స్ట్రీమ్లీ

o o o

ఇవాళ ఊర్నుంచి "అమ్మ" వచ్చింది.
రెండు రోజులు మా హాస్టల్లోనే వుంది.
ఆ రెండు రోజులూ అమ్మె నాకు జడలు వేసింది.
బట్టలు తీసి ఇచ్చింది.
పుస్తకాలు అందించింది.
రాత్రంతా అమ్మ ఒడిలో తలపెట్టుకుని పడుకున్నాను.
ఎంత బావుంది!
అమ్మ ఒడి....లో ఎంత ఆనందం ?
హాస్టల్లో కాకుండా అమ్మ దగ్గరే వుండిపోవాలనిపిస్తూంది.
కాని ఎలా ?
చదువు ముఖ్యం కదా?

o o o

అప్పుడప్పుడు శంకర్లాల్ నన్ను చూట్టానికి వస్తున్నాడు.
నా కోసం స్వీట్సు పళ్ళు ఏమేమో తీసుకువస్తాడు.
కనీ కనిపించకుండా అతని చూపుల్లో వెకిలితనం వుంది.
అతని స్పర్శలో స్వచ్ఛత లేదు.

ఫ్రెండ్సు అందరూ అడుగుతున్నారు "ఆయనెవరు?" అని.

మా అంకుల్ అని చెప్పాను.

కాని ఎందుకో....నాకు వాడంటే ఒళ్లు మంట....

o o o

శంకర్‌లాల్‌కి అమ్మకి మధ్య ఏదైనా సంబంధం వుందా ?

వుండే వుంటుంది.

ఛీ ...

o o o

డీ పీ....

ఐ లవ్ నందకుమార్....

o o o

డిగ్రీ పూర్తికాగానే ఎక్కడయినా చిన్న ఉద్యోగం చూసుకోవాలి.

గీత నా ప్రాణ మిత్రురాలు కదా?

వాళ్ళ నాన్నగారు పేరు మోసిన డాక్టరు.

వాళ్ళ చిన్నాన్న ఇండ్రస్ట్రియలిస్ట్.

వాళ్ళందరూ నాతో ఎంతో చక్కగా ఆప్యాయంగా మాట్లాడతారు కదా ?

ఎలాగయినా వాళ్ళ ద్వారానే ఒక చిన్న ఉద్యోగం సంపాదించుకోవాలి.

ఉద్యోగం రాగానే అమ్మచేత ఆ కుట్టు సెంటర్‌లో పని మాన్పించి బయటికి తీసుకురావాలి.

అమ్మ గౌరవంగా....ప్రశాంతంగా బ్రతకాలి.

అది నా కోరిక !

o o o

ఇవాళ ఉదయం పది గంటలకి నందకుమార్ కారులో గీతని డ్రాప్ చెయ్యటానికి వచ్చాడు.

నశ్యం కలర్ సూటులో చాలా అందంగా వున్నాడు.

ఇంజనీర్ కదూ! ఎక్కడో కాన్ఫరెన్సుకి వెడుతున్నాడట.
డిగ్నిఫైడ్‌గా డ్రెస్ అయ్యాడు.
అందమైన బుల్లి కారు....
ఐ లవ్ నందూ...,

o o o

ఇవ్వాళ "లొలిత" చదివాను.
ఎంత బాగుంది!

o o o

ఈ రోజు ఆదివారం.
హాస్టల్ ఫ్రెండ్స్ అందరం కల్సి మార్నింగ్ షో చూశాం.
కీర్తి—కాంత—కనకం!
సినిమా అంటే ఇలా వుండాలి.
"ఐ యామ్ ఫాలింగ్ ఇన్ లవ్" ఎంత బాగుంది!

o o o

మా కాలేజీలో చాల మంది అమ్మాయిలకి గీతవాళ్ళ అన్నయ్య అంటే అఫెక్షన్....

o o o

అమ్మ, నాన్న, అక్కలు, అన్నలు, తమ్ముళ్ళు, నానమ్మ, తాతయ్య ఇలా నాకూ కూడా వుంటే ఎంత బాగుండేది!

o o o

ఇవ్వాళ నా మనసేమీ బాగుండలేదు.
చాలా చికాకుగా అలసటగా వుంది.
కాలేజీకి వెళ్ళకుండా రూమ్‌లోనే వుండిపొయ్యాను.
మనసు గతి ఇంతే! ఎవర్రాశారాపాట ?

o o o

నందూకి అత్తయ్య కూతురు వుందట. పేరు రేఖ. ఆ అమ్మాయి పుట్టగానే అతని భార్యగా ముద్ర పడిందట.

వాళ్ళు నైజాగ్‌లో వుంటారట. రేఖ పి.జి ఫైనల్ చేస్తూందిట.

తొందర్లోనే మా అన్నయ్య మారేజ్ జరగచ్చు. ఈ సమ్మర్‌లో అనుకుంటున్నాం.

"అక్క పెళ్ళి ముందు చెయ్యాలని ఆపాను గాని మా అత్తయ్య కూతురు పెళ్ళికి తెగ తొందర పడిపోతోంది ......" అంది గీత ఒకసారి నాతో.

నాది మూగ ప్రేమ.

నింగిలో దోగాడే చందమామని నేలమీద కలువబాల వరించినట్లు నా ప్రేమ ఫలించదని నాకు తెలుసు.

నిజానికి అలాంటి ఆశలతో ప్రేమించలేదు.

ఇట్స్ ఓన్లీ ప్లటానిక్....

భవిష్యత్తులో నందూ, నేనూ విడిపోవచ్చు.

మా ఇద్దరి మధ్య కొన్ని వందల మైళ్ళ దూరం ఏర్పడవచ్చు.

కాని....

ఎండిన మల్లెల్లోంచి సన్నగా పరిమళాలు విరిసినట్లు....

నా మనసు నుంచి ఈ జ్ఞాపకాలు వీడిపోకూడదు.

నిజం చెప్పాలంటే నాకు అతనిపై వున్నది ప్రేమకాదు.

ఒక విధమైన డివోషన్....

భగవంతుడ్ని ప్రేమించి ఆరాధిస్తామే....అలా....

o o o

వడ్డెర చండీదాస్ "హిమజ్వాల" చదివాను.

వెయ్యి పేజీలు....

ఎంత బాగుంది!

అంతా వుమెన్ సైకాలజీ....

మనో విశ్లేషణ....

ఆ నవలా రచనకి పదకొండు సంవత్సరాలు పట్టిందట!

నవల నిండా ఫిలాసిఫికల్ మ్యూజింగ్స్....

వేదాంతం....

o o o

క్రిస్టమస్ సెలవులు ఇచ్చారు.
ఫ్రెండ్స్ అంతా ఇళ్ళకి వెళుతున్నారు.
కాని అమ్మ నన్ను రావద్దని హాస్టల్‌లోనే వుండమని వ్రాసింది....
డబ్బు పంపింది.
ఎందుకో....

o o o

ఈ రోజు బాడ్‌డే....
కాలేజీకి సెలవు ఇచ్చారు.
రాత్రి మా ఇంగ్లీష్ మేడమ్ చచ్చిపోయింది.
ఒళ్ళంతా కాలి తీవ్రగాయాలు అయ్యాయి.
ప్రమాద వశాన స్టౌ మంట అంటుకొని బర్నింగ్ అయ్యిందన్నారు.
కాదు ఆత్మహత్యని చాలామంది గుసగుసలు ఆడుతున్నారు.
ఆవిడకేవో కుటుంబ సమస్యలు వున్నాయట!
అయితే మాత్రం అంత చదువుకుని సంపాదిస్తూ ఒళ్ళు కాల్చుకుని చచ్చిపోవటం ఏమిటి!
స్త్రీ సమస్యలు వున్నాయి.
అవన్నీ ఇప్పట్లో పరిష్కరింపబడక పోవచ్చు.
కాని....
చావు ముగింపు కాకూడదు.
మా కాలేజి నుంచి చాలా మందిమి చూడటానికి వెళ్ళాము.
తెల్లగా అందంగా వుండేది ఆవిడ.
కాని నల్లగా కాలి మసిబొగ్గులా అయిపోయింది.
కనుగుడ్లు పేలిపోయాయి.
జుత్తు కనుబొమ్మలు కాలిపొయ్యాయి.
వుడికిన వంకాయలా దేహం కమిలిపోయింది.

మా కందరికీ ఏడుపు వచ్చింది.
ఏడిచాము.
ఆవిడ భర్తట.... మేడమ్ శవం పక్కనే దిగులుగా కూర్చున్నాడు.
వుండి వుండి రుమాలుతో కళ్ళనీళ్ళు తుడుచుకుంటున్నాడు.
"దొంగ వెధవ.... అంతా నటన...."
మా ఫ్రెండ్స్ అంతా తిట్టారు.
మేడమ్‌ని బతికుండగా చాలా బాధలు పెట్టేవాడుట నిజమే.
ఆ ఏడుపు.... అంతా నటనే కావచ్చు.
నాకు మానాన్న లీలగా జ్ఞాపకం వచ్చాడు.
ఆడవాళ్ళకి అనురాగం.... మగవాళ్ళకి నటన సహజగుణాలా!

o o o

కొత్త మేడమ్ వచ్చారు.
పాత మేడమ్ అంత అందంగా లేరు. కాని లెసన్సు బాగా చెప్తున్నారు.
అప్పుడప్పుడు ఇంగ్లీషు సినిమా కథలు చెప్పేవారు.
మేమంతా తొందరగా మేడమ్‌పట్ల అట్రాక్టు అయ్యాము. పాత మేడమ్‌ని మర్చిపోయ్యాము.
ఎంత చిత్రం!

o o o

ఎల్లుండి న్యూయిర్ డే.
పాత సంవత్సరానికి వీడ్కోలు.
కొత్త సంవత్సరానికి స్వాగతం.
గీత నిరుటిలాగే ఈ ఏడాది వాళ్ళింటికి విందుకు రమ్మని పిలిచింది.
చాలామంది ఫ్రెండ్సు వస్తున్నారుట.
సర్దాగా అర్ధరాత్రి పన్నెండింటి దాకా ప్రోగ్రాం చేద్దాం అంది.
వాళ్ళింటికి వెడితే "ఆనందం-ఆప్యాయత" అన్న పదానికి అర్ధం తెలుస్తుంది.

అందుకే గీత ఎప్పుడు వాళ్ళింటికి డిన్నరుకి పిలిచినా కాదనలేను.

ముఖ్యంగా నందూ ...

ఐ లవ్ హిమ్ సోమచ్....

నిరుడు న్యూ ఇయర్ డేకి డైరీ ఇచ్చాడు.

ఈ సంవత్సరం ఏమిస్తాడో....?

న్యూయిర్ డే....

గీత చెప్పినట్లు చాలామంది ఫ్రెండ్సు వచ్చారు.

వాళ్ళ అక్కయ్యా స్నేహితులు, అన్నయ్యా స్నేహితులూ, మా కాలేజి మేట్లు....

మేడమీద హాలులో ఫంక్షన్.

చాలా బాగా జరిగింది.

అర్ధరాత్రి పన్నెండింటి దాకా పాటలు, డాన్సులు, కామిక్స్, మిమిక్రీ... రకారకాల ప్రోగ్రాములు జరిగాయి.

కరెంటు లైట్లు ఆర్పేసి పెద్ద పెద్ద స్టాండులో క్యాండిల్సు వెలిగించారు.

ఆ వెలుగులో డిస్కో మ్యూజిక్ పెట్టి కొంతమంది యువత యువకులు "స్టెప్సు" వేశారు.

మధ్య మధ్యలో లైట్లువేసి తినుబండారాలు సప్లయ్ చేశారు.

ఈ ఏడాది న్యూ ఇయర్‌కి నందూ నాకు చాలాగొప్ప బహుమతి.... నేను కలగానైనా వూహించని బహుమతి ఇచ్చాడు.

చాలా తియ్యని బహుమతి....

o o o

వడ్డెర చండీదాస్ నవల "హిమజ్వాల" చదివాను.

వెయ్యి పేజీల నవల.

ఎంత బాగుంది !

అంతా వుమెన్ సైకాలజీ....

మనో విశ్లేషణ నవల....

పదకొండు సంవత్సరాలకి ఒక నవల వ్రాస్తాడట.

ఫిలాసఫి మరి....

o o o

నా మనసనే తెల్లకాగితం మీద నందూ రూపం తొలిసంతకం. అతను నాకు అందని చందమామ.

బట్ ఐ లవ్ నందూ....

కుర్చీలో కూర్చుని ఆశక్తిగా పేజీలు తిరగేస్తున్న సావిత్రి.... అర్థం అయ్యీకాకుండా వున్న కూతురు మనోభావాలు చదివి విస్తుపోయింది.

అక్కడక్కడా వ్రాసింది.

ఎక్కువగా వ్రాయలేదు.

డైరీలో చాలా పేజీలు ఖాళీగానే వున్నాయి.

కొన్ని పేజీలు హాస్టల్ గురించి, కాలేజీలో క్లాసుల గురించి, మాడమ్స్ గురించి వ్రాసింది.

ఒకసారి ఎందుకో స్ట్రైకు జరిగిందట.

ఆ గొడవలు కూడా వ్రాసింది.

దాదాపు ఒక గంటసేపు ఆసక్తిగా కూతురు మనసు విప్పి వ్రాసుకొన్న డైరీ తిరగేస్తూ కూర్చుండిపోయింది.

తన కంటికి ఎంతో అమాయకంగా చిన్నపిల్లలా కనిపించే సుజాతలో ఇన్ని భావాలు వున్నాయా!

చలాకీగా దుమికే జలపాతంలా హుషారుగా వుండే సుజాతలో ఇంత అసంతృప్తి కూడా వుందా!

అప్పుడే దాని మనసులో ప్రేమభావం మొలకెత్తిందా?

ఎవరీ నందకుమార్!

ఐశ్వర్యవంతుడని వ్రాసింది.

అందగాడని వ్రాసింది.

కలువ — చంద్రుడు సాపత్యం తెస్తూ తనకి అందదనీ వ్రాసింది.

అయినా ఎందుకు ప్రేమించింది ?

కొత్త సంవత్సరానికి మరుపురాని తియ్యని బహుమతి ఇచ్చాడా!

ఏమై వుంటుంది !

మరు....పు....రా....ని.... తి.... య్య.... ని.... బ.... హు.... మ....తి...?

సావిత్రి మనసులో సన్నగా కలకలలు.

సుజాతకి అనుమానం రాకుండా డైరీ తీసి సూట్‌కేస్‌లో తిరిగి యధా స్థానంలో పెట్టింది.

ఆమె మనసు పనిమీద లగ్నం కాలేదు.

చాలా సేపు ఆలోచిస్తూ అలా కుర్చీలోనే కూర్చుండిపోయింది.

o o o

....శంకర్‌లాల్ చూపులు వెకిలిగా వుంటాయి.

....అమ్మకి శంకర్‌లాల్‌కి సంబంధం వుందా ?

....నాన్న అమ్మని ఎందుకు ఒదిలేశాడు ?

....స్త్రీ సమస్యలకి చావు పరిష్కారం కాకూడదు.

....నందే నాకు అందని చందమామ.

బట్ – ఎక్స్ట్రీమ్‌లీ ఐలవ్ నందూ....

రెండు చేతుల మధ్య తలపట్టుకొని సావిత్రి చాలా సేపు స్తబ్ధుగా కూర్చుండిపోయింది.

భగ్గున పొయ్యి మండే ముందుగా సన్నగా పొగ రాజుకున్నట్లు ... సావిత్రి మనసంతా అవ్యక్తమైన వేదన....

o o o

సుజాత వచ్చిన పది రోజులకి శంకర్‌లాల్ ఊర్నుంచి వచ్చాడు.

సుజాతని చూస్తూనే ఆప్యాయంగా భుజంమీద చెయ్యివేసి చొరవగా పలకరించాడు.

శంకర్‌లాల్ సిటీకి వెళ్ళినప్పుడల్లా వీలుని బట్టి హాస్టల్‌కి వెళ్ళి సుజాతని చూసి వచ్చేవాడు.

సుజాత చేతికి వున్న ఫారిన్ రిస్ట్ వాచి ఆయన బహూకరించిందే.

సావిత్రి కోరికమీద శంకర్‌లాల్ హోటల్‌లో బసచేశాడు.

తనకి శంకర్‌లాల్‌కి మధ్య వున్న సంబంధం గురించి సుజాతకి తెలియడం సావిత్రికి ఇష్టంలేదు. సాధ్యమైనంత వరకూ గోప్యంగా వుంచా లన్నదే సావిత్రి తాపత్రయం.

శంకర్‌లాల్ ఫర్మ్‌లో పనిచూసుకుని ఆరోజు సాయంత్రం హోటల్ గదికి వెడుతుంటే వీలుచూసుకు చెప్పింది.

సుజాతకి పరీక్షా ఫలితాలు తెలియగానే డిగ్రీ కాలేజీలో సీటు కావాలని, హాస్టల్‌లో వసతి కూడా కాస్త చూసిపెట్టమని అడిగింది.

సావిత్రి మొహంలోకి రెండు నిమిషాలు చూసి అభిమానంగా అన్నాడు.

"సావిత్రీ! ఆ విషయం నువ్వు నాకు ప్రత్యేకంగా చెప్పాలా? సుజాత బాధ్యత నీకెంత వుందో నాకు అంతే వుంది, ఈ నెలాఖరుకి సిటీకి వెడతాను. సీటు సంగతి నా ఫ్రెండ్సుకి చెప్పి వుంచుతాను. కాని రిజల్ట్సు రాకుండా మనం ఏమి చెయ్యలేం కదా?" అన్నాడు.

సావిత్రి ఎంతో ఆనందపడింది.

కూతురు వున్నత విద్యావంతురాలు కావాలన్నదే సావిత్రి తాపత్రయం.

ప్రతి నెలా కొంత పొదుపు చేసి బ్యాంకు బ్యాలన్సు కూడా చేసింది.

ఆ మర్నాడు వూరికి వెళ్ళిపోతానని చెప్పి శంకర్‌లాల్ తన బసకి వెళ్ళిపొయ్యాడు.

సావిత్రి కొంతవరకూ తన కష్టం గట్టెక్కినట్టే అనుకొంది.

సుజాత చాలా అందమైన అమ్మాయి.

తెలివైనది. చురుకైనది.

గ్రాడ్యుయేషన్ పూర్తిచేసి ఎక్కడైనా చిన్న ఉద్యోగంలో సెటిల్ అయితే దానికి ఒక దారి ఏర్పడినట్టే.

ఈ రోజుల్లో చదువు వుద్యోగం వున్న అమ్మాయిల్ని కొంతమంది యువకులు కట్నం తీసుకోకుండా, కుల మతాల ప్రశక్తి లేకుండా ఆదర్శంగా వివాహం చేసుకుంటున్నారు.

అదృష్టం కలిసి వస్తే సుజాతని కూడా ఎవరైనా ఆదర్శ యువకుడు పెళ్ళి చేసుకోవచ్చు.

తను ఆరోజు కోసమే బ్రతికి వుంది.

నిజంగా ఆ రోజు అంటూ వుంటే భగవంతుడు తన మొర ఆలకించినట్లే అనుకుంది సావిత్రి.

నీళ్ళు కొత్త చేసో ఏమో....ఆ మర్నాడు సుజాతకి కాస్త ఒళ్ళు వెచ్చబడినట్టు అయ్యింది. నలిగినట్టు బడలికగా అనిపించింది.

నయంచటం లేదని భోజనం కూడా సరిగా తినలేదు.

అశ్రద్ధ చేస్తే జ్వరం ఎక్కువ అవుతుందేమో అనిపించింది సావిత్రికి.

ఆ రోజు సాయంత్రం ఐదు గంటలకి కుట్టు సెంటర్ మూసేయగానే సుజాతని జాగ్రత్తగా ఇంట్లో వుండమని చెప్పి సావిత్రి వూళ్ళోకి బయలు దేరింది.

సావిత్రి ఎక్కడికి వెళ్ళినా వాచ్‌మెన్ భార్యని తోడు తీసుకెళ్ళేది.

కాని నాల్గు రోజులుగా రత్నమ్మ వూళ్ళో లేదు. పిల్లల్ని తీసుకొని పుట్టింటికి వెళ్ళింది. ముసలి అత్తమామ ఇంట్లో వున్నారు. వాళ్ళకి సరిగా కనిపించదు. వినిపించదు. వాచ్‌మన్ కూడా ఎక్కడికో బయటకి వెళ్ళినట్లున్నాడు.

ఇండస్ట్రియల్ ఎస్టేట్‌కి అటువైపు బాగా చివరకి లేడి డాక్టర్ డిస్పెన్సరీ తెరిచింది. పేరు భారతి.

ఆవిడ దగ్గరికి వెళ్ళి ఏదైనా మందు తెస్తానని, ఆలాగే వూళ్లోకి వెళ్ళి బ్రెడ్, పళ్ళు తీసుకొస్తానని దీపాలు పెట్టే వేళకి తిరిగి వచ్చేస్తానని చెప్పి, సుజాతని జాగ్రత్తగా వుండమని వూళ్లోకి వచ్చింది సావిత్రి.

డాక్టర్ దగ్గర కాస్త "క్యూ" వుండటంతో సావిత్రి మందు తీసు కొని, బ్రెడ్, పళ్ళు కొని హడావుడిగా ఇంటికి వచ్చింది.

అసలే సుజాతకి ఆ ప్రాంతం కొత్త. దానికి తోడు పక్కనే శ్మశానాలు.

రత్నమ్మ కూడా తోడులేదు. జ్వరంతో వున్న సుజాత ఏం భయ పడుతుందో అన్నదే సావిత్రి ఆందోళన....

అప్పటికే బాగా చీకటి పడింది.

ఇళ్ళల్లో దీపాలు వెలుగుతున్నాయి.

గేటు ముందు రిక్షా దిగి పరిగెత్తినట్లు ఇంటికి వచ్చిన సావిత్రి స్థంభీ భూతురాలు అయ్యింది.

వీధి తలుపులు వేసి వున్నాయి.

లోపల లైటు వెలుగుతోంది.

"అమ్మా సుజా! సుజా...." అంటూ రెండుసార్లు తలుపు కొట్టింది సావిత్రి.

కాని లోపల్నుంచి సమాధానంలేదు.

ఒక్కక్షణం సావిత్రికి ఎటూ తోచలేదు.

అయోమయంగా గడప దగ్గరే నిల్చుండిపోయింది.

జ్వరం మగతలో బాగా నిద్ర పట్టేసిందేమో....! పైగా ఉదయం నుంచి ఏమి తినలేదు కూడా....అనుకుంటూ... మళ్ళీ "సుజా...." అంటూ గట్టిగా తలుపు తట్టబోయింది.

సరిగ్గా అదే క్షణంలో....లోపల్నుంచి "అ....మ్మా...." అంటూ గుండెల్ని చీల్చేలా గదిలోనుంచి ఒక సన్నని ఆర్తనాదం....

సావిత్రి శరీరం ఝల్లుమంది.

మరునిమిషం ఆ కేకలు హెచ్చుస్థాయిలో వెంట వెంటనే విని పించాయి.

మళ్ళీ అంతలోనే ఎవరో గొంతు నొక్కుతున్నట్లు....కీచుగా.... సగం తెగిన కోడిపిల్ల గొంతులా....

అంతే.

సావిత్రి గుండె ఒక్కసారి ఆగి తిరిగి రెట్టింపు వేగంతో కొట్టుకో సాగింది.

ఒళ్ళంతా ఒకటే ఒణుకు.

సందేహంలేదు.

అది సుజాత గొంతే.

లోపల ఎవరున్నారు?

అసలేం జరుగుతోంది?

సావిత్రి గభాల్న వెనక వైపుకి పరిగెత్తి అటువైపు తలుపులు బాదింది.

కాని గడియలు వూడి పడటంలేదు.

లోపల్నుంచి ఆగి ఆగి కేకలు మాత్రం వినిపిస్తూనే వున్నాయి.

"అమ్మా....అమ్మా..." అని అరుస్తోంది సుజాత.

అరవకుండా ఎవరో దాని గొంతు నొక్కుతున్నారు.

ఆ వెను వెంటనే ఏవేవో శబ్దాలు.

సావిత్రికి మతిపోయినట్లు అయ్యింది.

ఏటు తోచటంలేదు.

అసలు లోపల వున్నది ఎవరు?

వాచ్‌మెన్నా? లేక....

సావిత్రికి ఏమీ బోధపడటంలేదు.

అంతా అయోమయం.

పిచ్చిపట్టిన దానిలా రెండు చేతుల్తో తలుపులు మాత్రం బాదుతోంది.

చేతిలోంచి మందు సీసా ఎప్పుడో జారిపోయి నేలమీదపడి బ్రద్ద లయ్యింది.

సావిత్రికి పీడకలలాంటి గతం....మర్చిపోదామనుకుంటున్న గతం.... తిరిగి కళ్ళముందుకి వస్తూంది భయంకరంగా.

రక్తం మరిగినట్లు అయ్యింది.

గుండె ఉద్వేగంగా కొట్టుకుంటోంది.

పాము "బుస"లా వూపిరి తీసి విడుస్తోంది. ఎంత బాదినా తలుపులు తెరుచుకోవటం లేదు.

లోపల్నుంచి "అమ్మా....అ....మ్మా...." అంటూ సుజాత పెడుతున్న కేకలు ఆగి ఆగి హెచ్చుస్థాయిలో కీచుగా వినిపిస్తున్నాయ్.

సావిత్రి ఇంక ఆలస్యం చెయ్యలేదు.

మెరుపులా బిల్డింగ్ వెనక వైపుకి పరిగెత్తింది.

షేడ మెట్లకి మూలగా నాలుగు రోకళ్ళు నిలబెట్టి వున్నాయి.

"శంకర్‌లాల్ ఒట్టి రోగ్., ఈ ఫర్మ్ పెట్టి యెందరో ఆడవాళ్ళని నాశనం చేశాడు. ఉద్యోగాల పేరుతో యెందరో లేత వయసు ఆడపిల్లల్ని బ్రోతల్ హవుస్‌లకి చేరుస్తాడు. వేలాది వేలు సంపాదిస్తాడు."

అక్కడికి వచ్చిన కొత్తలో స్టాఫ్‌లో రమణి అనే అమ్మాయి చెప్పిన మాటలు సావిత్రి చెవుల్లో రింగు రింగుమని కంచుగంటల్లా మారుమ్రోగాయి.

గుండె ఝల్లుమంది.

పూనకం వచ్చినట్లు చివాలున రోకలి అందుకుంది.

ఆ వూపుకి బారెడు జుత్తు ముడి విడివడి కేశరాసి భుజాల నిండా పరుచుకుంది.

పైగా కట్టుకున్నది ఎర్ర నేత చీర.... మిడిగుడ్లు వేసుకొని "శివం" పూనుతున్నట్లు ఒక్క దూకున గది ముందుకు వచ్చి రోకలితో బలంగా తలుపుమీద గట్టి దెబ్బవేసింది.

లోపల్నుంచి హెచ్చుస్థాయిలో కేకలు వినిపిస్తూనే వున్నాయి.

సుజాత పెడుతున్న ఆ కేకలు వింటుంటే సావిత్రిలో ఆవేశం కట్టలు తెగి పొంగులెత్తింది.

శరీరంలోని శక్తినంతా కూడగట్టుకుని రోకలితో తలుపుమీద "ధబ్బు....ధబ్బు...."మంటూ మెరుపువేగంతో నాలుగు పోట్లు వేసింది.

"థన్...."మంటూ పెద్ద శబ్దంతో ఫెళఫెళమంటూ చెక్క తలుపులు విరిగాయి.

ఎర్రటి చీరతో విడిపడిన జుత్తు ముడితో చేతిలో రోకలి పట్టుకుని కళ్ళల్లోంచి రక్తం కక్కుతూ శక్తి పూనిన దానిలా లోపలికి ప్రవేశించింది సావిత్రి.

ఎదురుగా....

పులి పంజాలో చిక్కిన లేడికూనలా కామాంధుడైన ఆ శంకర్‌లాల్ చేతులమధ్య లేత తీగలాంటి సుజాత నలిగిపోతోంది.

సావిత్రి గుండె భగ్గున మండింది.

కళ్ళు రోషంతో రక్తం చిమ్ముతూ, యజ్ఞం చేసిన కుండని కుక్క ముట్టినట్లు.

ఎదురుగా ఆ స్థితిలో కూతుర్ని చూస్తుంటే మతి చలించినట్లు అయ్యింది.

అప్పటికే చాలా రభస జరిగిపోయింది కాబోలు.

చిరుత వేతపడ్డ లేడికూనలా వుంది సుజాత.

అసలే కొస్త జ్వరంతో తిండిలేకుండా వుందేమో.... దాంతో మరింత నీరసించిపోయింది.

అయినా వాడి బారినుంచి తప్పించుకోటానికి శతవిధాల ప్రయత్నిస్తోంది.

సుజాత కేకలు పెడుతుంటే శంకర్‌లాల్ నోరు నొక్కు తున్నాడు.

సరిగ్గా అదే సమయంలో తలుపులు విరగొట్టి లోపలికి ప్రవేశించింది సావిత్రి.

ఎదురుగా.... దుర్మార్గానికి మారు రూపంలా వున్న శంకర్‌లాల్‌ని చూడగానే అసహ్యం అనిపించింది.

"ఛీ.... తను ఇలాంటివాడ్నా నమ్మింది ?....

గొర్రె కసాయి వాడ్ని నమ్మినట్లు...." నిలువునా విరుచుకు తినడానికి

సిద్ధంగా వున్న ఆదిశక్తిలా... ఎదురుగా గడపలో నిల్చున్న సావిత్రిని చూడగానే శంకర్‌లాల్ మొఖంలో నెత్తురు విరిగింది.

అయినా సుజాతని మాత్రం ఒదల్లేదు. ఏదో చెప్పబోయ్యాడు.

కాని సావిత్రి వినలేదు.

ఆమెలో మొండి ధైర్యం ప్రవేశించింది.

మేకపిల్ల "వధ్య" స్థానానికి వెళ్ళేవరకూ కసాయివాడ్ని నమ్ముతుంది.

కాని "బలిపీఠం" ఎక్కాక నమ్మదు.

ఎదురు తిరుగుతుంది.

సావిత్రి చెవులు మూతపడి కళ్ళు తెరుచుకున్నాయ్.

"ఒరేయ్.... ముందు నా కూతుర్ని ఒదులు. లేకపోతే ఈ రోకలితో నీతల బ్రద్దలు కొడతాను...."

రౌద్రంగా అరిచింది.

దెబ్బతిన్న పులిలా వుంది ఆమె గొంతు.

అయినా శంకర్‌లాల్ జంకలేదు! సావిత్రి అడుగు ముందుకి వేసింది.

మరో ఆలోచన లేకుండ రోకలి ఎత్తి శంకర్‌లాల్ తలమీద బలంగా బాదింది.

కాని మెరుపులా ఆ దెబ్బనుంచి తప్పించుకున్నాడు శంకర్‌లాల్.

"ఠంగ్...."మంటూ రోకలి ఇనప పొన్ను గోడకి కొట్టుకొని వివ్వ తంగా శబ్దం చేసింది.

అనూహ్యంగా వెనక్కి ఒంగి ఒడుపుగా ఆమె చేతిలోని రోకలి అంత దూరాన పడేలా చిన్న దెబ్బకొట్టాడు శంకర్‌లాల్.

సరిగ్గా అదే క్షణంలో గద్ద నోటినుంచి జారిపడ్డ కోడిపిల్లలా సుజాత వాడి చేతుల్నుంచి తప్పించుకుంది.

"అమ్మా...." అంటూ బోరున ఏడుస్తూ తల్లిని వాటేసుకుంది.

సావిత్రి కూతుర్ని వెనక్కితోసి మెరుపు వేగంతో కిందపడ్డ రోకల్ని అందుకుంది.

శివుడు ఫాల నేత్రం తెరిచినట్లు ఆమె కళ్ల చింత నిప్పుల్ని కురిపిస్తున్నాయి.

పగతో ద్వేషంతో ఆమె రక్తం సలసలా మరిగిపోతోంది.

"బుస్"మని నాగుపాము బుసకొట్టినట్లు ఉచ్ఛ్వాస నిశ్వాసాలు ....

శంకర్‌లాల్ ఆమెని తప్పించుకోను వీలులేక....గోడమూలకి బల్లిలా అతుకున్నాడు.

అతని చేతికి అందుబాటులో ఏ ఆయుధము లేదు.

తప్పించుకోను వీలులేదు.

రోకలిఎత్తి నిప్పులు కురిపిస్తు మీది మీదికి వస్తూంది సావిత్రి.

"నన్ను బలిగొన్నావ్ కదా? చాలలేదట్రా ? తండ్రిలా కపట ప్రేమ నటిస్తూ నా కూతురి జీవితాన్ని కూడా నాశనం చెయ్యాలనుకున్నావట్రా ?"

శంకర్‌లాల్ ప్రతిఘటనగా అడుగు ముందుకి వేసి చేతులు ఎత్తాడు.

సరిగ్గా అదే క్షణంలో మెరుపులా శంకర్‌లాల్ తలమీద ఢబ్బు మంటూ రోకలి దెబ్బ బలంగా తగిలింది.

రోకలి ఇనుప పొన్ను అతని మాడుకి గుచ్చుకొని బొటబొట రక్తం కారింది.

శంకర్‌లాల్‌కి కళ్ళు పచ్చగా బైర్లు కమ్మి గిర్రున తిరిగాయి.

సావిత్రి తామసంతో రోకలి ఎత్తి వాడితలపై రెండవదెబ్బ వేసింది.

నేల కూలుతున్న సింహంలా భీకరంగా అరుస్తూ నిలువునా కుప్ప కూలిపోయాడు.

శంకర్‌లాల్ భయంకరంగా .... పెట్టిన ఆ చావుకేక ఇండ్రిస్టియల్ ఎస్టేట్ భవనాల్లో అతిదైన్యంగా "రింగ్"మని మారుమ్రోగింది.

వాడి తల రెండు చెక్కలుగ పగిలి, ఎర్రటి రక్తం సన్నగా కాల్వ కట్టి ప్రవహించ సాగింది.

గుండెల్ని చెదిరించే ఆ రక్తాన్ని చూడగానే అప్పటికి సావిత్రికి ఒంటి మీదకి ఎక్కిన పూనకం కొస్త దిగినట్టు అయ్యింది.

చేతిలో రక్తం ఓడుతున్న రోకలి కిందపడేసి వెనక్కి తిరిగి తలుపు వారగా గజగజా ఒణికిపోతున్న సుజాత దగ్గరకి వచ్చింది.

అప్పటికే తల చెక్కలుగ పగిలి రక్తం మడుగులో గిజ గిజా కొట్టుకుని ప్రాణాలు విడిచాడు శంకర్‌లాల్.

రక్తం మడుగులో శంకర్‌లాల్‌ని చూస్తుంటే సావిత్రి కళ్ళల్లో మెరుపులు మెరిశాయి.

సింహం గుహలో మేక ఆనందంగా నాట్యం ఆడింది.

రాత్రి తొమ్మిది గంటల సమయం.

చిమ్మ చీకటి.

ఇండస్ట్రియల్ ఎస్టేటు అంతా నిశ్శబ్దంగా వుంది.

ఆ సమయంలో—దెబ్బ తిన్న పులిలా వికృతంగా శంకర్‌లాల్ పెట్టిన చావుకేక ఆ ఇండస్ట్రియల్ ఎస్టేట్ కరుకు రాతిభవనాల్లో "రింగు.... రింగు" మని మారుమ్రోగింది.

చుట్టు ప్రక్కల పరిసరాల్లోంచి ఎక్కడెక్కడి జనం పరిగెట్టుకుని వచ్చారు.

శంకర్‌లాల్ గార్మెంట్ సెంటర్ ముందు గుంపులు గుంపులుగా దడి కట్టారు.

సరిగ్గా అన్నం పళ్ళెం ముందు కూర్చున్న వాచ్‌మెన్ యజమాని పెట్టిన చావుకేక విని ఒక్క పరుగున సావిత్రి ఇంట్లోకి వచ్చాడు.

రక్తం మడుగులో చచ్చి పడి వున్న యజమానిని చూడగానే కళ్ళు గిర్రున తిరిగాయి.

అప్రతిభుడై పోయ్యాడు.

కొద్దిక్షణాలు నోట మాట రానట్లు కొయ్యబారి పోయ్యాడు.

రక్తంతో మునిగిన రోకలిని, ఒళ్ళంత పచ్చి నెత్తురు ఓడుతూ జుత్తు

విరబోసుకున్న సావిత్రిని, స్పృహ తప్పి నేలమీద పడి వున్న సుజాతని చూడగానే పరిస్థితి అర్థం అయ్యింది.

అంతే!

కెవ్వున అరుస్తూ బయటికి పరిగెట్టాడు.

పది నిమిషాలు గడవ కుండానే సైరన్ వేసూ పోలీసు జీపు వచ్చి ఇంటి ముందు ఆగింది.

హత్యానేరం కింద సావిత్రి రెడ్‌హ్యాండెడ్‌గా పట్టుబడింది.

o o o

హైద్రాబాద్ "సెషన్స్ కోర్టు" జనంతో క్రిక్కిరిసి ఉంది.

దర్బారు హాలులో సూది రాలితే వినిపించేటంతటి నీరవ నిశ్శబ్దం....

ముద్దాయి సావిత్రి బోనులో దీనాతి దీనంగా నిల్చుని వుంది.

ముద్దాయి సావిత్రి "శంకర్‌లాల్ అండ్ సన్స్ రెడీమేడ్ గార్‌మెంట్ సెంటర్" మేనేజర్ శంకర్‌లాల్‌ని రోకలితో తల పగులకొట్టి చంపిందని ఆమెపై నేరారోపణ చెయ్యటం జరిగింది.

శంకర్‌లాల్ తల పగిలి, ఆ తలలోంచి చివ్వున చిమ్మిన రక్తంతో ఒళ్ళంత తడిసి పట్టునెత్తురు ఓడుతున్న సావిత్రిని పోలీసులు రెడ్ హ్యాండెడ్‌గా పట్టుకున్నారు.

శంకర్‌లాల్ మరణించిన మరుక్షణం ఆ సంస్థ వాచ్‌మెన్ ద్వారా పోలీసు వారికి సమాచారం అందింది.

మాజిస్ట్రేట్ అనుమతితో పవర్ ఆఫ్ ఆర్డర్స్‌తో శంకర్‌లాల్ మరణించిన పది నిమిషాలలో పోలీసులు సావిత్రిని "అరెస్టు" చేసి "కస్టడీ" లోకి తీసుకున్నారు.

వాచ్‌మెన్ యాదగిరితోపాటు ఇండస్ట్రియల్ ఎస్టేట్‌లో నివసించే చాలామంది జనం, తల పగిలి రక్తం మడుగులో గిజగిజా కొట్టుకుని ప్రాణాలు విడిచిన శంకర్‌లాల్‌ని—

— జుత్తు విరబోసుకుని, ఒళ్ళంతా రక్తంతో తడిసి చేతిలో నెత్తురు ఓడుతున్న రోకలితో భీతి కొల్పుతూ నిల్చున్న సావిత్రిని ప్రత్యక్షంగా చూడటం జరిగింది.

వాళ్ళందరు 'ఐ విట్‌నెస్‌కి' నిలిచారు.

అన్నింటిని మించిన బలమైన సాక్ష్యాధారం ముద్దాయి సావిత్రి తాను చేసిన నేరాన్ని నిర్భీతిగా ఒప్పుకోవటం....

పోలీసులు రంగంలోకి ప్రవేశించే సరికే శంకర్‌లాల్‌ ప్రాణాలు విడిచాడు.

అతని తల నుంచి రక్తం స్రవించటం ఆగిపోయి క్రమంగా గెడ్డ కడుతోంది.

శంకర్‌లాల్ కను గుడ్లు తేలేసి భీతి కొలుపుతూ నేలమీద రక్తం మడుగులో పడి వున్నాడు.

గవర్నమెంట్ డాక్టరు శవాన్ని పరీక్షచేసి శంకర్‌లాల్ ప్రాణం పోయి పది నిమిషాలు అయిందని సర్టిఫై చేసాడు.

శవాన్ని వివిధ భంగిమల్లోంచి ఫోటోగ్రాఫర్లు స్నాప్సులాగారు.

న్యూస్‌మెన్ గుమిగూడారు.

పోలీసులు ఆ సంస్థకి తాళం వేసి ఆ ఏరియాని తమ "కస్టడీ" కిందకి హేండ్ ఓవర్ చేసుకున్నారు.

మాజిస్ట్రేట్ విచారణ, పోలీసు సాక్ష్యం, గవర్నమెంటు డాక్టర్ సర్టిఫికెట్టు ఐ విట్‌నెస్ అంతా విని, కొన్ని లిటిగేషన్స్ కారణంగా కేసు హైద్రాబాద్ సెషన్స్ కోర్టుకి విచారణ కోసం ఆర్డరు వేశారు.

ముద్దాయి సావిత్రి శంకర్‌లాల్‌ని హత్య చెయ్యటానికి వుపయోగించిన ఆయుధం "రోకలి"ని కోర్టువారు "ఎగ్జిబిట్" చేశారు.

కొత్త పల్లెటూరి అమాయకత్వంతో అతి దైన్యంగా బోనులో నిల్చున్న ముద్దాయి సావిత్రిని చూస్తుంటే ప్రతి ఒక్కరి మనసుల్లోను సందేహం ....

—"ఇంత అయోమయంగా ఇంత బేలగా వున్న ఈ యువతి ఇంత దారుణం ఎలా చేసింది?"

కోర్టువార్ శంకర్‌లాల్ హత్య కేసులో ప్రథమసాక్షిగా వాచ్‌మెన్ యాదగిరిని ప్రవేశపెట్టారు.

"శంకర్‌లాల్‌ని సావిత్రి రోకలితో తలపగల గొట్టి, హత్య చేస్తూ వుండగా నువ్వు చూశావా?"

అని కోర్టువారు అడిగిన ప్రశ్నకి వాచ్‌మెన్ తలూగించాడు"

నువ్వు చూసిందేమిటో యథాతథంగా వినిపించు అని ఆదేశించారు.

వాచ్‌మెన్ కథనం.

"నేను ఆరోజు రాత్రి ఎనిమిది గంటలకి ఇంటికి వచ్చి భోజనానికి కూర్చున్నాను.

అప్పటికే ఇంటి వెనకాల ఏవో చిన్న చిన్న శబ్దాలు వినపడు తున్నాయి.

అయినా నేను అంతగా పట్టించుకోలేదు.

నా భార్య వూళ్ళో లేదు. పిల్లల్ని తీసుకొని పుట్టింటికి వెళ్ళింది ....

మా అమ్మ నాన్న వృద్ధులు వినిపించదు సరిగా కనిపించదు..

నేను ఇ టికి వచ్చి భోజనానికి కూర్చున్నాను. ముద్దకలిపి సరిగ్గా తిన బోతుంటే.

ఇంటి వెనకాల నుంచి "అ....మ్మా...." అంటూ చావు కేక విని పించింది.

అంతే!

ఆ కేకకి నా గుండెలు అదిరిపొయ్యాయి.

గబాల్న కంచం ముందు నుంచి లేచి ఇంటి వెనకాలే పరిగెత్తాను.

బిల్డింగ్ చుట్టు తిరిగి నేను ఇంటి వెనకాల భాగానికి వెళ్ళేసరికి .... సావిత్రమ్మగారి ఇంటి తలుపులు బద్దలయి కిందపడి వున్నాయి.

గది మధ్య మా అయ్యగారు తల పగిలి బొళబొళా రక్తం కారు తున్న తలని రెండు చేతుల్తో పట్టుకుని నేలమీద ఒరిగిబోతూ "అమ్మా" అని కేక పెట్టారు.

సావిత్రమ్మగారు రోకలి ఎత్తి వేగంగా మా అయ్యగారి తలమీద ఇంకొక దెబ్బవేశారు.

అంతే!

మా అయ్యగారు "అ....మ్మా...." అంటూ రెండవసారి ఇంకొక వెర్రి చావుకేక పెట్టి రక్తం మడుగులో గిజగిజా తన్నుకుని ప్రాణం విడిచారు.

సావిత్రమ్మ జుత్తు విరబోసుకుని ఎర్ర చీరతో చేతిలో రోకలి పట్టుకుని నిల్చున్నారు.

మా దొరగారి తల నుంచి ధారగా చిమ్మిన రక్తంతో సావిత్రమ్మ ఒళ్ళంతా తడిసిపోయింది.

రోకలి రక్తంలో ముంచి తీసినట్లుగా వుంది.

దూరం నుంచే అదంతా చూసిన నాకు నోట మాట పడిపోయినట్టు అయ్యింది. కళ్ళు గిర్రున తిరిగాయి. గట్టిగా కేక పెట్టాను.

కాని భయంతో నా గొంతు పెగల్లేదు. గుండె జలదరించింది. కాళ్ళు ఒణికి పోతుంటే గభాల్న అక్కడి నుంచి పరుగెత్తి బయటికి వచ్చాను.

అప్పటికే బయట చాలామంది జనం గుమిగూడి వున్నారు.

మరికొందరు దూరం నుంచి పరిగెత్తుకుని వస్తున్నారు.

అప్పటికే మా అయ్యగారు పెట్టిన చావుకేక రింగుమని చుట్టు ప్రక్కలంతా మారు మ్రోగిపోయింది.

వాళ్ళందరూకూడా లోపలికి వచ్చి సావిత్రమ్మగారి గదిలో దృశ్యాల్ని చూడటం జరిగింది.

నేను భయంతో మా ఆఫీసు రూమ్‌లోకి పరిగెట్టి పోలీసులకి ఫోను చేశాను.

వాచ్‌మన్ తను కళ్ళారా చూసిన దృశ్యాల్ని వివరించి చెప్పాడు.

బలమైన సాక్ష్యాధారాలతో పాటు ముద్దాయి సావిత్రి తన నేరాన్ని నిజాయితీగా ఒప్పుకుంటూంది.

ఏ విధమైన తొణుకు బెణుకూ లేకుండా ఆమె తన నేరాన్ని ఒప్పుకోవటంతో కోర్టులో వున్న ప్రతీ ఒక్కరూ.... జడ్జీతో సహా ఆశ్చర్య చకితులవుతున్నారు.

సావిత్రి స్టేట్‌మెంట్ ప్రకారం కేసు పరిశోధిస్తే సావిత్రి హత్యా నేరం చేసినప్పటికి ఇండియన్ పీనల్‌కోడు 97, 98, 99 సెక్షన్ల ప్రకారం.... ఆమెను నేరస్తురాలుగా పరిగణించకూడదు.

"తనయొక్క శరీరానికి గాని, ఇతరులయొక్క శరీరానికి గాని తీవ్ర హాని జరగబోతున్నప్పుడు మూడవ మనిషి ఆ అకృత్యాన్ని చూడటం జరిగి, ఆపదలోవున్న మనిషిని రక్షించే ప్రయత్నంలో నేరంచేసే వాళ్ళని తీవ్రంగా గాయపరచటంగాని, అప్పటి కప్పటి ఎమోషన్స్‌తో ఆ క్షణంలో విజృంభించి హత్య చెయ్యటం గాని జరిగితే ఎటువంటి శిక్షపడదు."—

ఇక్కడ (ఈ కేసులో) సావిత్రి విషయంలో సరిగ్గా అదే జరిగింది.

ఆమెకి శంకర్‌లాల్‌ని చంపాలన్న ఉద్దేశ్యం ఎపుడూ లేదు.

శంకర్‌లాల్ పట్ల ఆమెకి ప్రేమలేదు. ద్వేషమూ లేదు.

అతను అవినీతిపరుడైనప్పటికీ, తనకి ఒక జీవనాధారం చూపి నీడ నిచ్చాడన్న కృతజ్ఞత ఆమెలో ఎంతగానో జీర్ణించుకుంది.

సావిత్రి పరాజిత ?

తన బ్రతుకంటే ఆమెకి రోత.

ఎన్నోసార్లు చచ్చిపోవాలి అనుకుంది ఆవేశంగా.

కానీ ఆమెకి కూతురు సుజాత అంటే పంచప్రాణాలు. సావిత్రి జీవితంలో సుజాత ఏకైక ఆశాజ్యోతి.

కూతురుకోసం ఏమైనా చెయ్యగల మాతృత్వపు ఔన్నత్యం, మమకారం సావిత్రిలో పుష్కలంగా వున్నాయి.

సుజాత ఎదురుగా వుంటే "అమ్మ" అన్న పదానికి సావిత్రిలో సంపూర్ణమైన రూపం కనిపిస్తుంది.

తను మురికిలో బ్రతుకుతున్నా తన కూతురుకు ఆ మురికి అంట కూడదని, ఆ పిల్ల భవిష్యత్తు బంగారు బాట కావాలన్నది సావిత్రి జీవితాశయం.

ఆమె శంకర్‌లాల్ ముందు తల వంచడానికిగల బలమైన కారణం అదే ?

శంకర్‌లాల్ తేనె మాటలు కొంతవరకు నమ్మింది.

సుజాత చదువు విషయంలో అతను చూపిస్తున్న శ్రద్ధకి, డబ్బు విషయంలో అతడు తమపట్ల ఉదారంగా ప్రవర్తిస్తున్న తీరుకి ముచ్చట పడింది.

ఎంత దుర్మార్గుడిలోనూ ఇంకా కొంత మంచి మానవత్వం, ప్రేమ భావన మిగిలి ఉండబట్టే లోకం ఇంకా ఈ మాత్రంగానైనా నిలిచి వుంది అని భావించింది.

గతంలో శంకర్‌లాల్ ఎప్పుడూ సుజాత గురించి ప్రసంగించినా పితృ వాత్సల్యాన్నే చూపించాడు. కూతుర్ని గురించి ఒక తండ్రి ఎంత చక్కగా మాట్లాడగలడో ........ అలాగే మృదువుగా సంభాషించేవాడు ఆ అమ్మాయి గురించి.

శంకర్‌లాల్‌లో చాలా దుర్మార్గపు గుణాలు వున్నాయని, ఆడ పిల్లల్ని బ్రోతల్ హవుసుల పాలుచేసి డబ్బు సంపాదిస్తాడని ఆ నోట ఈ నోటా వింది. ప్రస్తుతం ఆయన ఆడవాళ్ళతో నడిపే "రెడీమెడ్ గార్మెంట్ సెంథర్"లో జరుగుతున్నది కూడా కొంతవరకూ అదే.

అందుకే శంకర్‌లాల్ ఎంత మంచితనంగా తన దగ్గర ప్రవర్తిస్తున్నప్పటికీ సుజాత విషయంలో సావిత్రి ఎక్కడికక్కడ జాగ్రత్త పడుతూనే ఉంది. చదువు పేరుతో దూరంగా ఉంచుతూనే ఉంది.

కానీ —

"ఆ రోజు" దురదృష్టవశాన కూతుర్ని ఇంట్లో ఒంటరిగా వుంచ వలసి వచ్చింది.

కూతురు జ్వరం పడటంతో తప్పనిసరై ఒంటరిగా ఒదిలి బజారుకి వచ్చింది.

అయితే విధి పగబట్టినపుడు కాలం కాటు వెయ్యటానికి అరక్షణం చాలు....

కూడా వుండటంతో ఉద్దేశ్య పూర్వకంగానే ఆ హత్య చేసిందని పేర్కొంటూ శంకర్‌లాల్ కొడుకులు కోర్టువారికి వినతి పత్రం దాఖలు చేశారు ....

....సావిత్రివి నీచ ప్రవృత్తి అని, వ్యభిచారి అని, ఆమె తమ ఆస్తిపై కన్నువేసి తమ తండ్రిని వల్లో వేసుకుందని ఆ విధంగానే తమ గార్‌మెంట్ సెంటర్‌లో ఉద్యోగం సంపాదించుకున్నదని, తమ సంస్థలో తయారైన దుస్తులు దొంగతనంగా అమ్ముకుని బ్యాంకు బాలన్సు పెంచుకుందని, క్రమంగా తమ ఆస్తి కూడా హస్తగతం చేసుకుందుకు ప్లాన్ వేసిందని, కానీ తమ తండ్రి శంకర్‌లాల్ ఆస్తి స్వాధీనం చెయ్యక పోవటంతో కక్ష కట్టి తమ తండ్రిని దారుణంగా హత్య చేసిందని "హతుని" తరపు బంధువులు కోర్టులో దాఖలు చేసిన స్టేట్‌మెంట్ యొక్క సారాంశం.

కోర్టువారు ఆ స్టేట్‌మెంట్ చదువుతున్నపుడు సావిత్రి స్థంభీభూతురాలు అయ్యింది.

తను శంకర్‌లాల్‌ని హత్య చేసిన మాట నిజమేనని. కానీ తనకి అలాంటి దురుద్దేశ్యాలు ఏమీ లేవని మ్రుద్దాయి సావిత్రి కోర్టు వారికి దీనంగా చేతులు జోడించి మొరపెట్టుకుంది.

దాంతో కేసు పొడిగించబడింది. అయితే ఇంకొక చిత్రమైన విషయం ఏమిటంటే —

సావిత్రి అరెస్టయి జైలుకి వచ్చిన మర్నాడు—మాజిస్ట్రేట్ విచారణకి ముందే—సుజాత ఆ ఇంటి నుంచి మాయం అయ్యింది.

సుజాత, సావిత్రి నిజంగా తల్లి కూతుళ్ళు కాదని, వాళ్ళిద్దరూ ఆడ కేడీలని, హత్య జరిగాక సావిత్రి పట్టుబడటంతో సుజాత తప్పించుకొని పరారీ అయ్యిందని శంకర్‌లాల్ కొడుకులు వ్యాఖ్యానించారు.

అది అంత నమ్మ దగ్గదిగా లేకపోయినా సుజాత మాత్రం కనిపించడం లేదు.

పోలీసులు ఆ కేసు కూడా నమోదు చేసుకున్నారు.

కానీ వాళ్ళ ఆ విషయంలో ఏ మాత్రం రంగంలోకి దిగారో అంతా భగవంతుడికే తెలియాలి.

శంకర్‌లాల్ ఒక్క బిజినెస్ మాగ్నెట్‌గానే కాక మనీలెండర్‌గా కూడా పెద్ద పేరు వుంది.

కేవలం సావిత్రి పనిచేసిన గార్మెంట్ సెంటర్‌లోనే కాక అతను చేసే ప్రతీ వ్యాపారంలోనూ ఎంతో అవినీతి అక్రమం వుంది.

తరతరాలుగా వాళ్ళ కుటుంబీకులు అక్రమార్జనకి అలవాటు పడి పొయ్యారు.

సావిత్రి చాలాకాలం అక్కడ పనిచెయ్యటమే కాక శంకర్‌లాల్‌తో సన్నిహిత సంబంధాలు వుండటంతో శంకర్‌లాల్ అండ్ సన్స్ వ్యాపార సంస్థలోని లొసుగులన్నీ చాలావరకు తెలుసు.

శంకర్‌లాల్ స్మగ్లింగ్ వ్యాపారం కూడా చేసేవాడు రకరకాల దుస్తులు, వాచీలు, చిన్న చిన్న రేడియోసెట్లు, టేప్ రికార్డర్సు, ఫిల్ముస్.... ఇలాంటివెన్నో విదేశాల నుండి దిగుమతి చేసుకొని రహస్యంగా రెట్టింపు ధరకి అమ్ముతూ వుండేవాడు.

కొన్నిసార్లు ఆ వస్తువులు గార్‌మెంట్ సెంటర్లో భద్రపరచటం కూడా జరిగింది.

ఆ గార్‌మెంట్ సెంటరులో అండర్‌గ్రౌండులో రహస్యపు గదులు వున్నాయి.

ఆ విషయం ఎవ్వరికి తెలియదు.

అవన్నీ క్రమంగా సావిత్రీకి తెలిసాయి.

కాని ఆమె వాటి గురించి ఎక్కువగా పట్టించుకోలేదు.

"లోకంమీద ఎంతో అవినీతి వుంది. ఇక్కడా వుంది" అనుకుంది.

తనకి సంబంధం లేని విషయాల గురించి ఎక్కువగా పట్టించుకునే మనస్తత్వం కాదామెది.

కాని సావిత్రి అనూహ్యంగా హత్యా నేరంచేసి పట్టుబడింది.

ఈ పరిస్థితిలో ఆమె జైలునుంచి విడుదలయి బయటికి వస్తే తమ

వ్యాపార రహస్యాలన్నీ బట్టబయలు అవుతాయన్న భయం శంకర్‌లాల్ కొడుకుల గుండెల్ని దొలచసాగింది.

శంకర్‌లాల్ విరోధులు ఎందరో శంకర్‌లాల్ వ్యాపారాల్ని పడ గొట్టాలని చూస్తున్నారు.

ఈ పరిస్థితిలో సావిత్రి జైలునుంచి బయటికి వస్తే ఆమె వాళ్ళంద రికీ పెద్ద మద్దతుగా "అడ్వాంటేజ్" అవుతుంది.

అందుకే సావిత్రిని శాశ్వతంగా జైలుపాలు చెయ్యాలని గట్టిగా పథకాలు వేసుకున్నారు.

అందుకే ఆమెపై ఎన్నోరకాల అభియోగాల్ని మోపారు.

చెయ్యని నేరాల్ని ఆమె నెత్తిపై రుద్దారు.

తనకలాంటి ఉద్దేశ్యాలు లేవని శంకర్‌లాల్‌ని కేవలం ఒక రకమైన ఆవేశంతో హత్య చెయ్యటం జరిగిందని సావిత్రి వాదన.

"హతుని" తరుపు లాయర్ వాదనకి హంతకురాలి వాదనకి తేడా కనిపిస్తూంది.

కాని—

రెండు వాదనల్లోనూ తగినంత యదార్థం కూడా గోచరిస్తుంది.

కత్తికి రెండువైపులా పదును ఉన్నట్టు రెండూ సమర్థవంతంగానే ఉన్నాయి.

అయితే మిగతా విషయాల మాట ఎలా వున్నా హంతకురాలు సావిత్రి తను శంకర్‌లాల్‌ని హత్య చేసినట్టు తన నేరాన్ని నిజాయితీగా ఒప్పుకుంటోంది.

దాంతో నీరు పల్లానికి ప్రవహిస్తున్నంత సహజంగా ఆమె నేరం తేటతెల్లం అవుతూంది.

అయితే సావిత్రికి సుజాత పరారీ అవ్వటం ఏమిటో సరిగా అర్థం కావటం లేదు.

"తను జైలుపాలైన ఈ పరిస్థితులో ఆ కుక్కలో ఒంటరిగా సుజాత ఎలా బ్రతగ్గలదు! దాని భవిష్యత్తు ఏమైపోతుంది....!" అని సావిత్రి మన

నంతా ఓ ప్రక్క కూతురు ఆ ఇంటినుంచి పరారు అయ్యిందన్న వార్త కించిత్ సంతోషాన్ని కలిగించింది.

కాని అంతలోనే ఆమెలో మరో సందేహం కూడా తలఎత్తింది.

"సుజాత నిజంగానే తప్పించుకుని పారిపోయిందా! లేక వీళ్ళు కల్పించి అలా చెప్తున్నారా."

సావిత్రికి ఎటూ బోధపడటం లేదు.

కాని కూతురు కనిపించక పోవటం, ఆమె గురించి సరిఅయిన సమాచారం తెలియకపోవటంతో సావిత్రి మనసు అల్లాడిపోతోంది.

సుజాత కడగంటి చూపుకోసం ఆ తల్లిప్రాణం ఒడ్డున పడ్డ చేపలా కొట్టుకుని పోతూంది.

ఈ రకమైన వాదోప వాదనలతో కేసు కోర్టులో దాదాపు ఆరునెల్లు పైగా నడిచింది.

ఈ ఆరునెలల్లో సావిత్రి పోలీసు కస్టడీలోనే వుంది.

ఆమె తరుఫున గవర్నమెంటు లాయర్ నియమింపబడ్డాడు.

శంకర్‌లాల్ కొడుకులు గంగారెడ్డి అనే ప్రసిద్ధ లాయరుని తమ తరపున వాదించటానికి పెట్టుకున్నారు.

గంగారెడ్డికి ఉద్దండుడైన లాయరుగా, వాదోపవాదాల్లో గొప్ప సమర్ధవంతుడిగా ఆ చుట్టుప్రక్కల డిస్ట్రిక్ట్సు లెవల్లో చాలా పేరు ప్రఖ్యాతులు వున్నాయి.

ఎలాంటి కొరుకుడు పడని కేసుల్ని కూడా మసిపూసి మారేడుకాయ చేసి గెలిపించగల సమర్ధుడైన వకీలుగా ప్రతిష్ట నార్జించుకున్నాడు.

గంగారెడ్డి పట్టిన కేసు బంగారమే.

అపజయం అన్నది ఆయనకి తెలియదు. తిమ్మిని బమ్మిని, బమ్మిని తిమ్మిని చేస్తాడని, నందిని పందిగా, పందిని నందిగా నిరూపిస్తాడని—

తాడుని పామని, పాముని తాడని భ్రమింప చెయ్యగలడని-

పచ్చనోట్ల కట్టలు చేతిలో పెడితే పీనుగని లేపి కూర్చో పెట్ట గలడని....

ఇలా.... చిత్ర విచిత్రాలుగా జనం గంగారెడ్డిని గురించి చెప్పు కుంటారు.

అలాంటి గంగారెడ్డిని వచ్చనోట్లతో కళ్ళు బైర్లు కమ్మించి శంకర్ లాల్ కొడుకులు తమ తరపున వాదించటానికి నియమించుకున్నారు.

సావిత్రి స్వల్పకాల శిక్షతో బయటపడటం వాళ్ళకి ఇష్టంలేదు.

అందుకే పిమ్చుకమీద బ్రహ్మాస్త్రం వేశారు.

సావిత్రి దీర్ఘకాలం జైలుకి వెళ్ళకపోతే తీగలాగితే డొంక కదిలి నట్లు తమ వ్యాపారాల్లోని అవినీతి, అక్రమం, కుళ్ళు అంత బయటికి రావటమే కాక తమ వ్యాపార సంస్థలన్నీ మూతపడే అవకాశం కూడా లేక పోలేదు.

గోతికాడ నక్కల్లా - శంకర్‌లాల్ విరోధులు ఎందరో....ఆ రోజు కోసమే ఎదురు చూస్తున్నారు.

ఈ పరిస్థితిలో సావిత్రి బయటికి వచ్చి తమ విరోధులతో చేతులు కలిపితే ఇన్నాళ్ళుగ కాపాడుకుంటూ వచ్చిన తమ వ్యాపారాభివృద్ధి "రహ స్యాలు" అన్నీ బయటికి వస్తాయి.

అప్పుడు తమ పరువు ప్రతిష్ఠలు గంగపాలు అవటమేకాక సావిత్రి బయటికి తాము జైల్లోకి వెళ్ళవల్సి వచ్చినా ఆశ్చర్యపడ నక్కర్లేదు.

నిప్పు రవ్వేకదా అని నిర్లక్ష్యంచేస్తే అదే భగ్గున మండి ప్రభంజనం అవుతుంది.

అందుకే సావిత్రిని శాశ్వతంగా మూయించెయ్యాలన్నదే వాళ్ళ తీవ్ర ప్రయత్నం.

ఆ విషయంలో ఎలాంటి చింత పడవద్దని గంగారెడ్డి వాళ్ళకి అభయం ఇచ్చాడు.

కేసు కోర్టులో నడుస్తుంది.

ఆరునెల్లు కాలగర్భంలో కల్సిపోయ్యాయి.

o o o

మన న్యాయ గ్రంథాలు ఏం చెస్తాయంటే .... "వందమంది

దోషులను విడిచి పెట్టవచ్చు. తప్పులేదు కాని ఒక్క నిర్దోషిని కూడా శిక్షించవద్దు." అని.

కాని ఇప్పుడు జరుగుతున్నది అందుకు పూర్తి వ్యతిరేకం.

సామాన్య మానవుడికి న్యాయం అందుబాటులో లేదు.

అది డబ్బు గలవాడి జేబులో వుంది.

"లిఖిత పూర్వకమైన చట్టాలు సాలెగూడు వంటివి, పేదవారూ, దుర్బలులూ మాత్రమే వాటిలో చిక్కుకుంటారు. పలుకుబడి గలవారూ, ధనవంతులూ వాటినుంచి తప్పించుకుంటారు" అంటాడు 'అనాకార్సిస్'.

"చట్టం అనేది స్తబ్దుగా వుండటం అసంభవం. ఇది సాంఘిక ప్రగతికి దోహదకారి కావాలంటే ఆ యుగంలోని అభ్యుదయ లక్షణాలకి అనుగుణంగా పురోగమించాలి....

....సంఘంలోని చట్టంయొక్క విధిని కాలానుగుణంగా మార్చవలసిన ఆవశ్యకత శ్రీమంతులూ, స్మృతులూ యెంతగానో పోషిస్తున్నాయి."

అంటారు అల్లాడి కృష్ణస్వామయ్యర్.

"వ్యక్తి స్వేచ్ఛను కాపాడేటందుకు చట్టం వుంది. కాని ఆ చట్టం న్యాయాన్ని అంతం చేస్తుంది." అంటాడు "షా" (జస్టిస్).

"నిజం రెండు రకాలుగ వుంటుంది అని కూడా" ఈయనే అంటాడు.

ఏది ఏమైనప్పటికి సామాన్య మానవుడికి చట్టం అందుబాటులో లేదు, కనీస న్యాయం జరగటంలేదు అన్నది నిర్వివాదాంశం.

"తప్పు" చేస్తే మామూలు సగటు మనిషి శిక్ష అనుభవించినంత తేలిగ్గా, శ్రీమంతులూ, పలుకుబడి గలవారూ శిక్ష అనుభవించటం లేదన్నది నిర్వివాదాంశం.

"నేరం" కోర్టుదాకా విచారణకి వచ్చినప్పటికి లాయర్ల "ట్విస్ట్" వల్ల న్యాయం మూగబోతుంది.

ధనవంతులు న్యాయాన్ని, నీతిని కొనుక్కుంటూ వుంటే పేదవాడు అన్యాయాన్ని అవినీతిని నెత్తిన వేసుకుంటున్నాడు.

"— తామే భువి·కధినాధులమని
స్థాపించిన సామ్రాజ్యాలు
సృష్టించిన కృత్రిమ చట్టాలె
ఎదురేతర శక్తులు లేస్తే
పడిపోవును పేక మేడలై" అంటాడు శ్రీ శ్రీ.

కనీస న్యాయం జరగనప్పుడు మనిషి ఉద్రిక్తుడై ఎదురు తిరిగి, చట్టాన్ని చేతుల్లోకి తీసుకోవటం, తనకి తానే న్యాయం జరిగేలా చూసుకోవటం జరుగుతుంది.

కాని—

ఈ రోజు తిరిగి తన కూతురికి అదే దుస్థితిపడుతూ వుంటే దానిని రక్షించటం కోసం-

ఇప్పుడు సావిత్రి విషయం సరిగ్గా అదే జరిగింది.

"తను నడిరోడ్డున అన్యాయంగా బలి అయిపోయినప్పుడు తనని ఈ న్యాయస్థానం ఎందుకు కాపాడలేదు!

ఏ చట్టం తనని ఎందుకు రక్షించలేదు !

"అయ్యో ఒక ఆడది నిష్కారణంగా బలి అయిపోయింది కదా అని కనీస చేయూత నివ్వలేదేం!....

హత్య చేసింది.

అది తప్పెలా అవుతుంది !

తనని "పతిత" అని చెయ్యని నేరానికి ఈ లోకం తన మొఖంమీద వూసింది.

కాని తన కూతురు అదే స్థితిలో పడకుండా తను అడ్డుకుంది.

అది తప్పెలా అవుతుంది!

గూండాలు, కసాయితనంతో తన చిన్నారి కొడుకు తలని దారుణంగా చితక్కొట్టి చంపేశారే... మరి అప్పుడు ఈ కోర్టులు ఏమయ్యాయి! ఈ న్యాయస్థానం.... తనకి కనీస న్యాయం చెయ్యలేదెందుకు !

ఆ దుండగుల్ని శిక్షించ లేదెందుకు!

ధనవంతుడు ఒక చిన్న "కేక" పెడితే ప్రపంచం అంతా వింటుంది.

కాని పేదవాడు గొంతు చించుకుని ఆర్తనాదం చేసినా ఎవ్వరికీ చీమ కుట్టినట్లయినా పట్టదు.

మనిషికొక న్యాయం.

మనిషికొక చట్టం.

ఈ దోపిడీ వ్యవస్థ మారెదెప్పుడు!

తను ఆడది.

నిస్సహాయురాలు.

నిరుపేద....

కాని ఆ దుండగులు తెగించినవారు.

కండబలం కలవారు. వాళ్ళ జోలికి వెడితే కత్తులతోటే జవాబు చెప్తారు.

అందుకే చట్టం నోరు నొక్కుంది.

బలవంతుల్ని, ధనవంతుల్ని, రక్షించటం, బలహీనుల్ని, దుర్బలుల్ని శిక్షించటం.

ఇదేకదా న్యాయస్థానం పని!

ఈ శంకర్‌లాల్.... ఎందరో ఆడవాళ్ళ బ్రతుకుల్ని నాశనం చేశాడు.

అలాగే తననీ అక్రమంగా "రొచ్చు" లోకి దింపాడు.

పోనీ అక్కడితో వాడి దాహం తీరిందా!

ఊహూ....లేదు.

తన కూతుర్ని కూడా అందులోకి దింపాలి అనుకున్నాడు.

"స్త్రీ"అనే కల్పవృక్షానికి ఈ శంకర్‌లాల్ చీడపురుగు. పచ్చని చెట్టుకి చీడపడితే ఆ భాగాన్ని నరికెయ్యరూ!

తనూ అదే చేసింది.

శంకర్‌లాల్ అనే చీడపురుగుని, విషకీటకాన్ని చంపి పారేసింది.

ఈ విధంగా స్త్రీ జాతికి ఎంతో మేలుచేసింది కదా !

ముందు ముందు ఎందరో సావిత్రిలు, ఎందరో సుజాతలు బలి అయి పోకుండా కాపాడింది కదా!

అది తప్పెలా అవుతుంది.

నిజానికి ఈ సమాజానికి ఎంతో మేలు చేసింది.

అందుకు వీళ్ళందరూ తనని అభినందించాల్సింది పోయి ఇలా వెలి వేస్తున్నారు ఏమిటి, పైగా న్యాయస్థానం తనని సమర్థించకుండా ఆ శంకర్ లాల్ తరపు వాదనపైపే మొగ్గు చూపుతోందేమిటి.

వాళ్ళ వాదనలన్నీ ఒప్పట....

తన వాదన తప్పట ?

ఒక ఆడదానికి కనీసం న్యాయం చెయ్యని చట్టం....ఒక ఆడదానిమీద ప్రతాపం చూపించే చట్టం....అసలు ఎందుకు, సావిత్రి హృదయం ఆక్రోశించింది.

కాని ఆమె గోడు ఎవరు వింటారు?

కరుకురాతి జైలుగోడలా ?

నల్లకోటు న్యాయస్థానమా ?

ఎవరు !

ఎవరు వింటారు ఒక పేదరాలి గోడు....

అందుకే—

'చట్టం గాడిదతో సమానం' అంటాడు డికెన్స్?

"ఇతరులకు రక్షణ ఇచ్చే ప్రతిచట్టమూ పేదలపాలిట పెనుశత్రువు" అంటాడు గోల్డుస్మిత్ కవి.

మరి అంతే కదా.

కాదని ఎవరైనా నిరూపించగలిగితే నిరూపించండి. మన సమాజంలో "స్త్రీ" నైతిక విలువలు దిగజారలేదని గుండెలమీద చెయ్యి వేసుకుని చెప్ప గలిగితే చెప్పండి.

o o o

దాదాపు ఆరునెల్ల కాలంపాటు "శంకర్‌లాల్ హత్య" కేసు కోర్టులో నడిచింది.

సావిత్రి తన వాదనతో పూర్తిగా ఓడిపోయింది.

ఆమె నేరం ఋజువు అయ్యింది.

శంకర్‌లాల్ కొడుకులు కేసు నెగ్గారు.

సావిత్రికి కొద్దిపాటి జుల్మానాతోపాటు జైలుశిక్ష కూడా పడింది.

ఆరునెల్ల సుదీర్ఘ వాదోపవాదాలు అనంతరం ఆరోజుతో ఆఖరి జడ్జిమెంటు పూర్తయ్యింది.

జడ్జి సావిత్రికి జుల్మానా జైలుశిక్ష విధిస్తూ తీర్పు చెప్పి ఆఖర్న తన స్వంత అభిప్రాయం వెలిబుచ్చుతూ కోర్టువారి నుద్దేశించి మరి రెండుమాటలు మానవతా ధర్మంగా—చెప్పాడు.

"బలమైన సాక్ష్యాధారాల ప్రకారం సావిత్రి నేరం నిస్సందేహంగా ఋజువు అయ్యిందని, అయితే ముద్దాయి వాదనలో కూడా కొంత నిజం లేకపోలేదని, కాని....ఒక మనిషి ఇంకొక మనిషిని....అందునా స్త్రీ అయి వుండి హత్య చెయ్యటం చట్టరీత్యా నేరం అని, అయితే లోతుగా ఆలోచిస్తే ఆ నేరం ఆమెది కూడా కాకపోవచ్చని, ఆమెని ఆ విధంగా దిగజార్చిన కొన్ని పరిస్థితులు....కొందరు వ్యక్తులు కావచ్చునని, కాని వాళ్ళని శిక్షించే అధికారం ఒక్క భగవంతుడికే సాధ్యం అని" చెప్పి కోర్టునుంచి లేచి తన ఛాంబర్‌కి వెళ్ళిపోయ్యాడు.

ఆ మాటలు చెప్పి జడ్జి న్యాయపీఠంమీద నుంచి లేస్తున్నప్పుడు — సావిత్రి—కళ్ళనుంచి ధారాపాతంగా కన్నీరు చెక్కిళ్ళమీద జారిపోతుంటే—రెండు చేతులూ జోడించి నమస్కరించింది.

చట్టరీత్యా తనకి జైలుశిక్ష విధిస్తున్నట్లు తీర్పు చెపుతున్నప్పుడు ....

....ఆయన కళ్ళల్లో మాటల్లో సావిత్రికి మానవత్వపు విలువలు కనుపించాయి.

అతనిలో ఏమూలో....సావిత్రిపట్ల అంతర్లీనంగా సదభిప్రాయం గోచరించింది.

శిక్ష విధిస్తున్నప్పుడు ఆయన గొంతులో కాఠిన్యం లేదు.

దయ, జాలి భావన గోచరించింది.

అన్యాయంగా ఒక అమ్మాయి శిక్షకి గురి అవుతుంది కదా....అన్న భావన తాలూకా దయనీయత అది ?

అందుకే ఆయన తనకి "శిక్ష" విధించినప్పటికి ధన్యవాదాలు చెప్పినట్లు రెండు చేతులా జోడించి నమస్కరించింది సావిత్రి.

"నేరస్తుల్ని కాదు శిక్షించవలసింది. అతడు నేరస్తుడిగా మారటానికి ఏ పరిస్థితులు కారణం అవుతాయో ఆ పరిస్థితుల్ని శిక్షించాలి" అంటాడు యమ్. ఎన్. రాయ్.

నిజానికి ఈ లోకంలో అంతా మంచివాళ్ళే.

కాని పరిస్థితులు చెడ్డవి.

"వయసు" చెడ్డది.

"ఆకలి" చెడ్డది.

"డబ్బు" ఇంకా చెడ్డది.

నిజమైన దొంగలు, దోపిడిదారులు, నేరస్తులు చట్టానికి దొరకరు.

"బెనిఫిట్ ఆఫ్ డౌట్" కింద తమ నేరాల్ని కప్పి పుచ్చుకుంటారు.

కాని సావిత్రి లాంటి అమాయకులు మాత్రం ఉరికంబాలు ఎక్కుతారు. జైళ్ళల్లో మగ్గుతారు. ఆ మరణశిక్షలు అనుభవిస్తారు.

దశాబ్దాలుగా ఈ వ్యవస్థ మారటంలేదు.

అందుకే డా॥ అంబేద్కర్ అంటారు —

"ఎవరైనా దేన్నయినా నాల్గు కాలాలపాటు కాపాడుకోదలిస్తే దానికి మరమ్మత్తు ముఖ్యం" అని.

పై మాటలకి మనం ప్రాధాన్యత ఇస్తే కొంతవరకైనా సామాన్య మానవుడికి న్యాయం జరగవచ్చు.

* * *

సావిత్రి అతి నిస్సహాయ పరిస్థితిలో—దీర్ఘకాల శిక్ష అనుభవించటం

కోసం—కటకటాల వెనక్కి వచ్చింది. తనకి శిక్షపడినందుకు సావిత్రి. బాధ లేదు.

కాని తనని పోలీసులు అరెస్టు చేసింది మొదలు సావిత్రి సుజాతని చూడలేదు.

కూతురు కడగంటి చూపుకోసం అల్లాడి పోతోంది సావిత్రి మనసు.

అప్పుడే పుట్టిన లేగ దూడని కళ్ళముందే కసాయివాళ్ళు ఈడ్చుకుని పోతుంటే "అంబా...." అంటూ గోవు ఆర్తనాదం చేసినట్లు సావిత్రి మాతృ హృదయం కూతురుకోసం తల్లడిల్లి పోతోంది అహర్నిశలూ....

కాని ఆమె గోడు వినేదెవరు!

సముద్రం ఎంత ఘోష పెడితే మాత్రం ఏమిటి!

ఈ పవిత్ర భారతదేశంలో....

ఈ సభ్య సమాజంలో....

జరుగుతున్న అన్యాయాన్ని గురించి పట్టించుకునే దెవరు

ఆమె కష్టసుఖాల గురించి విచారించే దెవరు.

న్యాయస్థానం కుంటిది.

గుడ్డిది.

న్యాయ దేవత కళ్ళు మూసుకుంటుంది.

చెవులతోటే వింటుంది.

తక్రాజ్ పట్టి గుడ్డిగా ధర్మకాటా వేస్తుంది.

కాని—

చెవులకి—కంటికి ఎంతదూరం!

సత్యానికి—అసత్యానికి అంతే దూరం.

డబ్బు పలుకుబడి చేతులు కలిపి అబల అసహాయ అయిన సావిత్రిపై "శిక్ష" విధించాయి.

పట్టించుకునే దెవరు?

"అశ్లీలతని రూపు మాపుతామని, అనక్షరతని అరికడతామని, ఆడపడుచుల కన్నీరు తుడుస్తామని" కంఠం శోషపడే రాజకీయ నాయకులు ఇటువంటి విషయాల గురించి ఎందుకు పట్టించుకోరో మరి?!

o o o

శంకర్‌లాల్ చావు కేక వినగానే సుజాతకి పచ్చగా కళ్ళు బైర్లు కమ్మాయి.

రక్తం మడుగులో తలపగిలి గిజగిజా తన్నుకుంటూ గుడ్లు తేలేసిన శంకర్‌లాల్‌ని చూడగానే భయంతో "కెవ్వున" అరుస్తూ పడక గదిలోకి పరిగెత్తింది.

అంతే?

ఆ గది గడప దగ్గరే స్పృహతప్పి పడిపోయింది.

ఆ తరువాత ఏం జరిగింది జ్ఞాపకంలేదు సుజాతకి.

అసలే జ్వరంతో నీరసంగా వుందేమో....కళ్ళారా తల్లి చేసిన హత్య చూసేసరికి పూర్తిగా మైకం క్రమ్మి ఫెయింట్ అయి కింద పడి పోయింది.

ఆ పడటంతో గడప బలంగా తలకి కొట్టుకుంది. పూర్తిగా మైకం లోకి జారిపోయింది.

తల్లిని పోలీసులు అరెస్టు చేసిన సంగతి కూడా తెలియదు.

ఆ మర్నాడు సాయంత్రం ఎప్పుడో సుజాతకి స్పృహ వచ్చింది.

ఇసుక గుప్పించినట్లు కళ్ళు భగ్గు భగ్గున మండుతుంటే వాలి పోతున్న కనురెప్పల్ని బరువుగా ఎత్తి........కొంచెంసేపు చుట్టూ పరి కించింది.

ఎదురుగా వాచ్‌మెన్ యాదగిరితోపాటు ఎవరివో కొత్త మొఖాలు కనిపించాయి. లీలగా....

సుజాతకి శరీరంలో అణువు అణువునా నిస్సత్తువ....

కనురెప్పలు బలహీనంతో మూసుకుపోతున్నాయి.

అంతలో వాచ్‌మెన్ యాదగిరి ఆమెకి దగ్గరగా వచ్చాడు.

చేతిలో వున్న సిరంజినిండా చిన్న సీసాలోంచి మందు ఎక్కించి ఆమె చేతికి ఇంజక్టు చేశాడు.

లావుగా పొడవుగా వున్న ఆ నీడిల్ జబ్బకి గుచ్చుకున్నప్పుడు విపరీతమైన నొప్పి కలిగింది సుజాతకి. ఆ బాధకి తట్టుకోలేక కెవ్వుమని కేక పెట్టింది.

కాని జబ్బలో గుచ్చిన సూది బయటికి లాగిన సంగతి ఆమెకి తెలియలేదు.

అప్పటికే శరీరం అంతా ఒక విధమైన మైకంతో మొద్దుబారి పోయింది.

కళ్ళు మత్తుగా మూతలు పడిపొయ్యాయి?

సైన్సు స్టూడెంట్ అయిన సుజాతకి—తన శరీరంలో ఏదో మాదక ద్రవ్యం ప్రవేశించిందన్న విషయం లీలగా స్ఫురించింది.

o o o

దాదాపు మూడు రోజుల తరువాత సుజాతకి ఆ మత్తు పూర్తిగా విడి పోయింది.

శరీరం నిస్సత్తువగా తూలుతుంటే నెమ్మదిగా కళ్ళు తెరిచింది.

ఆత్రుతగా ఆమె కళ్ళు తల్లి కోసం వెతికాయి.

కాని తల్లి కనిపించలేదు.

కొత్త ప్రదేశం....కొత్త ఇల్లు .... సరికొత్త మనుషుల మధ్య బంధింపబడి వుంది.

కళ్ళు తెరిచేసరికి ఇద్దరు అమ్మాయిలు ప్రక్కనే వేరే మంచంమీద కూర్చుని వున్నారు.

వాళ్ళు కూడా దాదాపు సుజాత వయసులోనే వున్నారు.

రెండు జళ్ళతో ఆప్శారీల్లో అందంగా వున్నారు.

వాళ్ళ మాటంవల్ల....అది ఒక బ్రోతల్ హౌస్ అని అర్థం అయ్యింది సుజాతకి.

మూడు రోజుల్నుంచి సుజాత జ్వర తీవ్రతలో బాధ పడుతూందని మూసిన కన్ను తెరవకుండా పడి వుందని, మందులు వాడుతున్నదని ఆ అమ్మాయిలు చెప్పారు.

అయితే అక్కడికి వాళ్ళని తీసుకు వచ్చింది ఎవరో మాత్రం వాళ్ళకి తెలియదుట?

శంకర్‌లాల్ భాగస్తులతో కల్సి చేసే వ్యాపారాల్లో అది కూడా ఒకటి.

అక్కడవున్న ఆడపిల్లలందరూ సుజాతలాగా ఏదో ఒక రకంగా మోసగించబడి తేబడిన వాళ్ళే.

ఇష్టపూర్వకంగా ఎవ్వరూ అక్కడికి రాలేదుట?

అసలు విషయం తెలిశాకా సుజాతకి గుండె పగిలినట్లు అయ్యింది.

తిండి, నీళ్ళు ముట్టుకోలేదు.

అలా కంటికి ఏకధారగా ఏడుస్తూనే ఉండిపోయిందది.

శంకర్‌లాల్, అతని కొడుకులు తనకేసి చూసే వెకిలి చూపులకి అర్థం తెల్సిన మొదటి క్షణం అది?

సుజాత అంత నీరసంమీద అలా మానసికంగా బాధపడి ఏడ్వటంతో తిరిగి ఆమెకి టెంపరేచర్ హెచ్చసాగింది.

తరుచు స్పృహ తప్పటం జరిగింది.

అయినా ఆహారం ముట్టుకోలేదు.

వాళ్ళే మందులు ఇంజక్షన్స్ ఇచ్చారు.

గ్లూకోజ్ ఇంజక్షన్స్ ఇచ్చారు.

దాదాపు నెలరోజులు సుజాత ఆ స్థితిలోనే ఉండిపోయింది.

ఆ తరువాత క్రమంగా ఆమె ఆరోగ్యం కోలుకోసాగింది.

కన్నీరు కాస్త వుపశమించింది.

సుజాత అక్కడికి వచ్చినప్పట్నుంచి ఆ గదిలో ఆమెతోపాటు శ్రీరాణి, జయ అనే ఇద్దరమ్మాయిలు ఉంటున్నారు.

ముగ్గురికి ఆ గది కేటాయించబడింది.

ముగ్గురికి మూడు సింగిల్ కాట్స్, తదితర సౌకర్యాలు వున్నాయి.

తరుచు సుజాత ఏడవటం చూసి శ్రీరాణి అనే అమ్మాయి జాలిగా సుజాత మొఖంలోకి చూసింది.

"సుజాత ఎందుకు అలా పూరికే ఏడవటం? తిండి మానేసి ఏడుస్తూ కూర్చున్నంత మాత్రాన మన కష్టాలు గట్టెక్కవు. వీళ్ళ చేతుల్లో బడి ఇక్కడికి తీసుకుని రాబడడమే మన దురదృష్టం. ఇంక మన తలరాతని ఎవ్వరూ మార్చలేరు....

వీళ్ళకి డబ్బూ, బాగా పలుకుబడి పుష్కలంగా వున్నాయి. రాజకీయ వేత్తల అండదండలున్నాయి.

కాబట్టి వీళ్ళు ఎన్ని దూరాగతాలు చేసినా చెల్లుబాటు అవుతాయి.

నేను కొత్తలో నీలాగే రోజుల తరబడి ఏడ్చాను.

ఇక్కడ్నించి తప్పించుకోవాలని విశ్వ ప్రయత్నం చేసాను.

కాని అదంత వృధా ప్రయాస.

మనం పారిపోటానికి ప్రయత్నిస్తే చిత్రవధ చేస్తారు.

మరింత కట్టుదిట్టం చేస్తారు.

రెక్కలు విరిగిన పక్షి ఎగరలేదు. కొంచెం ఎగిరినా మళ్ళీ ధబ్బున కిందపడుతుంది.

ఇక్కడ మన పరిసితి అంతే.

ఈ ఇంటికి వచ్చాక కొన్ని నెల్లపాటు నేను ప్రతీరాత్రీ ఏడ్చాను.

కాని ఏం సాధించాను.

చావలేక బ్రతుకుతున్నాను...."

సుజాత ఆశ్చర్యంగా ఆ అమ్మాయి మొఖంలోకి చూసింది.

"పైకి ఎంతో నిర్మలంగా, ఆనందంగా కనిపిస్తున్న ఈ అమ్మాయిలో కూడా ఇంత విషాదం వుందా!"

సుజాతకి ఎంతో ఆశ్చర్యం అనిపించింది.

"నువ్వు చెప్తున్నదంతా నిజమేనా!" అంది పిస్తుపోతూ.

"నిజం కాకపోతే నాకీ దుస్థితి ఎందుకు!

శ్రీరాణి చిన్నగా నవ్వింది.

ఆ నవ్వులో ఎంతో విషాదం....అంత విషాదంలోనూ ఆ అమ్మాయి ఎంతో అందంగా వుంది.

ఆమె మాట్లాడుతుంటే సంగీతం వింటున్నంత హాయిగా అనిపించింది సుజాతకి.

"అసలు నువ్వు ఇక్కడికి ఎలా వచ్చావ్!"

"నేను రాలేదు. వాళ్ళు నన్ను ఎత్తుకొచ్చారు. ఆ రోజు నాకిప్పటికి బాగా గుర్తు....

మా అమ్మకి గుండె జబ్బు.

ఒక రోజు బాగా గుండెపోటు వస్తే హాస్పటల్‌లో చేర్పించాం.

మేజర్ ఆపరేషన్ చేశారు.

అప్పటికి మా అమ్మ మూడు రోజుల్నుంచి హాస్పటల్లోనే వుంది. నేను ఇంటికి పెద్ద కూతుర్ని.

బి.ఏ. రెండవ సంవత్సరం చదువుతున్నాను.

కాలేజి నుంచి వచ్చి, ఇంట్లో వంట చేసి ఆ రోజు సాయంత్రం మా అమ్మ దగ్గర తోడు పడుకుందామని బయలుదేరాను.

ఆ రోజు మా నాన్న ఇంకా ఇంటికి రాలేదు.

ఆఫీసు నుంచి అటే మా అమ్మని చూడటానికి వెళ్ళి వుంటాడు అనుకున్నాను.

నాకు ఇద్దరు చెల్లెళ్ళు, ఒక తమ్ముడు.

మా పక్కింటి వాళ్ళని కాస్త చూడమని చెప్పి నేను హాస్పటల్‌కి బయలుదేరాను.

మా ఇంట్లో ఎవ్వరికీ సంతోషం లేదు.

మనసు బాగుండలేదు.

మా అమ్మకి జరిగిన ఆపరేషన్ సక్సెస్ కాలేదని, కాంప్లికేషన్స్ వచ్చాయని నాన్నగారు చెప్పారు.

ఆ ఆందోళనతోనే నేను ఇంటి నుంచి బయలుదేరాను.

అప్పటికే సమయం ఏడు గంటలు కావస్తోంది. బాగా చీకటి పడింది.

దీపాలు వెలిగాయి.

హాస్పటల్ గేటు మూసేస్తారేమోనన్న ఆందోళనతో నేను హడావుడిగా నడుస్తున్నాను.

ఆ ఆందోళనతో బస్సు కోసం ఎదురుచూసే ఓపిక లేక ఎదురుగా వస్తున్న ఆటో ఎక్కాను.

హాస్పటల్ మా ఇంటికి చాలా దూరం.

సగం దూరం వచ్చేసరికి మా ఆటో తప్పు దారి పట్టించాడు.

మా అమ్మ పరిస్థితి చాలా ప్రమాదంగా వుండటంతో నా మనసు బాగుండలేదు. అమ్మా చచ్చిపోతుందేమో అన్న బాధతో నా కళ్ళలోకి మాటి మాటికి నీళ్ళు నిండుతున్నాయి.

ఆ బాధతో నేను సరిగా గమనించలేదు. కాని ఆటో సగం దూరం వచ్చాక తప్పుదారి పట్టింది.

నేను కన్నీరు తుడుచుకుని ఆందోళనగా చుట్టూ పరికించాను.

అంతలోనే ఆటో దారి మళ్ళి ఒక చిన్న సందులో "కీచు" మని శబ్దం చేస్తూ ఆగిపోయింది.

"ఆదేమని!" ఆటోవాలాని ప్రశ్నించబొయ్యాను.

నా ప్రశ్న నా పెదవి దాటనే లేదు.

మెరుపు మెరిసి నల్లు నల్గురు రౌడీలు గభాల్న నా ఆటోలోకి ఎక్కారు.

నన్ను వూపిరి కూడా తీసుకో నివ్వలేదు.

గట్టిగా నా నోరు నొక్కారు.

నా చేతులు పెడవిరిచి పట్టుకున్నారు.

క్లోరోఫాం దూదిని నా ముక్కు దగ్గర గట్టిగా అదిమారు.

అంతే?

నాకు మత్తుగా మైకం కమ్మింది.

క్షణాల్లో పూర్తిగా స్పృహ తప్పిపోయింది.

ఆ తరువాత ఏం జరిగిందీ నాకు తెలియదు.

తిరిగి ఇక్కడే కళ్ళు తెరిచాను.

రోజుల తరబడి తిండి నీళ్ళు మానేసి కంటికి ఏకధారగా కన్నీరు కార్చాను.

ఎదురు తిరిగాను.

పారిపోవటానికి ప్రయత్నించాను.

కాని అదంతా వృధా ప్రయాస.

వాళ్ళు చెప్పినట్లు వినకపోతే చీకటి గదిలో పెట్టి బందిస్తారు.

చిన్న బారకత్తిలాంటి చాకుతో శరీరం మీద గాట్లు పెడతారు.

కాలుతున్న సిగరెట్ చెక్కిళ్ళకి అదుముతారు.

మంచానికి కట్టేసి కళ్ళమీద చిన్న చిన్న బొద్దింకల్ని పెట్టి కళ్ళకి గంతలు కడతారు.

కాలితో బంతిని తన్నినట్లు తంతారు.

చిన్న చిన్న కరాచే ట్రిక్సు "రుచి" చూపిస్తారు. ఇలా చెప్పాలంటే ఎన్నో ....

కనీసం ఆడపిల్ల అన్న దయాదాక్షిణ్యం కూడా లేకుండా ఎంతో శాడిజం ప్రదర్శిస్తారు.

ఆ బాధలు పడలేక ఎలాంటి అమ్మాయి వాళ్ళు చెప్పినట్లు వినటానికి సంసిద్ధురాలవుతుంది. రకరకాల భంగిమల్లో ఫోటోలు తీసి, అవసరం అయితే బ్లాక్ మెయిలింగ్ మొదలుపెడతారు. కాని వాళ్ళు చెప్పినట్టు వింటే ఇలాంటి బాధలు ఏమీ వుండవు. ఎన్నోరకాల సౌకర్యాలు చూస్తారు. మంచి భోజనం, బట్టలు ఇస్తారు. ఏదన్నా రోగం వచ్చిన వెంటనే డాక్టర్ని పిలిచి వైద్యం చేయిస్తారు.

కాని ఆ ఒక్క విషయంలో మాత్రం వాళ్ళ చెప్పినట్లు వినాల్సిందే.... మనల్ని అంగడి బొమ్మల్లా చేసి డబ్బు సంపాదిస్తారు. శరపంజరం లాంటి ఈ ఇంటి నుంచి తప్పించుకోలేము. అదృష్టవశాన తప్పించుకున్నా వీళ్ళు సుఖంగా బ్రతకనివ్వరు.

ప్రపంచం అంతా జల్లెడ పట్టి అయినా మనల్ని గాలించి తిరిగి ఇక్కడికి తీసుకువస్తారు.

పోలీసులు, రాజకీయ హస్తాలు, డబ్బు....ఈ మూడు వీళ్ళ గుప్పిట్లో వున్నాయి.

దాంతో ఎన్ని అకృత్యాలకైనా పాల్పడతారు.

ఈ ప్రపంచంలో అవినీతికి, అక్రమానికి వున్న స్థానం, నీతికి నిజాయితీకి లేదు.

దుర్మార్గుడు, దుష్టుడు బ్రతుకుతున్నంత సుఖంగా ఒక మంచివాడు బ్రతకలేక పోతున్నాడు.

బ్రతికున్నప్పుడు చేసిన పాపాలన్నింటికి పై లోకాల్లో బాధలు తప్పవు అంటారు.

అదెంత వరకూ నిజమో నాకు తెలియదు. కాని....

ఈ లోకంలో మాత్రం అవినీతి అక్రమం రాజ్యం ఏలుతున్నాయి.

వీళ్ళు పెట్టే చిత్రహింసలు పడలేక నేను లొంగిపోయ్యాను.

ఆ తరువాత పారిపోవాలన్న ఆలోచన కూడా మానివేశాను.

తరుచు మా వాళ్ళంతా జ్ఞాపకం వస్తూ వుంటారు.

మా అమ్మకెలా వుందో!

జబ్బు నయం అయిందో లేకో చచ్చిపోయిందో. అసలు ఆ రోజు నన్ను కిడ్నాప్ చేశారన్న వార్త తెలిస్తేనే ఆవిడ గుండాగిపోతుంది.

మా అమ్మకి నేనంటే ఎంతో ప్రేమ?

ఇంటికి పెద్ద కూతుర్ని అని అల్లారు ముద్దుగా పెంచింది.

నా పెళ్ళి చూడాలని తపించిపోయేది.

ఎప్పుడూ నన్ను పేరు పెట్టి పిలిచేది కాదు.

"అమ్మా.... శ్రీ.... నా బంగారు తల్లీ...." ఇదే పిలుపు.

కాలేజి నుంచి ఒక గంట ఆలస్యంగా వస్తే నా కోసం తపించిపోయేది.

అలాంటి అమ్మ ఇప్పుడు ఎలా వుందో .....

నేను కనిపించ లేదన్న దిగులుతో ఏమైపోయిందో.... ?

"అమ్మ" జ్ఞాపకం వస్తే నా గుండె తరుక్కుపోతుంది.

మా నాన్న ఎలా వున్నారో?

నన్ను వెతికించటం కోసం ఎన్ని ప్రయాసలు పడ్డారో

నా చెల్లెళ్ళు, తమ్ముడు ఎలా వున్నారో....

అప్పుడు వాళ్ళు చిన్నపిల్లలు.

అమ్మ జబ్బుతో మంచం పట్టినా నేను ఇల్లంతా చక్కబెట్టుకునే దాన్ని.

కాని అమ్మ అలా నేను ఇలా అయ్యాక వాళ్ళు ఎన్ని ఇబ్బందులు పడ్డారో ...

ఇవన్ని జ్ఞాపకం వస్తే నా మనసు వికలం అయిపోతుంది.

అలాంటి క్షణాల్లోనే ఎన్నోసార్లు పారిపోవటానికి ప్రయత్నించి నా దురదృష్టవశాన వీళ్ళకి పట్టుబడి ఎన్నో దెబ్బలు తిన్నాను.

కేవలం దెబ్బలతోనే హింసించినా ఫరవాలేదు.

కాని హింసలో ఎన్ని రకాలు వున్నాయో......అన్ని రకాలు వీళ్ళు మనకి చవిచూపుతారు.

గ్రూపుగా చేరి సెక్సువల్‌గా కూడా హింసిస్తారు. ఎంతో 'శాడిజం' ప్రదర్శిస్తారు.

అందుకే ఆ బాధలు పడలేక క్రమంగా పారిపోవాలన్న ఆలోచన మానేశాను.

మనసు "రాయి" చేసుకున్నాను.

ఎప్పుడయినా నా వాళ్ళంతా జ్ఞాపకం వస్తే కాస్సేపు ఏడుస్తాను. అంతే.

క్రమంగా ఏడవటం బాధపడటం కూడా నాకు ఒక అలవాటుగా మారిపొయ్యాయి ఇంకా ఇప్పుడు ఆ ఓపిక కూడా లేదు. ఎలాంటి గుండె గాయాల్ని మాన్పటానికి కాలం ఒక మహత్తరమైన మందు.

ఇక్కడికి నేను వచ్చి రెండేళ్ళు దాటిపోయింది.

ఈ వాతావరణానికి అలవాటు పడిపొయ్యాను...."

శ్రీరాణి చెప్పటం ఆపి కళ్ళు మూసుకుంది.

మనసులో పొంగుతున్న లావాని అణుచుకుంటున్నట్లు ఆమె పెదవులు కంపిస్తున్నాయి.

మూసిన కనురెప్పల్లోంచి కన్నీరు ధారగా చెక్కిళ్ళమీద ప్రవహించ సాగింది.

ఆమె కన్నీరు చూసి సుజాత ఏడిచింది.

జయా ఏడిచింది.

ముగ్గురూ కాస్సేపు అలా కన్నీరు కారుస్తూ నిశ్శబ్దంగా వుండి పొయ్యారు.

ఆ తరువాత ముందుగా జయ తెప్పరిల్లింది.

సుజాత చెయ్యిపట్టుకుని బ్రతిమలాడుతున్నట్లు ఆప్యాయంగా అంది.

"సుజాత. రాణి చెప్పింది విన్నావు కదా!

మన అందరం ఒకే గూటి పక్షులం.

మనం ఎంత ఏడ్చినా మన గుండెలు అలిసిపోతాయే తప్ప వేరే ప్రయోజనం వుండదు.

నువ్వు ఇక్కడికి వచ్చినప్పట్నుంచి విపరీతంగా జ్వరపడ్డావు. పైగా తిండి మానేశావు కదా!....

తినటం మానివేసి ఏడుస్తూ కూర్చున్నంత మాత్రాన మన కష్టాలు గట్టెక్కవు. సరికదా ఇంకా ఎక్కువ అవుతాయి.

నువ్వు జ్వరంతో వున్నావు కనుక సరిపోయింది.

లేకపోతే వాళ్ల నిన్ను ఈ పాటికి చీకటి గదిలో పెట్టి నరక బాధలు పెట్టి వుండేవారు.

అందుకే ఏడవద్దు అంటున్నాను.

తరతరాలుగా ఆడది ఏడిచే నగం నాశనం అయ్యింది.

చాతనయితే మనం అందరం ఏకమై మనకి మనం న్యాయం జరిగేలా సాధించుకోవాలి.

అంతేకాని ఏడుపులో క్రుంగిపోవటం అవివేకం.

"ఆడవాళ్ళం మనం ఏం చెయ్యగలం!" అంటూ విస్పహాయంగా వుండిపోకూడదు.

నువ్వు ఇంకా మా అందరికంటే చాలా అదృష్టవంతురాలివి.

నీ కోసం ఏడవటానికి ఒక్క మీ అమ్మ మాత్రమే వుంది.

కాని నా కోసం నా పుట్టింటి వాళ్ళు ఎంతో ఏడిచి వుంటారు.

నేను మా అమ్మకి ఒక్కర్తినే ఆడపిల్లని.

నాకు ముగ్గురు తమ్ముళ్లు.

నేను తొలిచూలు ఆడపిల్లని, ఒక్కర్తే కూతుర్ని అని మా అమ్మ నన్ను ఎంతో అపురూపంగా పెంచింది.

మా నాన్నకి కూడా నేనంటే గారాబం.

ఆర్థికంగా కూడా మేం కాస్త కలిగిన కుటుంబంలోకి వస్తాము.

అందుచేత నేను జ్ఞానం తెల్సినప్పట్నుంచి ఏ లోటూ ఎరగను. కోరిన తిండి, కోరిన బట్ట, పుష్కలంగా ప్రేమ, అనురాగం....ఇవే తెల్సు నాకు.

కష్టాలు, కన్నీళ్లు తెలియదు.

వీళ్లు నన్ను కిడ్నాప్ చేసి ఎత్తుకువచ్చిన ఆ రోజు నాకిప్పటికి బాగా గురు.

అది మార్చి నెలాఖరు....

అప్పుడు నేను ఇంటర్ ఫైనియర్ చదువుతున్నాను.

ఆ రోజు ఉదయం మా ఇంటికి మా అత్తయ్య, మామయ్య, మా బావ వస్తున్నట్లు తంతి వచ్చింది.

మా అమ్మ ఎక్కువ పాలప్యాకట్లు కావాలని అంతకు ముందురోజే పాలవాడికి చెప్పింది.

కాని వాడు ఎందుకో ఇవ్వలేదు.

తెల్లవారు ఝామున ఎప్పుడూ వరండాలో మామూలు వాడికగా ప్యాకట్లు పడేసి వెళ్ళిపోయ్యాడు.

నేను పరీక్షలు దగ్గరికి వస్తున్నాయి కదా అని రోజు తెల్లవారు ఝామున లేచి చదువు కుంటున్నాను.

ఆ రోజు అలాగే నాలుగింటికి లేచి చదువుకుంటున్నాను.

ఇంతలో మా అమ్మ నా దగ్గరికి వచ్చి "ఎక్స్ట్రా ప్యాకట్లు ఇవ్వ లేదు వాడు. నువ్వెళ్ళి తీసుకురావే. మీ అత్తయ్య వాళ్లు వస్తున్నారు. ఈ పాలు ఏకాడికి సరిపోతాయి....మీ మామయ్యకి అసలే అరగంటకోసారి కాఫీ కావాలి...." అంది బ్రతిమాలుతున్నట్లు.

పాలబూత్ మా ఇంటికి చాలా దగ్గర.

మా వీధి సందు మలుపు తిరిగి నాలుగు అడుగులేస్తే చాలు.... అప్పటికే తెల్లవారు ఝాము నాలుగు గంటలు దాటుతోంది.

"తమ్ముడ్ని కూడా లేపి తోడు తీసుకెళతావా!" అంది అమ్మ.

"ఫర్వాలేదులే....నేను వెళ్ళగలను" అని చెప్పి అమ్మ అందించిన పది నోటు అందుకుని చెప్పులు తొడుక్కొని పాలబూత్‌కి బయలు దేరాను.... అప్పటికే జనం రోడ్డుమీద చెదురు మదురుగా తిరుగు తున్నారు.

ఆ రోజు అత్తయ్య, మామయ్య ముఖ్యంగా మా బావ వస్తున్నా డంటే మా ఇంటిల్లి పాదికి చాలా ఆనందంగా వుంది.

మోహన్ మా అత్తయ్య పెద్ద కొడుకు. నా కాబోయే ఫియాన్సీ.

మా పెళ్ళి నాలుగు నెల్ల క్రితమే సెటిల్ అయ్యింది. లగ్నపత్రిక కూడా వేశారు.

ఈ వేసంగిలోనే మా మ్యారేజ్ అంటూ ఇంకా సరిగ్గా మూడునెల్లు మాత్రం వుంది. అప్పటికి మా బావంటే నాకెంతో ప్రేమ.

చిన్నప్పట్నుంచి మేం ఇద్దరం ఎంతో అనురాగంగా వుండే వాళ్ళం.

ప్రతి ఏటా స్కూళ్ళకి సెలవులు వస్తే వాళ్ళు మా ఇంటికి రావటమో మేం వాళ్ళింటికి వెళ్ళటమో విధిగా జరిగేది.

మా అత్తయ్య నన్ను ఎప్పుడూ పేరుపెట్టి పిల్చి ఎరగదు. "ఒసే కోడలా" అనో...."మా కోడలేది!" అనో సంబోధించేది.

ఆవిడకి ఆడపిల్లలు లేరు.

ముగ్గురూ మగపిల్లలే.

అందుకే నేనంటే అంత అభిమానం.

మా బావా అప్పుడు ఇంజనీరింగ్ మూడవ సంవత్సరంలో వున్నాడు.

అతని ఇంజనీరింగ్ కోర్సు పూర్తి అయ్యేసరికి, నా డిగ్రీ కూడా పూర్తి అవుతుంది.

ఆ తరువాత మా వివాహం అనుకున్నారు. కాని మా నానమ్మ చాలా వృద్ధురాలు. రేపో మాపో అంటూ వుంది.

ఆవిడకి మా పెళ్ళి చూడాలని పెద్ద కోరిక.

రోజూ గొడవ పెట్టేది. నా పెద్ద మనవరాలి పెళ్ళి చూడకుండానే పోతానో ఏమిటో....అంటూ తరచు బాధపడేది. ఆఖరిరోజుల్లో తల్లిని బాధ పెట్టడం ఇష్టంలేక... మా నాన్నగారు మా అత్తయ్య మా పెళ్ళి నిశ్చయించారు.

అయితే మా ఇద్దరి చదువులు పూర్తి అయ్యేదాకా నేను మా పుట్టింట్లోనే వుండాలని కూడా నిర్ణయించారు.

నాకు చేయించే నగలవిషయంలో మాట్లాడటానికి ఇప్పుడు వాళ్ళంతా వస్తున్నారు.

నాకు మాబావకి నచ్చిన మోడల్సు నగలు చేయించటమో, కొనటమో చెయ్యాలని మా అత్తయ్య ఆలోచన....?

అందుకే మా అమ్మ అంత హడావుడి చేస్తుంది.

"అప్పుడే ఇంటికి పెళ్ళికళ వచ్చేసింది" అని రోజుకి పదిసార్లన్నా అనుకునేది....

నేను అదంతా ఆలోచించుకుంటూ పాల ప్యాకట్లు కోసం బయలుదేరి నందు మలుపు తిరగబొయ్యాను.

అక్కడ బాగా చీకటిగా వుంది.

స్ట్రీట్ లైట్ వెలగటం లేదు.

నేను చీకట్లో కాలిబాట చూసుకుంటు నెమ్మదిగా నందుమలుపు తిరగ బొయ్యాను.

అంతే ?

మెరుపులా అమాంతంగా నలుగురు రౌడీలు నన్ను ఒడిసి పట్టుకున్నారు.

అంతవరకు వాళ్ళు ఎక్కడ దాక్కున్నారో ఎలా వచ్చారో కూడా నాకు తెలియలేదు....

నల్గురు ఒకసారి నా చుట్టు దడికట్టి నన్ను బలంగా ఒడిసి పట్టుకున్నారు.

అందులో ఒకడు తన ఇనుప హస్తంతో నా నోరు గట్టిగా నొక్కాడు.

వారు ఇద్దరు గబాల్న నన్ను ఎత్తి రోడ్డు వారగా చీకటి చాటున ఆపిన టాక్సీలో పడేశారు.

మరుక్షణం వాయు వేగంతో టాక్సీ స్టార్ట్ అయ్యింది.

అంత రెప్పపాటు కాలంలో అతి చాకచక్యంగా అతి లాఘవంగా జరిగిపోయింద.

నేను అరవాలని గట్టిగా కేకలు పెట్టాలని ఎంత గింజుకున్న లాభం లేకపోయింది.

గట్టిగా కబంధ హస్తాలు నా నోరు నొక్కేసాయి.

నా శరీరం ఒక్క అంగుళం కూడా వాళ్ళ చేతుల్నుంచి కదిలించలేక పోయ్యాను.

అంతలోనే మరొకడు నా జబ్బ గట్టిగా నొక్కి, లావాటి సూదితో నా చేతికి మాదక ద్రవ్యం ఏదో ఇంజక్షన్ చేశాడు.

అంతే?

సగం మందు నా శరీరంలోకి ఎక్కేసరికి నా ఒళ్ళు తిమ్మిర్లు ఎక్కి క్రమంగా మొద్దుబార సాగింది.

వాళ్ళు నా నోటి మీద నుంచి చెయ్యి తీసేశారు.

నేను గట్టిగా అరిచాను.

కాని....ఆ కేక నాకే వినిపించలేదు.

నాకు పూర్తిగా స్పృహ తప్పుతున్న స్థితిలో నన్ను ఎత్తి సీటుమీద పరిచిన బ్లాంకెట్ మీద పడుకోబెట్టారు.

వాళ్ళు సీట్లమీద కూర్చున్నారు.

కారు వేగంగా పోతూనే వుంది.

ఆ తరువాత అలా ఎంత దూరం ప్రయాణం చేశానో తెలియదు.

తిరిగి మత్తువిడి కళ్ళు తెరిచేసరికి ఒక చిన్న మిద్దెలాంటి ఇంట్లో వున్నాను.

అక్కడ రెండు రోజులు నన్ను కట్టుదిట్టమైన కాపలాతో బందీఖానాలో వుంచారు.

ఆ మర్నాడు నన్ను వేరే వాళ్ళకి అమ్మివేశారు.

ఆ తరువాత మళ్ళీ నల్గురు రౌడీలు నన్ను ఒడిసి పట్టుకున్నారు.

నా జబ్బ గట్టిగా నొక్కి తిరిగి మత్తుమందు నా శరీరంలోకి ఎక్కించారు.

మళ్ళీ నాకు స్పృహ తప్పింది.

ఆ తరువాత నేను కళ్ళు తెరిచే సరికి ఇక్కడ వున్నాను.

ఇంక చెప్పటానికేముంది!

శ్రీరాణి గతే నాకూ పట్టింది.

ఎన్నో రోజుల తరబడి తిండి, నిద్ర మాని ఏడ్చాను. తప్పించుకుని పారిపోవటానికి ప్రయత్నించాను.

కాని అన్నీ వృధా ప్రయాసలయ్యాయి.

క్రమంగా అలవాటు పడ్డాను ఈ వాతావరణానికి. రాను రాను వీళ్ళకీ నా మీద కొంచెం నిఘా తగ్గింది.

అయితే నాకు తప్పించుకోటానికి మాత్రం అవకాశం రాలేదు.

కాని చచ్చిపోవటానికి అవకాశం వచ్చింది. ఒకటి రెండుసార్లు.

అయినా నేను చచ్చిపోలేదు. నేను మరణించేలోగా వీళ్ళల్లో ఏ ఒక్కడ్ని అయినా చంపాలి.

నా కసి తీర్చుకోవాలి.

అది నా పగ? ప్రగాఢ కోరిక.

ఎప్పుడైనా మా వాళ్ల జ్ఞాపకంవస్తే నా గుండెలన్నీ గుబులుతో నిండి పోతాయి.

పాలకోసం వెళ్ళినదాన్ని తిరిగి ఇంటికి రాకపొయ్యేసరికి మా వాళ్ళు ఇంట్లో ఎంత ఖంగారు పడ్డారో....అమ్మ నా కోసం ఎంతగా గుండెలు అవిసి పొయ్యేలాగా ఏడ్చిందో .... తల్చుకుంటే....నా మనసంత అశాంతి మయం అయిపోతుంది.

నా మొఖాన భగవంతుడు ఈ ఖర్మ రాసిపెట్టాడుగాని....లేకపోతే మా బావని పెళ్ళి చేసుకుని నేను ఈపాటికి ఎంతో ఆనందంగా హాయిగా వుండేదాన్ని కదా అనుకుని తృప్తి పడతాను.

ఆడపిల్ల అత్తవారింటికి వెడితే అష్టకష్టాలు పడుతుంది అంటారు.

కాని నాకు ఆ బాధ కూడా వుండేదికాదు. మా అత్తయ్య ఎంతో మంచిది. ఆవిడకి నేనంటే ఎంతో అనురాగం....

వాళ్ళందరూ నా కోసం ఎంతో ఏడ్చి వుంటారు. కాని నా దురదృష్టం ఇలాగ వుంది...." చెప్పటం ఆపి జయ నిశ్శబ్దంగా కన్నీరు కారుస్తూ మంచంలో వాలిపోయింది.

సుజాత నిర్జీవ ప్రతిమే అయ్యింది.

శిలాశ్రువుల్లా ఆమె చెక్కిళ్ళమీద కన్నీరు ధారలు కట్టింది.

"ప్రతి రేయి ప్రవహించునది
కాదు గంగ
అది విషణ్ణుల అశ్రువాహిని
నిజంగా...." అంటాడు కవి.

బహుశా ఆ విషణ్ణులంతా ఇలాంటి వాళ్ళేనేమో....?

o o o

పులి పంజాలో చిక్కిన లేడికూన తప్పించుకోలేదు.

వేటగాడి వలలో చిక్కిన పావురంపిట్ట తప్పించుకోలేదు.

ఆ "హవుస్"కి వచ్చిన ఏ ఆడపిల్ల అసలే తప్పించుకోలేదు.

తను చక్కగా చదువుకుని ఉద్యోగంచేసి తల్లిని సుఖపెడదామనుకుంది హాయిగా ఆనందంగా జీవిద్దామనుకుంది.

కాని చివరికి ఇంత రొచ్చులోకి వచ్చిపడిందికదా తన జీవితం అనుకుంటే సుజాతకి ఎంతో దుఃఖం అనిపించేది.

ఎన్నోసార్లు ఆత్మహత్య ప్రయత్నం చేసింది.

తప్పించుకుని పారిపోవటానికి ప్రయత్నించింది. కాని ఆమె ప్రయత్నాలన్నీ విఫలం అయ్యాయి.

సరికదా దారుణంగా చిత్రవధలు అనుభవించింది.

దాంతో క్రమంగా ఆ ప్రయత్నాలన్నీ మాని యాంత్రికంగా మారిపోయింది సుజాత.

ఆ మురికి జీవితానికి అలవాటు పడిపోయింది.

జీవశ్చవంలా బ్రతుకు ఈడుస్తోంది.

అక్కడికి వచ్చిన చాలా కాలానికి తెల్సింది సుజాతకి

శంకర్‌లాల్‌ని చంపిన హత్యా నేరానికి తల్లికి జైలుశిక్ష పడిందని.

సుజాత హృదయం మూగగా ఆక్రోశించింది. ఒడ్డునపడ్డ చేపలా తల్లికోసం ఆమె ప్రాణం కొట్టుకుని పోయింది.

ఏడ్చి ఏడ్చి క్రమంగా ఆమె మనసు మొద్దుబారిపోయింది.

ఇప్పుడు "సుజాత" అంటే "కీ" ఇస్తే ఆడే బొమ్మ.

విరాగి.

అంతకుమించి ఆమెలో "జీవం" వున్న లక్షణాలు ఏమీ కనిపించవు.

ఎవరు ఎలా వున్నా ఏది ఏమైనా కాలం ఆగదు.

దాని మానాన అది విశృంఖలంగా సాగిపోతూనే వుంటుంది.

కాలగర్భంలో ఏడాది గిర్రున తిరిగిపోయింది.

o o o

సావిత్రి తల్లి మనసు అనుక్షణం కూతురుకోసం తహతహ లాడుతోంది.

ఆ రోజు శంకర్‌లాల్ హత్య జరిగిన తరువాత సుజాత భయంతో పక్క గదిలోకి పరిగెత్తడం మాత్రమే తెల్సు సావిత్రికి.

అంతే.

ఆ తరువాత సుజాత ఆమె కంటికి కనిపించలేదు.

సావిత్రి ప్రాణం—కుడితిలోపడ్డ ఎలకలా — కూతురురుకోసం కొట్టుకుని పోతోంది.

ఆఖరికి జైలుశిక్ష పడ్డాక కూడా కూతురుకోసం ఎదురు చూసింది.

"ఈ రోజు కాకపోతే రేపయినా ఈ దురదృష్టవంతురాలైన అమ్మని చూడటానికి రాకపోతుందా!" అని ఆశ పడింది.

కాని సావిత్రికి నిరాశే మిగిలింది.

నిత్యం ఆ కరుకురాతి జైలు గోడలమధ్య ఇనుప కటకటాలకి తల వాల్చి, ఏ క్షణంలోనయినా, కూతురు తనని చూడటానికి వస్తుందేమోనని నిరీక్షిస్తుంది.

కళ్ళల్లో ఒత్తులు వేసుకుని నిరీక్షిస్తుంది.

సుజాత "అమ్మా...." అన్న పిలుపుకోసం....

చంద్రబింబంలాంటి ఆ అమ్మాయి ముఖారవిందంకోసం....ఆమె తల్లి మనసు తహతహలాడిపోతుంది.

ఒక వెర్రి అన్వేషణ....

ఎడారిలో ఎండమావికోసం అర్రులుచాచే పాంథుడిలా ఒక తపన....

కన్నీళ్ళు కార్చి కార్చి సావిత్రి కళ్ళు ఎండిన బావుల్లా అయి పొయ్యాయి.

ప్రశంసగా అన్నా జవాబు చెప్పదు.

అలా రెప్పలెత్తి నిశ్శబ్దంగా వాళ్ళ మొఖంలోకి ఒకసారి చూసి తిరిగి తల దించుకుని తన పనిలో లీనం అయిపోయింది.

సావిత్రి జైలుకి వచ్చి ఏడాది దాటింది.

o o o

కలిమి లేములు—కావడి కుండలని — కష్టసుఖాలు వెలుగు—నీడ అని అంటారు పెద్దలు.

"అప్ అండ్ డౌన్సు ఇన్ లైఫ్ బట్ నాచురల్...." అని జీవితం గురించి నిర్వచనం చెప్తారు.

జగత్తుని చీకటి మయం చేసిన అమావస్య గడిచి సన్నగా చంద్రోదయం అవుతుంది. అలా చూస్తూ వుండగానే కన్నుమూసి తెరిచినంతలో పున్నమి వస్తుంది.

పిండి జల్లెడ పట్టినట్లు వెన్నెల నింగినుంచి ధారలుగా కురిసి జగత్తుని రసమయానందంతో ముంచెత్తుతుంది.

పెనుగాలికి నేలకూలిన తీగ ఏ చిన్న ఆసరా దొరికినా అందుకుని పైకి ఎగబ్రాకి మారాకువేసి చిగురు మొగ్గలు తొడుగుతుంది.

శిశిరంలో ఎండిన మ్రోడు కూడా వసంతంలో పచ్చగా చేవ తేలి చిగురించి నిలువెల్లా పూత పిందెతో కొత్త పెళ్ళి కూతురులా తయారవుతుంది.

కాని ఈ సమాజంలో స్త్రీకి అపాటి అదృష్టంగాలేదు.

ఒకసారి సౌభాగ్యంపోతే తిరిగి రాదు. సావిత్రి జీవితమే అందుకు ప్రబల నిదర్శనం.

అందుకు ఆడదై పుట్టటం కంటే అడవిలో మ్రానై పుట్టడం నయం అంటారేమో!

మరి నిజమే కదా!

కాలగర్భంలో రెండు సంవత్సరాలు గిర్రున తిరిగాయి.

కాలం కల్సి వచ్చిన వాళ్ళకి రెండు సంవత్సరాలు అంటే రెండు క్షణాలు.

కాలం కాటు వేసిన వాళ్ళకి రెండు సంవత్సరాలు అంటే రెండు యుగాలు....

సుజాత జీవితంలో రెండు యుగాలు గడిచాయి. ఇప్పుడు ఆమె వయసు పదహారేళ్ళు.

“స్వీట్ సిక్స్‌టీన్....కలలు కనే వయసు.

కాని ఆమె వయసుకి వుండవలసినంత వుత్సాహంలేదు.

ఆమెలో ఆనందం కాగడాపెట్టి వెతికినా కనిపించదు.

తెల్లగా వెన్నెల పోగు పోసినట్లు....మల్లెలు గప్పున విరగబూసి పరిమళాలు విరజిమ్మినట్లు వుంటుంది ఆమె రూపం....

కాని ఆమె చూపుల్లో జీవం లేదు.

పాలరాతి శిల్పానికి గాజుగుడ్డ పొదిగినట్లు వుంటుంది ఆమె రూపం....

“కీ” ఇస్తే ఆడే బొమ్మలా యాంత్రికంగా మారిపోయింది.

ఆమెలో.... వుత్సాహం, ఆనందం, కోరికలు .... ఇలాంటి రసానుభూతులకి అర్థం కనిపించదు.

కాని....

ఎప్పుడైనా తల్లి జ్ఞాపకం వస్తే మాత్రం విషాదంతో ఆమె వదనం కృంగిపోతుంది.

మేఘావృతమైన నల్లని ఆకాశంలా ఆమె మనసు బరువెక్కిపోతుంది.

చల్లగాలికి సన్నగా చినుకు రాలినట్లు తల్లి జ్ఞాపకాలతో మనసు ఆర్ద్రం అయి కన్నీటి వర్షంగా....తుపానుగా....ఆమె చెక్కిళ్ళమీద జాలువారుతుంది.

అంతే.

అంతకు మించి ఆ అమ్మాయిలో భావావేశం కనిపించదు.

క్రమంగా ఆ "హవుస్"లో బ్రతుక్కి అలవాటు పడి పోయింది.

అక్కడ ఆమె ఒక్కర్తెకాదు.

చాలామంది అమ్మాయిలు వున్నారు.

ఎక్కడెక్కడో కొత్త అమ్మాయిలు వస్తు వుంటారు.

అక్కడున్న వాళ్ళలో కొంతమంది ఎక్కడెక్కడికో వెడుతూ వుంటారు.

అదంత ఒక విషవలయం.

కొత్తలో సుజాతకి చాలా ఆందోళనగా వుండేది. కాని రాను రాను ఆ విషయం గురించి ఎక్కువగా ఆలోచించి మనసు పాడు చేసుకోవడం మానివేసింది.

ఒక విధమైన నిర్వికారం....

పగటి పూట ఎక్కువగా బయటికి వెళ్ళవలసిన అవసరం వుండదు.

కాని రాత్రి పూట మాత్రం తరచు బయటికి వెళ్ళవలసి వచ్చేది.

వాళ్ళే దగ్గరుండి తీసుకొని వెళ్ళి, తిరిగి తీసుకు వస్తారు.

జమా జట్టీల్లాగా వుండే వస్తాదుల్లాంటి మగవాళ్ళు సదా ఆ ఇంటిని అంటిపెట్టుకుని వుంటారు.

వాళ్ళలో "నాగు" అను వాడు ఒకడున్నాడు. పేరుకి తగినట్లే నల్లటి ఒళ్ళు తెల్లటి కళ్ళు.

వాడు చూస్తుంటే పాము పగబట్టినట్లే వుంటుంది.

వాడి చూపులు విషం చిమ్ముతు వుంటాయి. వాడంటే అక్కడ చాలామంది అమ్మాయిలకి ఎందుకో ......... భయం సుజాతకి ఇంకా భయం.

వాడు అక్కడ ఆడపిల్లలకి బాడి గార్డు. వాడి అసలు పేరు నాగు కాదు.

రూపాన్ని బట్టి అమ్మాయిలందరూ కలిసి వాడికి ఆ పేరు పెట్టారు.

ఒక అవినీతి విషయం తప్పితే మిగతా అన్ని విషయాలు బాగానే వుంటాయి.

మంచి మంచి చీరలు....మంచి భోజనం ఇస్తారు.

ఏవేళా డ్రెస్సింగ్ టేబిల్స్ నిండా రకరకాల కాస్మెటిక్స్ వుంటాయి.

మత్తుగా పరిమళాలు విరజిమ్మే హెయిర్ ఆయిల్సు బాడీస్ప్రేలు, సెంట్సు....చాలా ఆడంబరంగా వుంటాయి.

పెద్ద పెద్ద పోష్ హోటల్సుకి కాంట్రాక్ట్సు తీసుకుంటారు.

వందలమీద వేలమీద నడుస్తుంది వ్యాపారం.

ఐహిక సుఖాలకి అక్కడ లోటులేదు.

కాని అక్కడ వున్న లోటల్లా ఒక్కటే.

జీవితంలో అసలైన మానసిక ఆనందం....తృప్తి....?

ఇలాంటివన్నీ అక్కడ లుప్తం.

మచ్చుకైనా కానరావు. అక్కడ వున్నదంతా ఒకరకమైన కృత్రిమ ఆనందం....కృత్రిమ వాతావరణం....

శరీరాలకి అత్తరువుల పరిమళాలు అలముకున్న ఏ మూల నుంచో భరించరాని దుర్గంధం వేస్తూ వుంటుంది.

ఆ వాసన అంతరాంతరాల లోనిది కావచ్చు. "ఆఖరికి తను ఎలాంటి వాళ్ళలోకి వచ్చిపడింది!"

తల్చుకుంటే సుజాతకి ఒకోసారి రాత్రిళ్ల అసలు నిద్రపట్టేది కాదు.

రోజులు గడుస్తున్న కొద్దీ ఆ రకమైన బానిసత్వపు బ్రతుక్కి విసిగి పోయింది.

విముక్తి కోసం రోజులు లెక్కించుకుంటోంది.

సరిగ్గా అక్కడ జైల్లో సావిత్రి మానసిక పరిస్థితి అలాగే వుంది.

అక్కడికి వచ్చాక "సుజాత" పేరు "సుషమ"గా మారింది.

ం ం ం

సమయం....

రాత్రి పదకొండు గంటలు కావస్తోంది.

నగరం నిశీదేవి గార పరిష్వంగణలో క్రమంగా నిద్రకి జోగుతూంది.

చిరు చలిగాలులు మందంగా వీస్తున్నాయి.

చీకటి బద్ధకంగా అవులిస్తూంది.

హోటల్ బృందావన్ లాడ్జి ముందు మెత్తగా టాక్సీ వచ్చి ఆగింది.

తల వంచుకుని "సుజాత" నిశ్శబ్దంగా అందులోంచి దిగింది.

ఆమె వెనకాలే ఇద్దరు యువకులు కూడా టాక్సీ దిగారు.

కరాటే, జూడో, జుజుట్స్, కుంగ్‌ఫూ ... వంటి తొమ్మిది రకాల మార్షల్ ఆర్ట్సులో శాస్త్రవరంగా తరిఫీదు పొందిన యువకులు వాళ్ళు.

వాళ్ళిద్దరూ సుజాత బాడీ గార్డ్సు. బృందావన్ కాంపౌండ్ వాల్ దాటి ముగ్గురు లోపల భవంతిలోకి వచ్చారు.

సుజాత (సుషమ) చేతిలో చిన్న విజిటింగ్‌కార్డు లాంటిది పెట్టి వాళ్ళిద్దరూ "రెసెప్షన్"లో కూర్చున్నారు.

సుజాత లిఫ్టులో మూడవ అంతస్తుకి వెళ్ళింది. చాలా మామూలుగా యాంత్రికంగా వెళ్ళింది. ఆమెలో ఏ భావము లేదు.

పన్నెండవ నెంబరు గది ముందుకి వెళ్ళి చిన్నగా తలుపుమీద శబ్దం చెయ్యబోయింది. కాని—

తలుపు ఓరవాకిలిగా తెరిచే వుంది.

ఈ రెండు సంవత్సరాలుగా సుషమ పేరుతో ఆ రకమైన జీవితానికి అలవాటు పడిపోయింది సుజాత.

ఆమె మానసికంగా ఏనాడో చచ్చిపోయింది.

సుజాత నెమ్మదిగా తలుపు తెరిచి లోపలికి ప్రవేశించి తిరిగి తలుపు మూసింది.

గదిలో మందంగా నీలిరంగు బెడ్‌లైట్ వెలుగుతోంది.

ఒక ప్రక్క డబుల్ కాట్ బెడ్.... తెల్లగా దోమతెర దించి వుంది.

కిందంతా మెత్తటి కార్పెట్ పరిచి వుంది.

"అతను" కిటికీ దగ్గర అటువైపుకి నిల్చుని వున్నాడు.

అతని పెదవుల మధ్య సిగరెట్ కాలుతోంది.

కిటికీలోంచి తెరలు తెరలుగా వీస్తున్నగాలి అతని చెంపల్ని నిమిరి.... సన్నగా జుత్తుని కదిలిస్తూంది.

గదంతా ఒకవిధమైన సన్నని పరిమళం.... అలుముకుంది.

అతను కిటికీలోనుంచి బయటికిచూస్తూ చాలా దీర్ఘమైన ఆలోచనలో నిమగ్నం అయివున్నాడు.

సుజాత నెమ్మదిగా తలుపు దగ్గర్నుంచి కదిలి లోపలికి రెండు అడుగులు వేసింది.

ఆమె కాలినున్న సన్నని మువ్వల పట్టీలు సన్నగా చిరు శబ్దం చేశాయి.

ఆ అలికిడికి అతడు వులికిపడినట్లయి చప్పున చేతిలో సిగరెట్ గిరాటేసి ఇటు తిరిగాడు.

రెండు జడలతో.... తెల్లటి మాక్సితో సన్నజాజి మొగ్గలా లేతగా నాజూగ్గా వున్న ఆ అమ్మాయిని చూడగానే.... ఎందుకో.... అప్రతిభుడయి పొయ్యాడు.

క్షణంలో అతని కనుబొమ్మలు ముడిపడ్డాయి.

శరీరంలోని రక్తప్రసారం ఆగిపోయినట్లు కొద్దిక్షణాలు అలాగే కొయ్యబారి చిత్తరువులా నిల్చుండి పొయ్యాడు.

సింహాన్ని చూసిన మేకలా త్రుళ్ళిపడి వేగంగా ఆమెవైపు పడ బోతున్న అడుగుని గబుక్కున వెనక్కి తీసుకున్నాడు.

అతని మొహం నిండా కళ్ళనిండా ఆశ్చర్యం. మూసివున్న తలుపులు సన్నగా తెరుచుకున్నట్లు.... అతని హృదయపు అట్టడుగు పొరల్లో.... తరగలు తరగలుగా ఏవేవో.... జ్ఞాపకాలు.... నీలినీడలు....

అతని అంతరంగంలో సన్నగా కలకలం....ఆ అమ్మాయిని ఏదో అడుగుదామని నోరు తెరిచాడు.

కాని గొంతులో వచ్చి వెలక్కాయ పడ్డట్టు మాట పెగల్లేదు.

కంఠంలోనే మాటలు సుడి తిరిగి ఆగిపోయ్యాయి.

అలాగే పరిశీలనగా ఆమెని చూస్తూ సంభ్రమంగా నిలుచుండి పోయ్యాడు.

అతని ప్రవర్తన చాలా చిత్రంగా తోచింది సుజాతకి.

ఇంతవరకు అలాంటి విచిత్ర అనుభవం ఆమెకి కలగలేదు.

గదిలోకి అడుగు పెట్టగానే—ఆకలిగొన్న చిరుత జింకపిల్ల మీదకి దూకినట్లు—చేదు అనుభవాలే తెల్సు ఆమెకి.

కాని ఏ వ్యక్తి ఇంతవరకు ఇతనిలా మర్యాదగా ప్రవర్తించలేదు.

ఒక్కసారి వాలుగా కళ్ళెత్తి అతని మొఖంలోకి చూసి చప్పున తల దించుకుంది.

అతను మరీ యువకుడు కాదు.

కాస్త వయస్సు మళ్ళిన వాడిలాగే ఉన్నాడు. చెంపల దగ్గర్నుంచి జుట్టంతా నెరిసింది. కళ్ళకి అద్దాలు పెట్టుకున్నాడు.

వయసు పైబడ్డా అతని మొఖంలో మంచి వర్చస్సు అందం పోలేదు.

"... ...."

"........"

సుజాత మౌనంగా తలదించుకుంది.

ఇద్దరి మధ్య కొద్ది క్షణాలు నిశ్శబ్దం....

వచ్చి పది నిమిషాలు అయినా ఇంకా అలాగే తలుపు దగ్గర నిల్చుంది సుజాత.

ఆ తరువాత అతనిలోని ఆశ్చర్యానికి హఠాత్తుగా అర్థం స్ఫురించింది సుజాతకి.

"తనుగాని రాంగ్ నెంబర్ గదికి రాలేదు కదా!"

గభాల్న వెనక్కి తిరిగింది.

చేతిలో కార్డు చూసింది.

"పన్నెండు".

తలుపుమీద అదే నెంబరు వుంది. మరి!

ఇంతలోనే వెనకగా అతని పిలుపు వినిపించింది.

"ఇదిగో.... ప్లీజ్ వెళ్ళద్దు...."

వెయ్యిబారల నూతులోంచి వచ్చినట్లుగా వుంది అతని స్వరం.

ఆ గొంతు ఆజ్ఞాపించినట్లు లేదు.

అభ్యర్థించినట్లు వుంది.

కాళ్ళకి సంకెళ్ళు పడినట్లు సుజాత ఆగిపోయింది.

ఆ కంఠం....అతని పిలుపు....గుండె లోతుల్లో....ఎక్కడో.... చాలా సుపరిచితం అయినట్టు తియ్యగా స్ఫురించింది.

హృదయంలో సన్నగా కలకలం. అతన్ని ఎ....క్క....డో చూశాను అన్న భావన.

నెమ్మదిగా తల ఎత్తి అతని మొహంలోకి ఈసారి....చాలా పరిశీలనగా....చూసింది.

సరిగ్గా అదే క్షణంలో అతడు అలాగే ఆమెకేసి చూశాడు.

ఇద్దరి చూపులూ కలిశాయి.

అతని మెదడులో "ఛమక్" మని మెరుపు మెరిసి మాయం అయ్యింది.

అతడు గభాల్న దూకినట్లు ఆమె దగ్గరికి వచ్చాడు.

సుజాత చేతిని గట్టిగా పట్టుకుని ఆమె ముఖంలోకి గుచ్చి చూస్తూ అడిగాడు.

"నీ.... నీ పేరు?"

"సు... సు....ష్మ...."

"సుష్మా"

"మీదే వూరు?"

"...."

"మీ అమ్మా నాన్న ఎక్కడ వుంటారు?"

"...."

"వాళ్ళేం చేస్తారు?"

"...."

"విన్నే...." అతను ఆవేశంలో సుజాత భుజాలు పట్టి కుదిలించాడు.

సుజాతకి గుండె ఝుల్లుమంది.

దుఃఖం పొంగి వచ్చింది.

ఘనీభవించిన మంచు మీద సన్నగా వేడి సూర్య కిరణం పడినట్లు —

ఇన్నాళ్ళుగా ఆమెలో కరుడు కట్టిన వేదన సన్నగా కరగసాగింది.

గత రేండేళ్ళుగా యాంత్రికమయిన జీవితానికి అలవాటు పడిపోయింది.

ఇలా గదిలోకి అడుగు పెట్టగానే గుండెని వాడి గాయాలు చేసే చేదు అనుభవాలు, సూది మాటలే ఆమెకి తెల్సు.

కాని —

"నీ పేరేమిటి! నీ దేవూరు...." అంటూ ఇంత ఆత్మీయంగా స్నేహభావంతో ఎవరూ సంభాషించలేదు.

అసలు ఇంత సాత్వికంగా సంభాషించిన మనిషే లేడు.

ఈ కుశల ప్రశ్నలు.... ఈ ప్రేమ....అనురాగం స్నేహశీలత.... మర్చిపోయి ఎన్నాళ్ళు అయింది.

కాని—

ఈ రోజు ఈయన ఎవరో.... ఎంతో ఆత్మీయంగా పలకరిస్తున్నాడు.

ఎండిన బీడుపై తొలకరి జల్లు పడినట్లు ఆనందంతో సుజాత మనసు పులకరించింది.

ఒక్కసారిగా తన చిన్నప్పటి 'గతం' జ్ఞాపకం వచ్చింది.

దాంతోపాటే తల్లి తండ్రి తమ్ముడు, వీళ్ళ మధ్య తన జీవితం ఆ రోజుల్లో తను పొందిన ఆప్యాయత, అనురాగం, ఆనందం, తండ్రి అపురూపం, గారాబం, అన్నీ జ్ఞాపకం వచ్చాయి.

ఎడారిలో కోయిల గానం వినిపించినట్లు ఆమె మనసు ఆనందంతో పరవశించి పోయింది.

ఆ ఆనందంలోంచే వెల్లువలా దుఃఖం పొంగి వచ్చింది.

గట్టుతెగిన వరదలా కన్నీళ్ళు పొంగుతుంటే గభాల్న నేలమీద కూర్చుని చప్పున మోకాళ్ళ మధ్య తలదాచుకుంది.

పది నిముషాలు....పావుగంట....ఆమె అలాగే నేలమీద కూర్చుండి పోయింది.

అతని కేటూ తోచలేదు.

ఆమెకేసి అలా చూస్తూ స్తబ్ధుగా వుండిపొయ్యాడు.

ఆమె విపరీతంగా దుఃఖం పడుతోంది అనటానికి నిదర్శనంగా ఆమె భుజాలు తీవ్రంగా కంపించసాగాయి.

ఆగి ఆగి చిన్నగా ఏక్....ఏక్....అన్న శబ్దం....

దాంతో అతడు స్థంభీ భూతుడయ్యాడు.

ఆ అమ్మాయి అంత హఠాత్తుగా ఎందుకు ఏడుస్తుందో అతనికి అర్థం కాలేదు.

ఇప్పుడు తనే మన్నాడని?

తనేమయినా తప్పుగా మాట్లాడాడా ?

లేదే? !

పోనీ....తను కాస్త నెరిసిన జుత్తుతో కొంచెం పెరిగిన గెడ్డంతో కాస్త పెద్దవాడిలాగ కనిపిస్తున్నాడు.

ఆ అమ్మాయి తన్ని చూసి భయంతో అలా ఏడుస్తోందా!....

ఊహూం....
అదీ కాకపోవచ్చు.
ఆ అమ్మాయి కాల్ గర్ల్.
వాళ్ళకి డబ్బు ముఖ్యం.
మిగతా విషయాలు వాళ్ళకి పట్టవు అంటారు కదా.
మరి?
ఆమె ఎందుకంతగా ఏడుస్తోంది?
తన ప్రవర్తన ఆమెకి నచ్చలేదా?
ఏదో....కాలక్షేపంగా తన ఆనందంకోసం
ఆ అమ్మాయిని పిలుపించుకున్నాడు.
అంతటితో ఆగిపోయివుంటే సరిపొయ్యేది.
కాని పర్సనల్ విషయాలు అడిగాడు.
నిజంగా అది తన తప్పే....

ఇతరుల ఆంతరంగిక విషయాలు తెలుసుకోవాలి అనుకోవటం నిస్సందేహంగా పొరపాటే.

ఆ సంగతి తనకి తెలియంది కాదు.

కాని—

ఎందుకో....ఆ అమ్మాయిని....చూడగానే తన మనసు స్పందించింది.

ఆమె పరాయి పిల్ల అన్న భావన గాలేదు.

"ఇది" అని చెప్పలేని ఒక అనిర్వచనీయమైన ఆత్మీయతతో ఆమెని పలకరించాడు.

కాని తన ఆత్మీయతని ఆమె తప్పుగా అర్థం చేసుకుని వుంటుంది.

ఆమెను తను ఆంతరంగిక విషయాలు అడిగి అవహేళన చేస్తున్నాడు అని భావించి వుంటుంది.

అందుకే ఆమె ఏడుస్తోంది....

క్రింద ఎర్రటి కార్పెట్ మీద ముడుచుకున్న మల్లెమొగ్గలా కూర్చున్న ఆమెని చూస్తుంటే అతనికి ఏం చెయ్యటానికి పాలుపోలేదు.

కన్నార్పకుండా ఆమెని చూస్తూ చాలాసేపు అలాగే కూర్చుండి పొయ్యాడు.

"........"

"........"

ఇద్దరిమధ్య కొద్దిసేపు నిశ్శబ్దం.....

ఒక విధమైన విషాదం నిండిన నిశ్శబ్దం....

ఆ అమ్మాయి ఇంకా ఉద్వేగంతో దుఃఖపడుతోంది అనటానికి నిదర్శనంగా —

"ఏక్....ఏక్...." అన్న ఆమె వెక్కిళ్ళ ధ్వని తప్ప ఇంకే చిన్న అలికిడి లేదు.

అతనికి ఒక్క క్షణంసేపు ఎటూ పాలుపోలేదు.

ఏమీ తోచలేదు.

ఆ అమ్మాయి అంత హఠాత్తుగా ఎందుకు ఏడవటం మొదలు పెట్టిందో అసలే అర్థం కాలేదు.

కాని —

ఆ నిశ్శబ్దంలోంచి ఆమె సన్నని రోదన....అతని గుండెని కదిలిస్తూంది.

నిస్సందేహంగా తను ఏదో అనుచితంగా మాట్లాడి వుంటాడు.

అందుకే ఆ అమ్మాయి అంతగా వెక్కిళ్ళుపెట్టి ఏడుస్తోంది అన్న విషయం మాత్రం రూఢి అయ్యింది.

ఆ ఆలోచనలతో గభాల్న కుర్చీలోంచి లేచి నేలమీద ఆమెకి చేరువగా వచ్చి కూర్చున్నాడు.

తన అరచేతిని ఆమె తలపై వేసి నిమురుతూ .... మార్దవంగా అన్నాడు.

"ఇదిగో....చూడమ్మాయి........ఎందుకు అలా ఏడుస్తున్నావ్. ఇందాక నేను మాట్లాడిన దాంట్లో పొరపాటు ఏమైనా వుంటే క్షమిం...."

కోడెతాచు తల విసిరినట్లు సుజాత ఖంగారుతో గభాల్న తల ఎత్తింది.

"లేదు....లేదు... " అన్నట్లు తల అడ్డంగా అటు ఇటు వూపింది.

"మరి ఎందుకు ఇంతలా ఏడవటం? నేను అసలు నిన్ను ఏమీ అన లేదు కదా?"

సుజాత ఒక్కసారి విశాలంగా కళ్ళెత్తి ఆయన మొఖంలోకి చూసింది.

రక్తంలో ముంచి తీసిన కలువరేకుల్లా ఆమె కళ్ళు దుఃఖంతో ఎర్రబడి పొయ్యాయి.

పెదాలు స్వల్పంగా కంపిస్తున్నాయి.

కంపిస్తున్న స్వరంతో సుజాత అంది -

"నన్ను మీలా ఇంత ఆత్మీయంగా ఇంతవరకు ఎవ్వరూ పల్క రించలేదు.

మీరు ప్రవర్తించినంత మర్యాదగా యెవ్వరూ నాతో ప్రవర్తించలేదు.

నేను గదిలోకి రాగానే రాక్షసంగా ప్రవర్తించేవాళ్ళు, అసభ్యంగా మాట్లాడేవాళ్ళు.

కాని మీలా ఇంత ఆత్మీయంగా చక్కగా ఎవ్వరూ నాతో ప్రవర్తించ లేదు.

అందుకే నాకు తెలియకుండానే దుఃఖం వచ్చేసింది.

ఇలాంటి ఆత్మీయత, ఆపేక్ష మర్చిపోయి చాలా రోజులు అయ్యింది...."

వెక్కిళ్ళమధ్య చెప్పడం ఆపి కన్నీరు తుడుచుకుంది.

తలమీంచి పెద్ద బరువు దిగిపోయినట్లు అతనికి ఆనందం అవి పించింది.

ఆమె దుఃఖానికి కారణం తెలిశాక అతని మనసంతా చల్లగా అయ్యింది.

ఆ అమ్మాయి బేలగా, అమాయకంగా చెప్తూ వుంటే జాలిగా ఆమె మొఖంలోకి చూశాడు.

తనకి తాను మనసువిప్పి చెప్పుకుంటున్నట్లు గుబులుగా అన్నాడు.

"అమ్మాయ్? ...ఎందుకో....నాకు నిన్ను చూడగానే మనసంతా ఎంతో ఆత్మీయంగా అనిపించింది. నిన్ను ఇదివరకే....ఎప్పుడో....ఎక్కడో చూసినట్లు....నాకు బాగా కావల్సిన మనిషిలా అనిపించావు.

అందుకే తరచి తరచి నీ పేరు వివరాలు అడిగాను.

ఈ హోటల్‌కి నేను చాలాసార్లు వచ్చాను.

బహుశా....నీలాగే పోలికలున్న వేరే అమ్మాయి ఎవరైనా జ్ఞాపకం వచ్చి వుండవచ్చు.

మనిషిని పోలిన మనుషులు వుంటారు కదా?

అన్నట్లు....నీ పేరు సుషమ అన్నావు కదూ?

చాలా మంచి పేరు. నిజానికి నాకా పేరుగల వాళ్ళెవరూ తెలియదు........"

ఎటో చూస్తూ గుబులుగా చెప్పాడు. ఆ మాటలు చెప్తున్నప్పుడు అతని మనసు అక్కడలేదు.

సుజాత కళ్ళు తుడుచుకుని నెమ్మదిగా లేచి మంచంమీద కూర్చుంది.

అతను లేచి ఆమెకి ఎదురుగా కుర్చీలో కూర్చున్నాడు.

మళ్ళీ అతనే అన్నాడు.

"అమ్మాయ్....నిజం చెప్తున్నాను. నిన్ను చూడగానే నా కెందుకో అభిమానం అనిపించింది.

కొందర్ని చూడగానే ఎందుకో ఆత్మీయంగా అనిపిస్తుందో....మరి కొందర్ని చూడగానే అకారణంగా ఎందుకు ద్వేషం రగులుతుందో....

అంతా మనకు తెలియకుండానే జరిగిపోయింది....నీ పేరు సుష్మ అన్నావు కదా?"

"ఊఁ...."

"నిజం చెప్పు నీ కెవ్వరూ లేరా? నీకీ వృత్తి ఇష్టంలేదు అన్నావు కదా? మరి అసలు ఇందులోకి ఎలా వచ్చావ్?"

'సుజాత కళ్ళల్లో నీలినీడలు....

అమావాస్య కారు చీకటిలో చిన్న నక్షత్రకాంతి మెరిసినట్లు.... ఆమె పెదవులపై సన్నని నవ్వు కదిలింది.

"నేనుగా ఇందులోకి రాలేదు వాళ్ళు బలవంతంగా యెత్తుకొచ్చారు నన్ను"

"నిజమా ?"

"నిజమే...."

"అయితే నీకు నా అనుకున్న వాళ్ళు ఎవ్వరూ లేరా? అంటే ...మీ అమ్మ మీ నాన్న....ఇలా అడుగుతున్నానని ఏమీ అనుకోకు ఎందుకో .... నిన్ను చూడగానే నాకు ఏదయినా సాయం చెయ్యాలి అనిపిస్తోంది. మరి అసలు నీ గురించి అంతా వివరంగా తెలిస్తేనే కదా నేనేమన్నా సాయపడ గలను"

"...."

సుజాత గభాల్న తల దించుకుంది.

వాడి గాయానికి చల్లని గంధపు మైపూతలా అతని గొంతు చాలా ఆత్మీయంగా అనునయంగా వుంది.

మళ్ళీ సుజాత కళ్ళనిండా కన్నీరు పొంచి మూసుకున్న కనురెప్ప ల్లోంచి జలజలా రాలింది.

ఆ క్షణం ఎందుకో....సుజాతకి తన జీవితం గురించి నిజం చెప్పాలి అనిపించలేదు.

నిజం చెప్పితే తనకి అతన్నుంచి ఆపాటి ఆప్యాయత కూడా లభిం చకపోవచ్చు అనిపించింది.

తనా ఇలాంటి జీవితం గడుపుతోంది. హత్యచేసి తన తల్లి జైల్లో వుంది.

తన తండ్రి తమని ఒదిలి పెట్టేశాడు.

ఇటువంటి చరిత్ర చెప్పుకున్నందువల్ల జరిగే లాభం కంటే నష్టమే ఎక్కువ కదా?

అలాంటప్పుడు ఆ విషయాల గురించి చెప్పకపోతే మాత్రం ఏమిటి !

చెప్పినందువల్ల తను మరింత లోకువ అవటమే తప్ప ప్రయోజనం వుండదు అనిపించింది సుజాతకి.

అసలు తన జీవితం గురించి తల్చుకుంటే తనకే ఎంతో అసహ్యం వేస్తుంది.

అలాంటప్పుడు ఇతరులకి యింకా అసహ్యం అనిపించవచ్చును కదా ?

సుజాత చెక్కిళ్ళమీద జారుతున్న కన్నీటిని నిశ్శబ్దంగా పైయిట చెంగుతో అద్దుకుంది.

అతను మళ్ళీ కంగారు పడ్డాడు.

"ఇదిగో....అమ్మాయ్....నువ్వు చీటికి మాటికి ఇలా ఏడిస్తే ఇంక నిన్ను ఏమీ అడగను. కాని.... నిజంగానే నీ కెవ్వరూ లేనిమాట నిజమే అయితే....నిన్ను నాతో తీసుకువెళ్ళటానికి ప్రయత్నిస్తాను. మరి యిప్పుడు చెప్పు....ఏమంటావ్? నీ కిష్టమేనా ?"

"..."

"ఏమిటి, ఆయన తనని వాళ్ళింటికి తీసుకుని వెడతాడా. తాను పొరపాటుగగాని వినలేదు కదా!

సుజాతకి ఒక్కసారి గుండె బయటికి తీసి తిరిగి యధాస్థానంలో పెట్టినట్లు అయ్యింది.

సుజాత తలయెత్తి సంభ్రమంగా అతని మొహంలోకి చూసింది.

ఆమె కళ్ళల్లో తళతళా మెరుపులు మెరిశాయ్:

కోటి నక్షత్రాల కాంతి ఒక్కసారి గప్పున వెలిగి ఆరింది.

అతను చిన్నగా నవ్వాడు.

కారు చీకట్లో సన్నగా కాంతి కిరణం జారినట్లు .... క్షణకాలం ఆమె మొఖంలో కదిలిన ఆనందం చూసి అతనికి ఎంతో సంతృప్తి అనిపించింది నెమ్మదిగా అన్నాడు.

"అమ్మాయ్, మళ్ళీ చెప్తున్నాను, జాగ్రత్తగా విను నిజంగా నీమీద ఆధారపడి జీవిస్తున్న వాళ్ళు ఎవ్వరూ లేనిమాట నిజమే అయితే —

ఏ మాత్రం అవకాశంవున్నా - నిన్ను నాతో తీసుకోని వెళ్ళడానికి ప్రయత్నిస్తాను....

నువ్వు నన్ను నమ్మినా నమ్మకపోయినా ఇందులో దురుద్దేశ్యం ఏదీ లేదు.

నిన్ను చూడగానే నాకు ఎందుకో నీపై ఎనలేని ఆత్మీయతాభావం స్ఫురిస్తోంది.

నీ కోసం ఏదైనా చెయ్యాలన్న తపన నాలో చెలరేగుతోంది.

నేనూ ఒంటరిగాడ్ని.

జీవితంలో ఎన్నో ఆటుపోటులు తిన్నాను.

ఏదో డబ్బుకి లోటులేదు.

బాగానే సంపాదిస్తున్నాను.

కాని ఆత్మీయతకోసం 'నా' అన్న మనిషికోసం నా మనసు తపిస్తూంది.

నా చుట్టూ ఆశ్రితులు లేకపోలేదు.

కాని వాళ్ళందరికీ నా మీదకంటె నా డబ్బుమీదే ప్రేమ ఎక్కువ.

ఎవరైనా ఒక అనాధ బాలికను పెంచుకోవాలని చాలా రోజులుగా అనిపిస్తోంది.

అయితే ఆ అమ్మాయివి నువ్వే ఎందుకు కాకూడదు."

"........"

"నిన్ను చూడగానే నాలో చిత్రమైన స్పందన. మనిద్దరికీ ఏ జన్మలోనో బంధం వుండి వుంటుంది. ఇదంతా దైవఘటనగా నేను నమ్ముతున్నాను. నాకు చాతనయినంత వరకూ నీకు ఒక మంచి భవిష్యత్తు ఏర్పాటు చెయ్యటానికే ప్రయత్నిస్తాను. ఏమంటావ్ ...చెప్పు? నాతో రావటం నీకు ఇష్టమేనా?"

ఆ మబ్బు రంగు డిమ్‌లైట్ కాంతిలో అతను కిటికీ దగ్గర నిల్చుని బయటికి చూస్తూ చెప్తూంటే సుజాత దిగ్భ్రాంతురాలు అయిపోయింది.

ఇతను చెప్తున్నదంతా నిజమేనా?
తనని నిజంగా అతడు తనతో తీసుకుని వెడతాడా?
ఈ కుళ్ళు బ్రతుకునుంచి తనకి విముక్తి కలిగిస్తాడా?
ఇన్నాళ్ళ తన వెక్కిళ్ళరోదన ఆ భగవంతుడు విన్నాడా?
తన మొర ఆలకించాడా?
తనని కరుణించటానికి ఈయన రూపంలో వచ్చాడా?
బురదలో పడ్డ పూవుని గంగాజలంతో కడిగి భగవంతుడి పాదాల దగ్గర పెడతాననంటున్నాడు....
ఈ లోకంలో ఇంకా ఇంత మంచివాళ్ళు కూడా వున్నారా?
సుజాత చెక్కిళ్ళమీద కన్నీరు ధారగా జారిపోతోంది.
ఆ కన్నీటి తెరల మధ్యనుంచి అతన్ని చూస్తూ అలాగే నిల్చుండి పోయింది,
ఆమె నుంచి ఎంతసేపటికీ జవాబు రాకపొయ్యేసరికి అతను చెప్పటం ఆపి....ఏదో స్ఫురించినట్లు గభాల్న వెనక్కి తిరిగాడు.
సుజాత ఏడవటం చూసి మళ్ళీ ఖంగారుపడ్డాడు.
గబగబా కిటికీ దగ్గర్నుంచి నాలుగు అడుగులు ఆమెవైపు వేసి కొంచెం కోప్పడినట్లు అన్నాడు.
"ఇదిగో అమ్మాయ్ ఇలా అస్తమాను ఏడవద్దని చెప్పాను కదా? నాతో రావటం ఇష్టం లేకపోతే ఆ మాట చెప్పొచ్చుకదా? పోన్లే..."
ఏదో చెప్పబొయ్యాడు.
కాని....అప్పటికే సుజాత యెవరో తోసినట్లు తూలి అతని పాదాల దగ్గర కూలబడిపోయింది.
"సార్....మీ రెవరో నాకు తెలియదు.
కాని చాలా మంచివారులా అనిపిస్తున్నారు.
దయచేసి ఎలాగైనా నన్ను మీతో తీసుకుపొండి.
ఈ జీవితం అంటే నాకు రోత. మీరు తీసుకెళ్ళకపోతే....నిజంగా.... నేను చచ్చిపోతాను ..."

ఆ మాటలు చెప్తున్నప్పుడు సుజాత కంఠం రుద్ధః అయిపోయింది.
ఆమె కళ్ళనుంచి ధారలుగా జారిన కన్నీరు అతని పాదాలు తడిపింది.
అనూహ్యమైన ఆమె ప్రవర్తనకి అతను నిరుత్తరుడయిపొయ్యాడు.
కొద్దిసేపు అతని నోట మాట రాలేదు.
ఎటూ తోచలేదు.

ఆ తరువాత తనని తను సంబాళించుకుని, ఆమె తలమీద చెయ్యివేసి నెమ్మదిగా ఓదారుస్తున్నట్లు చెప్పాడు.

"చూడు.... ఒక వారం రోజులు ఓపికపట్టు ఈలోగా నిన్ను తీసుకు వెళ్ళటానికి ప్రయత్నిస్తాను.

మరి డబ్బు అదీ చూసుకోవాలి కదా? పైగా నీ మేనేజ్‌మెంట్‌ని ఒప్పించాలి.

అయినా అవన్నీ నీకు అనవసరం.... నిన్ను మాత్రం తప్పకుండా ఇక్కడ్నుంచి నాతో తీసుకు వెడతాను ముందు ఆ కన్నీళ్ళు తుడుచుకో...."

"........"

ఆ మాటలు చెప్తున్నప్పుడు అతని గొంతు ఎంతో దీనంగా మార్దవంగా అయిపోయింది.

గుండెల్లోని విషాదం అంతా వెలికి వస్తున్నట్లు దిగులుగా చెప్పసాగాడు....

"అమ్మాయ్.... నా గడిచిన జీవితం అంతా నిస్సారంగా నిష్ప్రయోజనంగానే గడిచిపోయింది.

భగవంతుడు క్షమించలేని ఎన్నో అవినీతి పన్లు చేశాను.

నా అంతరాత్మ మొరాయిస్తున్నా, నా కెంత కావల్సిన వాళ్ళ విషయంలోనే మానవత్వం లేకుండా ప్రవర్తించాను.

ఈ రోజు.... ఇంత విశాల ప్రపంచంలో నేను ఏకాకిలా ఒంటరిగా బ్రతుకుతున్నాను.

ఈ ఏకాకిత్వంలోని శూన్యం నేను ఎవ్వరికీ చెప్పుకోలేనిది.

నా అనుకున్న మనిషికోసం నా హృదయం తపించిపోతోంది.

నిన్ను చూడగానే.... ఎందుకో.... నా మనసుకి దగ్గిరగా అనిపిస్తు న్నావు.

ఇన్నేళ్ళ నా అన్వేషణకి.... ఆవేదనకి నీలో జవాబు కని పిస్తోంది.

నిన్ను నాతో తీసుకువెడతాను.

నీకు ఒక మంచి భవిష్యత్తు కలిగిస్తాను.

నా పాపాలన్నింటికీ ఈ రూపంగా ప్రక్షాళన చేసుకుంటాను.

ఇప్పటికయినా జీవితంలో ఒక మంచిపని చేశానన్న తృప్తి పొందు తాను....

అమ్మాయ్ సుష్మా! ఏడవకు.... ఎలాగైనా నిన్ను ఈ వూబినుంచి బయటికి లాగుతాను. నా మాట నమ్మ...." మృదువుగా తన కొన వేళ్ళతో ఆమె చెక్కిళ్ళమీద జారుతున్న కన్నీరు తుడిచాడు.

అనునయంగా ఓదార్చాడు.

వికసించిన కమలంలా వుంది ఆమె వదనం.

ఆమె విశాలమైన కళ్ళనిండా కృతజ్ఞతా వర్షం.

అప్పటికే సమయం మించిపోవటంతో సుజాత అతని దగ్గర సెలవు తీసుకుని కిందికి వచ్చేసింది.

'రిసెప్షన్'లో కూర్చున్న ఆమె బాడీగార్డ్సు ఇద్దరూ సుజాతని చూసి లేచి బయటికి వచ్చారు.

అప్పటికే గేటు ముందు టాక్సీ వేచివుంది.

సుజాత నిశ్శబ్దంగా వెళ్ళి టాక్సీలో కూర్చొంది.

సుజాత మొఖంలో వచ్చినప్పుడున్న నైరాశ్యం ఇప్పుడు లేదు.

వర్షించిన ఆకాశంలా నిర్మలంగా వుంది ఆమె వదనం.

టాక్సీ క్షణాల్లో వేగం అందుకుంది.

"అతను" మేడమీద తన గది బాల్కనీలో నిల్చుని టాక్సీ కను మరుగు అయ్యేదాకా అలాగ చూస్తూ నిల్చున్నాడు.

టాక్సీ కనుమరుగు అయ్యాక కూడా అతను చాలా సేపు అక్కడే పిట్టగోడకి ఆనుకుని నిశ్చలంగా నిల్చుండిపోయ్యాడు.

"సు....షమ్మ!"

అతని పెదవులమీద మాటి మాటికి ఆ పేరు కదులుతుంది. మనసు మెత్తగా అవుతుంది.

ఆ పేరు చాలా అపరిచితంగా వుంది.

కాని.... ఆ రూపం.... చాలా పరిచితమైనదిగా.... మనసుకి ఎంతో దగ్గరగా అనిపిస్తోంది.

ఆమె సమక్షంలో హృదయం ఎన్నడూ ఎరగని ఒకవిధమైన ఆత్మీయతతో స్పందిస్తూంది.

రక్తంలో సంచలనం....

ఎందుకిలా అవుతూంది తన మనసు?

ఆఫ్టరాల్ షి ఈజ్ ఎ కాల్‌గరల్....

కాని ఎందుకో.... ఆ మాట మనస్ఫూర్తిగా అనుకోలేక పోతున్నాడు.

మనసు ఎందుకో ఎదురు తిరుగుతూంది.

ఆమెకి వాగ్దానం చేసినట్లు.... ఈ వూబినుంచి ఆ అమ్మాయిని రక్షించగలడా?

ఆ అమ్మాయికి ఒక చక్కని భవిష్యత్తు చూపించగలడా?

....తన దగ్గర డబ్బుకి లోటులేదు.

కాని....

అసలు ఇంతకీ ఆమె ఎవరు?

దూరంగా "ఠంగ్ ... ఠంగ్...."మని రెండు గంటలు మ్రోగాయి.

అతను చిన్నగా నిట్టూర్చి లోపలికి వచ్చాడు.

ప్రశాంతమైన సరోవరంలో ఒక చిన్న గులకరాయి పడినట్లు అతని మనసంతా కలకలం....

o o o

సుజాత తన గదికి తిరిగివచ్చాక మిగిలిన ఆ రాత్రికూడా ఆమెకి సరిగా నిద్రపట్టలేదు.

ఒడ్డున పడి గిజ గిజా కొట్టుకుంటున్న చేప త్రుళ్ళి తిరిగి నీళ్ళల్లోకి పడినట్లు.

మనసంతా ఒక విధమైన ఆనందం పట్టరాని ఉద్వేగం....

మాటి మాటికి అతని రూపం కళ్ళముందు కదులుతూంది.

అతని మాటలు పదే పదే అమృత బిందువుల్లా చెవుల్లో మారు మ్రోగుతున్నాయి.

రెండేళ్ళ నుంచి ఈ పాడు జీవితం గడుపుతోంది.

ఏ ఒక్క రాత్రయినా తనకింతటి చక్కటి అనుభవం కలిగిందా?

అతను....

ఎంత సభ్యతగా ప్రవర్తించాడు।

ఎంత చక్కగా సంభాషించాడు !

నిజంగా తనని విడిపించి వాళ్ళింటికి తీసుకుని వెడతాడా ?

తనని చూస్తూంటే.... ఎక్కడో చూసినట్లు అనిపించిందిట ?

ఎవరో బాగా కావల్సిన మనిషిలా.... ఏ జన్మ బంధమో అనిపించిందిట.

నిజమేనా !

లేక మళ్ళీ ఇందులో కూడా ఏమన్నా మోసం దాగి వుందా?

పాపం.... అమ్మ ఆ శంకర్‌లాల్‌ని అలాగే నమ్మి చివరికి మోసపోయింది కదూ!

అమ్మ చదువుకోలేదు.

కాని తను అమ్మలా అమాయకురాలు కాదు.

ఇంక తను మోసపోకూడదు.

అతను నిజంగా తనని విడిపించి వెంట తీసుకొని వెడితే తను తప్పక వెడుతుంది.

ముందు ఈ బందిఖానా నుంచి........ఈ రొచ్చు నుంచి బయటపడాలి.

ఆ తరువాత పరిస్థితులను బట్టి ఏదో ఒక మార్గం ఆలోచించ వచ్చు.

కాని ....

ఇంతవరకూ అతనిలా తనతో ఎవరూ ప్రవర్తించలేదు.

అతనిలా ఆత్మీయంగా ఎవరూ మాట్లాడలేదు.

అసలు తనని ఒక మనిషిగా మాత్రం ఎవరు చూసారని!

సుఖాలు అందించే బొమ్మలా.... ఆటవస్తువులా వినోదంగానే చూశారు కదా!

కాని అతను!

ఎంత సంస్కార వంతంగా ప్రవర్తించాడు!

తన కన్నీళ్ళు తుడిచాడు.

తన తలమీద చెయ్యి వేసి నిమిరాడు.

ఒక చెడిపోయిన ఆడదాని మీద అంత దయనీయత ఎవరయినా చూపిస్తారా!

అవహేళన చేస్తారు.

వెలివేస్తారు.

కాని అతనిలా అంత చక్కగా ఎవ్వరూ ప్రవర్తించరు.

తన పేరు సుషమ అంటే నమ్మలేదు. గుచ్చి గుచ్చి అడిగాడు.

బహుశా........ ఇది వరకు అమ్మతో ఎప్పుడయినా పరిచయం కలిగిందా!

తనని అమ్మని ఎక్కడైనా చూశాడా.

ఎందుకలా పట్టిపట్టి అడిగాడు తన పేరుని?

అతను అలా అడుగుతుంటే తన పేరు సుషమ కాదు సుజాత అని చెప్పెయ్యాలి అనిపించింది.

కాని —

తను నిజం చెప్పదల్చుకోలేదు.

కొన్నాళ్ళ పాటు తన పేరు.... గతం....అంతా రహస్యంగా దాచాలి.

లేకపోతే అందరిలా అతను కూడా వెలివేస్తాడు.

ఒక హంతకురాలి కూతురుగానే చూస్తాడు.

తన తల్లి ఏ పరిస్థితిలో ఆ హత్యకి పాల్పడిందో చెప్పినా అర్థం చేసుకోడు.

భయంతో తనని దూరంగా విడిచిపెడతాడు.

అప్పుడు తను మళ్ళీ ఈ కూపంలో పడుతుంది.

ఆత్మీయతకి, ఆదరణకి కరువు వాచిపోతుంది.

తన బ్రతుకు మళ్ళీ మొదటికి వస్తుంది.

తన గతం గురించి అందరికీ చెప్పుకున్నందువల్ల జరిగేది ఏమీ లేదు. సరికదా నష్టం.

దొంగకూతురు దొంగ కాకపోయినా దొంగతనం అంటకడుతుంది లోకం.

అలాగే హంతకురాలి కూతురు హంతకురాలు. కాకపోయినా అలాగే చూస్తారు.

అందుకే అతనికి తను ఏమీ చెప్పకూడదు.

అతనికి ఎందుకో తనపై అనురాగం అభిమానం ఏర్పడింది.

ఈ వూబి నుంచి ఎలాగయినా బయటికి తీసుకుని వెడతానంటున్నాడు కదా!

తన కంతకంటే వేరే ఏం కావాలి?

ఆ తరువాత ఎలాగైనా జైల్లో వున్న అమ్మని కల్సుకోవాలి.

పాపం....తన మూలన అమ్మకి జైలు శిక్షపడింది.

ఆ రోజు శంకర్‌లాల్‌ని హత్య చేస్తుంటే అమ్మని చూసింది.

అంతే.

ఆ తరువాత మళ్ళీ అమ్మని చూడలేదు.

పాపం ....

ఇప్పుడెలాగుందో....
తన కోసం ఎంత పించ పోతోందో....
భగవంతుడు కరుణిస్తే ఎలాగైనా ఒకసారి అమ్మని చూడాలి.
చాతనయితే అమ్మ కోసం ఏదైనా చెయ్యాలి....
తను నిజంగా జీవితంలో తిరిగి అమ్మని చూడగలదా?
అమ్మ తనూ కలుసుకోగలరా?
లేక ....
సుజాత కళ్ళనుంచి ధారాపాతంగా కన్నీరు జారిపోతోంది.
ఆ కన్నీటి తెరల మధ్య తల్లి రూపం లీలగా కదులుతుంటే....
ఎప్పుడో నాల్గవ ఝాములో కలత నిద్రలోకి జారింది.
అప్పటికే తూర్పున వేగుచుక్క పొడిచింది.
దూరంగా కోళ్ళు కూస్తున్నాయి.

o o o

సరిగ్గా వారం రోజుల తరువాత సుజాతకి ఆ కొంపనుంచి శాశ్వతంగా విముక్తి కలిగింది.

పొరపాట్న పంజరంలో చిక్కుకున్న పిట్ట హఠాత్తుగా తలుపులు విరుచుకొని ఆకాశంలోకి ఎగిరిపోయినట్లు సుజాత ఆ బందిఖానా నుంచి బయట పడింది.

అతను.... అన్నమాట ప్రకారం.... సుజాత కోసం దాదాపు ఐదు వేలు ఖర్చు పెట్టి ఆమెని ఆ కొంప నుంచి బయటికి తీసుకు వచ్చాడు.

సముద్రగర్భంలో .... అగాథంలోపడి కొట్టుకుపోతున్న మనిషికి హఠాత్తుగా ఒక్క కొయ్య తెడ్డు ఆసరా దొరికినట్లు ఆమె మనసు ఆనందంతో పుప్పొంగిపోయింది.

నెల్ల తరబడి ఎంతో దుఃఖంతో వేదనలో బ్రిగ్గుళ్ళిపోయిన గుండె ఒక్కసారి తేలిక పడినట్టు—

కష్టాల కడలిలోంచి అఘాటున ఒడ్డుకి కొట్టుకు వచ్చినట్లు....

మొదటిసారిగా....ఎంతో ఆనందంగా....హాయిగా....గుండెలనిండా వూపిరి తీసుకుంది....

అతని పక్కన రోడ్డుమీద నడుస్తూంటే ప్రపంచాన్ని జయించినంత గర్వం అనిపించింది.

అతను....

ఎవరైనాగానీ....ఏ ఉద్దేశ్యంతోనయినా తనని అక్కడనుంచి బయటికి తీసుకునిరానీ....

కానీ, ఆ మురికి కొంపనుంచి ఈ విశాల ప్రపంచంలోకి తిరిగి కాలు పెట్టగలిగే అదృష్టాన్ని కలుగచేశాడు కద అనుకుంటే .... అతనిపట్ల ఆ అమ్మాయి హృదయం కృతజ్ఞతతో ముకుళించుకుని పోతోంది.

అతని పాదాలు కడిగి ఆ నీళ్ళు శిరస్సున జల్లుకోవాలి అన్నంత కృతజ్ఞత....

ఎంతో దర్జాగా అందరిలా తల ఎత్తుకుని అతని....వెంట....పది మంది నడిచే రోడ్డుమీద నడుస్తూంటే సుజాత హృదయం గర్వంతో వుప్పొంగిపోయింది.

అయితే —

"అతను నా కోసం ఇంత చేస్తున్నాడెందుకు."

అన్న ప్రశ్న అంతరాంతరాల్లో ముల్లులా కదులుతూ అలాగే వుండి పోయింది.

కేవలం అభిమానంతోనే అతడు ఇదంతా చేస్తున్నాడు అనుకుందుకు ఆమె మనసు అంగీకరించటంలేదు.

అతని ఈ చర్యకి ఈ సాహసానికి ఏదో బలీయమైన కారణం ఉండి వుంటుంది అనిపించింది.

అయినా నిస్సంకోచంగా అతని వెంట నడిచింది.

భగవంతుడే తనని రక్షించటానికి అతని రూపంలో వచ్చాడు అని పించిన క్షణం అది?

అక్కడ్నుంచి బయటికి రాగానే అతను సుజాతని ఒక హోటల్ గదికి తీసుకువచ్చాడు.

వారం రోజుల్నుంచి అతను అక్కడే బస చేశాడు.

అతను బిజినెస్ మాన్.

కాని చూడటానికి అలా అనిపించడు.

చెంపల దగ్గరంతా జుత్తు నెరిసి కొస్త మధ్యవయసు దాటుతున్న వాడిలా అనిపిస్తాడు.

చాలా నిరాడంబరంగా....సాత్వికంగా వుంటాడు తూచినట్లు మాట్లాడ తాడు.

ఎప్పుడూ అతని చేతిలో ఏదో ఒక పుస్తకం వుంటుంది.

భగవద్గీతో....వచన రామాయణమో....భారత కథో .... కృష్ణలీలా తరంగమో....ఇలా ఆధ్యాత్మకతకి సంబంధించిన పుస్తకాలు యెక్కువగా కనిపిస్తాయి.

అతను వ్యాపారి అంటే సుజాతకి నమ్మకం కలగలేదు.

అతని నివాసం అక్కడ కాదట.

వేరే హ్యాప్పీ ఫారెస్టు ఏరియాలో వుంటాడు.

అప్పుడప్పుడూ వ్యాపార రీత్యా వివిధ ప్రాంతాలకి వెళ్ళవలసి ఉంటుందిట.

అతనికి సంపాదనకి లోటులేదు.

కాని సంసారం, పిల్లలూ, అంటూ 'నా' అనుకున్నవాళ్ళు ఎవ్వరూ లేరుట.

అతను ఒంటరి వాడట!

ఆ మాట విన్నప్పుడు సుజాత చాలా ఆశ్చర్యపోయింది.

అతను సుజాతని తన "బస"కి తీసుకొని వెళ్ళేముందు దార్లో ఒక పెద్ద బట్టల దుకాణానికి తీసుకువెళ్ళాడు.

చక్కటి లేటెస్ట్ డిజైన్లతో వున్న అరడజను చీరలు, రెడీమేడ్ జాకట్లు....మరికొన్ని నిత్యావసరాలకి కావలసిన వస్తువులు కొన్నాడు.

ఆ తరువాత ఇద్దరూ అతను బస చేసిన హోటల్‌కి వచ్చారు.

సుజాత షవర్‌బాత్ చేసి అతను కొన్న కొత్తచీర కట్టుకుంది.

అంతకుముందు ఆమె ధరించిన దుస్తులు హోటల్ ముందు బిచ్చగత్తె అడుక్కుంటుంటే సుజాతచేత ఆమెకి దానం చేయించాడు.

సుజాతకి అతని ధోరణి చాలా ఆశ్చర్యాన్ని కలిగించింది.

ఆ తరువాత సుజాతని వెంటపెట్టుకుని దేవాలయానికి తీసుకెళ్ళి ఆమె పేర్న అర్చన చేయించాడు.

కాస్సేపు బజార్లో తిరిగి తనకి కావాల్సిన చిన్న చిన్న వస్తువులు కొనుక్కున్నాడు.

ఇద్దరూ కల్సి మంచి భోజన హోటల్ కి వెళ్ళి భోజనం చేశారు.

ఆ మధ్యాహ్నం దాదాపు రెండు మూడు గంటలసేపు సుజాతని ఒక్కర్తిని హోటల్ గదిలో వదలి అతను మళ్ళీ పనివుందని బయటికి వెళ్ళాడు.

ప్రయాణానికి టిక్కెట్లు బుక్ చేసుకొని సాయంత్రం దీపాలవేళకి తిరిగి వచ్చాడు.

ఆ రాత్రి తొమ్మిది గంటల ప్రాంతంలో హోటల్ గది రైల్వేస్టేషన్ కి వచ్చారు.

అప్పటికే ట్రైన్ ప్లాట్ ఫారంమీద సిద్ధంగా వుంది.

అతను ముందు సుజాతని ట్రైన్ ఎక్కించి ఆ తరువాత లగేజి అంతా సర్దాడు.

మరి పదినిమిషాల్లో ట్రైన్ కూతవేసి ప్లాట్ ఫాం దాటింది.

తన జీవితాన్ని మలుపు తిప్పుకున్న ఆ ప్రయాణం .... అతని పరిచయం.... సుజాత హృదయాన్ని పారవశ్యంతో ముంచి తేల్చింది.

o o o

ప్రభుత్వం "టెండర్" వేసి అడవుల్ని వేలం పాటకి పెడతారు.

అతను వేలం పాడి అడవుల్ని కొంటాడు.

వేలం పాటలో తను కొన్న ప్రాంతంలో "వర్క్" పూర్తి అయ్యే దాకా దాదాపు రెండు సంవత్సరాలపాటు ఆ ఫారెస్టు ఏరియాలోనే నివాసం ఏర్పరుచుకొంటాడు.

ఆ వ్యాపారంవల్ల మానసికంగా అతనికి ఎంతో ప్రశాంతత .... ప్రకృతి పరిశీలన దొరకటమేకాక ఆర్థికంగా కూడా మంచి లాభాలు వస్తాయి. అందమైన ప్రకృతి, మంచి గాలి, నీరు, చక్కటి ఆహారం, ఆరోగ్యకర మైన వాతావరణముతో పాటు చేతినిండా డబ్బుకి కూడా ఏ లోటూ వుండదు.

కాంట్రాక్టు ముగియగానే అక్కడ మకాం ఎత్తేసి మళ్ళీ "టెండర్" పడిన అడవి ప్రాంతాల్ని వేలంపాటలో కొంటాడు.

తిరిగి అక్కడ నివాసం ఏర్పరచుకొని పని ప్రారంభిస్తాడు.

అతనికి హంటింగ్ కూడా వచ్చు.

ఎప్పుడూ ఫుల్ లోడ్‌తో వున్న రెండు లైసెన్స్‌డ్ తుపాకులు అతని దగ్గర వుంటాయి.

హంటింగ్ అతని హాబీ కాదు.

కేవలం అడవుల్లో తిరుగుతాడు గనుక రక్షణ కోసం దగ్గర వుంచు కొంటాడు. అంతే పైగా అను శాఖాహారి.

ఈ బిజినెస్ వ్యవహారాలమీద అప్పుడప్పుడూ సిటీలకి వెళ్ళి వస్తూ వుంటాడు.

వెళ్ళినప్పుడల్లా వారం పది రోజులపాటు పెద్ద పెద్ద పోష్ హోటల్స్‌లో "బస" చేస్తూ వుంటాడు.

అతను ఒంటరివాడు.

తల్లి, తండ్రి, భార్యా బిడ్డలు అనే సంసార బందూబంలేదు.

డబ్బుకి లోటు లేదు.

అడివి ప్రాంతాల్లో దైవచింతనతో యోగీశ్వరుడిలా ఎంత ప్రశాంత జీవితం గడిపినా....అప్పుడప్పుడూ నాగరికతా వ్యామోహాల్ని కూడా చవి చూస్తూ వుంటాడు.

మరీ ముక్కుమూసుకుని ఐహిక సుఖాలకి దూరంగా ఉండే వయసు కూడా కాదు దానుది.

ఎడారిలో పయనించే పాంథుడు "దాహం" వేసినప్పుడు నీటిచెలమల

కోసం దేవులాడినట్లు అప్పుడప్పుడూ ఆనందాల కోసం ఆరాటపడుతుంది అతని మనసు.

సుజాత ఆ విధంగా తటస్థపడిన అమ్మాయే.

అడవుల్లో నివాసకారణంగా అరుదుగా.... గిరిజన స్త్రీల తోటి పల్లె పడుచుల తోటి కూడా సంబంధాలు లేకపోలేదు దానుకి.

కాని అవన్నీ తాత్కాలికం.

అయితే సుజాత వాళ్ళందరిలా అతని కంటికి కనిపించలేదు.

ఆమెని చూసిన మరుక్షణం హృదయం ఎందుకో....స్పందించింది.

ఆమె రూపం మనసుకి చాలా దగ్గరగా .... ఆత్మీయంగా అనిపించింది.

ఆ అమ్మాయిని చూడగానే "నా" అన్న భావన కలిగింది.

ఆమె కన్నీరు చూసి కరిగిపోయ్యాడు.

అంత నిస్సహాయ పరిస్థితిలో ఆమెని అలా ఒంటరిగా....ఆ కూపస్థ జీవితంలో ఒదిలి రావటానికి అతని మనసు మొరాయించింది.

అందుకే దాదాపు ఐదారు వేలు ఖర్చుపెట్టి తన యింటికి తీసుకు వచ్చాడు.

ఆ అమ్మాయికి ఒక మంచి భవిష్యత్తు ఏర్పాటు చెయాలన్నదే అతని తాపత్రయం.

ఎవ్వరూ పట్టించుకోకపోతే గంగానదీ పాయ కూడా మురుగు నీటిలోకి ప్రవహించి కలుస్తుంది.

కాని శ్రద్ధ వహించి ఆ నీటిపాయని దారి మళ్ళిస్తే పంట పొలాల్లో చేరి బంగారం పండించి ధరణిని సశ్యశ్యామలం చేస్తుంది.

సుజాతని చూడగానే "అతని"లో ఆ భావన ఎందుకు ప్రవేశించిందో తెలియదు.

అందుకే ఆమెకోసం చాలా శ్రమపడి, ఎంతో డబ్బు ఖర్చుపెట్టి ఆ కూపంనుంచి విడిపించాడు.

రెండురోజుల దీర్ఘప్రయాణం తరువాత ట్రైన్‌దిగి అతను నివసించే ఫారెస్టు ఏరియాలోకి కాలుపెట్టింది సుజాత.

మందనుంచి తప్పిపోయిన మేకపిల్ల తిరిగి తన మందలో కల్సినంత ఆనందం ?

o o o

పండగ....

నిజానికి....లోకానికి ఆ రోజు ఏ పండుగా కాదు.

కాని సుజాతకి మాత్రం ఆ రోజు పండగలా వుంది.

సంక్రాంతి, ఉగాది, దసరా, దీపావళి... అన్ని పండుగలు ఒకేరోజు వస్తే యెలా వుంటుందో అలా వుంది సుజాత మనసు.

"అతని" ఇంట్లో అడుగు పెడుతున్నప్పుడు ఆ అమ్మాయి మనసు ఆనందంతో ఉప్పొంగిపోయింది.

ఒడ్డునపడ్డ చేప తిరిగి నీళ్ళల్లోకి జారినట్లు — మబ్బును చూసి మయూరి పురివిప్పి ఆడినట్లు బీటలు వారిన బీడు భూమిపై వర్షం ధారలు కురిసినట్లు ఆమె హృదయం ఉద్వేలం అయిపోయింది.

ఆమె లేత మనసు ఉల్లాసంతో పరవశించిపోయింది. నిజానికి అతను వుండేది "ఇల్లు" కాదు ఒక చిన్న పర్ణశాల.

బలమైన వెదురు బద్దలతో చుట్టూరా దట్టంగా గోడలా కట్టారు.

పైన వాసాలువేసి రెల్లుగడ్డి కప్పి చక్కగా నేత నేసినట్లు నేశారు.

విశాలమైన నాలుగు గదులతో మట్టి నేలతో పర్ణ కుటీరంలా అతి ప్రశాంతంగా వుంది.

ఇంటిని కట్టటానికి మొత్తం కలపనే ఉపయోగించారు.

ఇంటిచుట్టూ చక్కని విశాలమైన ఆవరణ.

కాంపౌండ్‌వాల్ బదులు ఇనప తీగలతో ఫెన్సింగ్‌వేసి దట్టంగా రక రకాల పూలలతలూ పాకించారు.

ఆ లతలనిండా ఎర్రగా గుత్తులు గుత్తులుగా పూలు కళ్ళని చెదిరించే అందంతో విరగబూసి సన్నగా పరిమళాలు విరజిమ్ముతున్నాయి.

ఇంటి చుట్టూతా వున్న ఖాళీస్థలంలో రకరకాల పూల మొక్కలు,

కాయగూరల చెట్లు, క్యాబేజీ, కాలిఫ్లవర్ వంటి ఆకుకూరల మొక్కలు పచ్చగా ఏపుగా పెరిగి ఉన్నాయి.

అక్కడ నిత్యం రాత్రిళ్ళు మంచు కురుస్తుంది.

తెల్లారేసరికి మొక్కలన్నీ నీళ్ళు చిలకరించినట్లు స్వచ్ఛంగా కడిగినట్లు వుంటాయి.

మంచినీటి వసతి పుష్కలంగా లభించటంతో వనసంపద అద్భుతంగా వుంది.

అతను రెండు జింకల్ని, ఒక నెమళ్ళ జంటని పెంచుతున్నాడు.

అవి అడవంతా తిరిగి తిరిగి అతని ఇంటికి మేతకి వస్తాయి.

చాలా ప్రేమగా వాటిని ఒళ్ళో కూర్చోపెట్టుకుని బుజ్జగిస్తూ అతను ఆహారం అందించే తీరుచూస్తే సుజాతకి చాలా ఆనందం అనిపించింది. మరెంతో ఆశ్చర్యపోయింది.

అడివి పావురాలకోసం అతని ఇంటి వెనుక గూడు వుంది.

గూడుమీద కూర్చుని గువ్వలు కువకువ లాడతాయి.

ఊరికి నవనాగరికతకి చాలా దూరంగా విసిరేసినట్లు అడవులకి చాలా దగ్గరగా వున్న ఫారెస్టు ఏరియా అది.

"ఫారెస్టు డెవలప్‌మెంట్‌కి" సంబంధించిన చాలామంది ఉద్యోగులు, పనివాళ్ళు, అక్కడ తాత్కాలికంగా నివాసాలు యేర్పరుచుకున్నారు.

దాదాపు అక్కడ ఇళ్ళన్నీ ఒకేలా వున్నాయి. అన్నీ రెల్లుగడ్డి నేసి చెక్కలతో వెదురు బొంగులతో కట్టినవే ...

నిజానికి అదంతా అడవి ప్రాంతమే అయినా అక్కడికక్కడ ఒక చిన్న గ్రామంలా ఏర్పడింది.

చాలామంది పిల్లా మేకతో సంసారాలతో సహా కాపురాలు వున్నారు.

"అతను" (దాసు) వుండే ఇల్లు కూడా పైకి కుటీరంలావున్నా లోపల చాలా ఆధునిక సౌకర్యాలతో ఇల్లు చక్కగా వుంది.

దేనికీ ఇబ్బంది పడవలసిన అవసరం లేదు.

అడవిలో వుంటున్నామన్న ఆలోచనే రాదు.

అల్మారాల నిండా చదువు కుందుకు బోల్డు పుస్తకాలు...., రేడియో, టేపు రికార్డర్ వంటి వినోద కాలక్షేపాలు కూడా వున్నాయి.

మధ్య గదిలో గోడకి రెండు తుపాకులు, ఎవరైనా వస్తే, కూర్చుందుకు వీలుగా నాలుగు ఫ్రేమ్ వెదురు కుర్చీలు, చిన్న టేబిల్, వంటగదిలో రెండు కిరోసిన్ స్టౌలు, వంట పాత్రలు, దినుసులు, ఒక ప్రక్కగా చిన్న మట్టి దిమ్మె, దానిపై చిన్న పూజామందిరం, దానిపై పెద్ద కాళీమాత ఫోటో.... మరొక గదిలో వెదురు కర్రలతో చేసిన మంచం, బూరుగ దూది పరుపు, కింద కుర్చీల దాకా చక్కగా అల్లిన ఈతాకు చాపలు, జింక చర్మాలు ....

అక్కడికి వచ్చిన గంటలోనే ఇల్లంతా సందడిగా తిరిగేసింది సుజాత.

వేటగాడి వలతాళ్లు తెంచుకున్న లేడి కూనలా వుంది ఆమె మనసు.

ఆ ప్రాంతంలో కాలుపెట్టిన మరుక్షణం ఆమె తన చేదు గతాన్ని మరిచిపోయినట్లు-ఆమె వదనంలోని విషాదం అంతా పూర్తిగా తుడిచేసినట్లు వుత్సాహంగా మారిపోయింది.

అమాయకంగా ఛెంగు ఛెంగున తన ఇల్లంతా తిరిగే లేడి కూనల్తో సమానంగా ఉత్సాహంగా తన ఇంట్లో తిరుగుతున్న ఆ అమ్మాయిని చూస్తుంటే అతని పెదవులపై తృప్తితో కూడిన ఒక సన్నని చిరునవ్వు ... .... మాటిమాటికి అందంగా ... .... నాట్యం ఆడ సాగింది.

సుజాతే కాదు....పండు వృద్ధులు కూడా పసిపిల్లలుగా మారిపోయి... పరవశించి కేరింతలు కొట్టే అందమైన ప్రకృతి....ఎటువైపుకి చూసినా కన్నుల విందులుచేస్తుంది.

కనుచూపు మేరల్లో చుట్టూరా నీలిరంగు కొండలు....పెద్ద పెద్ద

మానులతో నింగిని తాకుతున్నాయా అనిపించే ఎత్తయిన నీలగిరి వృక్షాలు, గలగల పారేనీరూ, కళ్ళని చెదిరించే రంగురంగుల పూలు, చేతికి అందు బాటుగా గుత్తులు గుత్తులుగా విరగకాసిన పళ్ళచెట్లతో ఆ అడవి వేయికన్నుల పండువగా వుంటుంది.

చెట్లమీద రకరకాల పక్షులు వాలి, ఎగురుతూ పంచవర్ణాలతో ఎంతో అందంగా... రకరకాల కూతలు చేస్తాయి.

పైగా అది స్ప్రింగ్ సీజన్ కావటంతో మనోహరమైన ఆ ప్రకృతి అందం ద్విగుణీకృతం అయ్యింది.

అస్తమానం కోయవాళ్లు, లంబాడి స్త్రీలు, పురుషులు, పిల్లలు.... సందడిగా తిరుగుతూ వుంటారు.

పెద్ద పెద్ద మానులు కట్టిన చెట్లని మిషన్లతో నరుకుతారు.

సన్నటి ఆ మిషన్ చప్పుడు ఏవేళా ఏదో ఒక మూలనుంచి వినిపిస్తూ వుంటుంది.

నిత్యం అటవీ శాఖవారి జీపులు, లారీలు ఆ అడవిలోకి వచ్చిపెడుతూ వుంటాయి.

పేరుకే అది అడవి.

కాని "అడివి" అంటే అడివి కాదు. అది ఒక అందమైన ఉద్యాన వనం.

భగవంతుడి సృష్టిలో ప్రకృతి ఎంత అద్భుతమైనదో.... మొదటి సారిగా సుజాతకి తెల్సింది అక్కడకి వచ్చాకనే?....

భగవంతుడి అద్భుతమైన కళాసృష్టి.

పచ్చని ఆకులతో, కళ్ళని చెదిరించే రంగులతో గుత్తులు గుత్తులుగా విరగబూసి, సన్నగా మత్తు పరిమళాలు విరజిమ్మే. రకరకాల పూలచెట్లు, నింగిని తాకుతున్నాయా అన్నట్లు ఎత్తుగా పెద్ద పెద్ద మానులు కట్టిన శాఖోప శాఖలుగా విస్తరించిన మహావృక్షాలు....వాటినిండా అల్లిబిల్లిగా ప్రాకిన పూల లతలు....

అక్కడ కొండల మీంచి, గుట్టల మీంచి ఎప్పుడూ సన్నటి పాయల్లా నీళ్లు ప్రవహిస్తూ వుంటాయి.

కొండలమీద పేరుకున్న మంచు అలా కరిగి ఏటి పొడుగునా అలా నీళ్ళలా జారుతూ వుంటుంది.

ఆ నీళ్ళన్నీ కలిసి ఒక నదిగా ఏర్పడ్డాయి.

ఆ వేలీలో ఏటి పొడుగునా ఆ నది ప్రవహిస్తూ వుంటుంది. అది జీవనది. ఎండిపోవటం అంటూ ఉండదు. వేసవిలో కాస్త నీరు తగ్గినా మిగతా మూడు ఋతువుల్లో పూర్ణ గర్భిణిలా నిండు ప్రవాహంతో వుంటుంది.

కొండలమీంచి కురిసే నీళ్ళన్నీ ఆ నదిలో కలుస్తాయి.

అడవినిండా ఎక్కడపడితే అక్కడ రకరకాల పళ్ళచెట్లు ... జామ, దానిమ్మ, వుసిరి, బెర్రా, రేగు, బేరీ, పనస, బొప్పాయి, కమలా, నారింజ, ఆపిల్, ఖర్జూరా...,ఇలా ఎన్నో రకాల పండ్ల చెట్లు ఋతుక్రమాన్ని అనుసరించి సీజన్ల వారీగా గుచ్ఛాలు గుచ్ఛాలుగా విరగకాస్తాయి.

అక్కడ ఏటి పొడుగునా నీటి వనరులు ఎక్కువగా వుండటంచేత ఫారెస్టు డెవలప్‌మెంట్ శాఖవారు హెలీకాప్టర్లమీద తిరుగుతూ అడవంతా రకరకాల పళ్ళవిత్తనాలు, పూల విత్తనాలు చల్లుతారు.

ఎక్కువగా వర్షాలు, మంచుకురిసే ప్రదేశం కావటంతో ఆ విత్తనాలు ఏపుగా పెరిగి సీజన్లవారీగా పూలు, ఎక్కువగా పళ్ళు అడవంతా గుత్తులు గుత్తులుగా విరగకాస్తాయి.

అక్కడ నివసించే గిరిజనులు, లంబాడీలు, కోయలు.... వీళ్ళందరికి ఆ చెట్లే జీవనాధారం. నిత్యం చిన్నా పెద్దా అంతా వెదురు బుట్టలు వీపులకి తగిలించుకుని అడివిల్లోకి పోతారు.

అడవంతా తిరిగి రకరకాల పూలు, పళ్ళు, దుంపలు, గురివెందలు సేకరించి తెస్తారు.

కిందపడిన అడ్డాకులు, పుల్లలు మోపులుకట్టి నెత్తిన పెట్టుకుని మోసి తెస్తారు.

కోయవాళ్ళు అడవిల్లోకిపోయి రకరకాల వేళ్ళు, ఔషధాల్లోకి పనికి వచ్చే దుంపలు, ఆకులు, సేకరించి సంచులనిండా నింపుకుని తెస్తారు.

వాటినన్నింటినీ వూళ్ళోకి తీసుకుపోయి అమ్ముకుని సొమ్ము చేసుకుంటారు.

తేనె తుట్టెలు కొట్టి మంచి స్వచ్ఛమైన తేనే సీసాల నిండా నింపి తెస్తారు.

అవన్నీ అమ్ముకుని బ్రతుకు తెరువు లాగిస్తారు.

అడివిలో కొన్ని ప్రాంతాలు ఫారెస్టు డిపార్ట్‌మెంట్‌వారి ఆధీనంలో ఉంటాయి.

ఆ ప్రాంతంలో అడుగు పెట్టకూడదని నిషేధాజ్ఞలు వుంటాయి.

మిగతా ప్రదేశం అంతా కోయలు, గిరిజనులు,లంబాడీలు యధేచ్ఛగా సంచరిస్తారు.

అక్కడ వారానికి ఒకసారి 'సంత' జరుగుతుంది.

బయట వూళ్ళనుంచి రకరకాల వ్యాపారస్తులు చిన్న, పెద్ద....అంతా సంతరోజు అక్కడ చేరతారు.

రకరకాల దుస్తులు, తినుబండారాలు, పూసలదండలు, అద్దాలు దువ్వెన్నలు లాంటి అలంకరణ సామాగ్రి, పాత్రలు ...వగైరా ఎన్నోరకాల వస్తుసామాగ్రి అంతా వ్యాపారస్తులు సంతరోజు అక్కడ దుకాణాలు పెడతారు. అడవంతా ఆరోజే భలే సందడిగా వుంటుంది.

అడవి జనాలకి సంతరోజు అంతా పండగే....

ఆ వారం అంతా వాళ్ళు సేకరించిన పళ్ళు, తేనె, ఔషధాలకి సంబంధించిన సామాగ్రి, కట్టెలు, అడ్డాకులు, జంతువుల చర్మాల్నూ, తోళ్ళు, కొమ్ములు, దంతాలు .... అన్నీ తీసుకుని ఆడా మగా సంతకి వెడతారు.

వ్యాపారస్తులు వీళ్ళ దగ్గర వస్తువులు చాలా చౌకగా కొని బయట రెట్టింపు ధరకి అమ్ముకుంటారు.

గిరిజనులకి కోయలకి ఆ కిటుకులన్నీ తెలియవు. అసలు తమ దగ్గర వున్న వస్తువుల అసలు విలువ ఎంతోకూడా సరిగా తెలియదు.

ఒకోసారి వస్తువులు మారకం చేస్తారు. అంటే తమ దగ్గర వున్న

వస్తువులు వ్యాపారస్తులకి ఇచ్చి, వాళ్ళ దగ్గరున్న వస్తువులు ఆ ధరకి సరి తూగేవి తీసుకుంటారు.

మరికొందరు డబ్బుకి అమ్ముకుని, ఆ డబ్బుతో అవసరమయినవి కొనుక్కుంటారు.

సంతరోజు అడవంతా భలే సందడిగా వుంటుంది.

వ్యాపారస్థులు ఎడ్ల బళ్ళమీద వస్తారు. అక్కడ పదిరోజుల కొక సారి 'వేట' జరుగుతుంది.

అడవి జంతువుల మాంసం హోల్ సేల్‌గా అమ్ముతారు.

ఆ రోజుకూడా బయటనుంచి వర్తకులు ఆ మాంసం, తోళ్ళు కొనుక్కుందుకు వస్తారు.

ఫారెస్టు డిపార్టుమెంటు వారు జీపులకి ఫ్లడ్‌లైట్స్ వేసి క్రూర మృగాలని పట్టుకునే విధానం గూడా చాలా థ్రిల్లింగ్‌గా వుంటుంది.

అలా పట్టుకున్న క్రూర మృగాలని సర్కస్ కంపెనీలకి, "జూ"లకి పంపిస్తారు.

ఏనుగుల వేటని "రెడ్డా" అంటారు.

ఆ రోజు అడవంతా వాటి ఘీంకారాలతో దద్దరిల్లిపోతుంది.

అడవిలో పెద్ద పెద్ద గోతులు తీసి వాటిమీద ఆకులు అలములు దట్టంగా కప్పి నేలలా భ్రమింప చేస్తారు.

రెండవవైపునుంచి ఏనుగుల మందల్ని బెదిరించి ఆ గోతుల వైపు తరిమి తరిమి కొడతారు.

ఏనుగులు గుంపులు గుంపులుగా పరుగు పరుగునవచ్చి ఆ గోతుల్లో పడతాయి.

ఆ తరువాత కొన్ని రోజులపాటు వాటికి ఆహారం - పెట్టకుండా మాడ్చి క్రమంగా వాటిని లొంగదీసుకుంటారు.

కేవలం జంతువులని వేటాడటమే కాక వాటి సంరక్షణ భాధ్యతలు కూడా ఫారెస్టు డిపార్టుమెంటు వారు ఎంతో శ్రద్ధగా చూస్తారు.

మంచి కలప ఉత్పత్తికోసం చెట్ల సంరక్షణ చేస్తారు.

నారు వేసి ప్రత్యేక శ్రద్ధతో నీలగిరి చెట్లు (యుకలిప్టస్ చెట్లు) పెంచుతారు. వీటినుంచి మంచి కలప తయారవుతుంది. కాగిత పరిశ్రమకి ఈ చెట్లు ఎంతగానో ఉపయోగపడతాయి.

ఈ అడవులు ఎక్కువగా వు.టే ఎన్నోరకాల వనరులతో పాటు మంచి వర్షాధారం వుంటుంది.

అందుకే అటవీశాఖ వారు ఈ అడవుల సంరక్షణకి ఎంతో కృషి చేస్తారు. ప్రత్యేక శ్రద్ధ వహిస్తారు.

అడవి జంతువులు, చెట్లతో పాటు పిట్టల సంరక్షణకి కూడా వీళ్ళు ఎంతో శ్రద్ధ చూపిస్తారు.

అదంతా ఒక ప్రత్యేకమయిన లోకం.

అక్కడికి వచ్చాక సుజాత ఆనందం వర్ణనాతీతం.

అసలు అలాంటి "లోకం" అంటూ ఒకటి వుంటుందని సుజాతకి వూహా మాత్రంగానయినా తెలియదు.

అడవుల్లో బ్రతకటం అంటే ప్రాణాలమీద ఆశ వదులుకుని, తోడూ నీడ లేకుండా, అడవి మనుషుల మధ్య కాయ కసరు తింటూ బ్రతకటం అనుకుంది.

కాని అక్కడ అంతా అద్భుత వాతావరణం, ఆనందకరమైన జీవనం వుంటుందని కలగానైనా వూహించలేదు.

మన్ను తిన్న పాములా వుండే ఆ అమ్మాయిలో వచ్చిన పది రోజులకే ఒక విధమైన నూతనోత్సాహం, మొఖంలో తేజస్సు చూడగలిగాడు అతను.

ఎండిన తీగ వల్లని నీరు తగిలి పులకించినట్లు.... ఆమెలో రోజు రోజుకి ఆనందం.

మొఖంలో మునుపటి నీలినీడలు, విషాద ఛాయలు తుడి చేసినట్లు మాయం అయ్యాయి.

మబ్బులు విడిచిన చందమామలా ఆమె వదనం ప్రశాంతంగా కాంతివంతం అయ్యింది.

ఆ పిట్టలు....దగ్గరగా పురివిప్పి ఆడే నెమళ్లు, చెంగు చెంగున దూకే జింక పిల్లలు ప్రేమగా భుజాలమీద వ్రాలే పావురాళ్లు, రంగు రంగులపూలు, మత్తయిన వాటి సన్నని పరిమళం....చల్లని వాతావరణం .... అతి ప్రశాంత మైన ప్రకృతి....

సుజాత మనసు పరవశించిపోయింది.

గొంగళిపురుగు అద్భుతమైన సీతాకోక చిలుకలా రూపం మార్చు కున్నట్లు....

అక్కడికి వచ్చిన పదిరోజుల్లోనే సుజాత తన చేదుగతాన్ని పూర్తిగా మరిచిపోయి కొత్తరూపంతో .... కొత్త ఆశలతో .... సరికొత్త జీవితాన్ని ప్రారంభించింది.

సహజంగా పదహారేళ్ళ వయసులో ఉండే ఉత్సాహంఅంతా ఆమెలో వచ్చి చేరింది. విన్నటిదాకా సుజాత తనకి "గతమే" గాని "భవిష్యత్తు" లేదు అనుకునేది.

కాని ఇప్పుడు ఆమెకి గతం జ్ఞాపకం చేసుకుంటేనేగాని గుర్తుకు రావటంలేదు.

వద్దు అనుకున్న అందమైన భవిష్యత్ కళ్ళముందు కదులు తోంది.

ఆనందం గుండెలో చిందులు తొక్కుతూంది.

ఆమెలోని ఆ ఆనందానికి ఉత్సాహానికి కారణం....అతను ?

"దాసు....కాశీ దాస్...." అనుకుంటుంది తపనగా అతని పేరు వుచ్చరిస్తూ.

"....విన్నటిదాకా శిలనైన
నీ పదము సోకి నే
గౌతమినైనా...."

అన్నంతగా జీవిత మాధుర్యాన్ని చవి చూపిన అతనిపట్ల అంతులేని ఆరాధన....

o o o

చల్లటి నీరూ, చక్కటి గాలి, మంచి పోషణ ప్రశాంతకరమైన వాతావరణం వుంటే ఒక చిన్న విత్తనం మొలకెత్తి ఏపుగా పెరిగి, మహావృక్షమై శాఖోపశాఖలుగా విస్తరిస్తుంది. అమృత ఫలాల్ని అందిస్తుంది.

....కాని—

అదే విత్తనాన్ని చెడు నేలలో కల్మష వాతావరణంలో నాటితే మర్నాటికల్లా మాడిపోతుంది.

ఒక దశలో మనిషి జీవితం కూడా అంతే ?

సుజాత అక్కడికి వచ్చిన అతి స్వల్పకాలంలోనే చాలా మార్పుని ఆమెలో చూడగలిగాడు అతను.

ఆరోజు ఆ అమ్మాయిని హోటల్ గదిలో మొదటిసారిగా చూసినపుడు ఎంతో దైన్యంగా వుంది. ముసురు పట్టిన ఆకాశంలా ఎంతో వేదన నిండిన ఆమె మోములో ఆనాడు నీలి నీడలనే చూశాడు.

ఆమె గుండెల్లోని విషాద బ్రతుకులోని బాధలు అన్నీ ఆమె రెండు కళ్ళల్లోనూ ప్రతిఫలిస్తున్నాయి అనిపించింది.

పదహారేళ్ళ లేతవయసులో వుండవలసిన ఉత్సాహం ఆమెలో అణు మాత్రం కూడా లేకుండా .... మోయలేని నూరేళ్ళ బ్రతుకు భారాన్ని మోస్తున్న ముదివగ్గులా .... నవనాడులూ కృంగిపోయినట్లు .... అడుగులో అడుగువేస్తూ ముళ్ళకంచెల మీంచి నడిచి వస్తున్నట్లు .... తన గదిలోకి వచ్చింది.

కాని అటువంటి ఆ అమ్మాయిలో ఈరోజు ఎంతో మార్పు కొట్ట వచ్చినట్లు చూడగలుగుతున్నాడు అతను.

గతాన్ని చప్పున మర్చిపోయింది.

లేడికూనలా ఛెంగు ఛెంగున గెంతుతూ ఆ అడవంత తానై విరగ బూసిన పువ్వులా కనిపిస్తోంది.

అక్కడ పిట్టలతోపాటు తాను గాలిలో ఎగురుతున్నంత ఆనందంగా వుంది.

నెమళ్లు పురివిప్పి ఆడుతుంటే ఆ అమ్మాయి మనసు సంతోషంతో ఆడుతోంది.

గలగలా దుమికే జలపాతంలో ఆమె నవ్వుల హోరే వినిపిస్తోంది అతనికి....

ఆ ప్రకృతి అందాలలో ఆమె ఒక అందంగా మారిపోయింది.

ఆ అమ్మాయిలో మార్పు అతడ్ని విచలితుడ్ని చేసింది.

సుజాత వచ్చాక అతని జీవితంలో కూడా చాలా మార్పే వచ్చింది.

అంతకుముందు అతను కోడికూతతోనే లేచి స్నానం ముగించి ఓ గంటసేపు దైవధ్యానం చేసేవాడు. ఆ తరువాత స్వయంగా వంట చేసుకునే వాడు.

ఇంట్లో రకరకాల కూరలు, దుంపలు, పళ్ళు, ఏవేళా వెదురు బుట్టల నిండా వుంటాయి.

"దొరా.... దాను దొర...." అంటూ లంబాడీలు, కోయలు.... నిత్యం ఏవో ఒకటి తెచ్చిఇస్తూ వుంటారు.

వంట భోజనం అయ్యాక అడవిలోకి వెళ్ళి దగ్గరుండి కాంట్రాక్టు వర్క్ చేయిస్తాడు.

సాయంత్రం చీకట్లు ముసిరే దాకా వర్కర్సు పన్లు చేస్తూనే వుంటారు.

మధ్యలో కాస్సేపు లంచ్ బ్రేక్.

అతను ఎక్కువగా ఎవరితోనూ సంభాషించడు. మితభాషి.

తన విషయం తప్పించి అనవసర విషయాల్లో చప్పున జోక్యం కలిగించుకోడు.

సాయంత్రం వర్కర్స్ పన్లు చాలించి వెళ్ళిపొయ్యాక.... అతను కూడా ఇంటికి వచ్చేస్తాడు.

ఇంటికి వచ్చాక నెమళ్ళనీ, లేళ్ళనీ, పావురాళ్ళని కాస్సేపు లాలించి స్వయంగా మేత తినిపిస్తాడు.

తీరిక సమయంలో పుస్తక పఠనం చేస్తాడు.

మనసు నిలవకపోతే మళ్ళీ అలా అడవి మార్గాలగుండా నడుస్తూ ప్రకృతి పరిశీలన చేస్తాడు.

ఉదయం తప్పనిసరిగా వేకువ ఝామున లేచి ప్రకృతి పరిశీలన చేస్తాడు.

జీవితంలో ఒంటరివాడు.

"నా" అనుకున్న వారి ప్రేమానురాగాలకి దూరం అయిన ఒక విధ మైన "ఎగోనీ" అతనిలో కనిపిస్తుంది. అతడు నవ్వినా........ ఏదో లోటు.

మనసారా నవ్వినట్లు వుండదు.

స్విచ్ వేస్తే లైటు వెలిగినట్లు యాంత్రికంగా వుంటుంది.

అంతమాత్రం చేత అతను "స్త్రీ"కి దూరంగా వుంటాడని కూడా చెప్పలేం.

అక్కడ పనిచేసే గిరిజన స్త్రీలతో అతను అప్పుడప్పుడు ఆనందంగా గడుపుతాడని వదంతులు కూడా లేకపోలేదు.

పనిమీద వ్యాపారరీత్యా పట్నం పోయినప్పుడు పెద్ద పెద్ద పోష్ హోటల్సులో బస చేస్తాడు.

అలాంటప్పుడు కూడా తన ఆనందం కోసం అమ్మాయిల్ని పిలి పించుకుంటాడు.

కాని ఏ విషయంలోనూ ఎవ్వర్నీ బాధ పెట్టడు.

అవతలి అమ్మాయి కొంచెం "హర్టు" అయి ఏడిచి కళ్ళనీళ్ళు పెట్టు కుందంటే మెత్తగా కరిగిపోతాడు.

అంతే ?

మిగతా విషయాలన్నింటిలో తన చుట్టూ గిరిగీసుకుని ఒక పరిధిలో జీవిస్తాడు.

ఆ గిరిదాటి తను బయటికి రాడు.

వేరేవాళ్ళని అందులోకి రానివ్వడు.

కానీ....

అటువంటి వ్యక్తి ఒక దైవ ఘటనగా సుజాతని తన ఇంటికి తీసుకు వచ్చాడు.

ఆ అమ్మాయిని చూసిన మొదటి క్షణంలోని ఒక అనుబంధం ఏదో అతన్ని కట్టిపడేసింది.

ఆ ప్రేమ పాశాన్ని త్రెంచుకోలేక పోయ్యాడు.

అందుకే ఆమె బాధ్యతని హృదయ పూర్వకంగా స్వీకరించాడు.

అయితే సుజాత వచ్చాక అతని రొటీన్‌లో కొంచెం మార్పు కూడా వచ్చింది.

ఇదివరకులా సుజాత అతన్ని ఇంటి పని వంట పని చెయ్యనివ్వటం లేదు.

ఇప్పుడు బాధ్యతలన్నీ ఆమె స్వీకరించింది.

ఇద్దరూ కల్సి భోజనం చేసేవారు.

ఆ తరువాత అతను డ్యూటీలోకి వెళ్ళేవాడు.

ఇష్టం అయితే సుజాత కూడా "వర్క్" జరుగుతున్న చోటుకి వెళ్ళేది.

అలసట అనిపిస్తే ఇంటి పట్టునే వుండిపోయ్యేది.

"దాసు దొరా! ఆ అమ్మాయి ఎవరు!" అతని వెంట నీడలా తిరుగుతున్న సుజాతని చూసి ప్రతి ఒక్కరూ అడిగేవారు.

"నా స్నేహితుడి కూతురు. ఆ అమ్మాయి తల్లి తండ్రి ఆక్సిడెంటులో మరణించారు. అందుకని నేను తీసుకు వచ్చాను. ఆ అమ్మాయికి ఒక మంచి భవిష్యత్తు చూపించాల్సిన బాధ్యత నాకు వుంది"—

ఏ మాత్రం తడుముకోకుండా చాలా నిర్వికారంగా ఆ మాటలు చెప్పేవాడు.

ఆ మాటలు వింటున్నప్పుడు సుజాత కళ్ళ నిండా గిర్రున నీళ్ల తిరిగేవి.

అతనిపట్ల....కృతజ్ఞతతో మనసు ఒంగిపోయేది.

అతనెవరు!

నేనెవరు!

ఏనాటిదీ బంధుత్వం!

ఇంతవరకు ఒక ఆడదాన్ని దిగజార్చటానికి ప్రయత్నించే వాళ్ళనే తను చూసింది.

కాని దిగజారిన స్త్రీని తిరిగి వున్నత స్థానంలో నిలబెట్టాలనుకునే ఇలాంటి వ్యక్తులు కూడా వున్నారు కదా అనుకుంటే ఆమె మనసంతా అతని పట్ల గౌరవంతో నిండిపోయేది.

ఆ భగవంతుడే తనని రక్షించటానికి ఇతని రూపంలో వచ్చాడేమో అనుకునేది.

ఇదివరకులా, సుజాతకి చదువుకోవాలని, మంచి ఉద్యోగం చేసి సంపాదించాలని....ఇలాంటి కోరికలు ఏమీలేవు.

చాలావరకు ఆమె మనసు శిథిలం అయిపోయింది.

ఆ మురికి కొంప నుంచి బయట పడటమే గొప్ప వరంగా భావిస్తోంది.

ఇప్పుడు ఆమెకి ఏ కోరికలు లేవు.

ఆమె అంతరాంతరాలలో ప్రగాఢంగా వున్న కోరికల్లా ఒక్కటే....

అతని చల్లని నీడలో....ఏ వడి దుడుకులు లేకుండా ప్రశాంతంగా తన జీవితం ఇలా వెళ్ళిపోవాలన్నదే ఆమె ఆశయం.

ఆ తరువాత ఏలాగయినా అతన్ని ఒప్పించి తన తల్లిని కలుసుకోవాలి.

అతని సహకారంతో ఆ చెరసాల నుంచి అమ్మకి విముక్తి కలిగించాలి.

అంతకుమించి ఏ ఆశలూ లేవు సుజాతకి.

అతనితో జీవితాన్ని పంచుకున్నే మధుర ఘడియకోసం....తన తల్లిని కల్సుకునే రోజు కోసమే....ఆమె నిరీక్షణ....

కేవలం ఆవేశంతో చేసుకున్న నిర్ణయం కాదిది.

ఎంతో ఆలోచించిన మీదటే ఆ నిర్ణయం తీసుకుంది సుజాత.

o o o

గాయాలన్ని మాన్పే మందులా కాలం అతి నిశ్శబ్దంగా సాగిపోతోంది.

కాలగర్భంలో మరో మూడు నెల్లు గిర్రున ముందుకి తిరిగాయి.

ఆ రోజు....

తెల్లవారుజాము సమయం.

తూర్పున వెలుగు రేఖలింకా పూర్తిగా విచ్చుకోలేదు.

గూళ్ళలోంచి బయటికివచ్చి చెట్లకొమ్మలనిండా చేరి గొంతెత్తి కలకలా రావాలు చేస్తున్నాయి.

అడవంతా ఆ పిట్టల గానంతో నిండిపోయింది.

సన్నగా చిరు చలిగాలాలు వీస్తుంటే దుప్పటి ముసుగు బిగించి మంచంలో బద్దకంగా ఒత్తిగిల్లుతున్న సుజాతకి వెన్ను జలదరించేలా ఎవరిదో మూల్గు వినిపించడంతో గభాల్న దుప్పటి తొలగించి మంచంలో లేచి కూర్చుంది.

ఇల్లంతా నిశ్శబ్దంగా వుంది.

వీధి తలుపులు కూడా ఎవ్వరూ తియ్యలేదు. రోజూ .... వేకువ ఝామున....తూర్పున వెలుగురేఖలు విప్పుకోకముందే నిద్ర మంచంనుంచి లేచేవాడు అతను....కాళీదాస్....

కానీ ఆ రోజు సూర్యోదయం కాబోతున్నా లేవలేదు.

సరికదా ఉండి ఉండి "ఊయ్...." అని బాధగా మూలుగుతున్నాడు.

మంచంలో అసహనంగా అటు ఇటు కదులుతున్నాడు.

అంతకు ముందురోజు వర్క్ నడిచేచోట లారీలకి ఎత్తిన పెద్ద దుంగ ఒకటి పొరపాట్న జారి కిందపడి దొర్లి ప్రక్కనే దగ్గర్లో చెట్టుకింద కూర్చున్న అతని కాలిమీద పడింది.

దాంతో వెంటనే అతని పాదం వాచి అంతెత్తున బుసబుసా పొంగింది.

కాలు నేలమీద ఆన్చ పీలులేకుండా క్షణాల్లో ఎలిఫెంట్ లెగ్‌లా లావుగా వాచిపోయి మోకాలివరకూ బాగా మోపు చేసింది.

వేళ్ళ చివర్లు బాగా చితికినట్లు అయి యెర్రగా కందిపొయ్యాయి.

కాలిమీద పచ్చగా నరాలు తేలాయి.

కాలు నేలమీద ఆన్చి నడవలేక పొయ్యాడు.

ఇద్దరు వర్కర్స్ అతన్ని చెరో రెక్కా పట్టుకుని ఇంటిదాకా నడిపిస్తూ తీసుకు వచ్చారు.

కోయదొర వచ్చి ఆకుపసరు పూసి కాపడం పెట్టాడు.

తైలాలుపోసి మర్దనా చేశాడు.

వాపు తియ్యడానికి ఏవో ఆకులువేసి కట్టుకట్టాడు.

ఆ రోజంతా మంచం దిగలేదు అతను.

అతని అవసరాలన్నీ సుజాతే చూసింది.

భోజనం అది మంచం దగ్గరే అమర్చింది.

వర్కర్స్, అతని స్నేహితులు....అస్తమానం ఎవరో ఒకరు వచ్చి చూసి వెడుతూనే వున్నారు.

కాలిలో నరాలేమీ దెబ్బ తినలేదు.

కేవలం కొంచెం వాపే గనక తెల్లారేసరికి తగ్గిపోతుందనే అనుకున్నారంతా.

కానీ ఆలా జరగలేదు.

అర్ధరాత్రి గడిచేసరికి అతనికి కొంచెం టెంపరేచరు తగిలింది.

తెల్లవారేసరికి తీవ్రంగా జ్వరంవచ్చి ఉష్ణోగ్రత నూటరెండు డిగ్రీలకి పెరిగింది.

రోజూ సుజాతకంటే అతనే చాలాముందు లేచేవాడు.

స్నానం, సంధ్యా, పూజ....ముగించుకుని పాలుకాచి తను తాగి లాన్‌లో కూర్చునేవాడు.

ఆ అలికిడికి సుజాతకి మెలకువ వచ్చేది.

కానీ ఆరోజు వేదనా భరితమైన అతని మూల్గుతో సుజాతకి మెలకువ వచ్చింది.

అప్పటికి తూర్పున ఇంకా పూర్తిగా వెలుగురేఖలు విచ్చుకోలేదు.

అడవంతా పక్షుల కలకలా రావాలతో సందడిగా వుంది.

సుజాత గభాల్న మంచం దిగి అతని గదిలోకి వెళ్ళింది.

అతను నిండా దుప్పటి కప్పుకుని మూల్గుతున్నాడు.

అతని ముఖం అంతా వాచినట్లు వుంది.

కనురెప్పలు వుబ్బి ఎర్రగా చురకత్తుల్లా మెరుస్తున్నాయ్.

ఒంటిమీద స్పృహలేని స్థితిలో ఆగి ఆగి బాధగా మూల్గుతున్నాడు.

ప్రక్కనే స్టూలుమీద రెండు గ్లాసులు, చెంబు, గ్లూకోజ్ ప్యాకట్టు పడివున్నాయి.

వాటిని చూడగానే సుజాతకి చాలా కోపం వచ్చింది.

సుజాత రాత్రి పడుకోబోయేముందు వాటిని తెచ్చి అక్కడ పెట్టలేదు. ఆమెకి ఎందుకో అంత ఆలోచనరాలేదు.

కానీ అతను సగం రాత్రివేళ బాగా దాహం అనిపించి స్వయంగా లేచి వంటింట్లోకి వెళ్ళి అవన్నీ తెచ్చుకుని గ్లూకోజ్ నీళ్ళు తాగి ఉంటాడు.

ఆ మాట తల్చుకోగానే సుజాతకి ఎంతో అవమానం కోపం అనిపించాయి.

తనని లేపవచ్చు కదా!

అంత జ్వరంలో....అంత కాలునొప్పితో నడవలేని పరిస్థితిలో కూడా స్వయంగా తన పన్లు తనే చేసుకోవాలా!

తనని ముట్టుకుంటే మైల పడిపోతాడు కాబోలు.

మరి ఆ రాత్రి తనని ఎందుకు గదిలోకి పిలిపించుకున్నాడు?

ఇంటికి తెచ్చి ఎందుకు పెట్టుకున్నాడు?

పోనీ........

ఆ విషయాలన్నీ వదిలిపెట్టినా ఒక మంచి స్నేహితుడిలాగ తనతో ఎంతచక్కగా వ్యవహరిస్తాడు!

కలలోనైనా వూహించ నటువంటి ఎంత అందమైన జీవితాన్ని తనకి ప్రసాదించాడు.

అతనిపట్ల తనకి ఎంతో కృతజ్ఞత వుంది కదా !

మరి ఆ కృతజ్ఞతతో అతనికి ఏ రూపంలో ప్రదర్శించి చెప్పగలను !

అలా అనుకుంటే సుజాత హృదయం ఆర్ద్రం అయిపోయింది.

చప్పున దుప్పటి తొలగించి అతని ఒంటిమీద చెయ్యివేసింది.

అంతే !

మరుక్షణం షాక్ తగిలినట్లు చురుగ్గా చేతిని వెనక్కి తీసుకుంది.

నిప్పులమీద పెనంలా సలసలా కాగిపోతోంది. అతని వొళ్ళు....

సుజాత గుండె ఝల్లుమంది.

దేముడెలా వుంటాడో ఆ అమ్మాయికి తెలియదు. కానీ అతన్ని అంతగా ఆరాధిస్తోంది. అలాంటి అతనికి... !

సుజాత కళ్ళల్లో వల్చగా నీళ్ళు చిమ్మాయి. గభాల్న లేచి మంచం అంచున కూర్చుని అతని పాదాల దగ్గర దుప్పటి తొలగించింది.

పాదం మొత్తం మోకాలి వరకూ ఎర్రగా వుబ్బింది.

నరాలు పచ్చగా తేలాయి.

వేళ్ళ చివరులు రక్తం చిందినట్లు ఎర్రగా చితికి పోయి వున్నాయి.

సుజాతకి ఒక్కక్షణం ఎటూ తోచలేదు.

రోజూ తను లేచేసరికి చక్కగా స్నానం చేసి పూజ ముగించి పాలు కాచి లాన్‌లో విశ్రాంతిగా కూర్చునేవాడు.

అలాంటి అతను మూలుగుతూ మంచంలో పడివుండటం చూస్తే సుజాత మనసంతా ద్రవించిపోయింది.

చప్పున లేచి తలుపులన్నీ తెరిచింది.

స్టౌ ముట్టించి వేడినీళ్ళు కాచి బకెట్ నిండా తొలిపి బాత్‌రూమ్‌లో పెట్టింది.

అతను బ్రష్ చెయ్యటానికి అన్నీ అమర్చి నెమ్మదిగా అతన్ని లేపింది.

సుజాత చేతి ఆసరాతో అతను బ్రష్ చేసి తిరిగి నీరసంగా వచ్చి మంచంలో కూర్చున్నాడు.

సుజాత పాలు కాచి కప్పు నిండా కాఫీ కలిపి తీసుకు వచ్చింది.

ఆ తరువాత బుట్టనిండా కమలాలు వుంటే ఒలిచి తొనలు తీసి పెట్టింది.

మధ్యలో మళ్ళీ ఒకసారి గ్లూకోజ్ నీళ్ళు కలిపి ఇచ్చింది.

సీసాలో తైలం తీసి అతని కాలికి రుద్దింది.

అతను ఎంత వద్దన్నా ఆ రోజంతా అలాగే అతన్ని అంటిపెట్టుకుని సేవలు చేస్తూనే వుండిపోయింది.

ఆ తరువాత కోయ దొర వచ్చి అతని కాలికి ఏవో ఆకులు రుద్దాడు.

ఆ రోజు ప్రక్క గ్రామానికి మనిషిని పంపి డాక్టర్ని కూడా పిలి పించుకున్నాడు.

డాక్టరుగారు కాలు పరీక్షచేసి, ఎక్స్‌రే లాంటివి ఏమీ అవసరం లేదని చెప్పి, ఇంజక్షన్ చేసి, టాబ్లెట్సు ఇచ్చాడు.

రాత్రి పగలూ డాక్టరు ప్రిస్క్రిప్షన్ ప్రకారం దగ్గరుండి టైము ప్రకారం అతనికి మందులు వాడి సేవలు చేసింది సుజాత.

ఆఖరికి అతన్ని మంచి నీళ్ళు కూడా తెచ్చుకొని తాగనియ్య లేదు.

తనే దగ్గరుండి అన్నీ స్వయంగా అందించింది.

"సుష్మా! నీకెందుకీ శ్రమ! నువ్వు లేకపోతే ఈ పన్లన్నీ నేనే చేసుకునే వాడ్ని కదా !" అన్నాడు.

"కానీ... ఇప్పుడు నేను వున్నాను కదా?!" అంది వాలుగా చూస్తూ సుజాత.

అంత నీర్సంలోనూ అతను చిన్నగా నవ్వాడు.

ఆ నవ్వు నిండా ఎంతో కృతజ్ఞత.

ఆ నవ్వు సుజాత గుండెల్లో వెయ్యి పువ్వులు పూయించింది.

ఎన్నో చెదిరిపోయిన మధురాను భూతుల్ని రేపింది.

ఆ క్షణంలో ఆమెకి తన కెంతో ప్రియమైన "నందూ" జ్ఞాపకం వచ్చాడు.

అతను... ....కూడా ఇలాగే ఎంతో చక్కగా నవ్వేవాడు కదూ!

శృతి చేసి పెట్టిన వెయ్యి వీణల్ని ఒక్కసారి "ఝుమ్మని మ్రోగించినట్లు ......." అతని చిరునవ్వు తన మనసుని ఎంతగా కరిగించేది!

నందూ........

తను కనిపించగానే అతని కళ్ళలో ఆరాధనా....ఆత్మీయతా తను జీవితంలో మరిచి పోగలదా!

ఎప్పుడైనా వాళ్ళింటికి వెళ్ళటానికి కాస్త బద్ధకించి ఆలస్యం చేస్తే బెంగపడినట్లు తపనగా అడిగేవాడు....

"మీరు రాక చాలారోజులైంది కదా। వూరెళ్ళారేమో అనుకున్నాను" అనేవాడు.

తనకి క్యాడ్ బరీస్ ఐస్ క్రీం అంటే ఇష్టం అని తెల్సి .... బయట ఎప్పుడు కల్సుకున్నా రెస్టారెంట్ కి తీసుకెళ్ళి ఐస్ క్రీం తెప్పించేవాడు.

మనసు విప్పి మాటల రూపంలో చెప్పలేని ఎన్నో భావాలన్నీ చిన్న నవ్వు....అందమైన కళ్ళు....చాటి చెప్తాయి.

అతను....నందూ....అలాగే....ఎన్నో వూసులు చెప్పాడు.

కానీ........

తన తల్లి కుట్టు టీచరు .... అనగానే .... అతని కళ్ళలో నీలి నీడలు... ?

నందూకి తనపట్ల ఎంత ప్రేమా అనురాగాలున్నా ఒక్కనాడు కూడా మాటల రూపంలో వ్యక్తం చెయ్యలేదు.

కారణం....తన పేదరికం కదూ !

కానీ పేదరికం పాపం కాదే!

పేదరికమ్ము - ప్రేమ పథమ్ము

మూసివేసిన దా - నా ఆశ రేపినదా ! అన్నట్లు కేవలం....తన ప్రేమ....నందూతో పరిచయం ఈనాడు భ్రాంతిగానే మిగిలిపోయ్యాయి.

ఇప్పుడు తన తల్లి హంతకురాలు ... తను పతిత....అంతే. నందూ తనకేసి తల ఎత్తి కూడా చూడడేమో?

అవును.

అంతే జరుగుతుంది.

డబ్బుకున్న విలువ మనిషికి లేదుకదా!

తన చదువు....స్నేహం....ప్రేమా....తన బ్రతుకూ....అంతా ఒక కల?....పీడకల....ఆన....

"సుష్మా...."

భుజంమీద చెయ్యి పడటంతో ఉలిక్కిపడింది సుజాత.

"ఏమిటి, ఆ పాలు అలా పొంగిపోతుంటే అలా చూస్తూ నిల్చున్నావ్!" ఆశ్చర్యంగా ఆ అమ్మాయి మొఖంలోకి చూశాడు అతను.

సుజాత చప్పున తేరుకుని వాస్తవంలోకి వచ్చింది. అప్పటికే అతను పాలగిన్నె దించి స్టౌ చల్లార్చాడు.

సుజాత సిగ్గు పడినట్లు తల దించుకుని గబగబా తన గదిలోకి వచ్చేసింది.

ఇంత పరధ్యానంలో ఎలా పడింది!

నందూ ఇంకా తన మనసులో అలాగే ఉన్నాడా!

సుజాత మనసంతా అస్థిమితంగా అయిపోయింది.

o o o

దాదాపు వారం రోజుల తరువాత అతని జ్వరం పూర్తిగా తగ్గిపోయింది.

కాలు వాపు కూడా మొత్తం తీసేసింది.

ఎప్పటిలా పాదం నేలమీద ఆన్చి హాయిగా నడువగలుగుతున్నాడు.

ఇంకొక నాల్గు రోజులపాటు కాలుకి ఎక్కువ శ్రమ ఇయ్యకుంటే మంచిదని ముందు జాగ్రత్తకోసం సలహా చెప్పాడు డాక్టరు.

డాక్టరుగారి వైద్యం సగం, సుజాత పగలూ రాత్రి కంటికి రెప్పలా కాపాడి చేసిన సేవలు సగం .... అతడ్ని అనతి కాలంలోనే పరిపూర్ణ ఆరోగ్యవంతుడ్ని చేశాయి.

తిరిగి మునపటిలా అతడు ఇల్లంతా తిరుగుతూ వుంటే సుజాతకి ఎంతో ఆనందం అనిపించింది.

పందిరి ఆసరా లేనప్పుడు తీగ నేల కూలిపోతుంది.

అతను అండలేని రోజు తన బ్రతుకూ అంతే కదా! అనుకొంటుంది ఎప్పుడూ సుజాత.

అందుకే ఆమెకి అతడంటే అమితమైన ఆరాధన?

వారం రోజుల తరువాత అతడు యథాప్రకారం వ్యాపార విషయాలు చూసుకోవటం మొదలు పెట్టాడు.

సుజాతకి పండగొచ్చినట్లు అనిపించింది.

ఆ మాటే అతనితో అంటే అతను చిన్నగా నవ్వి వూరుకున్నాడు.

ఏ భావాలు లేకుండా అతి సామాన్యంగా వున్న అతని నవ్వులాగే.... మరో మూడునెల్ల కాలం ముందుకి కదిలింది.

o o o

సాయం సమయం....

ఆకాశం కొద్దిగా మబ్బు పట్టింది.

చల్లగాలులు మందంగా తెరలు తెరలుగా వీస్తున్నాయి.

ఆ గాలితో కల్సి సన్నని అడివిపూల పరిమళం....పరిసరాల్ని మత్తిల చేస్తుంది.

మబ్బుని చూసి నెమళ్ళు రెండూ పురివిప్పి అందంగా నాట్యం చేస్తున్నాయి.

ఇప్పుడో ఇంకో ఘడియకో....పెద్ద వాన కురవచ్చు. లేదా....గాలికి దూది పింజెల్లా మబ్బులు తేలిపోనూ వచ్చు.

ఆ అడివిలో వానలు కురవటం ఎక్కువే.

అక్కడికి వచ్చాకనే ప్రత్యక్షంగా నెమళ్ళ నాట్యం మొదటిసారిగా కళ్లారా చూసింది సుజాత.

ఆ నెమలి పిట్టల నాట్యం చూసి పరవశించి పోయింది సుజాత....

అప్పట్నుంచీ ఆకాశం ఎప్పుడు మబ్బులు పడుతుందా అని ఎదురు చూట్టం మొదలుపెట్టింది....

"....బహు బహిన్ పూర్బయినా
విదానాహిన్ బిన్ సయినా...."

[వాన కురుస్తోంది. నెమళ్ళు నాట్యం చేస్తున్నాయి. ప్రేమికుడు తన ప్రియురాల్ని హృదయానికి హత్తుకుంటున్నాడు.]

మబ్బుని చూసి మయూరి పురివిప్పి ఆనందంతో నాట్యం చేస్తుం దట.

అప్పుడు ఆ పారవశ్యానికి దాని కంటి వెంట కన్నీరు చుక్కలు చుక్కలుగా రాలుతుందిట!

ఆడ నెమలి ఆ కన్నీటి చుక్కల్ని ప్రేమగా త్రాగుతుందిట.

ఆ తరువాత అది చూలింతై గుడ్లని పొదుగుతుందట.

ప్రకృతిలో ఏ జీవికి లేని- ఒక వింత ప్రవృత్తి ఈ నెమళ్ళ జాతికి మాత్రమే వుంది. వారి నెమలి ప్రేమికులు పరవశించాలంటే వర్షం కురవాలి,

అందుకే నెమళ్ళకి నాట్యం అంటే ఇష్టం....

అవి అద్భుతంగా నాట్యం చెయ్యాలంటే మరి మనసు పరవశించాలి కదా!

మనసు పరవశించాలి అంటే ధారలు పట్టి వర్షం కురవాలి....

వర్షం కురవాలి అంటే ఆకాశం కారుమబ్బులు పెట్టాలికదా!

అందుకే మబ్బులకి— మయురాలకి ప్రకృతిలో అంత అవినాభావ సంబంధం వుంది.

కాబట్టే భగవంతుడి సృష్టిలో పవిత్రతకి, సౌందర్యానికి, పారవశ్యానికి, నాట్యానికి ఈ పిట్టలు ప్రతీకంగా నిలిచిపోయ్యాయి.

ఆ రోజుకూడా ఆకాశం మబ్బులు పట్టడంతో మయూరాలు నింగిలోకి చూస్తూ పరవశంతో పురివిప్పి నాట్యం చెయ్యసాగాయి.

సుజాత 'వేర్ లవ్ హాజ్ గాన్' చదువుతూ చల్లగాలికి లాన్‌లో కుర్చీ వేసుకుని కూర్చుంది.

కానీ మనసు పుస్తకంమీద లగ్నం కావడంలేదు.

ఇంట్లో వంటరిగా వుంది.

అతను పని వుందని ఎక్కడికో వెళ్ళాడు. వుండి వుండి ఆకాశం వురుముతోంది.

తళుక్కుమని మెరుపులు మెరుస్తున్నాయి.

నింగిలోకి మోరయెత్తి చూస్తూ పెంపుడు నెమళ్ళు పురివిప్పి అద్భుతంగా నాట్యం చేస్తున్నాయి....

సుజాతకి ఎంతో ఇష్టమైన దృశ్యం.... కన్నులముందే వుంది.

కాని సుజాత ఆ పిట్టల నాట్యం చూడటం లేదు.

ఆమె మనసు మనసులో లేదు.

ఎంతో విషాదంగా వుంది.

అస్థిమితంగా వుంది.

ఎంత నిభాయించుకున్నా కళ్ళు చెమరుస్తున్నాయి.

తింటున్నా తిరుగుతున్నా ప్రాణానికి సుఖంలేదు.

ఆరోజు ఎందుకో లేచింది మొదలు మాటిమాటికి తల్లి జ్ఞాపకం వస్తూంది.

ఒళ్ళంతా నెత్తురుతో తడిసి. జుత్తు విరబోసుకుని, రక్తం వోడుతున్న రోకలి పట్టుకుని ఎర్రచీరతో నిల్చున్న తల్లి రూపమే మాటి మాటికి అద్దం కట్టినట్లు కళ్ళముందు నిలచిపోతోంది. ఒడ్డునపడ్డ చేపలా తల్లి కోసం మనసు కొట్టుకు పోతోంది.

అందుకే ఎదురుగా తనకెంతో ఇష్టం అయిన నెమళ్ళ నాట్యం చేస్తున్నా మనసు వాటిపై లగ్నం కావడం లేదు.

దూరంగా పచ్చికలో ఛెంగుఛెంగున పరుగులెత్తుతున్న లేళ్ళని చూస్తూ కూర్చుంది.

అవి తల్లీ - పిల్ల.

సుజాత వచ్చేముందే ఆ లేడి ఈనిందట.

పట్టుకుచ్చులాంటి గోధుమరంగు శరీరం, వాటిపై అందంగా తెల్లటి మచ్చలు, నిలకడలేని చూపులతో చంచలంగా కదిలే అందమైన పెద్ద కళ్ళు....

ఆ లేళ్ళు రెండూ ఎప్పుడూ ఒకదాన్ని ఒకటి అంటిపెట్టుకుని తిరుగుతుంది.

తివాసీ పరచినట్లున్న ఆ పచ్చగడ్డి నేలలో ఒకదాని ఒళ్ళో ఒకటి చేరి పడుకొంటాయి.

తల్లి నములుతున్న గరిక పోచల్ని లాక్కుని మరీ తింటుంది ఆ లేడికూన.

ఆ రెంటినీ చూస్తుంటే మాటిమాటికి తల్లి రూపమే జ్ఞానకానికి వస్తుంది సుజాతకి.

ఇప్పుడు అమ్మ ఆ జైల్లో ఎలా వుందో!

శంకర్‌లాల్‌ని హత్య చేసినందుకు అమ్మకి ఎలాంటి శిక్ష విధించారో !

ఇన్ని రోజులుగా తనని చూడక అమ్మ అనుక్షణం తనకోసం యెంతగా కుమిలి పరితపించి పోతోందో.....

ఆ జైల్లో ఎన్ని కష్టాలు పడుతోందో....!

తల్చుకుంటేనే గుండె తరుక్కుని పోతోంది.

తనకోసం హత్యచేసి తనకోసం జైలుకెళ్ళిన తల్లి ....

తన గురించి ఎంత కుమిలిపోతోందో....

ఇన్ని రోజులుగా తను కనిపించక ఎంత అల్లాడిపోతోందో.... కదా! అనుకుంటే సుజాత హృదయం ద్రవించి పోతోంది. అయినా ఏమీ చెయ్యలేని నిస్సహాయతలో కుమిలి పోతోంది.

అసలు తల్లిని ఏ జైల్లో పెట్టారో....ఎలాంటి శిక్ష విధించారో .... ఏమీ తెలియదు కానీ జైలుశిక్ష పడిందని మాత్రం తెలిసింది.

అమ్మ యెలా వుందో....యెక్కడ వుందో....

ఎలాగైనా అమ్మని ఒక్కసారి చూడాలి.

అనుక్షణం ఇవే ఆలోచనలు సుజాతవి.

మనసంతా ఒకటే హోరు....

మొండి కత్తితో గుండెను కోస్తున్నట్లు....

కడుపులో కొయ్యి రాజబెడుతున్నట్లు....

అనిర్వచనీయమైన వేదన....

ఒకోసారి ఆ జ్ఞాపకాలు మరింత క్షోభ పెడతాయి.

ఆ రోజు ఉదయంనుంచి అలాగే వుంది. మాటిమాటికి తల్లి జ్ఞాపకం వస్తుంది.

గుండె చల్లగా చెమరుస్తుంది.

పచ్చి గంగ కూడా ముట్టబుద్ధి కాలేదు.

అమ్మ తనకోసం యెంత పాటుపడింది!

కానీ అమ్మకోసం తను ఏమీ చెయ్యలేకపోతోంది కదా!

"అతను" తనని ఇక్కడికి తీసుకువచ్చి దాదాపు ఆరు నెల్లు కావస్తోంది.

ముళ్ళ కంచెలమధ్య నలుగుతున్న శరీరాన్ని పూలపాన్పు మీదికి విసిరినట్లు ఇక్కడికి వచ్చాక తన వరకూ జీవితం కాస్త సుఖంగానే వుంది.

అక్కడ వున్నన్ని రోజులు ప్రతీరాత్రి....నరకమే కదా

ప్రతీ రాత్రి కన్నీటితోనే తెల్లవారిపోయింది కదా.

కానీ ఇక్కడికి వచ్చాక - రొచ్చుగుంటలో పడిన తరువాత తిరిగి గంగానదిలో స్నానం చేసినట్లు....జీవితం కొంచెం ప్రశాంతంగానే సాగి పోతోంది.

నల్గురిలో తనూ ఒక మనిషికదా....అన్న గుర్తింపు, "స్త్రీ"గా సున్నితమైన భావన కలుగుతోంది.

కాని ఏం లాభం!

బాహ్యంగా ఎంత సుఖం వున్నా మనసు కృంగిపోతోంది.

తల్లి జ్ఞాపకం రాని క్షణం లేదు.

ఆ జైలు కటకటాల వెనకాల తల్లిని వూహించు కొంటేనే గుండెకి సూదులు గుచ్చుతున్నట్లు వుంది.

ఆ బ్రోతల్ హౌస్‌లో జీవించినన్నాళ్ళూ తనూ జైలు గదిలో వున్నట్లు బ్రతికింది.

కానీ భగవంతుడు అనుగ్రహించబట్టి ఆ మురికి కూపం నుంచి ఎలాగో బయటపడ గలిగింది,

అలాగే తన తల్లిని కూడా ఆ చెరసాల నుంచి బయటికి తీసుకుని రాగలిగితే బాగుండును అని ఆరాట పడుతోంది.

నిజానికి తనకిగా తను చెప్పుకోలేకపోయినా అతడు ఎన్నోసార్లు తన గతాన్ని గురించి, తన తల్లిదండ్రుల గురించి, తన జీవితం గురించి వివరాలు గుచ్చి గుచ్చి అడిగాడు.

అలాటి క్షణాల్లో మనసు ఎంతో బలహీనపడి పొయ్యేది.

అతని మంచితనం, సహృదయం చూశాక ఎన్నోసార్లు మనసు విప్పి తన గోడు చెప్పుకోవాలి అనిపించేది.

ఒక్కసారి కనీసం తన తల్లిని కళ్ళారా చూసే అవకాశం కలిగించ మని వేడుకోవాలి అనిపించేది.

కానీ ఎందుకో........అంతలోనే సందేహం........ఎన్నోరకాల సంశయాలు.

తల్లి గురించి నాలిక చివరిదాకా వచ్చిన మాటలు కూడా పైకి చెప్పలేక గొంతుకలోనే మింగివేసింది

అతడు సహృదయంతో సహకరిస్తే సరే....లేకపోతే!

తను ఒక హంతకురాలి కూతుర్ని అని తన తల్లి జైల్లో వుందని అసహ్యించుకొంటే....తన గతి ఏమిటి!

ఈ పాటి ఆశ్రయం కూడా వుండదుకదా!

తను కాల్ గరల్....తన తల్లి హంతకి....?

తమలాంటి వాళ్ళని ఇంట్లో పెట్టుకుందుకు, తమలాంటి నేరస్థులకి సహాయం చెయ్యడానికి వెనకాడ వచ్చు. ఏ రకంగానయినా భయపడ వచ్చు.

అప్పుడు ఈ పాటి ఆదరణ కూడా చూపించరపోగా తనని ఇంటి నుండి వెళ్ళగొట్టవచ్చు కదా!

ఎంత సహృదయత మంచితనం వున్నా తనలాంటి వాళ్ళని ఎవరు ఆదరిస్తారు! ఎవరు అర్థం చేసుకుంటారు.

దొంగ కూతురు దొంగ కాకపోయినా దొంగని చూసినట్లే చూస్తుంది. లోకం.

ఇప్పుడు తన విషయంలోనూ అంతే అవుతుంది.

మీ అమ్మ హంతకురాలు అయినప్పుడు నువ్వు మాత్రం కాకుండా పోతావా! అన్న బెదురుతో అతడు తనని దూరం చేస్తాడేమోనని సుజాత భయం ? ?

అది సహజం కూడా !

ఎవరి ప్రాణం గురించి వాళ్ళకి తీపి వుండటంలో ఆశ్చర్యం లేదు కదా?

నిజానికి తాము అలాంటి వాళ్ళం కాదని చెప్పినా ఎవరూ నమ్మక పోవచ్చు.

ఎందుకంటె ప్రత్యక్ష సాక్ష్యంగా తమ నేరాలే కనిపిస్తాయి కానీ కారణాలు కనిపించవు కదా !

అందుకే సుజాత అతనికి తల్లి గురించి చెప్పటానికి భయ పడింది.

ఆమె తెలిసీ తెలియని వయసు....చేదు అనుభవాలు....మంచి జరుగు తుందన్న నమ్మకాన్ని కోల్పోయేలా చేశాయి.

ఈ ఆరునెల్ల సాహచర్యంలోనూ అతని వ్యక్తిత్వాన్ని గురించి ఏ విధంగానూ ఒక నిర్ణయానికి రాలేకపోతూంది సుజాత.

అతను తనతో ప్రేమగానే వుంటున్నాడు.

అభిమానంగానే చూస్తున్నాడు.

కానీ....

ఆ ప్రేమ ఏ రకం అయినదో....ఆ అభిమానానికి అర్థం ఏమిటో ఎంత ఆలోచించినా తోచటంలేదు.

ఆరోజు....అతడు...తన కోసం అంత డబ్బు ఖర్చుపెట్టి.... అంత శ్రమ అతని ఇంటికి తీసుకొని వచ్చిన రోజున అనుకొంది....

"తను చాలా అందమైన అమ్మాయి. ఆమాట చాలామంది అన్నారు. ఆ అందమే అతన్ని ఆకర్షించి వుంటుంది"

"తన అందం కేవలం అతని ఒక్కడి స్వంతమే కావాలన్న తపనతో తనని ఇక్కడికి తెచ్చుకుని వుండచ్చు.

మోజు తీరిపోయిన తరువాత తనను పట్టించుకోక పోవచ్చు.

లేదూ జీవితాంతం అతని దగ్గరే ఆశ్రయం ఇయ్యొనూవచ్చు...."

అనుకుంది ఆరోజు.

అతని మనసు ఇదమిద్ధంగా తెలియక పోయినా, అతని నిర్ణయం ఎలాంటిదైనా సరే....ఆ విష వలయంనుంచి బయటికి తీసుకు వచ్చినందుకు మనసులోనే అతని పాదాలు కళ్ళకి అద్దుకుంది.

ఆ హోటల్స్‌లో....ఎన్నో రాత్రులు....ఎందరికో....మనసు మొరా యిస్తున్నా....కన్నీటితో తల వంచింది.

కానీ...."అతనికి" తనకిగా తాను మనసారా అంకితం కావాలని ఎన్నో రాత్రులు ఎదురు చూసింది.

మనసు విప్పి ఒక ఆడపిల్ల మాటలద్వారా చెప్పలేని భావాల్ని ప్రవర్తన ద్వారా చూపించింది.

తనకి ఒక కొత్త జీవితాన్ని ప్రసాదించిన అతని పాదాల దగ్గర తన బ్రతుకు గడిచిపోవాలని ఆశించింది.

కానీ....అతడు మౌనిలాగ తన దగ్గర ప్రవర్తిస్తున్నాడు.

తను అతనికి ఎంత దగ్గర కావాలని ప్రయత్నిస్తుందో .... అతడు తనకి అంత దూరంగా వుంటున్నాడు.

దాంతో సుజాత హతాశురాలు అయిపోతోంది. అందుకే తల్లి గురించి కూడా ధైర్యంగా చెప్పలేకపోతోంది.

ఆతనిలోని ఆ స్తబ్ధతకి కారణం ఏమిటో కూడా అర్థం కావటం లేదు.

అసలు తనని ఇక్కడికి ఎందుకు తీసుకొచ్చాడో! తన విషయంలో అతని అభిప్రాయం ఏమిటో...! అంతా అయోమయం....

ఒక్క చిక్కుముడిలాగ అనిపిస్తోంది. ఆ విషయం గురించి తను అడగలేదు.

అతడు చెప్పడు.

ఆతడు తనకంటే వయసులో పెద్దవాడు.

అయినా సరే....అతడు అంగీకరిస్తే అతడ్ని వివాహం చేసుకోవాలని, అతని నీడన తన జీవితం వెళ్ళదీయాలని మనసా వాచా కోరుకొంటోంది.

ఆ తరువాత తన ప్రేమవల్ల, ప్రవర్తనవల్ల అతని ఇంట్లోనే కాక అతని మనసులో కూడా చోటు సంపాదించుకుని....అప్పుడు తన తల్లి గురించి చెప్పాలని, అతని సహకారంతో తల్లిని ఎలాగైనా ఆ చెరసాల నుంచి విముక్తి కలిగించి తన దగ్గరికి తెచ్చుకోవాలని ఆశిస్తూంది సుజాత.

కానీ అతను ఎంతమాత్రం సుముఖంగా లేడు.

ఈ ఆరునెల్ల సాహచర్యంలోనూ అతడిలో ఒక స్నేహితుడ్ని, సోదరుడ్ని, తండ్రినీ...చూడగలిగింది కానీ అంతకంటే ఎక్కువ చొరవ కనిపించలేదు. అతనింట్లో తనకే ఒక ధృఢమైన స్థానంలేదు.

ఈ పరిస్థితిలో ఇంక తల్లి గురించి ఏమని చెప్పగలదు!

అందుకే తల్లి గురించి మనసు ఆత్రపడుతున్నా....తన వేదన ఆర్తి అంతా తనలోనే అణిచేసుకుంది.

పోనీ....అతనికి తెలియకుండా తల్లిని చూడటానికి వెళదామన్నా అదీ అసాధ్యంగానే అనిపిస్తోంది.

అతని నివాసం ఎక్కడో వూరి చివర....అరణ్య ప్రాంతంలో.

తన చేతిలో ఎక్కువగా డబ్బులేదు. అసలు తల్లి ఎక్కడ వుందో తెలియదు.

తనకి "నా" అనుకున్నవాళ్ళు ఎవ్వరూలేరని కదా చెప్పింది.

అతనికి తెలియకుండా ఈ పరిస్థితిలో యెక్కడికైనా ఎలా వెళ్ళగలదు!

వెళ్ళినా అతను తప్పుగా అర్థం చేసుకుంటే తను ఈ పాటి సానుభూతి కూడా కోల్పోతుంది. సరికదా .... తిరిగి తన పరిస్థితి మొదటికి వస్తుంది.

అందుకే తల్లిమీద మనసు లాగుతున్నా ఎటూ తోచని స్థితిలో .... ఈ రకమైన మానసిక సంఘర్షణతోనే ఈ ఆరునెల్లా గడిపేసింది సుజాత.

కానీ ఇలా ఎన్నాళ్ళూ!

ఆమెకి తెలియకుండానే ఒక విధమైన మానసిక స్తబ్దత .... గుండెల నిండా గుబులు పేరుకోసాగింది.

రాను రాను ఆమెలో ఒక విధమైన ఫ్రిజిడిటీ ?

మనసుకి అద్దం పట్టినట్లు ఆ అమ్మాయి కళ్ళల్లో కనిపిస్తున్న నీలి నీడలు....అతడిని విచలితుడిని చేశాయి.

ఆమె పెదవి విప్పి చెప్పకనే అతడు ఆమె గుండెల్లోని గుబులుని అర్థంచేసుకున్నాడు.

ఆ అమ్మాయి ఒక విధమైన అమాయకతతో....కృతజ్ఞతతో.... తన సాహచర్యం కోరుకుంటోంది.

కానీ....అతనికి ఆమె పట్ల అలాంటి భావాలు ఎందుకో కలగడం లేదు.

ఆ మాట చెప్తే బాధ పడుతుందేమో....

"అసలు నన్ను ఎందుకు ఇక్కడికి తీసికొచ్చారు!" అని అడిగితే జవాబు అతని దగ్గర స్థిరంగా లేదు.

ఈ సమస్యకి ఏదో ఒక పరిష్కారం ఆలోచించాలి అని అనిపించింది.

ఇక్కడికి వచ్చిన కొత్తలో ఆమెలో వున్న వుత్సాహం స్థానంలో ఇప్పుడు విషాదం కనిపించటం చూసి అతను స్థంభీభూతుడు అయ్యాడు.

"ఆ రోజు" ఆ అమ్మాయి కన్నీరు చూసి కరిగిపొయ్యాడు.

ఎందుకో "ఇది" అని చెప్పలేని అనిర్వచనీయమైన ఆపేక్ష అనిపించింది ఆమెని చూడగానే.

ఆ భావనతోటే ఆ అమ్మాయికి ఏదన్నా మంచి చెయ్యాలని కదా తన వెంట. కానీ ఇంతవరకూ ఆమె భవిష్యత్తు గురించి ఏమీ ఆలోచించ లేదు.

ఆమెని పెళ్ళి చేసుకునే వుద్దేశ్యం ఎలాగూ తనకి లేదు.

ఆ అమ్మాయిని చూస్తే ఎందుకో....అసలు అలాంటి సెక్సు పరమైన ఆలోచన్లు రావటంలేదు.

కానీ....ఇలా తిండి బట్ట ఇచ్చి ఇంట్లో ఆశ్రయం చూపించినంత మాత్రాన ఈ సమస్య పరిష్కారం కాదు.

"ఆ అమ్మాయికి ఒక మంచి భవిష్యత్తు ఏర్పాటు చెయ్యాలి...." అనుకున్నాడు అతను.

తీవ్రంగా ఆలోచించిన మీదట ఒక నిశ్చయానికి వచ్చాడు.

ఒకరోజు సుజాతని పిలిచి చెప్పాడు....

"సుష్మా? నువ్వు ఇంటర్ ఫస్ట్ క్లాసులో పాసయ్యావని చెప్పావు కదా!"

"అవును"

"నువ్వు చదువుకున్న కాలేజీకి అప్లయి చేసి నీ రికార్డ్సు సర్టిఫికేట్సు తెప్పించుకో...." అంటూ రెండు ఎనవలెప్స్, స్టాంప్సు అందించాడు.

సుజాత తలెత్తి ఆశ్చర్యంగా అతని ముఖంలోకి చూసింది.

అతను సన్నగా నవ్వి అన్నాడు "అవును సుష్మా? నీ కేదయినా మంచి భవిష్యత్తు చూపించాలనే వుద్దేశంతోనే నిన్ను యిక్కడికి తెచ్చాను."

వచ్చే నెల్లో మనం హైద్రాబాద్‌కి వెళదాం. అక్కడ నిన్ను మెడికల్ ఎంట్రన్స్‌లో చేర్పిస్తాను.

సీటు వచ్చిందా సరే... లేకపోతే డొనేషన్ కట్టి అయినా సరే.... నిన్ను మెడిసన్‌లో చేర్పిస్తాను.

సుజాత స్థంభించినట్లు రెండు నిముషాల సేపు రెప్పలు వెయ్యకుండా అతని ముఖంలోకి చూసి........నెమ్మదిగా తలదించుకుని అంది.

"ఇప్పుడు నాకు అంత చదువు ఎందుకు! అంత డబ్బు మీరు నా కోసం ఖర్చు పెడితే........మీ ఋణం నేను జీవితంలో తీర్చుకోలేను...."

"సుష్మా? ఋణాల మాట ఎందుకు! అయినా నువ్వు తీర్చుకోవాల్సింది నా ఋణం కాదు. ప్రజాసేవ చేసి ఆ విధంగా నాకు ఆనందాన్ని ఇచ్చి నీ ఋణం తీర్చుకో...."

"అసలు ఇప్పుడు నాకెందుకింత చదువు!"

"సుష్మా! ........"

"చదువు ఎందుకు ఏమిటి! నువ్వు డాక్టరువి కావాలి అది నా కోరిక ....

"సుష్మా....నాకు ఎవ్వరూ లేరు. జీవితంలో ఒంటరి వాడ్ని. ఈ కాంట్రాక్ట్సు చేసి చాలానే సంపాదించాను.

నేను పోయేలోగా ఏదయినా ఒక మంచి పని చెయ్యాలని అనుకున్నాను.

లేదూ....ఎవరైనా ఒక అనాధ బాలికను పెంచుకోవాలని కూడా అనుకున్నాను.

అలాంటి పరిస్థితిలో నువ్వు దైవఘటనగా తటస్థపడ్డావు.

నిన్ను చూడగానే ఎందుకో........నా మనసు స్పందించినట్లు అయ్యింది.

నేను ఎలాగూ ఒక అమ్మాయిని పెంచుకోవాలి అనుకుంటున్నాను కదా!

ఆ అమ్మాయి నువ్వే ఎందుకు కాకూడదు। అనిపించింది.

నీ సంపాదన మీద ఎవ్వరయినా ఆధారపడ్డవారు వున్నారేమో అని సందేహించాను.

కానీ నువ్వు నీ కెవ్వరూ లేరని, అనాథనని చెప్పావు.

అంతే....నిన్ను తీసుకొచ్చాను.

నువ్వు బాగా చదువుకొని వృద్ధిలోకి రావాలి. ఒక మంచి డాక్టరుగా పేరు ప్రఖ్యాతులు సంపాదించాలి....అది నా అభిలాష.

సుజాత చప్పున మొఖం తిప్పుకుంది.

"కానీ... నాకు అంత శ కిలేదు"

అతను చకితుడయ్యాడు.

ఆశ్చర్యంగా చూస్తూ అన్నాడు.

"ఆ శ క్తి లేదా!"

"ఉహూ...."

"మరి ఏం చేద్దామని!"

సుజాత కళ్ళనిండా నీళ్ళు తిరిగాయి.

"అతనికి తన మనసు ఏమిటో తెల్సు. తెల్సే ఇలా మాట్లాడు తున్నాడు కదా!" అనుకొంటూ ఆమె కళ్ళ నిండా గిర్రున నీళ్ళు వచ్చాయి.

ఒక విధమయిన మొండి తనం తల ఎత్తింది. దూకుడుగా అంది —

మీరు ఒప్పుకుంటే మిమ్మల్ని పెళ్ళి చేసుకొని స్థిరపడదామను కొంటున్నాను"

అంతే ? ?

అతడు స్థంభీభూతుడయ్యాడు.

ఇన్నాళ్ళ ఆమె ప్రవర్తన్ని బట్టి ఆ అమ్మాయికి ఆ వుద్దేశం వుందని గ్రహించుకున్నాడు.

కాని అంత సూటిగా చెప్తుంది అనుకోలేదు.

అతడు ఆ మాటతో ఖంగు తిన్నట్లయి గభాల్న కుర్చీలోంచి లేచి గబగబా అంగలు వేస్తూ కిటికీ దగ్గరికి వెళ్ళాడు.

అతని మొఖం అంతా ఎర్రగా కందింది.

ఆవేశాన్ని అణుచుకొంటున్నట్లు చాలాసేపు పెదవులు బిగించి బయటికి చూస్తూ వుండిపొయ్యాడు.

సుజాతకి భయం అనిపించింది.

తను అన్నదాంట్లో పొరపాటు ఏమిటో అర్థం కాలేదు.

పోనీ........అతనికి అంత ఇష్టం లేకపోతే ఆ మాట చెప్పవచ్చు కదా !

నిజమే. తను పతిత. తన లాంటి అమ్మాయిని ఎవరూ పెళ్ళి చేసుకోరు....

సుజాతకి కళ్ళ నిండా నీళ్ళు వచ్చాయి.

"......."

"........"

ఇద్దరి మధ్యా కొద్దిసేపు నిశ్శబ్దం తర్వాత తిరిగి నెమ్మదిగా అతనే అన్నాడు.

"సుష్మా? నువ్వింకా చిన్నపిల్లవి. అప్పుడే అంతంత ఆలోచన్లు ఎందుకు! నాకు పెళ్ళి చేసుకోవాలన్న ఆలోచన ఏనాడో చచ్చిపోయింది. నిన్ను చూస్తుంటే నా కూతురు లాగా అనిపిస్తున్నావు. నా చెల్లెలు లాగా అగుపిస్తున్నావు. అంతే?"

నువ్వు బాగా చదువుకుని వృద్ధిలోకి రా. ఆ తర్వాత నీకు తగిన వరుడ్ని చూసి పెళ్ళి చేస్తాను.

ఇప్పుడు నేను సంపాదించిన దంతా నీ కోసం ఖర్చు పెడతాను.

నా వార్ధక్యంలో నీ దగ్గరికి వచ్చి వుంటాను.

నాకు మాత్రం ఎవరున్నారని!

అప్పుడు నీ సంపాదనా నా కోసం ఖర్చుపెట్టు.

"వెంటనే నీ సర్టిఫికేట్సు పంపమని నువ్వు చదువుకున్న కాలేజీకి వ్రాయి. ఈలోగా మనం ఒకసారి హైదరాబాదు వెళ్ళి వద్దాం .... ..."

అంటూ చెప్పి వేగంగా అక్కడి నుంచి బయటికి వెళ్ళిపోయాడు.

సుజాత హతాశురాలు అయ్యింది.

చాలా సేపు అలాగే స్తబ్దుగా కూర్చుండిపోయింది.

ఆ తరువాత ఆలోచిస్తే అతని మాటల్లోనూ ఎంతో సమంజసం కనిపించింది.

అతనికి తనపట్ల కోరిక లేనప్పుడు పెళ్ళికి సుముఖత లేనప్పుడు .... ఒక విధంగా అదీ తన మంచికే అనిపించింది.

అతని సలహా ప్రకారం తను సిటీకాలేజీలో చేరితే....అప్పుడు తనకి కొంచెం స్వేచ్ఛ లభిస్తుంది.

తన చేతిలో కొంత డబ్బు కూడా వెసులుబాటు అవుతుంది.

అతనికి తెలియకుండా తన తల్లిని ఏ జైల్లో పెట్టారో తెల్సుకోవాలి.

ఆ తరువాత అమ్మని కల్సుకోవాలి.

వీలైతే ఆవిడని విడపించాలి.

లేదూ........తను చదువు పూర్తిచేసి డాక్టరుగా ఎక్కడైనా ఉద్యోగం దొరికిన వెంటనే అమ్మ బాధ్యత తీసుకోవాలి. ఈలోగానే ఆవిడ శిక్షాకాలం పూర్తి అయితే తనకి అంతకంటే కావలసింది ఏదీలేదు.

బ్రతుకంతా ఒకరిమీద ఆధార పడటంకంటే కాస్త ఆలస్యంగానైనా తన కాళ్ళమీద తను నిలబడటం ఉత్తమం....అనుకొంది సుజాత.

ముందు కాలేజీలో చేరగానే తల్లి గురించి వివరాలు సేకరించి అమ్మని కల్సుకోవాలి.

తను ఆనందంగా క్షేమంగా వుందని చెప్పాలి.

అమ్మకి తన శ్రేయస్సు కంటే ఆనందం మరొకటి లేదు కదా!.... ఎలాగయినా అమ్మని చూడాలి....

సుజాత కన్నీరు తుడుచుకొని కాగితం కలం అందుకొంది.

తన సర్టిఫికేట్లు పంపమని అప్లికేషన్ వ్రాయడం మొదలు పెట్టింది.

o o o

ఆ రోజు....

అక్టోబరు రెండవ తారీఖు....

గాంధీ జయంతి.

ప్రభుత్వం — ఆ సందర్భంగా చాలామంది ఖైదీలని విడుదల చేసింది.

దీర్ఘకాలంగా జైలు శిక్ష అనుభవిస్తున్న వాళ్ళూ, యావజ్జీవిత ఖైదు శిక్షలు పడినవాళ్ళూ, చాలామంది ఖైదీల నేరాలన్నీ మానవతా దృష్టితో రద్దుచేసి ప్రభుత్వం వాళ్ళని జైళ్ళనుంచి విడుదల చేసింది.

దొంగతనం, హత్య, వ్యభిచారం, కిడ్నాపింగ్....ఇలా ఎన్నో రకాలుగా నేరాలుచేసి పట్టుబడిన వాళ్లు కూడా పూజ్యబాపూజీ జయంతి సందర్భంగా అనాడు విడుదల అయ్యారు.

ఖైదీలను మర్నాడు విడుదల చేస్తారనగా ఆ ముందురోజు జైలు అధికారులు ఖైదీ అందర్నీ సమావేశ పరిచారు....

"....నేరం చెయ్యటం మహా పాపమని, నీతిగా నియమంగా బ్రతికి మానవత్వపు విలువల్ని పెంచాలని, నేరంచేసి ఈ లోకంనుంచి తప్పించుకున్నా పై లోకంలో భగవంతుని ముందు శిక్ష అనుభవించక తప్పదని, ఇక ముందైనా మానవధర్మంగా బ్రతకమని...." బోధనలు చేశారు.

ఆ తరువాత గాంధీజీ, గౌతమ బుద్ధుడు, వివేకానంద మొదలగు మహామహుల మహితోక్తులు చదివి వినిపించారు.

ఆ మర్నాడు జైలు రూల్సు ప్రకారం ఫార్మలిటీస్ అన్నీ ముగిసిన తరువాత ఖైదీలందర్నీ విడుదల చేశారు.

ఆ ఖైదీలలో సావిత్రి కూడా వుంది.

నిజానికి ఆమె శిక్షాకాలం పూర్తి కాలేదు. కానీ ఇన్నాళ్ళ జైలుశిక్షా కాలంలో సావిత్రి క్రమశిక్షణ, సత్ప్రవర్తన, గుడ్ కాండక్టు, తోటి ఖైదీలతో సంచరించిన విధానం, ఆమె పనితనం....అన్నీ జైలు అధికారుల మన్ననలు పొందాయి.

సావిత్రిపట్ల సదభిప్రాయాన్ని కలిగించాయి.

పైగా ఆమె ఆరోగ్యం కూడా ఈ మధ్య సరిగాలేదు. బాగా దెబ్బ తింది.

"క్షయ"లాంటి వ్యాధి ఏదో పట్టి పీడిస్తున్నట్లు ఆమె పూర్తిగా చిక్కిపోయింది.

తరచు "ఖంగ్....ఖంగ్...." మని దగ్గుతూ వుంటుంది.

ఈ మధ్య ఆహారం కూడా సరిగా తీసుకోవటంలేదు. కొన్ని రోజులు అభోజనంగా వుంటోంది.

వీటన్నింటి దృష్ట్యా ప్రభుత్వం ఆమెని కూడా విడుదల చేసింది.

అక్టోబరు రెండవ తారీఖున విడుదలైన ఖైదీలలో, వాళ్ళకోసం వచ్చిన ఆత్మీయులతో - జైలు ఆవరణ కిటకిటలాడిపోయింది.

విడుదలయిన వాళ్ళని ఇళ్ళకి తీసుకు వెళ్ళడంకోసం ఎందరో ఆత్మీయులు, బంధువులు, స్నేహితులు వచ్చారు....ఆనందంగా కౌగలించుకుని ఇళ్ళకి తీసుకు వెళ్ళారు.

వాళ్ళందరి ఆత్మీయత చూస్తూంటే సావిత్రికి దుఃఖం ఆగలేదు.

ఎంత నిగ్రహించుకున్నా ఆగకుండా కట్టలు తెంచుకుని ప్రవహించే వరదలా — కన్నీరు చెక్కిళ్ళమీద ధారా ప్రవాహంలాగా జారిపోయింది.

విడుదలైన ప్రతి ఖైదీకోసం ఎవరో ఒకరు వచ్చారు.

కానీ సావిత్రికోసం ఎవ్వరూ రాలేదు.

ఆమె కళ్ళు ఆత్రంగా సుజాతకోసం ఆవరణంతా వెతికాయి,

కానీ ఆమె ఆశ నిరాశ అయింది.

"తను విడుదల అవకుండా ఆ జైల్లోనే వుంటే మాత్రం ఏమిటి!

తనకోసం ఆనంద పడటానికైనా దుఃఖం పడటానికైనా యెవరున్నారని!

ఒంటరితనాన్ని మించిన నేరం....

ప్రేమ రాహిత్యాన్ని మించిన శిక్ష....ఈ లోకంలో ఇంకొకటి లేదు కదా.

ఆ రెండూ భగవంతుడు ఏనాడో తనకి విధించాడు కదా.

ఆ శిక్ష ముందు ఉరిశిక్ష, చిత్రవధ కూడా చాలా తక్కువే.

నిజం చెప్పాలంటే బయట ప్రపంచంలో కంటే ఈ జైలు గోడల మధ్యే తన జీవితం ఒక రకమైన ప్రశాంతతో క్రమశిక్షణగా సాగిపోయింది.

బయటికి వస్తే....తను నిరుపేద. ఒంటరి బ్రతుకులో అడుగు అడుగున అశాంతి, భయం... ఆందోళనలే కదా.

ఈ ప్రపంచం ఎంత విశాలమైనదైనా తను జైల్లో వున్నట్లే బ్రతికింది.

కానీ....

ఆ జైలుగది ఎంత ఇరుకైనా అదే విశాల ప్రపంచంలా....ఆ కొస్తలోనే వున్నంతలో శాంతిగా సుఖంగా ఆనందంగా జీవించింది.

కానీ తిరిగి ఇప్పుడు మళ్ళీ ఆ పాత జీవితం, ఆశలు, అడియాసలు, ఆరాటం....అన్నీ తలెత్తుతాయి.

తన కూతురు గురించి ఆందోళన మొదలయ్యింది.

నిజానికి దానికోసం వూరూరా తిరిగే శక్తి, ఓపిక తన వొంట్లో లేదు.

అలా అని దాని గురించి పట్టించుకోకుండా వూరుకునేంతటి గుండె నిబ్బరం కూడాలేదు.

దాన్ని చూసి ఎన్నాళ్ళయింది!

రెండేళ్ళ పైనే కదూ!

అసలు ఇప్పుడు అది ఎక్కడ వుంది!

ఎలా వుంది!

ఈ అమ్మ దానికి జ్ఞాపకం వుందా!

లేక....

సావిత్రి చెక్కిళ్ళమీద ధారగా జారిపోతున్న కన్నీరుపయిటచెంగుతో అద్దుకుంది.

నిశ్శబ్దంగా జైలుగేటుదాటి రోడ్డు వెంట నడువసాగింది.

ఇదివరకులా ఇప్పుడు ఒంట్లో ఓపికలేదు.

గాలి తీసేసిన తోలితిత్తిలా అయిపోయింది శరీరం.

అడుగుతీసి అడుగువేస్తుంటే గుండెల్లో కలుక్కుమంటోంది.

అయినా సావిత్రి నడక ఆపలేదు.

వెన్నెముక విరిగినట్లు కొస్త ఒంగి అరచేత్తో గుండెలు అదిమి నడవటం మొదలు పెట్టింది.

"ఇల్లు ఇల్లంటావు
నీ యిల్లు అంటావు
ఇల్లు నీకెక్కడే చిలకా ?
కూలిపోయే ఇల్లు
కాలిపోయే ఇల్లు
కలకాలముండదే చిలకా....
ఊరికి ఉత్తరాన కావూజిపురములో
కట్టి ఇల్లనదే చిలకా........"—

దూరంగా కూలిన ఇంటి అరుగుమీద కూర్చుని ఎవరో సాధువు టింగ్....టింగ్‌మని ఏకతారా మీటుతూ ఎవరో సాధువు తత్వం పాడుతున్నడు.

సాధువు గొంతులో సన్నని అపశృతితో కూడన విషాదం.

సావిత్రి ఆ జైలు ఆవరణ పూర్తిగా దాటి సందు మలుపు తిరిగే దాకా గాలి తరంగాలలో తేలితేలి ఆ బిచ్చగాడి దీనమైన గొంతు "వద్దు" అనుకున్న ఆమెకి వినిపిస్తూనే వుంది.

సావిత్రి ఆలోచనల మధ్యే చాలాదూరం నడిచి నడిచి అలసి పోయింది.

జైలు ఆవరణ దాటి చాలాదూరంగా వచ్చేసింది.

కాళ్ళు సన్నగా పీకుతున్నట్లు అనిపించి హఠాత్తుగా నడక ఆపేసింది.

అప్పుడు జ్ఞాపకం వచ్చింది.

"గమ్యం" తెలియకుండా ఇలా ఎంతదూరం నడవాలి?

సావిత్రి తల యెత్తి నిశ్శబ్దంగా చుట్టూ పరికించింది.

ఒక పెద్ద రావిచెట్టు విశాలంగా విస్తరించి కనిపించింది.

సావిత్రి నెమ్మదిగా ఆ చెట్టుకిందకి వెళ్ళి కూర్చుంది.

అసుర సంధ్యాసమయం.

ఒక ప్రక్కనుంచి ప్రొద్దు వాటారిపోతోంది.

పూర్తిగా వెలుగురేఖలు అంతరించి పొయ్యాయి.

సన్నగా సంజె చీకట్లు అలుముకుంటున్నాయి.

ఇళ్ళల్లో దీపాలు వెలిగించే వేళ.

చెట్టు బోదెని ఆనుకొని చాలా సేపు నిశ్శబ్దంగా....ఒంటరిగా కూర్చుని ఆలోచిస్తూ కూర్చుండిపోయింది సావిత్రి.

ఎంత ఆలోచించినా "ఎక్కడికి వెళ్ళాలి?" అన్న ప్రశ్నకి మాత్రం జవాబు దొరకటంలేదు.

ఉవ్వెత్తున లేచి విరిగిపడే అలల్లా సావిత్రికి గుండెల్లోంచి కన్నీరు పొంగి వచ్చింది.

మోకాళ్ళమీద తల పెట్టుకుని చాలా సేపు ఏడుస్తూ కూర్చుండి పోయింది.

ఈ ప్రపంచం యెంత విశాలంగా వుంటే మాత్రం ఏమిటి?

ఒక స్త్రీ తలదాచుకుందుకు కొంచెం నీడ లేకపోయిన తరువాత?
"నా" అని చెప్పుకుందుకు ఒక తోడు లేకపోయిన తరువాత.
స్త్రీకి న్యాయం చెయ్యలేని చట్టం....
స్త్రీకి రక్షణలేని సంఘం....
ఎందుకు?
సావిత్రి చెక్కిళ్ళపై కన్నీరు కాల్వలుకట్టి జారుతోంది.
సుజాత కొరకు ఆ తల్లి మనసు తపన పడుతూంది.
"అది ఇప్పుడు ఎక్కడ వుందో....ఎలా ఉందో....
ఏ కిరాతకుల చేతుల్లో ఎన్ని కష్టాలు పడుతూందో....
'నా' అనుకున్నవాళ్ళు లేక ఎన్ని బాధలు పడుతోందో...."

అనుక్షణం ఈ రకమైన ఆలోచన్లు ఆమె గుండెని చెదపురుగులా దొలుస్తున్నాయి.

కూతురి కంటికి దూరం అయిన క్షణంనుంచి ఈ రకమైన మానసిక క్షోభతో నలిగిపోతోంది సావిత్రి.

చేపపిల్లల్లా తళతళా మెరిసే ఆమె సోగకళ్ళు గాజుగుడ్లల్లా మారి పొయ్యాయి.

కళ్ళకింద నల్లగా వలయాలు ఏర్పడ్డాయి.

తెల్లగా చందనపు చెక్కల్లా వుండే చెక్కిళ్ళు పల్చగా చిక్కి లొట్టలు పొయ్యాయి.

నల్లగా రింగులు తిరిగి తుమ్మెద రెక్కల్లా వుండే జుత్తు రాగి రంగుకి తిరిగి తుంపులు తుంపులుగ అయిపోయింది.

ఒక్కసారి యాభై ఏళ్ళు అదనంగా పైబడినట్లు కృంగిపోయింది సావిత్రి.

ప్రపంచంలోని నిర్వేదం అంత ఆమె కళ్ళల్లోనే గూడు కట్టుకుందీ అన్నట్లు నిర్జీవంగా వున్నాయి ఆమె చూపులు.

జైల్లో వున్ననాళ్ళూ ఆమె వూరికే తిని కూర్చోలేదు.

జైలు అధికారులు నిత్యం రకరకాల పన్లు చేయించుకుని కూలి డబ్బు ఇచ్చేవారు.

ఆ డబ్బంతా సావిత్రి పేర్న జమ చేశారు.

ఖైదీ లందరిచేత అలాగే పన్లు చేయించుకుని ఆ కూలి డబ్బు అంత వాళ్ళ విడుదల అయిన రోజున ముట్ట చెబుతారు.

సావిత్రికి అలాగే కొంత డబ్బు చేతికి అందింది.

అంతేకాక జైల్లో వున్నన్ని రోజులు సావిత్రి సత్ప్రవర్తనకి, క్రమ శిక్షణకి, గుడ్ కాండక్టుకి, తోటి ఖైదీలతో ఆమె వ్యవహరించిన తీరుకి మెచ్చి "రివార్డుగ" మరికొంత డబ్బు కూడా ముట్ట చెప్పారు.

జైలునుంచి విడుదల చేసేముందు అధికారులు సావిత్రిని పిలిచి ఆ డబ్బు, ఒక జత కొత్త బట్టలు ఇచ్చారు.

"ఇక ముందైనా నీతిగా నిజాయితీగా బ్రతకమని, హత్యలు చెయ్యటం, వ్యభిచారం చెయ్యటం, మానవత్వానికి కళంకం తెచ్చే చర్యలని, స్త్రీగా జన్మ ఎత్తినందుకు ఆ పదానికి గౌరవం తేవాలిగాని, కళంకం తేవద్దని......" నీతులు చెప్పి జైలు అధికారులు సావిత్రిని విడుదల చేశారు.

అధికారులు తనని నిల్చోపెట్టి ఆ మాటలు చెబుతున్నప్పుడు సావిత్రికి దుఃఖం పొంగి వచ్చింది.

చెక్కిళ్ళమీద కన్నీరు ధారలుగా జారిపోయింది.

"ఆఖరికి ఇతరులచేత ఆ మాటలు చెప్పించుకోవాల్సి వచ్చింది కదా?" అన్న ఆవేదనకి ప్రతిరూపమే ఆ కన్నీళ్ళు.

సావిత్రి జైలునుంచి బయటకి వచ్చిన మరుక్షణం నుంచి ఒకే ఒక్క ప్రశ్న ఎదురయ్యింది.

ఎక్కడికి వెళ్ళాలి?

అసలు తనకి ఎవరున్నారని?

ఈ లోకంలో గడ్డిపోచ చాలా తేలిక అయినది.

"దూది" అంతకంటె తేలిక అయినది.

"యాచకుడు" ఈ రెండింటికంటె కూడా చాలా తేలిక అయినవాడని వేదాలు చెపుతున్నాయి.

కాని—

"పతనం" అయిన ఆడది అంతకంటెకూడా చాలా తేలిక అయినదని సావిత్రి అనుభవం చెబుతూంది.

సమాజపరంగా తను ఎంతో పతనం అయ్యింది.

ఎన్నో రకాలుగ దిగజారింది.

అలాంటి తను యెక్కడికి వెడుతుంది?

ఈ పరిస్థితిలో సహృదయంగా యెవరు ఆదరిస్తారు తనని?

స్త్రీకి రక్షణ కల్పించలేని సమాజం!

స్త్రీకి గౌరవంలేని సమాజం?

"ఒక చక్కటి సంసార స్త్రీని యెలా దిగజారుద్దామా?" అని ఆలోచిస్తారేగాని—

పతనం అయిన స్త్రీని తిరిగి ఉద్ధరిద్దామని గౌరవస్థానంలో నిలబెడదామని యెవ్వరూ యెందుకు అనుకోరో... సావిత్రికి అర్థం కాదు.

"తప్పు" చేసిందని ఒక స్త్రీని అంత వ్రేలెత్తి చూపుతారు గాని—

....అసలు ఆమె ఆ తప్పు యెందుకు చేసింది? ఆమె సమస్య ఏమిటి? అని సహృదయంగా ఎవ్వరూ యెందుకు ఆలోచించరు?

"యజ్ఞం" చెయ్యబోయి చెయ్యి కాల్చుకున్నట్లు యేమిటి తన

ఆకుకి అందక — పోకకి చెందక అన్నట్లు ఇలాగ ఎందుకు అయిపోయింది ?

తను ఏ జన్మలో చేసిన పాపానికి శిక్ష ఇది?

తన సంగతి సరే....

కాని తన కూతురు....సుజ్జి మాట ఏమిటి? అసలు ఇప్పుడు ఎక్కడ వుంది? వుందా? లేక....

సావిత్రిలో మళ్ళీ దుఃఖం పొంగివచ్చింది.

సావిత్రి ఆరెస్టు అయిన వెంటనే సుజాత ఇంట్లోంచి తప్పించుకుని పారిపోయినట్లు శంకర్‌లాల్ కొడుకులు కోర్టులో స్టేట్‌మెంటు ఇచ్చారు.

అది విని సావిత్రి యెంతో ఆనందించింది,

"సుజ్జి చాలా తెలివయిన పిల్ల. అందుకే తెలివయిన పని చేసింది." అనుకుంది.

సింహాల గుహలోనుంచి తప్పించుకుని పోయిన మేకపిల్ల యెంత ఆనందపడుతుందో....

సావిత్రి కూతురు చేసిన పనికి అంతగా ఆనందించింది.

కాని రోజులు గడుస్తున్న కొద్దీ ఆమెలో ఆ ఆనందం క్రమంగా హరించుకుని పోయింది.

సుజాత తప్పించుకుని పారిపోయింది అంటే ఆ రోజు నమ్మింది.

కాని ఈ రోజు నమ్మశక్యం కావటంలేదు.

వాళ్ళనుంచి అది తప్పించుకుని పోయిన మాట నిజమే అయితే.... ఎలాగైనా....ఎక్కడ వున్నా... ....తనని వెతుక్కుంటూ వచ్చి వుండేది కదా ?

కాని అలా జరగలేదు.

తను ఎంత అవినీతిపరురాలు.... హంతకి .... అయినప్పటికి....దాని కోసం అహర్నిశలూ తప్పించి పోయిన తల్లి తను.

సుజ్జీ డైరీలో తన గురించి ఎంత చక్కగా రాసుకుంది?

ఉద్యోగంచేసి అమ్మని సుఖ పెట్టాలి అని వ్రాసుకొంది.

తనమీద యెంత ఆపేక్ష లేకపోతే తన గురించి అలాగ వ్రాసుకొంటుంది?

అలాంటి సుజాత యెక్కడ వున్నా .... యెలా వున్నా....ఈ అమ్మ జైల్లో వుంటే ఒక్కసారన్నా చూడటానికి రాకుండా వుంటుందా?

ఉహుం....

ఉండదు.

తప్పకుండా వచ్చేది.

ఎక్కడ వున్నా యెలాగవున్నా తనని చూడటానికి వచ్చేది.

కాని రాలేదు.

అంటే....

అది పారిపోయి వుండదు.

బహుశా ఈ వెధవలంతా కల్సి దీన్ని మాయంచేసి వుండాలి.

అంతే జరిగి వుంటుంది.

ఆ వాచ్ మెన్ కూడా పెద్ద గూండా రకమేనని శంకర్ లాల్ కి పూర్తిగా దాసోహం అని, అవసరం అయితే ఖూనీలు చెయ్యటానికి కూడా వెనుకాడడని, సంస్థలో పనిచేసే అమ్మాయిలు చెప్పగా వింది.

బహుశా వాళ్ళందరూ ఏకమై సుజాతని అక్కడ్నుంచి తప్పించి వుండాలి.

అందుకే దీని ఆచూకి తనకి తెలియలేదు.

అంతే జరిగి వుంటుంది.

సావిత్రికి దృఢంగా అనిపించసాగింది.

అసలు అలాకాక ఇంకొకలా యెలా జరుగుతుంది?

శంకర్ లాల్ చేసే వ్యాపారాలన్నీ అవినీతి వ్యాపారాలే కదా?

సుజాతని కూడా అలాగే దుర్మార్గంగా ఏ కొంపకో చేరవేసి వుంటారు....అనిపించింది సావిత్రికి.

ఒకోసారి—

"అసలు అది బ్రతికి వుందా? లేక...." అన్న ఆలోచన కూడా గుండెని జలదరింప చేసేది.

"శంకర్ లాల్ అండ్ బ్రదర్స్" అన్న పేర్న పెద్ద పెద్ద బ్రాంచెస్ వున్నాయి.

వీలయినంత వరకు అలాంటి సంస్థలు ఎక్కడెక్కడ వున్నాయో వెదికి పట్టుకోవాలి.

వాళ్ళకి పెద్ద పెద్ద షోప్ లాడ్జింగ్స్ లో, హోటల్సులో షేర్లు కూడా వున్నాయని వింది.

వాళ్ళ వ్యాపార సంస్థల ద్వారా ఆచూకి తీసి ఏ హోటల్స్ లో షేర్లు

వున్నాయో తెల్సుకొంటే అక్కడ సుజాత ఆచూకీ తెలియవచ్చు....అని పించింది సావిత్రికి.

ఒక విధంగా చూస్తే ఆమె ఆలోచన సరిఅయినదే!

శంకర్‌లాల్ డ్రెస్‌ల్యాండ్‌లో దాదాపు పది సంవత్సరాలు పనిచేసింది సావిత్రి.

శంకర్‌లాల్‌తో అతి సన్నిహితంగా మెదిలింది.

కాబట్టి వ్యాపారాల్లో ఆనుపానులన్ని చాలావరకు ఆకళింపు చేసు కొంది.

అందుకే చివరికి అలాంటి నిర్ణయానికి వచ్చింది.

వీలయినంత వరకు సుజాతని గాలించటానికి నిర్ణయించుకొంది సావిత్రి.

చేతిలో కొంచెం డబ్బు వుంది.

ఒంట్లో కొంచెం ఓపిక వుంది.

అవన్ని ఖర్చు అయ్యేదాకా కూతురుకోసం శ్రమపడటం ఒక తల్లిగా తన కర్తవ్యం అనుకొంది సావిత్రి.

తన జీవితం ఎలాగూ శిథిలం అయిపోయింది.

కాని—

తన కూతురు బ్రతుకు మాత్రం అలాగ కాకూడదు అన్నదే ఆమె ఆరాటం.

ఆ ప్రయత్నంలోనే సావిత్రి మనసులో అప్పటికప్పుడే ఒక చిన్న పథకం రూపు దిద్దుకుంది.

ముందు సుజాత చదువుకున్న స్కూలుకి వెళ్ళి అక్కడ వాకబు చెయ్యాలి.

అక్కడ సరిఅయిన సమాచారం తెలిసిందో తను అదృష్ట వంతురాలే.

లేదూ....తన ప్రయత్నం మానదు.

కొన్ని పట్టణాలలో "శంకర్‌లాల్ అండ్ సన్స్" అన్న పేర్న వాళ్ళ బ్రాంచెస్ వున్నాయి.

వరుసగా ఆ యా వూళ్ళకి వెళ్ళి వాకబుచేస్తే ఏమైనా ప్రయోజనం వుండచ్చు.

శంకర్‌లాల్‌కి కొన్ని హోటల్సులో, లాడ్జింగ్సులో షేర్లు వున్నాయి.

ఆ హోటల్సు యెక్కడ వున్నాయో, వాటి షేర్సు వివరాలు తెల్సుకొంటే కూడా సుజాత ఆచూకీ తెలియవచ్చు.

తప్పకుండా ఆ ముఠా అంతా సుజాతని ఎత్తుకెళ్ళి అలాంటి చోటుకే ఎక్కడికో చేరవేసి వుంటారు.

తను కొ_స్త శ్రమపడితే ప్రయోజనం వుండవచ్చు అనిపించింది సావిత్రికి.

తను ఇప్పుడు ఒకచోట కూర్చుని నివాసం ఏర్పరుచుకుని కూలో నాలో చేసుకుని వండుకు తినడం తప్పించి వేరే ప్రయోజనం లేదు.

కేవలం తనకోసం తన సుఖకోసం బ్రతకాలన్న ఆలోచన, తన పాపిష్టి శరీరాన్ని కాపాడుకోవాలన్న ఆశ_క్తి తనలో ఏనాడో నశించి పోయ్యాయి.

ఇంత జరిగినా తను ఇంకా భూమిమీద నిలిచివుందీ అంటే అది సుజాత క్షేమం కోసమే!

అప్పుడూ - ఇప్పుడూ - ఎప్పుడూ తన ఆరాటం దీనికోసమే.

ఒంట్లో ఓపిక చేతులో డబ్బు వున్నంత వరకూ ఆ ప్రయత్నం మానదు.

తన అదృష్టం పండి సుజాత కనిపించిందా సరే....

లేకపోతే ఇంకా తను బ్రతకటం అనవసరం...."

సావిత్రి ఆలోచన్ల నుంచి తేరుకుని నెమ్మదిగా మోకాళ్ళ మధ్య నుంచి తల ఎ_త్తింది.

చెక్కిళ్ళమీద జారుతున్న కన్నీటిని పమిట చెంగుతో తుడుచుకుంది.

చెట్టు బోదెకి ఆన్చిపెట్టిన సంచీని అందుకుని నిశ్శబ్దంగా లేచి నెమ్మదిగా రైల్వుస్టేషన్‌వైపు నడవసాగింది.

ఎడారిలో బాటసారి నీడకోసం, నీటి చలమకోసం గాలిస్తూ నడుస్తున్నట్లు....బరువుగా....ఆశగా....అడుగులు వెయ్యసాగింది.

అప్పటికే నలుదిశలా చీకట్లు దట్టంగా అలుముకుంటున్నాయి.

సావిత్రి సుజాత చదువుకున్న పట్టణానికి వచ్చి ముందుగా ఒక సత్రంలో "బస" చేసింది.

ప్రయాణపు బడలిక తీర్చుకుని ప్రక్కనే వున్న దుకాణంలో ఒక బన్ను కొనుక్కు తిని ఓ కప్పు టీ తాగింది.

ప్రాణం కొంచెం తేరుకున్నట్టు అనిపించింది.

తరువాత నెమ్మదిగా లేచి సుజాత చదువుకున్న స్కూలుకి వెళ్ళి ప్రిన్సిపాలుని కలుసుకుంది.

పాత హెడ్ మిస్ట్రెస్ ట్రాన్స్ఫర్ అయి వెళ్ళిపోయిందిట.

ఆవిడ స్థానంలో కొత్తావిడ అార్చొని వుంది.

ఆకుపచ్చ రంగు గద్వాల్ చీర, సగం నెరిసిన జుత్తు కళ్ళకి తెల్లి కళ్ళద్దాలు.

సావిత్రి నేరుగా ఆఫీసు గదికి వెళ్ళి ఆవిడ్ని కల్సుకుని సుజాత గురించి అడిగింది.

సుజాతకి తను కన్న తల్లి ని అని చెప్పలేదు. దూరపు బంధువుల మని, అత్యవసర పరిస్థితిలో వాళ్ళ ఆచూకీ తెల్సు కొందుకు వివరాలు కావలసి వచ్చి అడుగుతున్నానని అభ్యర్థించింది సావిత్రి.

ఆవిడ ఏమనుకుందో ఏమో....

కొంచెం సేపు నిశ్శబ్దంగా వుండి ఆ తరువాత కాలింగ్ బెల్ నొక్కింది.

అటెండర్ రాగానే "ఈవిడ్ని క్లర్క్ సత్యవతి గారి దగ్గరికి తీసు కెళ్ళి కావల్సిన వివరాలు చెప్పి పంపండి." అంది.

సావిత్రి ఆవిడకి ఎంతో కృతజ్ఞత తెలిపి క్లర్క్ దగ్గరికి వెళ్ళింది.

దాదాపు ఒక అరగంట పైగా ఆవిడ పాత రికార్డ్సు తిరగేసి సుజాత గురించి చెప్పింది.

సుజాత ఇంటర్ ఫస్ట్‌క్లాసులో పాసయ్యింది.

కాని ఇంతవరకూ ఆ అమ్మాయి వచ్చి రిజిస్టర్ బుక్, సర్టిఫికెట్లు తీసుకెళ్ళలేదు అని చెప్పారు.

ఆ మాటలు విన్న సావిత్రి హతాశురాలు అయ్యింది.

ఆమె గుండెలో ఏమూలో మినుకు మినుకు మంటున్న ఆశాదీపం కాస్తా ఆ మాటలు వినటంతోనే గప్పున మండి అణగారిపోయింది. ఆమె ఆశాసౌధాలు అన్నీ కుప్ప కూలిపోయ్యాయి.

అయితే వాళ్ళు కోర్టులో ఇచ్చిన స్టేట్‌మెంట్ అబద్ధం.

సుజాత వాళ్ళ నుంచి తప్పించుకుని పారిపోలేదు.

అదే నిజం అయితే సుజాత తప్పకుండా తను చిన్నప్పట్నుంచి చదువుకున్న స్కూలుకి వెళ్ళి సర్టిఫికెట్లు తీసుకునేది.

ఆ ఆసరాతో ఎక్కడయినా చిన్న పని చూసుకునేది.

లేదూ తన పరిస్థితి చెప్పి ప్రిన్సిపాల్‌నే రక్షణ కోరేది. ఆవిడ్ని ఏదో సహాయం అర్థించేది.

సుజాత చాలా తెలివయిన స్టూడెంట్. ఆ స్కూల్లో అది చదువుకున్నన్ని రోజులూ దాన్ని టీచర్లు ప్రిన్సిపాల్ అంతా సుజీని లైక్ చేసేవారే.

సుజాత వెళ్ళి అడిగితే వాళ్ళంతా తప్పకుండా దానికి సహాయం చేసేవారు.

సుజాత ఆ యింటి నుంచి పారిపోయిన మాటే నిజం అయితే తప్పకుండా స్కూలుకి వచ్చి వుండేది — తనని చూడటానికి వచ్చి వుండేది.

కాని అలా జరగలేదు.

అంటే........ఆ వెధవలు అంతా కలిసి దీన్ని........ఎక్కడికో........

సావిత్రి సన్నగా గుండెల్లో పోటు మొదలయ్యింది.

ఆమె ప్రమేయం లేకుండానే కళ్ళ నుంచి ధారగా కన్నీరు వర్షించ సాగింది.

సావిత్రి ఆఫీస్ గది దాటి బయటికి వస్తుంటే సరిగ్గా లంచ్ బ్రేక్ అయ్యింది "బెల్" కొట్టారు.

అమ్మాయి అందరూ గలగలా క్లాసుల్లో నుంచి బయటికి వచ్చారు.

విశాలమయిన స్కూలు ఆవరణలో చెట్ల క్రింద గ్రూపులు గ్రూపులుగా కూర్చుని టిఫిన్ బాక్సులు తెరిచి లంచ్ చెయ్యటం మొదలు పెట్టారు.

రెండు జళ్ళతో ఆప్ శారీల్లో ఎగిరే విహంగాల్లా ఆనందంగా వున్న ఆ అమ్మాయి అందర్నీ చూస్తుంటే సావిత్రి కళ్ళు జలపాతాలు అయ్యాయి.

సుజీ...

ఎక్కడ వుంది అదిప్పుడు !

దాని కోసం తను ఎంత మనోవేదన్ని అవమానాల్ని భరించింది !

అది చక్కగా చదువుకుని మంచి ఉద్యోగస్తురాలు కావాలని సుఖంగా బ్రతికాలని ఎంత తాపత్రయ పడింది!

దాని గురించి ఎన్నికలలు కంది!

కాని....ఫస్ట్ క్లాసులో పాసయిన పిల్ల....కనీసం ఆ సర్టిఫికెట్లు కూడా తీసుకెళ్ళటానికి రాలేదంటే....!

ఆ స్కూలు గ్రౌండ్ దాటి సావిత్రికి బయటికి రావాలనిపించ లేదు.

బెల్ అయి లంచ్ బ్రేక్ ముగిసి అమ్మాయి అందరూ క్లాసుల్లోకి వెళ్ళిపోయినా సావిత్రి అక్కడ్నుంచి కదలాలనిపించలేదు.

చాలా సేపు అక్కడే అచేతనంగా కూర్చుండిపోయింది. ఆమెకి పాత రోజులు గుర్తుకు వచ్చాయి.

సాయంత్రం మూడు గంటలు దాటుతుంటే తప్పనిసరిగా లేచి శరీరాన్ని ఈడుస్తున్నట్టు అతి భారంగా తిరిగి సత్రానికి వచ్చింది.

ఆ రోజంతా అలాగే దిగులుగా ఏడుస్తూ కూర్చుండిపోయింది.

ఆ వూరితో సావిత్రికి బాగానే పరిచయం వుంది. అక్కడ సెంటర్ లో వున్న శంకర్ లాల్ బట్టల దుకాణానికి వెళ్ళింది.

సావిత్రి వెళ్ళేసరికి యజమాని కౌంటర్ లో లేడు.

సేల్స్ మెన్స్ వున్నారు.

దాదాపు పదహారేళ్ళ కుర్రాడు మెత్తని కుంచె పట్టుకుని చీరలు బట్టలు దులుపుతున్నాడు.

హేంగర్స్ కి చీరలు తగిలించి బయట వ్రేలాడ కడుతున్నాడు.

నెమ్మదిగా వాణ్ణి ఆరాతీసి శంకర్ లాల్ వ్యాపార సంస్థలు ఎక్కడెక్కడ వున్నాయో వివరాలు అడిగి తెలుసుకుంది.

ఆ వూళ్ళో ఆ ఒక్క బ్రాంచ్ ఉందట. ఆ బ్రాంచ్ అంతా పెద్దల్లుడు చూసుకుంటాడట.

ఇంకా వేరే వూళ్ళల్లో వున్న బట్టల దుకాణాలు, కొట్టు సెంటర్స్, రెడీమెడ్ షాపులు, వగైరా వివరాలు కూడా తెలిసినంత వరకూ చెప్పాడు.

ఆ వివరాలన్నీ చాలా వరకూ సావిత్రికి తెల్సు.

ఆ తరువాత శంకర్ లాల్ కి షేర్లు వున్న కొన్ని హోటల్స్ పేర్లు కూడా చెప్పాడు.

సావిత్రి చాలా వరకూ వివరాలు తెలుసుకుని తిరిగి సత్రంలోకి వచ్చేసింది.

సావిత్రికి శంకర్ లాల్ వ్యాపార సంస్థల వివరాల గురించి ఇదివరకు ఎంత తెల్సో ఇప్పుడు అంతే తెల్సు.

అంతకు మించి ఎక్కువగా తెలియలేదు.

శంకర్ లాల్ "హత్య" అయ్యాడని, హత్య చేసినవాణ్ణి జైల్లో పెట్టారని కూడా చెప్పాడా ఆ సేల్సుమాన్.

"వారి ఆవిడకి ఒక కూతురు వుండాలి కదా!" అని అడిగితే ఆ విష యాలు తెలియవని, అమ్మాయి గురించి కూడా ఎక్కువగా వినలేదని అన్నాడు.

అంతకంటే ఎక్కువ అడిగితే ప్రమాదం అని వూరుకుంది సావిత్రి.

"తనని ఎవరైనా గుర్తుపడితే కష్టం...." అనిపించింది.

ఇంతలో శంకర్‌లాల్ అల్లుడు షాపుకి రావటంతో సావిత్రి మొహం చాటు చేసుకుని బయటకి వచ్చేసింది.

కూతురు గురించి ఆచూకి తెలుస్తుందన్న ఆశ ఆమెలో ఏ కోశాన లేదు.

అయినా ఓపిక వున్నంతవరకూ ప్రయత్నించటానికే నిర్ణయించు కుంది.

కూతుర్ని ఒక్కసారి చూడాలన్న తహ తహ ఆమెలో ఎక్కువై పోతోంది.

ఆరోగ్యం ఒకప్రక్క రోజురోజుకి క్షీణించి పోతూంది. కాని కూతురిపై మమకారం మాత్రం క్షీణించలేదు. నానాటికి పెరుగుతోంది.

o o o

గ్రీష్మ తాపం నశించింది.

శిశిరం వెళ్ళిపోయింది.

వసంతా గమనాన్ని సూచిస్తూ ఆమని కోయిల పాడింది.

అమృతపు చినుకుల్లో తొలకరి జల్లు కురిసింది.

వర్షానికి బీడుపడ్డ నేల తల్లి పులకరించింది.

చల్లని నీరు తగిలి యెండిన మ్రోడులు, చెట్లు, లతలు చిగురిం చాయి.

పచ్చని దుస్తులతో తలనిండా పూలతో ప్రకృతి కన్య కొత్త పెళ్ళి కూతురిలా అందాలు ఒలకపోసింది.

పుప్పొడి రేణువులతో తేనెవాగులు ప్రవహిస్తున్న పూలని చూసి

గండు తుమ్మెదలు ఝుమ్మని నాదంచేశాయి. మన్మధుడు విల్లు యెక్కు-పెట్టాడు.

లేత మావి చిగురులు గండు కోయిల మోహావేశంతో జంటకోయిల్ని పిలుస్తూ పాట పాడింది.

మబ్బుని చూసి మయూరాలు పురివిప్పి ఆడాయి. నవవసంత శోభతో ప్రకృతి పచ్చగా కళకళ లాడిపోయింది.

కాని—

సావిత్రి మోడు బ్రతుకు చిగురించలేదు.

ఆమె మనసు ఎడారి అయిపోయింది.

బ్రహ్మజెముడు పొదల్లో సౌగంధికా పుష్పం విరిసినా విరియచ్చు గాక....

కాని తన అన్వేషణ ఫలిస్తుందన్న ఆశమాత్రం సావిత్రిలో పూర్తిగా అడుగంటి పోయింది.

ఆ కోరికని ఆమె పూర్తిగా మనసులోంచి త్రుంచేసుకుంది.

సావిత్రి కూతురు కనిపిస్తుందేమో నన్న ఆశతో ఎన్నో వూళ్ళు తిరిగింది. ఎంతో ప్రయాసపడింది.

ఆకలేస్తే కడుపునిండా తిండి కూడా తినలేదు.

చేతిలో వున్న డబ్బు కాస్తా తన తిండికి ఖర్చు పెడితే వూళ్ళు తిరగ టానికి డబ్బు వుండదని ఆకలి కట్టుకుంది.

పేగులు మెలి పెడుతున్నా "టీ" నీళ్ళతాగి "బన్ను" తిని క్షుద్బాధ తీర్చుకుంది.

ఒంట్లో శక్తి వున్నంత వరకూ వూళ్ళన్నీ తిరిగి తిరిగి అలిసి పోయింది.

చేతిలో డబ్బు మొత్తం ఖర్చు అయిపోయింది.

శరీరంలో శక్తి యావత్తూ కరిగిపోయింది.

ఒంట్లో ఆఖరి రక్తం చుక్క కూడా ఇగిరిపోయినట్లు ఎండిన కట్టె పుల్లలా మారిపోయింది.

ప్రమిదలో పూర్తిగా నూనె ఎండిపోయి చివరి కొనదాకా కాలిపోయిన ఒత్తి.... ఆఖరి క్షణాల్లో ఇప్పుడు సావిత్రి రూపం.

ఇదివరకూ జైల్లో వుండగా పౌర్ణానికి- అమావాశ్యకి వచ్చే సంధి ప్రేలాపన్లు.... ఇప్పుడు సావిత్రికి తరుచూ వస్తున్నాయి ?

అస్తమానం తనలో తానే ఏదో గొణుకుంటూ కోపం వస్తే ఎవర్నో తిడుతూ వుంటుంది.

ఎవ్వరితోనూ మాట్లాడదు. ఒక సంచి పట్టుకుని వూరూరా తిరుగుతూ వుంటుంది. ఎవరైనా పల్కరించినా జవాబు చెప్పదు.

చింపిరి జుట్టు.

చిరిగి చీలికలు వాలికలు అయిన దేహం.

ఎండిపోయి శుష్కించిన దేహం.

పిచ్చి చూపులు....

ఆమెని చూసి అందరూ భయంతో దూరంగా తొలగుతున్నారు.

కొంతమంది చిల్లర పైసలు ఇస్తున్నారు. సావిత్రి ఆ డబ్బు చూసి పేలవంగా నవ్వుకుంటుంది.

కాని ఆమెకి ఒంటిమీద స్పృహపోలేదు.

లోకం తెలుసు.

తను ఎవరికోసం వెతుకుతూందో....

ఎందుకు వూరూరా తిరుగుతోందో.... అన్నీ సావిత్రికి తెలుసు.

చెట్టుకి ఒకరుగా గుట్టకి ఒకరుగా అయిపోయిన తన సంసారాన్ని తల్చుకుని, ఎక్కడపడితే అక్కడ గంటల తరబడి కూర్చుని కరువు తీరా ఏడుస్తుంది.

కానీ....

సముద్రం ఎంత ఘోషపెడితే మాత్రం ఏమిటి !

సావిత్రి జైలు నుంచి విడుదలై దాదాపు ఆరు నెల్లు అయ్యింది.

ఎన్నో వూళ్ళు తిరిగింది.

కూతురికోసం కొట్టువేసి వెతికింది.

తిరిగి తిరిగి కాళ్ళకి బలపాలు కట్టుకుని పోయాయి.

కూతురు జాడ కోసం చూసి చూసి కళ్ళు గాజుగుడ్లు అయి పోయాయి.

ఇప్పుడు సావిత్రి కర్రబొమ్మ.

ఆ చూపుల్లో జీవం లేదు.

వెర్రిది చూస్తుంటే ఎలా వుంటుందో అలా వుంటుంది.

ఆమె నడుస్తుంటే మనిషి నడుస్తున్నట్లుగా వుండదు.

"శవం" నడుస్తున్నట్లు వుంటుంది.

పచ్చగా బొద్దుగా వుండే ఆమె దేహం నల్లగా మాడి ఎండి పోయింది.

కడుపునిండా భోజనం లేదు.

కంటి నిండా నిద్ర లేదు.

ఒంట్లో శక్తి లేదు.

మనసుకి శాంతి లేదు.

ఇంక ఆనందం రమ్మంటే ఎక్కడ్నుంచి వస్తుంది!

ఇప్పుడు సావిత్రి నవ్వినా ఏడుస్తున్నట్లుగా వుంటుంది.

సావిత్రి ఒంట్లో ఓపిక పూర్తిగా నశించిపోయింది.

జీవితపు చివరి అంచుదాకా నడిచి నడిచి అలసిపోయింది.

నడిచిన దారినిండా అగాధాలు.... రాళ్ళు.... రప్పలు.... ముళ్ళ డొంకలు....

కాని ఆ రాయిలోంచి కూడా సన్నగా జలతరంగం పుట్టినట్లు ... సావిత్రి గుండెలో కూతురుపై ప్రేమ, అనురాగం మాత్రం ఇంకా చచ్చి పోలేదు.

కూతురుకోసం వెదికి వెదికి....తిరిగి....తిరిగి...

సావిత్రి పాదాలు రక్తసిక్తం అయిపొయ్యాయి.

అయినా కోరుకున్న గమ్యం చేరలేకపోయింది.

ఏడ్చి ఏడ్చి ఆమె గుండె కుమిలిపోయింది.

సన్నని సూదులతో....పుల్లలతో ఎవరో అదృశ్యంగా గుండెని కుళ్ళబొడుస్తున్నట్లు ఒక రకమైన బాధ దుర్భర వేదన....

ఆ బాధ భరించలేక పోతూంది సావిత్రి.

విష ప్రయోగం చేయబడ్డ మనిషి గిలగిలా కొట్టుకొంటున్నట్లు.... ఆమె ప్రాణాలు గిజగిజ లాడుతోంది.

ఇక ఈ వేదన....బాధ భరించలేను.

భగవంతుడి పిలుపు కోసం ఎదురు చూస్తూంది సావిత్రి.

ఆమె మనసు పండిపోయింది.

బ్రతుకు తెల్లవారిపోయింది.

అయినా సావిత్రి నిరీక్షణ మానలేదు.

కాని....

ఇప్పుడు....

ఆమె ఆశ....

నిరీక్షణ....

కూతురి కోసం కాదు.

భర్త కోసం అసలే కాదు.

మరి ఎవరి కోసం?

మృత్యుదేవత పాదాల సవ్వడి కోసం....

o o o

సాయం సమయం....

సూర్యుడు పశ్చిమాద్రికి కృంగిపోతున్నాడు.

ఎర్రటి సూర్య బింబం నీళ్ళల్లో అందంగా ప్రతిఫలిస్తూంది.

టాంక్ బండ్ రెయిలింగ్‌ని ఆనుకుని ఆ నీళ్ళల్లోకి చూస్తూ నిల్చుంది సావిత్రి.

జైలు అధికారులు దయదలచి ఇచ్చిన డబ్బుతో....వూళ్ళన్నీ తిరిగి తిరిగి ఆఖరికి భాగ్యనగరం నడిబొడ్డుకి చేరింది.

కడుపు కట్టుకుని కూతురి కోసం గాలించింది.
అయినా ఆమె ఆశ ఫలించలేదు.
ఏ అదృశ్య శక్తో ఇన్నాళ్ళు జీవితం వెంట పరుగులు పెట్టించింది.
చివరికి ఎండమావి వద్దకు చేరింది.
ఆశలూ, నిరాశలూ, వేదనా, బాధలూ, భయాలూ, దుఃఖం....
వీటన్నింటి మధ్య జీవన స్రవంతి ఎండిపోయింది.
ఈ ఎడారి జీవితయాత్ర ఇంకా ఎన్నాళ్ళు!
అసలు ఎందుకు బ్రతకటం!
ఎవరి కోసం!
చేతిలో డబ్బు అయిపోయింది.
ఒంట్లో ఓపిక నశించిపోయింది.
గుండెల్లో ఆశ అణగారిపోయింది.
"జీవితం ఎలా వుండాలి!" జవాబు చెప్పలేదు సావిత్రి.
కాని "ఎలా వుండకూడదో...." అనుభవం ద్వారా తెల్సుకుంది.
మధుర స్మృతులు అంటూ ఏమీలేవు.
వున్నదంతా చేదు....
ఎటు చూసినా చీకటే కనిపిస్తోంది.
విషాద గీతమే వినిపిస్తోంది.
మనసంత విషపూరితం అయిపోయింది.
ఈ పరిస్థితుల్లో కూడా ఇంకా ఎందుకు బ్రతకటం !
ఎవరికోసం !

టాంక్ బండ్ రెయిలింగ్‌ని ఆనుకుని నీళ్ళల్లోకి చూస్తూ నిల్చుంది సావిత్రి

హుసేన్ సాగర్ నీళ్ళు నిర్మలంగా ప్రవహిస్తున్నాయి.
వర్షాకాలం కావటంతో నది నిండుగా ప్రవహిస్తూంది.
పడమటి ఆకాశం ఎర్రగా నీళ్ళల్లో ప్రతిబింబిస్తూంది.

ఆ ఎర్రగా చందూరంలా వున్న నీళ్ళల్లో సావిత్రికి శంకర్‌లాల్ తల నుండి చిమ్మిన రక్తం కనిపిస్తుంది.

తల చితికిపోయి మాంసం ముద్దగా మారిపోయిన తన చిన్నారి ముద్దుల కొడుకు రూపం కనిపిస్తోంది.

తన జీవిత సమస్యకి పరిష్కారం కూడా కనిపిస్తోంది.

చీకటి పడే వరకూ ఇక్కడే తచ్చాడితే ఎవరికైనా అనుమానం రావచ్చు.

కాస్సేపు అలా తిరిగి వచ్చి....నెమ్మదిగా చీకట్లు పడ్డాక ఇక్కడి తిరిగి రావాలి.

అప్పుడైతే ఎవరూ వుండరు.

ఆ తరువాత ఒక్క క్షణం కళ్ళు మూసుకుంటే చాలు.

ఎన్నో కల్మషాల్ని కుళ్ళుని కడిగివేసే ఈ గంగాభవాని....ఆ మాత్రం తనని కడుపులో ఇముడ్చుకోదా!

ఈ పవిత్ర గంగాజలంలో మునిగి తన పాపాలన్ని ప్రక్షాళ....

"అమ్మా....?"

సావిత్రి శరీరం ఝల్లుమంది.

వులిక్కిపడి గభాల్న తలయెత్తింది.

ఎదురుగా ఎవరో....శత వృద్ధురాలు....

ముడతలుపడ్డ దేహంతో, చిరిగి పీలికలైన చీరతో....ముగ్గు బుట్ట లాంటి జుత్తుతో....

సావిత్రి ఎదురుగా దీనంగా....నిల్చుని వుంది.

....దారి ప్రక్క చెట్టుకింద

ఆరిన కుంపటి విధాన

కూర్చున్నది ముసల్దొ కత్తి

మూలుగుతూ ముసురుతున్న

ఈగలతో వేగలేక...." అన్న వర్ణనకి సరిగ్గా సరిపోయినట్లు వుంది అవ్వ ?

ఎముకలాంటి తనచేతిని సావిత్రి ముందుకి చాపి, గాజు కళ్ళతో సావిత్రి మొఖంలోకి ఆశగా చూస్తూ....అడిగింది.

"అమ్మా....ధర్మం...."

అర్ధరాత్రి....అమావాశ్యలో చిన్ననక్షత్రం గుడ్డిగా మినికినట్లు....

సావిత్రి పెదవుల్లో చిన్న నవ్వు కదిలింది లీలగా....

తనే ఒక దరిద్రురాలు....బిచ్చగత్తె....అనుకుంటే తన దగ్గర కూడా ధర్మం అడుక్కునేందుకు ఇంకో బిచ్చగత్తె ?

ఎంత గొప్ప దేశం!

ఎంత గొప్ప పేదరికం!

సావిత్రి తన గుప్పెట తెరిచి అరచేతుల్లో వున్న చిల్లర డబ్బులకేసి చూసుకుంది.

యాభై పైసల నాణెం....పది పైసలు.

సరిగ్గా అరవై పైసలున్నాయి.

మరో ఆలోచన లేకుండా ఆ చిల్లరంతా తీసి అవ్వ చేతిలో పెట్టింది.

ఆ ముసల్దాని కళ్ళల్లో ఆనందం గప్పున వెలిగి ఆరింది.

ఇంతవరకూ పదిపైసలు....తప్పితే ఇరవైపైసలు....

అంతకుమించి ఎవరూ ధర్మం చెయ్యలేదు.

ఒక్కసారి అరవైపైసలు చూడగానే ఆ ముసలిదాని కళ్ళు ఆనందంతో వెలిగిపొయ్యాయి.

"సిరిగల తల్లివి....నా బంగారు తల్లివి...."

అవ్వ ఒణికే గొంతుతో దీవిస్తూ టకటక చేతిక్కర నేలకి తటిస్తూ వెళ్ళిపోయింది.

సావిత్రి పెదవులమీద మళ్ళీ ఒక చిన్న నవ్వు కదిలింది.

తను చేసిన ఆఖరి ధర్మం ఇది.

తెల్లారేసరికి తను ఈ లోకంలో వుండదు కదా!

పోయేముందు ఏదో ఒక మంచి పని చేసి పోవాలి అంటారు కదా!

ఈ పరిస్థితిలో....తను ఇంతకంటే మంచి పని ఏం చెయ్యగలదు!

సావిత్రి రెయిలింగ్ని ఆనుకుని నీళ్ళల్లోకి చూస్తూ నిల్చుంది.

ఆలోచిస్తూ అలా ఎంత సేపు నిల్చుందో ఆమెకు తెలియదు.

తల ఎత్తేసరికి ఇద్దరు పోలీసులు సైకిల్ మీద వస్తూ కనిపించారు.

సావిత్రి వులిక్కిపడినట్లు అయ్యింది.

తను యెక్కువ సేపు యిక్కడే వుంటే యెవరికైనా అనుమానం రావచ్చు.

చీకటిపడేదాక కాస్సేపు అలా తిరిగివస్తే సరి....

సావిత్రి నెమ్మదిగా నడవటం మొదలు పెట్టింది.

అడుగుతీసి అడుగువేస్తూంటే గుండెల్లోకి బరువు ఎక్కుతోంది.

శరీరంలో శక్తి అంతా జీర్ణించుపోయింది.

ఇదివరకులా తిరిగే శక్తిలేదు.

ఇదివరకులా ఆశలూ, తపనా కూడా లేదు.

ఈ మ్రోడు జీవితాన్ని ఇంకా కొనసాగించలేదు.

ఈ వేదనా, ఈ దుఃఖం, ఈ నిరాశ ఇంకా తను భరించలేదు.

ఎన్నాళ్ళు బ్రతికినా ఒకటే బ్రతుకు.

ఎడారి బ్రతుకు.

ఎలాగైనా ఈ రాత్రికి వెళ్ళిపోవాలి.

రేపటి సూర్యోదయానికి ముందే తన బ్రతుకు తెల్లవారిపోవాలి.

సావిత్రి భారంగా శరీరాన్ని యీడుస్తున్నట్లు నడవసాగింది.

సాయంత్రం ఐదుగంటలు దాటుతోంది.

రోడ్లన్నీ రద్దీగా వున్నాయి.

ఉద్యోగస్థులతోటి విద్యార్థులతోటి రోడ్లన్నీ నిండుగా కల కల లాడు తున్నాయి.

చేతిలో పుస్తకాలతో ఆఫ్‌శారీల్లో గుంపులు గుంపులుగా ఇళ్ళకి వెడు తున్న అమ్మాయిల్ని చూడగానే సావిత్రికి మళ్ళీ కూతురు జ్ఞాపకం వచ్చింది అదసలు బ్రతికివుందా!

బ్రతికివుంటే....వూరూ వాడా తను ఇంత గాలించింది కదా....ఆ మాత్రం కనిపించక పోతుందా!

తను... దానికోసం హంతకురాలు అయ్యింది.

జైలు కెళ్ళింది.

అలాంటి తనని చూడటానికి, ఎక్కడ వున్నా ఎలాగైనా ఒక్కసారి రాకపోతుందా!

ఊహూ....వుండలేదు.

బహుశా అది చచ్చిపోయి వుంటుంది.

సావిత్రి ఆలోచన్ల మధ్యే చాలాదూరం నడిచి వచ్చేసింది.

అలా ఎంతదూరం వచ్చిందో ఆమెకే తెలియదు.

నాలుగు విశాలమైన రోడ్లని కలుపుతూ పెద్ద జంక్షన్ ?

చౌరస్తా....

విశాలంగా....అతి వెడల్పుగా వున్న నున్నటి తార్రోడ్లు....

రోడ్డుకి అటు ఇటు ఎత్తయిన భవంతులు.

రకరకాల షాపులు, హోటల్సు, దుకాణాలు....

కళ్ళు జిగేల్ మనే లైట్ల కాంతిలో తళ తళ మెరిసిపోతూ ఉన్నాయ్.

ఫుట్ పాత్ ల మీదుగా జనం....

నాలుగు రోడ్లని కలిపే చోట ...మధ్యగా పెద్దగా గుండ్రంగా కట్టిన చమన్.

ఆ చమన్ మధ్య ఎత్తయిన దిమ్మమీద ఎవరిదో....నాయకుని నల్లని స్టాట్యూ.

అక్కడ అక్కడా పోలీసులు నిలుచుని ట్రాఫిక్ కంట్రోల్ చేస్తున్నారు.

అసంఖ్యాకంగా మోటారు వాహనాలు....సంధించి విడిచిన బాణాల్లా అతి వేగంగా చమన్ చుట్టి దూసుకుని పోతున్నాయి.

అంతటా స్పీడ్....మెకానికల్....

ఎక్కడ చూసినా జనం....

షాపులు, మోటారు, వాహనాలు ?

సావిత్రి ఆలోచనల మధ్యే నడుస్తూ నాలుగు రోడ్ల కూడలి దగ్గరికి వచ్చేసింది.

ఎటు పోవాలో తెలియలేదు.

నాలుగు రోడ్లు....

ఎన్ని దార్లు వున్నా తనకి ఒకదారి లేదు.

ఏ రోడ్డు వెంట వెళ్ళినా తన కొక గమ్యం లేదు,

అసలు ఎటైనా వెళ్ళటం ఎందుకు!

తను "గమ్యం" చేరుకోవాలంటే మళ్ళీ వెనక్కి తిరిగి వెళ్ళాలి కదా !

సావిత్రి హఠాత్తుగా నడక ఆపేసింది.

తలెత్తి చుట్టూ పరికిస్తూ నిల్చుండిపోయింది.

సిటీలో అది ఏ ప్రాంతమో ఆ బస్తీ పేరు ఏమిటో....అసలు ఎంత దూరం నడిచి వచ్చిందో కూడా తెలియదు.

కాళ్ల సన్నగా పీకుతున్నట్లు అనిపిస్తే చాలాదూరం వచ్చాను కాబోలు అనుకుంది.

ఫుట్‌పాత్‌కి ఇరుప్రక్కల ఎత్తయిన పెద్ద పెద్ద భవంతులతో....విశాలమైన రోడ్లతో....నగం నగర శోభ అంతా అక్కడే కని పిస్తూంది.

కార్లు, టాక్సీలు, బస్సులు, మోటారు వాహనాలు....

చీమల బారుల్లా అసంఖ్యాకంగా రోడ్డు మీద దూసుకుపోతూ ఉన్నాయి.

ఆ హడావుడంత చూస్తూ కొద్ది క్షణాలు సావిత్రి అలాగే నిల్చుండి పోయింది.

ఇంతలో హఠాత్తుగా ట్రాఫిక్ "జామ్" అయ్యింది.

సావిత్రి నిల్చున్న ఫుట్ పాత్ కి ఎదురుగా షడన్ బ్రేకుతో అసంఖ్యాకంగా మోటారు వాహనాలు ఆగిపోయ్యాయి.

ఆలోచనల్ల మధ్య చుట్టూ పరికిస్తూ యథాలాపంగా తలఎత్తిన సావిత్రి త్రుళ్ళిపడింది.

ఫుట్ పాత్ కి చాలా దగ్గరగా అంబాసిడర్ టాక్సీ ఆగివుంది.

ఆ టాక్సీలో వెనకాల సీటులో కిటికీ దగ్గర కూర్చున్న అమ్మాయిని చూస్తూనే సావిత్రీ స్థంభీభూతురాలు అయ్యింది. ఆమె గుండె ఒక్క క్షణం ఆగి తిరిగి రెట్టింపు వేగంతో కొట్టుకోసాగింది. తెల్లటి చెక్కిళ్ళు, విశాలమైన సోగ కళ్ళు, నల్లగా రింగులు తిరిగి భుజాల మీదుగా ముందుకు జారిన రెండు పొట్టి జళ్ళు....

ఆ అమ్మాయి సుజాత కదూ!

కదూ ఏమిటి!

సుజాతే....

అంతే ?

సావిత్రి గొంతులో ఉద్వేగం వువ్వెత్తున విరుచుకుపడింది.

దిగంతాలు మారుమ్రోగేలా "సు....జా...."

అంటూ కెవ్వున కేక పెట్టింది.

కాని ఎందుకో.... ఆ కేక బయటికిరాలేదు. గొంతులోనే సుడి తిరిగి ఆగిపోయింది.

కానీ....

ఆ కేకకంటే ముందే వేగంగా సావిత్రి రివ్వున రోడ్డుమీదికి అడ్డంగా పరిగెటింది.

సరిగ్గా అదే క్షణంలో ట్రాఫిక్ కదిలింది.

అంతవరకూ అసహనంగా రోడ్డుమీద ఆగివున్న వాహనాలన్నీ క్షణంలో వేగాన్ని అందుకుని లైనుగా దూసుకు పోసాగాయ్.

సావిత్రి ముందునుంచే ఆ అమ్మాయి కూర్చున్న టాక్సీ కూడా దూసుకుపోయింది.

సావిత్రి వేగంగా పరిగెట్టటంలో ఆ టాక్సీకి వెనకాల ఆగివున్న కారుకి అడ్డం పడింది.

అంతే ?

దాదాపు సావిత్రిని తాకుతున్నట్లు కారు దగ్గరగా వచ్చి "కీచు" మని శబ్దం చేస్తూ షడన్ బ్రేకుతో ఆగిపోయింది.

ఆ వెనకాలే మోటారు వాహనాలన్నీ మళ్ళీ ఆగిపొయ్యాయి.

అంతే ?

ట్రాఫిక్ పోలీసు కోపంతో మండిపడుతూ దూకినట్లు ఆమె మీదకి వచ్చి సావిత్రి రెక్కపట్టి బలంగా పుట్‌పాత్ మీదకి గుంజాడు.

"బద్మాష్ దమ్మక్ కరాబ్ హోగయా క్యా....!" అంటూ చేతిలో వున్న లాఠీతో సావిత్రి ఒంటిమీద రెండు వేశాడు.

సావిత్రిని కాలితో తన్నినట్లు పుట్‌పాత్ మీదకి తోసి తిరిగి పరిగెత్తినట్లు రోడ్డు మీదకి వెళ్ళి డ్యూటీలో వడ్డాడు.

వెనకాల "కీచు"మన్న శబ్దానికి "టాక్సీ" కొంచెం ముందుకెళ్ళి ఆగి.... రెండు నిమిషాల తరువాత మళ్ళీ వేగం పుంజుకుంది.

దాని వెంబడి మిగిలిన వాహనాలన్నీ యథాప్రకారం రోడ్డుమీద జారిపోసాగాయి.

పోలీస్ తోసిన తోపుకి సావిత్రి పుట్‌పాత్ మీద వున్న డ్రైనేజ్ మీద పడింది.

తుప్పు పట్టిన ఆ ఇనప డ్రైనేజ్ మూత సావిత్రి మోచేతులకి బలంగా గీరుకుని పల్చని నెత్తురు చారికలుగా చిమ్మింది.

ఇందాక కారుకింద పడటంతో పాదాలవేళ్ళ.... కొనలు చితికినట్లు అయ్యాయి.

అయినా సావిత్రికి అవేం పట్టలేదు.

ఆమె దృష్టంత ముందు పోతున్న టాక్సీమీదే వుంది.

సావిత్రి పోలీసు తోసిన తోపుకి ఢబ్బున కిందపడి మరుక్షణం దూకుడుగా లేచి....

"సుజా....సుజా...." అంటూ వేగంగా ఫుట్‌పాత్ వెంట పరిగెత్తసాగింది.

రోడ్డుమీద పోతున్న టాక్సీకి, ఫుట్‌పాత్ వెంట పరిగెడుతున్న ఆమెకి మధ్య దాదాపు పదిగజాల దూరం వుంది.

ఆమె కాళ్ళల్లోకి అంత శక్తి ఎలా వచ్చిందో తెలియదు.

మోటారు కంటే వేగంగా పరిగెడుతూంది.

మధ్య మధ్య "సుజా....సుజా...." అని అరుస్తూంది.

ఆమె మనసు ఉద్వేగంతో కొట్టుకుని పోతోంది.

టాక్సీలో వెనకాల విండో దగ్గర కూర్చున్న ఆ అమ్మాయిని చూసింది....

సందేహం లేదు....

ఆ రెండు జడలు....ఆ వుంగరాల జుత్తు....తెల్లని చెక్కిళ్ళు.... ఆ సోగలు దేరిన కళ్లు....ఆ అమ్మాయి అచ్చు గుద్దినట్లు సుజాతలాగే వుంది.

కాని....దాని ప్రక్కన—కూర్చున్న ఆ మనిషి ఎవరు!

టాక్సీలో దాన్ని ఎక్కడికి తీసుకువెడుతున్నాడు.

ఆ అమ్మాయి సుజాతేనా! తను భ్రమపడలేదు కదా! లేక....

కాని సుజాతే అయితే....నిస్సందేహంగా ఆ వ్యక్తి శంకర్‌లాల్ బాపతు ఏ రౌడీ వెధవో అయి వుండాలి ఇది తప్పకుండా వాళ్ళ వుచ్చులో చిక్కుకుని వుండాలి.

ఎక్కడికో....ఎందుకో....దాన్ని తీసుకుని పోతున్నాడు.

సావిత్రి ఫుట్‌పాత్ వెంట వేగంగా పరిగెడుతూనే వుంది.

దారిలో అడ్డం వచ్చిన వాళ్ళందర్నీ తోసేస్తూంది.

తన దృష్టి నుంచి ఆ టాక్సీ దాటి పోకుండా వేగంగా పరిగెడుతూంది.

ఇంతలో ఆ విశాలమైన సుదీర్ఘమైన రోడ్డు చివర పెద్ద హోటల్ భవంతి ముందు ఆ టాక్సీ ఆగిపోయింది.

సావిత్రి ఒక్క క్షణం పరుగు ఆపి వూపిరి తీసుకుంది.

మళ్ళీ రెట్టించిన వేగంతో పరుగు లంకించుకుంది.

దాదాపు పది నిమిషాలసేపు అలా పరిగెత్తి పరిగెత్తి చివరికి ఆ హోటల్ భవంతి ముందుకి చేరుకుంది.

కాని అప్పటికే ఆ టాక్సీ నుంచి దిగి ఆ ఇద్దరు భవంతి లోపలికి వెళ్ళారు.

టాక్సీ వెళ్ళిపోయింది.

సావిత్రి పరుగు ఆపి ఒగర్చుతూ ఆ భవంతి ఎదురుగా నిల్చుండి పోయింది. గుండెల్లోంచి ఎగవూపిరి వస్తూంది దమ్ము తీస్తుంటే ఛాతి ఎగిరెగిరి పడుతూంది.

నీళ్ళల్లో మునిగి లేచినట్లు ఆమె ఒంటి నుంచి ధారాపాతంగా చెమట జారిపోతోంది.

కాలి వ్రేళ్ళ నుంచి, మోచేతుల్నుంచి దెబ్బలు తగిలిన చోట రక్తం బొట్లుబొట్లుగా జారి ఆ చెమటతో కలిసి ఎర్రగా ప్రవహిస్తుంది.

శరీరం అంతా బ్లేడుతో పలచగా చెక్కినట్లు భగ్గున మండు తోంది.

దాహంతో నోరు ఎండిపోతుంటే సావిత్రి నాలికతో పెదాలు తడుపు కుని రెండు నిముషాలసేపు దమ్ము తీసుకుంటూ అలాగే ఆ హోటల్ లాడ్జింగ్ ముందు నిల్చుండిపోయింది.

వాళ్ళిద్దరూ టాక్సీ దిగి ఆ బిల్డింగ్ లోపలికి వెళుతుంటే కూడా చూసింది.

ఆ అమ్మాయి చాలా వరకు సుజాతలాగే వుంది.

ఆ భవంతి నాలుగంతస్థుల లాడ్జింగ్.

ఎంట్రన్స్ అటు వైపు రోడ్డుకి వున్నట్లుంది.

ఇటు వెనక భాగం.

చుట్టూ కొంచెం కాంపౌండు గోడతో ఇటు పైకి నుంచి మెట్లు వున్నాయి.

సావిత్రికి రెండు క్షణాలు ఏం చెయ్యాలో తెలియలేదు.

వాళ్ళిద్దరూ ఈ భవంతిలోకే వెళ్ళారు.

కాని ఎటు వెళ్ళారో తెలియదు.

సావిత్రి శరీరం చచ్చుపడిపోయింది.

గాలి తీసేసిన బెలూన్‌లా కాళ్ళల్లో శక్తి నశించిపోయింది.

కింద పడటంతో శరీరం అంతా మట్టికొట్టుకుపోయింది.

రెండు నిముషాలు అలుపు తీర్చుకుని మొఖం అంతా జారుతున్న స్వేదాన్ని పయిటచెంగుతో తుడుచుకుని మళ్ళీ రివ్వున ఆ భవంతిలోకి పరుగు లంకించుకుంది.

లాడ్జింగ్ వెనకభాగం కావటంతో ఆమెని యెవ్వరూ అడ్డగించలేదు.

సావిత్రి మళ్ళీ ఆ మేడ మెట్లు ఎక్కి వేగంగా అంతస్థులన్నీ అట్నుంచి ఇటు ఇట్నుంచి అటు పరిగెత్త సాగింది.

కారిడారంతా ఆ చివర్నుంచి ఈ చివరికి పదే పదే తిరిగింది.

చాలా సేపు నాలుగు అంతస్థులు అలాగే చెత్తగా తిరిగింది.

కానీ ఇందాక టాక్సీలోంచి దిగిన ఆ ఇద్దరూ కనిపించలేదు.

వాళ్ళుండేది ఏ నంబరు గదో తెలియదు.

అయినా సరే....సావిత్రి తన ప్రయత్నం మానలేదు.

నాలుగు అంతస్థులకి మెట్లు యెక్కి దిగుతూ కారిడారంతా తిరగ సాగింది.

సాయంత్రం కావటంతో టూరిస్టులంతా గదుల్లో లేరు. తాళాలుపెట్టి బయటికి వెళ్ళారు.

కొంతమంది మాత్రం గదుల్లోనే వున్నట్లు అలికిడి వినిపిస్తోంది.

సావిత్రి మతి చలించిన దానిలా అటు ఇటు కారిడార్ అంతా తిరుగుతూనే వుంది.

అంతస్తులన్నీ యెక్కి దిగుతూంది.

ఆమెకి ఎటూ తోచటంలేదు.

పద్మవ్యూహంలో చిక్కిన అభిమన్యుడిలా వుంది ఆమె పరిస్థితి.

మనసంతా ఉద్వేగం....

ఆ ఉద్వేగంతోనే కారిడార్ అంతా పరిగెడుతూంది. దాదాపు పావు గంటసేపు అలా తిరిగి అలిసిపోయింది.

మూడవ అంతస్తూ అంతా తిరిగి నాలుగవ అంతస్తూ మెట్లు అన్నీ పరిగెత్తింది.

నిరాశగా ఆఖరిమెట్టుపై కాలు పెట్టబోతుంటే సరిగ్గా అదే క్షణంలో ఆ చివర మెరుపు మెరిసినట్లు అయ్యింది.

సరిగ్గా ఇందాకా టాక్సీలో పసుపు పచ్చని దుస్తుల్లో రెండు జళ్ళతో వున్న ఆ అమ్మాయి కారిడార్‌కి ఆ చివర వున్న గది తలుపులు తెరుచుకొని లోపలకి వెళ్ళినట్లు అయ్యింది.

భుజాలమీదుగా ముందుకి జారిన రెండు జాడలు....

ఆ జడలో పొడవుగా పూలదండ....

తెల్లని చెక్కిళ్ళు....

సోగ కళ్ళు....

కళ్ళు మిరుమిట్లు గొలిపే కాంతిలో అలా మెరుపు మెరిసి మాయం అయినట్లు....ఆ అమ్మాయి కారిడార్‌లోంచి ఆ గదిలోకి వెళ్ళింది.

సావిత్రి గొంతుకలో ఒక చిన్న కేక....

గుండెని ఒక్కసారి బయటికి తీసి పెట్టినట్లు ఆనందంతో ఒక్క క్షణం వూపిరి నిలిచిపోయి తిరిగి రెట్టింపు వేగంతో కొట్టుకోసాగింది.

గబాల్న దూకినట్లు పై రెండుమెట్లు దాటి కారిడార్ ఆ చివర్నుంచి ఆ చివరకి పరిగెత్తింది సావిత్రి.

అసలు....తను చూసిన ఆ అమ్మాయి సుజాతేనా!

లేక... వేరే యెవరైనా అయితే!

ఉహూ....ఆ అమ్మాయి ఎవరైనా కానీ....

ఆ అమ్మాయిని మాత్రం యెలాగైనా ఒకసారి తను చూసి తీరాలి.

తన కళ్ళకి అచ్చం ఆ అమ్మాయి సుజాతలాగే కనిపించింది.

అది తన భ్రమే కావచ్చు.

అయినా తనకి నిజం తెలియాలి.

ఆ భ్రమ తొలగిపోవాలి.

సుజాతలాగే వున్న ఆ అమ్మాయి ఎవరో....

నాల్గు అంగల్లో దూకినట్లు కారిడార్ ఆ చివరికి చేరుకుంది సావిత్రి.

ఆ దూకటంలో కాలు "స్లిప్" అయి నరం బెణికినట్లు అయ్యింది.

అయినా అలాగే పరిగెత్తింది.

కాని అప్పటికే ఆ అమ్మాయి గభాల్న తలుపేసుకుని గదిలోకి వెళ్ళిపోయింది.

సావిత్రికి ఒక్క క్షణం ఏమీతోచలేదు.

కొద్దిక్షణాలు ఎటూ పాలుపోలేదు.

ఏం చెయ్యాలో తోచలేదు.

ఆయాసంతో రొప్పుతూ.... అయోమయంగా దిక్కులు చూస్తూ అలాగే నిల్చుండిపోయింది.

ఆ అమ్మాయి ఆ చివరి గదుల్లోకే వెళ్ళింది.

అయితే ఏ గదిలోకి వెళ్ళిందో మాత్రం స్పష్టంగా తెలియదు.

గుండెల్లోంచి ఎగవూపిరి తీస్తున్నట్ల ఒగర్పు వస్తూంది.

ఒళ్ళంతా ధారగా చెమటలు జారిపోతోంది.

దుస్తులన్నీ మాసి రక్తశిక్తమై మట్టి కొట్టుకుపొయ్యాయి.

ఎటూ తోచనట్లు ఆలోచిస్తూ నిల్చుండిపోయిన సావిత్రికి ఒక గది ముందు కనకాంబరం, మల్లె రెక్కలు రాలి కనిపించాయి.

సావిత్రి కళ్ళల్లో మెరుపు మెరిసింది.

మరో ఆలోచన లేకుండా ఎవరో తోసినట్లు గభాల్న ఆ తలుపు దగ్గరికి వెళ్ళి గట్టిగా తలుపుమీద కొట్టబోయింది.

లోపల గడియ వేసినట్లు లేదు.

సావిత్రి చేతి బరువుకి వెంటనే తలుపు తెరుచుకుంది.

మరుక్షణం సావిత్రి దబాల్ని తలుపు తోసుకుని సుడిగాలిలా లోపలికి ప్రవేశించింది.

ఆ అమ్మాయి గదిలో లేదు.

బాత్‌రూమ్ లోంచి నీళ్ళ చప్పుడు వినిపిస్తోంది.

కాని....

కొద్దిగా పెరిగిన గెడ్డంతో వున్న ఒక వ్యక్తి ఎదురుగావున్న మంచం మీద కూర్చుని తలదించుకుని ఏదో ఫైలు చూసుకుంటున్నాడు.

"ధన్...." మన్న తలుపు చప్పుడుకి ఉలిక్కిపడి అధాటున ఫైలు లోంచి తల ఎత్తాడు.

ఎదురుగా....

చింపిరి జుత్తు....

చిరిగి నాలికలైన చీర....

రక్తపు మరకలతో.... మట్టి కొట్టుకుపోయిన ఆమెని చూడగానే.... ఎవరో.... ముష్టిదో.... దొంగదో.... అన్న భయంతో గభాల్న చేతిలో ఫైలు జార విడిచి లేచి నిల్చుని ఆందోళనతో గట్టిగా ఒక కేక పెట్ట బొయ్యాడు.

కాని.... ఎందుకో... అంతలోనే ఆగిపోయి.... దేన్నో వెదుకు తున్నట్లు ఆమె ముఖంలోకి చూస్తూ ఆగిపొయ్యాడు.

ఇద్దరి చూపులూ ఒకచోట చిక్కుపడ్డాయి.

కాస్త పెరిగిన గడ్డంతో వున్న ఆతడ్ని చూస్తూనే స్థంభీభూతురాలు అయ్యింది.

దూకుడుగా ముందుకి పడబోతున్న అడుగుని అతి కష్టంతో వెనక్కి తీసుకుంది.

"సుజా...." అన్న శబ్దం ఆమె నాలుక చివర అంచుదాకా వచ్చి హఠాత్తుగా ఆగిపోయింది.

అతన్ని చూస్తూనే.... గుండె ఆగిపోయినట్లు కొద్దిక్షణాలు చిత్తరువులా నిల్చుండిపోయింది.

ఆమె కళ్ళు విశాలంగా అయ్యాయి.

రెండు నిముషాలసేపు రెప్పలు వెయ్యకుండా అలాగే.... దీక్షగా అతడి ముఖంలోకి చూస్తూ నిల్చుండిపోయింది.

శరీరంలోని రక్తప్రసారం స్థంభించిపోతున్నట్లు....

గుండె వేగం తగ్గిపోతున్నట్లు....

నాడి పడిపోతున్నట్లు ...

కాళ్ళకింద భూమి జారిపోతున్నట్టు....

కొద్దిక్షణాలు.... అంతా అయోమయం.

సావిత్రి మనసు మూగబోయింది.

కట్టెబొమ్మలా చైతన్య రహితంగా నిల్చుండిపోయింది.

అతని ముఖంలోకి అలా చూస్తూంటే...

మనసు అట్టడుగు పొరల్లో ఏదో సన్నని కలకలం.... శాపవిమోచన వల్ల మరచిపోయిన గతం.... మంత్రజలం తలమీద పడగానే.... తెరలు తెరలుగా కళ్ళముందుకి వచ్చినట్లు....

హృదయపు అంచుల్లో అణువు అణువునా స్పందన....

ఎదురుగా ఆ వ్యక్తిని చూస్తూ కొద్దిక్షణాలు నోటమాట రానట్లు స్థంబీభూతురాలు అయిపోయింది.

కొంచెం పెరిగిన గెడ్డం.... సూదిముక్కు.... సోగలు దేరిన చిలిపి కళ్ళు.... ఒత్తుగా తరగలు.... తరగలుగా నుదుటిమీదకి వ్రాలే క్రాపు....

అంతే? ఆశ్చర్యంతో.... "కృష్ణా.... మీరా!" అంది.

పెద్ద శబ్దంతో డైనమైట్ పేలిన తరువాత కొద్దిసేపు అతి నిశ్శబ్దం అలుముకున్నట్లు....

"...."

"...."

అతడు చలించినట్లు ఆమె ముఖంలోకి చూశాడు.

చిన్నగానే అయినా...."కృష్ణా....మీరా!" అంటూ ఆమె తన పేరు ఉచ్ఛరించిన తీరు అతడ్ని వున్మత్తుడ్ని చేసింది.

కరిగిపోయిన ఎన్నో వెన్నెల రాత్రులు........ఎన్నో మధుర స్మృతులు....ఎన్నో తియ్యని అనుభూతులు .... పంచుకున్న సమయాల్లో తనని అంత తియ్యగా పేరుపెట్టి....అంత మధురంగా .... అంత స్పంద నగా... అంత స్వతంత్రంగా....పిలువగల స్త్రీ....నాటికి నేటికి తన జీవితంలో ఒకే ఒక వ్యక్తి?

ఆమె?

తన భార్య మాత్రమే.

కాని... ఎదురుగా బిచ్చగత్తెలా వున్న ఆమె నోటినుంచి ఆ పిలుపు వినగానే అతని శరీరం "ఝల్లు"మంది.

పున్నమి జాబిల్లిలాంటి సావిత్రి నిండు రూపమే అతనికి తెల్సు.

కాని—పాడ్యమినాటి చంద్రరేఖలా ఎదురుగా బిచ్చగత్తె రూపంతో వున్న ఆ స్త్రీని "కృష్ణా...." అన్న ఆ చిన్న పిలుపుతోనే గుర్తు పట్టాడు.

అంతే ?

అదిరినట్లు చప్పున కళ్ళజోడు తీసి చేతిలో పట్టుకొని గబాల్న ఒక అడుగు ముందుకువేసి ఆమె కళ్ళల్లోకి చూస్తూ ఉద్వేగంగా "సావిత్రీ!" అన్నాడు.

"—— ——"

అతను ఒక అడుగు ముందుకు వేస్తే సావిత్రి ఒక అడుగు వెనక్కి వేసింది.

ఉద్వేగంతో మళ్ళీ అతనే అన్నాడు. "సావిత్రి! ఇన్నాళ్ళ ఎక్కడ వున్నావ్!"

"—— ——"

వెయ్యి బారల నూతిలోంచి ఒక చిన్న శబ్దం వచ్చినట్లు నవ్వింది సావిత్రి.

"నన్ను చూస్తే తెలియటం లేదూ! ఎక్కడ వున్నానో—ఎలా వున్నానో—పోనీ....ఇంకా బ్రతికే వున్నాననైనా తెలుస్తోంది ! అదీ లేదా !"

"సా—వి—"

సావిత్రి ఎర్రగా అతని మొఖంలోకి చూసింది.

ఆ కళ్ళల్లోంచి "నిప్పులు రాలు తున్నాయా!" అన్నంత వేడిగా వున్నాయి ఆ చూపులు.

"ఇందాక మీతో టాక్సీదిగిన అమ్మాయి ఏది?"

"బాత్‌రూమ్‌లో స్నానం చేస్తూంది."

"ఆ అమ్మాయి మన సుజాత కదూ!"

"నాకూ అలాగే అనిపించింది. కాని తన పేరు సుషమ అని చెప్తూంది. తల్లి తండ్రి చచ్చిపోయ్యారని చెప్తూంది."

సావిత్రి నవ్వింది.

వెయ్యి బారల నూతిలోంచి వచ్చినట్లు—మళ్ళీ అదే శబ్దం—

"మరి అలా చెప్పక ఇంకెలా చెప్తుంది. తల్లి హంతకురాలై జైల్లో వుందని, తండ్రి దేశాలుపట్టి పొయ్యాడని—ఏ ఆడపిల్లయినా ఎలా చెప్పు కుంటుంది?"

ఆ మాటలు వినడంతోనే అతను స్థంభించినట్లు ఒక్క క్షణం కను రెప్పలెత్తి ఆమె ముఖంలోకి చూశాడు.

విస్మయంగా అడిగాడు.

"సావిత్రి - ఏమిటి! ఇన్నాళ్ళూ జైల్లో వున్నావా! హత్య చేశావా! ఎందుకు! ఎవర్ని — అసలు ఏం జరిగింది! - ఇలా రా - ముందు కూర్చో - వివరంగా మాట్లాడుకుందాం - ఇన్నాళ్ళ యెలా వున్నావ్! నువ్వేమిటి! ఇలా అయి...."

ఎండిన చెరువులో సన్నగా నీటిజల తిరుగుతున్నట్లు—అతని కళ్ళల్లో గిర్రున నీళ్ళు తిరుగుతుంటే ఉద్వేగంతో అతను మళ్ళీ రెండు అడుగులు ఆమెవైపు వేశాడు.

కాని—

పులిని చూసిన లేడిలా సావిత్రి బెదిరినట్లు గభాల్న వెనక్కి జరిగి దూకుడుగా చేతిని ముందుకు చాపి వేగంగా అటు ఇటు త్రిప్పింది.

ఆమెలో ఆవేశం పొంగుతుంటే గట్టిగా అరిచినట్లు చెప్పింది.

"దయచేసి నా దగ్గరికి రాకండి. ఇప్పుడు నా మీద ఇంత ప్రేమ వచ్చిందా! ఇన్నాళ్లు ఏమైపోయింది ఆ ప్రేమంతా! ఆ రోజు....నడి సముద్రంలో నన్ను వదిలిపొయ్యారే....అప్పుడేమయి పోయింది ఈ ప్రేమ అంతా!....

....

ఇదిగో చెపుతున్నా....ఆ క్షణంలోనే నా మనసు విరిగిపోయింది. ఆ క్షణం నుంచే మీకూ నాకూ ఏ సంబంధం లేదు.

జీవితంలో మీ ముఖం చూడకూడదనుకున్నాను.

మీ గురించి ఆలోచించ కూడదనుకున్నాను. నేను....ఇక్కడికి వచ్చింది ఈ పరామర్శలకి కాదు. మిమ్మల్ని గుర్తించి అసలే కాదు. ఆ అమ్మాయి మీ దగ్గరికి ఎలా వచ్చింది. ముందు చెప్పండి...."

సావిత్రి ఆవేశంతో రొప్పుతూంది.

చెక్కు తీసిన కందగెడ్డలా ఆమె మొఖం అంత ఎర్రగా ఆవేశం చిందుతూంది.

కుప్పించిన చెక్కిళ్ళమీద ధారగా కన్నీరు జారిపోతుంటే....రుద్ధమైన కంఠంతో అతడ్ని నిలేసింది.

అతడు ఒక్క క్షణం తడబడినట్లు కళ్ళజోడు తిరిగి పెట్టుకుంటూ అన్నాడు.

"సావిత్రి! ఆవేశపడకు. ఆ అమ్మాయి సుజాత అవునో కాదో నాకు-

ఇంకా రూఢిగా తెలియలేదు. ఎన్నిసార్లు అడిగినా తన గురించి ఏమీ చెప్ప లేదు. ఆ అమ్మాయి నాకు....నాకు కాల్ గరల్ గా ఒక హోటల్ గదిలో పరిచయం అయ్యింది."

"ఆ...." సావిత్రి చెయ్యి అప్రయత్నంగా గుండెల మీదికి వెళ్ళింది ....

"...."

మీ దగ్గరికి కాల్ గరల్ గా వచ్చిందా.

"...."

కాని....అది మన సుజాత," దాదాపు అరిచినట్లుగా అంది.

అతను కొంచెం వులికి పడినట్లయి మళ్ళీ సర్దుకున్నాడు.

"సావిత్రీ? ఆవేశపడకు. నీ పోలికలు ఆ అమ్మాయిలో చాలా కని పించాయి. నాకూ అలాగే అనిపించింది. అందుకే అక్కడ్నుంచి విడిపించి నా దగ్గరికి తెచ్చుకున్నాను. కాని ఎన్నిసార్లు అడిగినా తన గురించి ఏమీ వివరాలు చెప్పలేదు. తన పేరు కూడా అబద్ధం చెప్పింది. తన తల్లి తండ్రి చచ్చిపొయ్యారని .... తాను అనాధనని, తనకి ఎవరూ లేరని చెప్పింది.

మనం విడిపొయ్యేనాటికి అది బాగా చిన్నపిల్ల. అందుకే అది నన్ను అసలే గుర్తు పట్టలేదు.

కాని నాకు అది మన సుజాత అన్న భావన పోలేదు.

అందుకే చాలా డబ్బు ఖర్చుపెట్టి అక్కడ్నుంచి విడిపించి తీసుకు వచ్చాను.

దాదాపు నాల్గునెల్లపైగా నాతోనే వుంటోంది.

దాన్ని బాగా చదివించాలని నిర్ణయించుకున్నాను.

ఇంటర్ మీడియట్ ఫస్టుక్లాసులో ప్యాసయ్యానని చెప్పింది.

అది చదువుకున్న కాలేజికి సర్టిఫికెట్సు పంపమని వ్రాశాను.

ఇంకా వాళ్ళ పంపలేదు.

దానిచేత మెడికల్ ఎంట్రన్సు వ్రాయించాలని, సీటు రాకపోతే డొనేషన్ కట్టి అయినా చేర్పించాలని నిర్ణయించుకున్నాను.

ఆ ప్రయత్నంలోనే ఇక్కడికి తీసుకువచ్చాను.

సావిత్రి!

నా మాట నమ్ము. అది తన గురించి చెప్పటానికి ఎందుకో భయ పడుతూంది. నెమ్మదిమీద అన్ని తెల్సుకోవచ్చని వూరుకున్నాను.

దాని మాటల ప్రకారం నువ్వు బహుశా చచ్చిపొయ్యావని....

సావిత్రి విశ్శబ్దంగా నవ్వింది.

"చచ్చిపోయినా బాగుండేది. కాని జైల్లో వున్నాను. నా గురించి తెలిస్తే ఏం చేసేవారు!"

"సావిత్రి!"

"........"

"జైలు కెళ్ళావా! ఎందుకు!"

యెండిన ఆకుల మధ్యనుంచి గాలి వీచినట్లు సావిత్రి మళ్ళీ నవ్వింది....

"ఎందుకేమిటి! మీరు చేసిన పనికి జైలు కెళ్ళక ఇంకెక్కడికి వెడతాను.

నరాంతకిగా మీ భార్య జైలుకి వెళ్ళింది. స్వంత కూతురు....కాల్ గరల్‌గా మీ దగ్గరకే వచ్చింది.

తండ్రి దగ్గరే వుంటున్నా తండ్రి అని దానికి తెలియదు కదా!

కూతురే అని తెల్సినా గట్టిగా ఆ మాట చెప్పుకోలేని దౌర్భాగ్యం మీది.

చూశారా!

బంధుత్వాలు ఎంత చక్కగా మారి పోతున్నాయో!

ఆరోజు....

విధి చేసిన వికృతానికి మీరు నన్ను శిక్షించి వెలివేశారే....

కాని....ఆనాడు మీరు కొంచెం సహృదయంగా సంస్కారవంతంగా ప్రవర్తించి నన్ను ఆదరించి వుంటే ఈనాడు ఇంత జరిగేదా! మీ భార్య జైలుకి వెళ్ళేదా! కూతురు కాల్‌గరల్ అయ్యేదా!

కాని....మీరు,

ఆ రోజుల్లో నా మీద కురిపించిన ప్రేమంతా నిజమే అయివుంటే.... తప్పకుండా నాకంత కష్టం వచ్చినప్పుడు మీరు నన్ను హృదయ పూర్వకంగా ఆదరించి వుండే వారు కదా!

కాని....మీది స్వార్థపూరితమైన ప్రేమ.

కపట ప్రేమ.

భార్య చస్తే భార్య వస్తుంది.

లేకపోయినా ఫర్వాలేదు.

సుఖాలు అంగట్లో దొరుకుతాయి.

అందుకే అగ్నిసాక్షిగా తాళికట్టిన నన్ను అంత తేలిగ్గా గడ్డి పరకని వదిలినట్లు వదులుకున్నారు.

చెత్తని విదిల్చుకున్నట్లు విదిల్చుకున్నారు.

తరతరాలుగా స్త్రీ సర్వనాశనానికి కారణం మగవాడు.

స్త్రీ కన్నీటికి కారణం మగవాడు.

స్త్రీజాతి నైతికపతనానికి కారణం మగవాడు.

ఈనాడు నేను పతితగా....పరాజితగా.... సమాజంనుంచి వెలివెయ్యబడటానికి కారణం ఎవరు!

మీ మగజాతి కదూ!

అందుకే...

అందుకే....నాకు....నాకు....మీరంటే....

మీ....రం....టే....అసహ్యం..."—

సావిత్రి కళ్ళనిండా కన్నీళ్ళు వచ్చేశాయి.

ఆమె కంఠం రుద్ధం అయిపోయింది.

ఆమె శుష్కించిన చెక్కిళ్ళమీద కన్నీరు ధారగా కాల్వలు కట్టింది.

ఆవేదనతో ఆమెమాట తడబడిపోతూంది.

పెనుతుఫాను గాలికి వ్రేళ్ళతోసహా పెకిలించబడుతున్న మహా వృక్షంలా ఆమె ధబ్బున నేలమీద కూలబడిపోయింది.

దూకినట్లు కృష్ణ గభాల్ని రెండు చేతులూ సాచి ఆమె దగ్గరకి రాబోయ్యాడు.

సరిగ్గా అదేక్షణంలో బాత్‌రూమ్ తలుపు దగ్గిర "ధన్"మంటూ పెద్ద చప్పుడు అయింది.

ఆ శబ్దానికి సావిత్రి—కృష్ణ... ఇద్దరూ గభాల్న తలతిప్పి అటువైపు చూశారు.

అక్కడ స్థంభించినట్లు సుజాత శిలాకృతిలా నిల్చుని వుంది.

అంతసేపూ అక్కడ నిల్చుని తమ సంభాషణలు వింటున్న సుజాతని ఇద్దరూ ఆవేదనలో గుర్తించలేదు.

భుజాలమీంచి జారిన రెండు జళ్ళతో ఎదురుగా నిల్చున్న కూతుర్ని చూడగానే సావిత్రి గుండె ఝల్లుమంది.

ఆమె శరీరంలోని అణువు అణువునా ఇంకా కూతురిపై ప్రేమ చచ్చిపోలేదు.

ఒక్కక్షణం మనసు మూగబోయినట్లు....అలాగ కన్నీటి తెరలమధ్య కూతుర్ని చూస్తూ వుండిపోయింది సావిత్రి.

ఆ గదిలో.... కొద్దిక్షణాలు.... సూది కింద రాలితే వినిపించేటంత నిశ్శబ్దం.... అలుముకుంది.

గాలికూడా ఆ కాస్సేపు స్థంభించిపోయిందా అన్నట్లు.... ముగ్గురూ స్థంభీభూతులయ్యారు....

ఎదురుగా.... జీవంలేని కట్టె బొమ్మలా వున్న తల్లిని చూస్తూంటే సుజాత నోటిమాట పడిపోయింది.

అయితే! తను కాల్‌గరల్‌గా వెళ్ళింది తన తండ్రి గదికా!

అతడ్ని ప్రేమిస్తున్నానని, అతడంటే ఆరాధన అనీ—తనని పెండ్లి చేసుకోమని ఇన్నాళ్ళుగా కోరుతున్నది తన తండ్రినా!

పైగా, ప్రేమిస్తున్నానని చెప్పింది.

"ప్రేమా ?"

అసలు ఆ పదానికి తనకి అర్థం తెలుసా:

కాని....

అతను ఎంత చక్కగా ప్రవర్తించాడు తనతో !

అయ్యో? నాన్న? నువ్వు నాన్నవని తెలిస్తే నోరారా ఎన్ని వందల సార్లు పిలిచి వుండేదాన్నో కదా!

ఇద్దరం కలిసి వెళ్ళి అమ్మని విడిపించే వాళ్ళం కదా!

అ..మ్మ ?

ఎలాగై పోయింది !

ఎముకల పోగులా, నడిచే శవంలా.

అంతసేపూ బాత్‌రూమ్ తలుపు దగ్గర చైతన్యరహితంగా, బొమ్మలా నిల్చుండిపోయింది సుజాత.

తల్లి తండ్రి సంభాషణ వింటున్నంతసేపూ ఆమె మనసులో పోటెత్తిన సముద్రంలా తీవ్ర సంచలనం.

తండ్రి సమక్షంలో తన ప్రవర్తన తల్చుకోగానే, పెనుగాలికి కదిలి పోయే తీగలా ఒణికిపోతూ, కన్నీటి తెరల మధ్యే—

తల్లివైపు దృష్టి తిప్పి....

"అమ్మా...." అని గట్టిగా ఆర్తనాదం చేసినట్లు కేక పెట్టింది.

ఆ పిలుపుకు అదిరిపడినట్లు సావిత్రి కృష్ణ ఒకేసారి గభాల్న తలలు తిప్పి వెనక్కి తిరిగారు.

శోక దేవతలా వున్న సుజాతని చూస్తూనే.

"అమ్మా....సుజా...." అంటూ ఉద్వేగంతో కృష్ణ కూతురువైపు రెండు అడుగులు వేశాడు.

అంతే?

అతనినోట మాట పూర్తి కానేలేదు.

తండ్రి మొఖం చూడలేని దానిలా సుజాత చివ్వున మొఖం తిప్పుకుని మెరుపులా బాల్కనీ పిట్టగోడ దగ్గరకి పరిగెత్తింది.

అంతే ?

మరుక్షణం "కెవ్వు"మన్న ఒక చావుకేక ఆ నాల్గు అంతస్థుల భవంతిలో "రింగు"మని అతిభయంకరంగా మారుమ్రోగింది.

అంతా కన్నుమూసి తెరిచినంత రెప్పపాటు మెరుపు వేగంతో జరిగిపోయింది.

అంతే! గుండె పగిలినట్లు "సుజా....!" అని అరుస్తూ సావిత్రి గభాల్న లేచి దూకినట్లు పిట్టగోడ దగ్గరకి పరిగెత్తింది.

కాని అప్పటికే అంతా అయిపోయింది.

సుజాత పెట్టిన ఆ చావుకేకతో పాటే ఆమె దేహం ఆ మూడంతస్థుల బిల్డింగ్‌మీంచి జారి నడిరోడ్డున మాంసంముద్దలా మారిపోయింది.

ఎర్రటి రక్తం రోడ్డుమీద కాల్వకట్టింది.

నీలి నీలి ఆకాశంలో .... అంతరిక్షంలో .... నక్షత్రంలోని చంద్రమండలాన్ని....దాటి....ఆమె ప్రాణం. అనంత వాయువుల్లో ...లీనం అయిపోయింది.

ఉద్వేగంతో కదిలిపోతూ పిట్టగోడమీంచి కిందికి తొంగి చూసిన సావిత్రికి గుండె చెదిరినట్లు అయ్యింది.

నడిరోడ్డున ఎర్రగా మాంసం ముద్దలా చితికి పోయిన కూతురు దేహం....

ఆమెచుట్టూ గుంపులు కూడుతున్న జనం చూడగానే మతిభ్రమించిన దానిలా రెండు చేతుల్తో తలబాదుకుంది.

సుజా....నా తల్లి....వెళ్ళిపొయ్యావు టె....

....నా తల్లి....సుజా....

పిచ్చిగా అరుస్తూ ఆ కేకలకంటే వేగంగా కిందకి పరిగెత్తింది.

సావిత్రి వెనకాలే బాల్కనీలోంచి కిందకి చూసిన కృష్ణ స్తంభించి పోయ్యాడు.

ఆమె కేకలు పెడుతూ కిందికి పరిగెడుతుంటే తనూ పరిగెడదామను కున్నాడు.

కాని వున్న చోటునుంచి ఒక్క అడుగు కూడా కదలలేనట్లు .... శిలలా....పోయ్యాడు.

అతడి మెదడు మొద్దుబారిపోయింది.

అతనిలో చైతన్యం నశించింది.

బిత్తరువు అయిపోయ్యాడు.

జరిగేది .... జరుగుతున్నది .... జరగబోయ్యేది .... అంతా అయో మయం?

క్రమంగా అతని కంటికి ఆమె రూపం దూరం అయ్యింది.

సుజా....నాతల్లి....అన్న పిలుపుకు దూరం అయ్యాడు.

రోడ్డు వెంబడి పరిగెత్తుతూంది.

కాని, అతను ఆమె వెంట పరిగెత్తలేదు?!

o o o

కాని—

సావిత్రి పరుగు ఆపలేదు.

సుడిగాలికి ఎగిరే ఎంగిలి విస్తరాకులా, నేటికి ఆలా వీధుల్లో వెంట పరుగులెత్తుతూనే వుంది.

మధ్య మధ్య "అమ్మా, సుజా, నా తల్లి" అని అరుస్తూ ఉంటుంది.

అంతలోనే వెర్రిదానిలా పెద్ద గొంతుతో ఏడుస్తుంది వెకిలిగా నవ్వు తుంది.

రెండుచేతులూ గట్టిగా పిడికిళ్ళు బిగించి గుండెలమీద గుభిగుభీ గుద్దుకుంటుంది.

ఒకోసారి గోడకేసి తలని రపీ రపీ కొట్టుకుంటుంది.

నుదురు చిట్లి రక్తం కారుతుంది.

జుత్తు పీక్కుంటుంది.

కచ్చిగా బట్టలు చింపుకుంటుంది.

"అయ్యో నా తల్లీ సుజా.... నా తల్లీ.... వెళ్ళిపోయ్యావుటే ! భగవంతుడా, నన్నుకూడా తీసుకుపో...."

హిస్టీరిక్‌గా అరిచి నడిరోడ్డున విరుచుకుని పడిపోతుంది.

ఎవరో దయతలచి తలమీంచి బిందెలతో నీళ్ళు పోస్తారు.

తోచినవాళ్ళు ఆకులో ఇంత అన్నం తెచ్చి ఇస్తారు.

ఇష్టమైతే తింటుంది.

లేకపోతే ప్రక్కనే వున్న మోరీలో పడేస్తుంది.

ఆకలేస్తే అన్నం తినాలని తెలియదు.

నిద్రవస్తే పడుకోవాలని తెలియదు.

ఇదివరకు అమావాశ్యకి— పౌర్ణమికి ఎక్కువయ్యే జబ్బు.... ఇప్పుడు నిత్యం ఆమెని అంటిపెట్టుకుని తోడునీడగా వుంటోంది.

ఒకోసారి కుక్కలు ఆదేపనిగా అరుస్తూ ఆమె వెంట పరుగెడుతాయ్.

ఆమె రాళ్ళేసి వాటిని కొడుతుంది.

నోటికొచ్చినట్లు తిడుతుంది.

అవి తరుముతూ వుంటే భయంతో ఏడుస్తోంది.

ఒకోసారి చిన్నచిన్న పిల్లలు ఆమెని రాళ్ళతో కొట్టి కవ్విస్తారు.

చింపిరి జుత్తు....

చిరిగి పీలికలైన చీర....

ఒళ్ళంతా రక్తపు మరకలు....

మట్టి కట్టుకుపోయిన ఎముకల గూడులాంటి శరీరం.... గాజు కళ్ళు.

మీకు ఎప్పుడైనా, ఎక్కడైనా, ఆలాంటి ఒక "పిచ్చిది" కనిపిస్తే శవం గుర్తుపట్టండి ఆమె సావిత్రి!

ఈ పవిత్ర భారతదేశంలో ఒక ఆడది.

o o o

అశ్రుఒక్కటీ రాలదా ?

ఆరణి దాల్చిన నిప్పులా

కాలకంఠుని కన్నులా

ప్రగతి శక్తికి మార్గమై.

( అయిపోయింది )